



# బాలల మహాభారతం

## మొదటి భాగము

ఆంగ్లమూలం : స్వామి రాఘవేశానంద
తెలుగు సేత : స్వామి జ్ఞానదానంద
చిత్రాలు : పద్మవాసన్



**రామకృష్ణ మఠం**
దోమలగూడ,
హైదరాబాద్ - 500 029.



# విషయ సూచిక


ఉపోద్ఘాతము

| | | | |
|---|---|---|---|
| 1. | ఆదిపర్వము – ఇతిహాస ప్రారంభం | .... | 1 |
| 2. | వ్రాసినవాడు గణేశుడు | .... | 2 |
| 3. | శంతనుడు గంగను వివాహమాడటం | .... | 4 |
| 4. | వసిష్ఠుడు వసువులను శపించటం | .... | 5 |
| 5. | మహాభారత మూలపురుషుడు – భీష్ముడు | .... | 6 |
| 6. | సత్యవతి కుమారులు | .... | 10 |
| 7. | దుర్దశ | .... | 13 |
| 8. | ముగ్గురు సోదరులు | .... | 13 |
| 9. | రాకుమారుల పరిణయం | .... | 13 |
| 10. | గాంధారికి కలిగిన పుత్రులు | .... | 15 |
| 11. | పాండురాజుకు కలిగిన శాపం | .... | 16 |
| 12. | పాండవుల జననం | .... | 16 |
| 13. | పాండవులు హస్తినాపురానికి రావటం | .... | 18 |
| 14. | దుర్యోధనుడు మాత్సర్య పీడితుడవడం | .... | 19 |
| 15. | ద్రోణుని ప్రవేశం | .... | 22 |
| 16. | ఏకలవ్యుడు | .... | 24 |
| 17. | అర్జునుని సర్వోత్కృష్టత | .... | 25 |
| 18. | ద్రోణుని ప్రతీకారం | .... | 26 |
| 19. | సూర్యపుత్రుడు | .... | 27 |
| 20. | లక్క ఇల్లు | .... | 29 |
| 21. | ఘటోత్కచుని జననం | .... | 31 |
| 22. | ఏకచక్ర నగరంలో పాండవులు | .... | 33 |
| 23. | ద్రౌపది – మహాభారత కథానాయకి | .... | 34 |
| 24. | పాండవులు హస్తినాపురం తిరిగి రావడం | .... | 37 |
| 25. | పాండవుల కొత్త రాజ్యం | .... | 38 |
| 26. | అర్జునుడు స్వేచ్ఛానుసారం తపస్సుకు వెళ్ళడం | .... | 39 |
| 27. | సుభద్రా పరిణయం | .... | 40 |
| 28. | ఖాండవ దహనం | .... | 42 |

# బాలల మహాభారతం

## ఉపోద్ఘాతము

మన ప్రాచీన భారత దేశంలో సూర్యవంశం, చంద్రవంశం అనే రెండు గొప్ప వంశాలుండేవి. చంద్రవంశంలో కురు అనే రాజు ప్రఖ్యాతుడు. అందువల్ల అతని సంతతి వారంతా కౌరవులు అని పిలువబడ్డారు. అనేక తరాల తర్వాత ఆ కురువంశంలో ధృతరాష్ట్ర, పాండు అనే ఇద్దరు సోదరులు జన్మించారు. వీరి కుమారులందరూ కౌరవులే అయినా ధృతరాష్ట్రుని కొడుకులే కౌరవులని పేర్కొనబడ్డారు. పాండురాజు కుమారులు పాండవులైనారు. వారసత్వంగా రావాల్సిన రాజ్యాధికార విషయంలో ఏర్పడ్డ తగాదావల్ల అన్నదమ్ములైన కౌరవ పాండవుల మధ్య యుద్ధం సంభవించింది. క్రమంగా పరిస్థితులు, ఈ యుద్ధానికి ఎలా దారి తీసినవో అన్నదే మహాభారత రచనకు ఇతివృత్తం. ఈ రచనలో అనేక నైతిక ధర్మాలు, భక్తి ప్రపత్తులు, పారమార్థిక తత్త్వాలు కనిపిస్తాయి. అందులో అనేక ఉపదేశాలలో విశ్వ విఖ్యాతమైన భగవద్గీత ఒకటి. ఇక కథ ప్రారంభిద్దాం!

# బాలల మహాభారతం

## 1
## ఆది పర్వము - ఇతిహాస ప్రారంభం

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయం ఉదీరయేత్ ॥

పూజ్యనీయులైన నరనారాయణులకు నమస్కారములు. విద్యాదేవి సరస్వతికి వందనములు. ప్రాచీన ఋషి వ్యాస మహర్షికి నమస్కారములు. మనకు జయము కలుగుగాక!

"రోమహర్షుడి కుమారుడైన ఉగ్రశ్రవుడు సకలశాస్త్ర పారంగతుడు. ఒకసారి ఈయన నైమిశారణ్యానికి వెళ్ళినప్పుడు అక్కడ అనేకమంది ఋషులు తపస్సు చేసుకుంటూ ఉన్నారు. వాళ్ళంతా ఉగ్రశ్రవుని అర్ఘ్యపాద్యాదులతో సత్కరించారు. స్నానపానాదులు ముగించిన తర్వాత, ఆయన చెప్పేవి వినటానికి ఒక చెట్టుక్రింద ఆయన చుట్టూ ఆసీనులైనారు. ఆ ఋషులలో ఒకరు వినయంతో ఆయన్ని ఇలా ప్రశ్నించారు: "స్వామీ! మీరెవరు? ఎక్కడ నుండి వస్తున్నారు? ఎక్కడ తపశ్చర్యలు ఆచరించారు? దయచేసి మీ విషయం తెలియచేస్తారా?"

అప్పుడు ఆ మహర్షి ఇలా సమాధాన మిచ్చాడు: "జనమేజయ మహారాజు చేసిన సర్పయాగ సమయంలో వైశంపాయనుడు చెప్పిన, వేద వ్యాస మహాఋషి విరచించిన మహాభారతంలోని అద్భుతమైన పుణ్యకథలు వినే భాగ్యం నాకు కలిగింది. తర్వాత, నేను అనేక పుణ్యతీర్థాలు దర్శించాను. ఆ పర్యటనలలో



శ్యమంతకపంచకం అనే సరోవరం దగ్గర ఉన్నాను. దాని సమీపంలోనే కౌరవుపాండవుల మధ్య మహాభారత సంగ్రామం జరిగింది. ఇప్పుడు మీ మధ్య కొన్ని రోజులు గడపాలని వచ్చాను."

అటువంటి మహానుభావుడు తమ మధ్య ఉన్నందుకు ఋషులు ఎంతో సంతోషించారు. ఆయన రోజూ ఉన్నతమైన పారమార్థిక ఆశయాలు గలిగిన పురాణ, ఇతిహాసాలనుండి అనేక పుణ్యకథలను చెప్పిన తరువాత మహాభారత కథ చెప్పటం మొదలుపెట్టాడు.

"సృష్టికి ముందు లోకం అంతా అంధకారం ఆవరించింది. తర్వాత సర్వసృష్టికి కారణమైన ఒక మహా అండం ఆవిర్భవించింది. ఈ అండం నుండి ప్రాణులకు ప్రభువైన ప్రజాపతి, మనువు, దక్షుడు, ఆయన ఏడుగురు పుత్రులు, అశ్వినీ దేవతలు, ఆదిత్యులు, పితరులు తదితరులు ఆవిర్భవించారు.

తర్వాత పంచభూతాలు, సంవత్సరాలు, ఋతువులు, మాసాలు, పక్షాలు, పగళ్ళు, రాత్రులు ఆవిర్భవించాయి.

ఇప్పుడు ఉన్న మానవ జాతి సమస్తం ఆ విధంగా ఉద్భవించింది."

## 2

## వ్రాసినవాడు గణేశుడు

ఋషులలో పరాశర పుత్రుడైన వేదవ్యాసుడు ఉత్తమోత్తముడు. ఈ జగద్రహస్యాన్ని అర్థం చేసుకోవటమే కాకుండా, ఆయన తన మనస్సులో మహాభారత మహాకావ్యాన్ని కూడా ఊహించి, దానిని మానవ జాతికి ఎలా అందించాలా అని ఆలోచించసాగాడు. సృష్టికర్తయైన బ్రహ్మను ధ్యానించాడు. బ్రహ్మ సాక్షాత్కరించగా వ్యాసుడు భక్తిపూర్వకంగా నమస్కరించి చేతులు జోడించి ప్రార్థించాడు: "ఓ దేవా! మహాభారతం అనే గొప్ప ఇతిహాసాన్ని నా మనస్సులో రూపొందించాను. ఇది, భూత, భవిష్యత్, వర్తమానాలను, జరామరణాలను, ఆది వ్యాధులను, ఉన్నదానిని, లేనిదానిని తెలియజేస్తుంది. ఇందులో సన్న్యాసులు పాటించాల్సిన యతి ధర్మాలున్నాయి. ఇది సూర్య, చంద్రుల పరిమాణాన్ని చెబుతుంది. గ్రహాలను, నక్షత్రరాసులను గురించి వివరిస్తుంది. వేదాల సారాన్ని, తత్త్వ విచారాలను తెలుపుతుంది. కొండకోనలను, నదీనదులను, సముద్రాలను, పుణ్య తీర్థాలను, దివ్యధామాలను గురించి చెపుతుంది. విభిన్న భాషలను, జాతులను, యుద్ధకౌశలాన్ని, దివ్యరూపాలను వివరిస్తుంది. ఈ ఇతిహాసాన్ని నేను చెపుతూ ఉన్నప్పుడు, సంపూర్ణంగా, సత్వరంగా లభించగలవారిని ఎవరినీ ఊహించలేకున్నాను."

అప్పుడు బ్రహ్మదేవుడు సంతసించి వ్యాసునితో "నీ ఇతిహాస రచన అమోఘంగా సాగుతుంది. నీవు గణేశుని ధ్యానించి ఆయనను వ్రాయమని ప్రార్థించు" అని చెప్పి అంతర్ధానమైనాడు.

తర్వాత వ్యాసమహర్షి గణేశుని ధ్యానించాడు. విఘ్నరాజు ప్రత్యక్షం కాగానే వ్యాసుడు సగౌరవంగా ఆయనతో "స్వామీ, నేను ఒక బృహత్తర కావ్యాన్ని తలపోశాను. దానిని నేను చెబుతుండగా వ్రాయటానికి, నీవే తగినవాడివని బ్రహ్మదేవుడు సలహా ఇచ్చాడు. అందువల్ల ఈ పనికై నిన్ను ప్రార్థిస్తున్నాను" అన్నాడు.



గణపతి ఇలా బదులు చెప్పాడు: "ఒక్క షరతుపై ఒప్పుకుంటున్నాను. నీవు ఆపకుండా చెప్పాలి. నీవు ఎప్పుడైనా ఆపితే, నేను తక్షణం వెళ్ళిపోతాను."

అందుకు వ్యాసుడు, ఒక షరతుతో అంగీకరించాడు. "నేను చెప్పే ప్రతి (శ్లోక) పాదము నీవు ముందుగా అర్థం చేసుకోకుండా వ్రాయకూడదు."

గణేశుడు 'ఓం' అని ప్రారంభించి, వ్రాయటం సాగించాడు. తాను శీఘ్రంగా వ్రాస్తూ, వ్యాసుణ్ణి శ్లోకాలు కూర్చటానికి తొందరపెట్టాడు. కానీ, ఒక చక్కని శ్లోకం రూపకల్పన చెయ్యటానికి సహజంగా వ్యాసునికి కొంత వ్యవధి కావాల్సి వచ్చింది. అందువల్ల ఆయన ఉద్దేశపూర్వకంగా క్లిష్టభావంతో కూడిన శ్లోకం చెప్పేవాడు. దాన్ని అర్థం చేసుకోవటానికి గణేశునికి కొంత వ్యవధి పట్టేది. ఈ సమయంలో వ్యాసుడు మానసికంగా తర్వాత శ్లోకాలు కూర్చుకునేవాడు.

ఈ కావ్యం ముగించిన తర్వాత, మహత్తరమైన ఈ ఇతిహాసాన్ని వ్యాసుడు తన కుమారుడైన శుక మహర్షికి వినిపించాడు. ఈ మహాభారత కథను, నారదుడు దేవతలకు చెప్పగా, శుకుడు గంధర్వులకు, రాక్షసులకు, యక్షులకు చెప్పాడని ప్రతీతి. ఇప్పుడు దీన్ని మీ అందరికీ వినిపిస్తున్నాను."

ఈ మాటలు విని మహర్షులంతా సావధాన చిత్తులయ్యారు. వైశంపాయన, జనమేజయ



సంవాదరూపంలో ఉగ్రశ్రవుడు ఈ మహాభారతాన్ని చెప్పసాగాడు:

## 3
## శంతనుడు గంగను వివాహమాడటం

మహాభారత ఇతిహాస, హస్తినాపుర మహారాజైన శంతనునితో ప్రారంభమవుతుంది. ఆదర్శవంతుడైన మహారాజని మన్ననలు పొందాడు శంతనుడు. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించాడు. వారు ధర్మమార్గాన నడవడానికి ప్రోత్సాహమిచ్చాడు. ఒకసారి ఆయన వేటాడుతూ ఘోరారణ్యములలోనికి వెళ్ళాడు. ఆయన అలా గంగాతీరములో వెళుతూవుండగా ఒక దివ్యతేజస్సుతో ప్రకాశిస్తున్న అందాలరాశియైన కన్య కనబడింది. అంతటి అందగత్తెను ఆయన అంతవరకు చూచివుండలేదు. వెంటనే ప్రేమలో పడి, ఆమెను వివాహం చేసుకోవాలనే ఉద్దేశంతో సమీపించి మృదువుగా ఇలా అన్నాడు: "లలనా! నీవు అప్సరసవా లేక దేవకన్యవా? లేక మానవకన్యవా? ఎవరైనా సరే, నేను నిన్ను వివాహం చేసుకుంటాను."

ఆమె మరెవ్వరో కాదు, గంగాదేవి. ఆమె "ఓ రాజా! నేను నీకు భార్యగా ఉంటాను. ఆజ్ఞలు పాలిస్తాను. కాని ఒక షరతు! నన్ను నీవెవరని ప్రశ్నించకూడదు. నేను చేసే ఏ కార్యాన్నీ అది నీకు నచ్చినా, నచ్చకపోయినా ప్రశ్నించకూడదు. నాతో అప్రియవచనములు పలుకకూడదు. ఈ షరతులకు నీవు అంగీకరిస్తే నేను నీతో ఉండడానికి సమ్మతిస్తాను. కాని ఈ షరతులను నీవు ఉల్లంఘించిన మరుక్షణమే నేను నిన్ను విడిచి వెళ్ళిపోతాను" అని అంది.

శంతనుడు ఆమె షరతులకు అంగీకరించాడు. వారు కొంత కాలం సంతోషంగా జీవించారు. వారికి కాల క్రమంలో ఏడుగురు కుమారులు పుట్టారు. వారు సౌందర్యంతో దివ్య తేజస్సులుగా కనిపించారు. కానీ ప్రతిసారీ బిడ్డ పుట్టిన వెంటనే ఆమె ఆ బిడ్డను "ఇది నీ మంచికోసమే" అంటూ గంగలో వేసేది. ఆమె అలా చేయడం చూచి దిగ్భ్రాంతుడైనా, శంతనుడు ఆమె వెళ్ళిపోతుందనే భయంతో పెదవి విప్పలేదు. కానీ ఎనిమిదవ శిశువు జన్మించినప్పుడు మరల అలానే ఆమె చేయడానికి పూనుకున్నప్పుడు మాత్రం శంతనుడు ఇక ఆగలేక విషాదంతో, "ఈ పిల్లవాడినైనా వదిలేయి. నీకు పుట్టిన బిడ్డలనే నీవెందుకు ఇంత దారుణంగా చంపావు? ఇంతకూ నీవెవరవు?" అని ప్రశ్నించాడు.

అప్పుడు గంగాదేవి "ఓ రాజా! నీ కోరిక ప్రకారం ఈ బిడ్డను వదలి పెడుతున్నాను. నీవు నాకిచ్చిన వాగ్దానం తప్పావు కాబట్టి వెళ్ళిపోతున్నాను. నేను మహర్షులందరూ పూజించే జహ్నువి కుమార్తె గంగాదేవిని. ఒక దైవకార్యం నెరవేర్చడానికి నేను ఇంతకాలం నీతోపాటు ఉండాల్సివచ్చింది. ఈ ఎనిమిది మంది బిడ్డలు అష్టవసువులు. శాపకారణంగా వారు జన్మ స్వీకరించాల్సి వచ్చింది. నేను తప్ప మరెవరూ వారికి తల్లి కాజాలరు. నీకు తప్ప వారికి తండ్రి అయ్యే భాగ్యం మరెవరికీ



కలుగలేదు. వారికి తండ్రి కావటంతో నీవు అనంతమైన పుణ్యాన్ని ఆర్జించావు" అన్నది.

## 4

## వసిష్ఠుడు వసువులను శపించటం

వసువులను గూర్చి, వారు ఎలా శాపగ్రస్తులయ్యారో తెలుసుకోవాలని శంతనుడు కుతుహలం చెందాడు. అప్పుడు గంగాదేవి ఆ కథను వివరించింది: "వసిష్ఠుడనే తపోగరిష్ఠుని వద్ద నందిని అనే దేవతాసంబంధమైన ధేనువు ఉన్నది. ఒక రోజు అష్టవసువులు తమ భార్యలతో సహా ప్రిథును నాయకునిగా ఎన్నుకొని వసిష్ఠుని ఆశ్రమానికి వచ్చారు. వారిలో ప్రభాసుడు అనే వసువు నందినిని చూచి పరవశించిపోయాడు. విశాల నేత్రాలు, పెద్ద పొదుగు, కుచ్చుతోక, అందమైన గిట్టలు మొదలైన సకల మంగళ చిహ్నాలతో శోభిస్తూ సమృద్ధిగా పాలు ఇచ్చేటటువంటి ఆవును చూచిన వెంటనే ఆయన భార్య దానిని కావాలని కోరింది. తన భార్యను సంతోషపెట్టటానికి ప్రభాసుడు తన సోదరుల సహాయంతో నందినిని అపహరించాడు. ఆ సమయంలో నందిని ఆశ్రమంలో లేని విషయం వసిష్ఠుడు తెలుసుకున్నాడు. వసువులు నందినిని అపహరించారని తన యోగశక్తితో గ్రహించి కోపోద్రిక్తుడై వారిని భూలోకంలో మనుష్యులుగా జన్మించాలని శపించాడు. ఈ శాపాన్ని విన్న వసువులు భయకంపితులై తమను క్షమించమని ఆయనను వేడుకున్నారు. అప్పుడు ఆయన కరుణించి, "నా శాపం అమోఘమైంది.





అనుభవించి తీరాల్సిందే. మీలో ఏడుగురు మాత్రం మానవులుగా జన్మించిన వెంటనే శాపవిముక్తులు అవుతారు. కాని ప్రభాసుడు మాత్రం తన పాపకృత్యం వల్ల భూలోకంలో చాలా కాలం ఉంటాడు. ఈతడు ధర్మాత్ముడుగా, ఆదర్శవంతుడుగా, శాస్త్రపరిజ్ఞానంలో మేటియై అందరిచేత గౌరవింపబడి కీర్తివంతుడు అవుతాడు" అన్నాడు.

తర్వాత వసువులు నా వద్దకు వచ్చి, నేను వారికి తల్లిగా కావాలనీ, పుట్టిన వెంటనే గంగలో పారవేసి, శాపవిముక్తులను చేయాలనీ నన్ను వరం కోరారు. అందువల్ల నేను అలా చేశాను. కాని వసిష్ఠుని శాపానుసారం అష్టమవసువు అయిన ప్రభానుడు చాలాకాలం భూలోకంలో గడపాలి. అందువల్ల ఈ బిడ్డను నేనే పెంచి పెద్దవాణ్ణి చేసి, నీకు కానుకగా ఇస్తాను. ఈతడు గంగాదత్తుడు (గాంగేయుడు) అని పిలువబడుతాడు." ఇలా శంతనునితో చెప్పి గంగాదేవి బిడ్డతో సహా అంతర్ధానమైపోయింది. భగ్నహృదయంతో శంతనుడు రాజధానికి తిరిగి వచ్చాడు.

## 5

## మహాభారత మూలపురుషుడు - భీష్ముడు

శంతనుడు ఒక రోజు గంగాతీరాన తాను బాణంతో కొట్టిన జింకను వెంటాడుతూ వెళుతూ ఉండగా ఆ నది ఒకచోట లోతు తగ్గి ఉండడం గమనించాడు. ఈ వింత దృశ్యమునకు కారణం ఏమై ఉంటుందా అని ఆలోచిస్తున్నాడు. అప్పుడు పదునారేండ్ల ప్రాయంలోవున్న సుందరమైన బాలుడు విల్లు పట్టుకుని బాణాలు వేస్తూ ప్రవాహానికి ఆనకట్ట కట్టటం చూచాడు. ఆ బాలుని అద్భుత కౌశలం అతణ్ణి ముగ్ధుణ్ణి చేసింది. అంత శక్తిమంతమైన నదీప్రవాహాన్ని తాను ఒక్కడే ఆపగలుగుతున్నాడు. ఆ సమయంలో గంగాదేవి శంతనునికి కనబడి, "ఇదిగో, నీ ఎనిమిదవ కుమారుడు! నేను ఎంతో శ్రద్ధ తీసుకుని ఇతణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేశాను. వసిష్ఠమహర్షి వద్ద వేదవేదాంగాలన్నీ అధ్యయనం చేశాడు. ధనుర్విద్యలో ఎవ్వరూ ఇతనికి సరిసమానులు కాజాలరు. యుద్ధరంగంలో ఇతణ్ణి ఎదిరించి ఎవ్వరూ నిలువజాలరు. ఇతడు రాజధర్మాలన్నీ చక్కగా



తెలిసినవాడు" అంటూ గాంగేయుని, శంతనునకు అప్పగించి వెళ్ళిపోయింది. తన ప్రియపుత్రుణ్ణి తిరిగి పొందినందుకు శంతనుడు ఎంతో ఆనందించాడు. మహదానందంతో రాజధానికి తిరిగి వచ్చి, తన ప్రియపుత్రుడైన గాంగేయుని, లేక దేవవ్రతుని తన వారసునిగా ప్రకటించాడు.

ఇలా నాలుగేండ్లు సంతోషంగా గడిచింది. ఒక రోజు శంతనుడు యమునా తీరంలో విహరిస్తున్నప్పుడు అక్కడ ఒక అప్సరసలాంటి అందమైన యువతిని చూశాడు. ఒక మహర్షి వరప్రసాదంతో ఆమె శరీరం నుండి వెలువడుతున్న దివ్య పరిమళం ఆ అరణ్య పరిసరాల్ని సుగంధమయంగా చేసింది. శంతనుడు ఆమెను "ఓ కోమలాంగీ, నీవు ఎవరు? ఇక్కడ ఏం చేస్తున్నావు?" అని ప్రశ్నించాడు. ఆమె ఇలా బదులు చెప్పింది: "నా పేరు సత్యవతి, దాశరాజు (జాలరుల రాజు) పుత్రికను. పుణ్యం ఆర్జించటానికి ప్రయాణీకులను నది దాటిస్తుంటాను." శంతనుడు ఆమెను ప్రేమించి వివాహమాడటానికి ఉత్సాహపడ్డాడు. ఆమె తండ్రి వద్దకు వెళ్ళి ఆమెను తనకిచ్చి వివాహం చేయమని కోరాడు. అందుకు ఆయన, "మహారాజా! మీరు నా కుమార్తెను వివాహమాడటం మాకు గర్వకారణం. కాని మీరు ఆమెను చేపట్టడానికి ముందు నాకొక వాగ్దానం చెయ్యాలి" అన్నాడు.

"నీకేం మాటివ్వాలో చెప్పు" అని శంతనుడు అడిగితే ఆతడు, "ఈమెకు పుట్టిన బిడ్డకే మీ తదనంతరం రాజ్యాన్ని ఏలే అధికారం ఉండాలి" అన్నాడు.

శంతనునికి ఆమెపై ఎంత వ్యామోహమున్నా, అలాంటి వాగ్దానం చేయలేకపోయాడు. తన ప్రాణమయిన దేవవ్రతునికి ఎలా అన్యాయం చేయగలడు? అందువలన అతడు భారమైన హృదయంతో తిరిగి వచ్చాడు. ఈ విషయం ఎవరితోనూ చెప్పక ఏకాంతంలో రోజు రోజుకు కృంగిపోసాగాడు.

దేవవ్రతుడు తండ్రి విచారాన్ని గమనించి ఆయనను సమీపించి, " తండ్రీ ఇటీవల మీరు విచారంగా కనిపిస్తున్నారు. మీ విచారానికి కారణమేమిటి? నేను ఏ విధంగా మీకు సహాయపడగలనో చెప్పండి" అని వేడుకున్నాడు.





అప్పుడు శంతనుడు, "నాయనా! నా మనోవేదనకు కారణం చెబుతాను, విను, నీవు నాకు ఒక్కగానొక్క కుమారుడివి. జీవితం అనిత్యం. నీకు జరగరానిది ఏదైనా జరిగితే నేను మళ్లీ పుత్రవిహీనుణ్ణి అవుతాను. కాని నీవు నాకు వందమంది కుమారులతో సమానం. అందువల్ల నేను మళ్ళీ వివాహం చేసుకోదలచలేదు. నీవు చిరకాలం జీవించి మన వంశాన్ని వృద్ధి చెయ్యాలని నా ఆకాంక్ష. కాని పెద్దలు ఒక్క పుత్రుడున్నవాడు పుత్రహీనుడంటారు. నీవు నా పుత్రుడివి కావటం వల్ల నాకు స్వర్గం లభిస్తుందని తెలుసు. నీవు సాటిలేని యోధుడివి. ఏ కారణం వల్లనైనా నీకు యుద్ధంలో వీరమరణమే సంభవిస్తే అప్పుడు వంశాన్ని నిలబెట్టే వారు ఎవరు? ఇదే నా మనోవేదనకు గల కారణం" అన్నాడు.

ధీరుడైన దేవవ్రతుడు కొంత కాలం ఆలోచించి, తర్వాత మహామంత్రి మూలంగా తండ్రి మనోవేదనకు అసలు కారణం తెలుసుకున్నాడు. సత్యవతిని చేపట్టాలని శంతనుడు ఎంతగానో ఆశించాడు కాని దేవవ్రతునికి అన్యాయం చెయ్యడానికి ఆయనకు మనస్సొప్ప లేదు. మంత్రి సామంతులతో సహా దేవవ్రతుడు సత్యవతి తండ్రి వద్దకు వెళ్లి ఆమెను తన తండ్రికిమ్మని ప్రాధేయపడ్డాడు. ఆ జాలరి తన షరతును తిరిగి చెప్పాడు. దానికి దేవవ్రతుడు "ఓ! దాశరాజా! నా ప్రతిజ్ఞ విను. నీ కుమార్తె పుత్రునికే రాజ్యాధికారం కలుగుతుందని ప్రతిజ్ఞ చేస్తున్నాను" అన్నాడు.

ఆ జాలరి మళ్ళీ తటపటాయిస్తూ "ఓ మహానుభావా! మీరు చేసిన ప్రతిజ్ఞ ప్రశంసనీయం. ఇలాంటి త్యాగం మీరే చేయగలుగుతారు. కాని మీకు పుట్టబోయే కొడుకులు మీ మాట నిలబెడతారని ఎలా



నమ్మగలను? ఇలా ప్రశ్నించినందుకు నన్ను క్షమించాలి. కుమార్తె శ్రేయస్సును మాత్రమే ఆకాంక్షించే తండ్రిగా ఇలా అడుగుతున్నాను" అన్నాడు.

అప్పుడు దేవవ్రతుడు, "నా మాట మరల విను! నేను ఇప్పుడే రాజునయ్యే అధికారాన్ని త్యజిస్తున్నాను. మీ అందరి సమక్షంలో ఈ ప్రతిజ్ఞ చేస్తున్నాను. నేను ఆజన్మ బ్రహ్మచారిగానే ఉండిపోతాను. వివాహం చేసుకోను. నేను అపుత్రుణ్ణి అయినా నాకు స్వర్గం లభిస్తుంది" అన్నాడు గంభీరంగా!

దేవవ్రతుని మాటలు విన్న ఆ జాలరి పరమానందంతో "సంతోషపూర్వకంగా నా కుమార్తెను మహారాజుకు ఇస్తాను" అన్నాడు.

ఇంతలో అప్సరసలు, దేవగంధర్వులు 'భీష్ముడు, భీష్ముడు' అంటూ దేవవ్రతుని మీద పుష్పవర్షం కురిపించారు. భీష్ముడు అంటే భీకరమైన ప్రతిజ్ఞ చేసిన వాడు అని అర్థం. అప్పటి నుండి దేవవ్రతుడు భీష్ముడుగా ప్రఖ్యాతి పొందాడు.

యువరాజైన దేవవ్రతుని ప్రతిజ్ఞలకు దాశరాజు సంతోషంతో తబ్బిబ్బై తన కుమార్తెను శంతన మహారాజు కివ్వటానికి అంగీకరించాడు. తర్వాత దేవవ్రతుడు సత్యవతితో, "అమ్మా! ఈ రథం ఆధిరోహించండి. మా తండ్రి వద్దకు తీసుకుపోతాను" అన్నాడు. తండ్రి వద్ద సెలవు తీసుకుని సత్యవతి దేవవ్రతునితో హస్తినాపురానికి బయలుదేరింది.

సత్యవ్రతుడు తండ్రి వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పాడు. భీష్ముని పితృప్రేమను సభాసదులందరూ వేనోళ్ళ ముక్తకంఠంతో ప్రశంసించారు. "నీవు నిజంగా భీష్ముడివే, నీకు జోహారులు" అన్నారు. శంతనుడు కూడా దేవవ్రతుని త్యాగానికి ముగ్ధుడైపోయాడు. ఆయన హృదయం కరిగిపోయింది. తన ప్రియపుత్రునికి కృతజ్ఞత ఎలా తెలియచెయ్యాలో తెలియలేదు. కనుల వెంట





ఆనందబాష్పాలు కురిశాయి. భీష్ముని ప్రేమతో కౌగలించుకున్నాడు. "నాయనా, నీ వలన పరితృప్తుడనైన నేను నీకు స్వచ్ఛంద మరణం కలిగేటట్లు వరమిస్తున్నాను. నీవు కోరుకున్నప్పుడే నీకు మృత్యువు కలుగుతుంది," అంటూ వరమిచ్చాడు.

## 6
## సత్యవతి కుమారులు

క్రమంగా సత్యవతికి చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అనే ఇద్దరు కుమారులు కలిగారు. చిత్రాంగదుడు అత్యంత పరాక్రమశాలి, ధీమంతుడు. విచిత్రవీర్యుడు విలువిద్యలో మేటి. శంతనుడు మరణించిన తర్వాత భీష్ముడు తన వాగ్దాన ప్రకారం చిత్రాంగదుని రాజుగా చేశాడు.

అప్పుడు గంధర్వులలో మాత్సర్య పీడితుడైన చిత్రాంగదుడు అనే రాజు శంతన కుమారుడైన చిత్రాంగదునితో యుద్ధానికి పూనుకున్నాడు. గంగాతీరంలో వారికి మూడు సంవత్సరాలు యుద్ధం సాగింది. చివరకు శంతన కుమారుడైన చిత్రాంగదుడు యుద్ధంలో మరణించాడు. భీష్ముడు దహన సంస్కారాలు చేశాడు. అప్పుడు విచిత్రవీర్యుడు ఇంకా చిన్నవాడు. అందువలన సత్యవతి కోరిక మేరకు భీష్ముడు రాజ్యపాలనలో ఆతని తరఫున కర్తవ్యపాలన వహించాడు.

విచిత్రవీర్యునకు వయసు రాగానే భీష్ముడు ఆతనికి రాజ్యపట్టాభిషేకం చేశాడు. భీష్ముడు, సత్యవతి అతనికి వివాహం చేయదలచుకున్నారు. ఆ సమయానికి కాశీరాజు తన ముగ్గురు కుమార్తెలకు స్వయంవరం

ప్రకటించాడు. చాలామంది రాజులు ఆ స్వయంవరానికి విచ్చేసి ఉన్నారు. భీష్ముడు ఆ ముగ్గురు కన్యలను చూసి వారు విచిత్రవీర్యునికి తగిన భార్యలవుతారని నిశ్చయించుకున్నాడు. ఆసీనులైన రాజుల పేర్లు చదువుతుండగా భీష్ముడు, విచిత్రవీర్యుని కొరకు ఆ కన్యలను కోరాడు. భీష్ముడు స్వయంవర మండపంలో ప్రవేశించి అచ్చట ఉన్న రాజులందరూ చూస్తూ ఉండగానే బలవంతంగా ఆ ముగ్గురు కన్యలను తన రథం మీద ఎక్కించుకుని, అచ్చటి రాజులందరితో పిడుగులాంటి కంఠస్వరంతో ఇలా అన్నాడు: "స్వయంవర విధానాలు చాలా ఉన్నాయి, అని పెద్దలు చెపుతారు. అందులో కన్యను బలవంతంగా రాజులందరి సమక్షాన తీసుకుపోవడం ఒక విధం. ఈ ముగ్గురు కన్యలను మీ సమక్షంలోనే బలవంతంగా తీసుకొని పోతున్నాను. మీలో ఎవ్వరైనా నాతో పోరాడమని సవాలు చేస్తున్నాను. మీకున్న శక్తిసామర్థ్యాలతో నన్ను ఓడించవచ్చు." ఇలా అంటూ భీష్ముడు రథాన్ని ముందుకు నడిపాడు. హఠాత్తుగా ఇలా జరుగుతుందని ఊహించని ఆ రాజులందరూ క్షణకాలం స్తంభించిపోయి తర్వాత కోపోద్రిక్తులై పెదవులు కొరుకుతూ ఆయుధాలు ధరించి, రథాలను అధిరోహించి భీష్మునితో యుద్ధానికి తలబడ్డారు. భీష్మునికి, రాజులకు మధ్య ఘోర యుద్ధం జరిగింది. ఒక వైపు అసంఖ్యాకులైన రాజులు మరోవైపు భీష్ముడొక్కడు. వేలకొలది నిశిత బాణాలను వారు భీష్మునిపై ప్రయోగించారు.



కాని భీష్ముడు వాటినన్నింటిని మార్గమధ్యముననే ఖండించి వేశాడు. ఈ భీకర సంగ్రామాన్ని చూచిన వారు దేవాసుర యుద్ధమేమోనని భ్రమపడ్డారు. యుద్ధంలో పాల్గొనని రాజులు ఆ దృశ్యాన్ని చూడటానికే భయపడ్డారు. భీష్ముని ధైర్యసాహసాలకు ఆయన నెదురించిన రాజులందరు ఆశ్చర్యపడి అభినందించారు. ఆ రాజులందరినీ అవలీలగా ఓడించి భీష్ముడు ముగ్గురు కన్యలతో హస్తినాపుర మార్గం పట్టాడు.

అప్పుడు సాల్వుడు అనే రాజు వికటాట్టహాసం చేస్తూ భీష్ముని అడ్డగించి నిలువమన్నాడు. సాహసవంతుడైన సాల్వుని చూచి రాజులంతా ఆశ్చర్యచకితులైనారు. ప్రచండ కోపంతో భీష్ముడు, "సారథీ! రథాన్ని సాల్వుని వైపు నడుపు. గరుడుడు సర్పమును చీల్చినట్లు నేనతణ్ణి చీలుస్తాను" అంటూ సాల్వుని గుఱ్ఱాలనూ, రథసారథినీ క్షణంలో చంపి, జాలితో సాల్వుని ప్రాణాలతో విడిచిపెట్టాడు. ఇతర రాజులందరూ అక్కడి నుండి వెళ్ళిపోయారు.

విజయంతో భీష్ముడు ముగ్గురు కన్యలతో హస్తినాపురం చేరుకున్నాడు. విచిత్రవీర్యునితో వారి వివాహమునకు అన్ని ఏర్పాట్లు చేశారు. కాని ఆ ముగ్గురు కన్యలలో పెద్దదైన అంబ భీష్ముని ముందుకు వచ్చి ఇలా అన్నది: "నేను స్వయంవరానికి ముందే శైబ్యరాజైన సాల్వుని భర్తగా వరించాను. ఆయన కూడా నన్ను అంగీకరించాడు. మా తండ్రి కూడా సమ్మతించాడు. నేను స్వయంవరంలో సాల్వుణ్ణే వరించి ఉండేదాన్ని. మీరు విజ్ఞానవంతులు, ధర్మవేత్తలు. అందువల్ల, ఏది ధర్మసమ్మతమో దానినే చేయండి."

భీష్ముడు ఆమె మాటలను గౌరవించి ఆమె వెళ్ళిపోవడానికి అనుమతించాడు. మిగిలిన ఇరువురు సోదరీమణులైన అంబిక, అంబాలికలను విచిత్రవీర్యునికిచ్చి వివాహం జరిపించాడు. కొంతకాలం వారి వివాహ జీవితం సుఖసంతోషాలతో గడిచిపోయింది. కాని, యువప్రాయముననే అతనికి రాజయక్ష్మ రుగ్మత దాపురించింది; చికిత్సలు ఎన్ని చేయించినా



లాభంలేకపోయింది. రాజకుటుంబాన్నంతా విషాదంలో ముంచి విచిత్రవీర్యుడు కన్నుమూశాడు.

## 7
## దుర్దశ

ఇప్పుడు, బ్రహ్మచర్యవ్రతం పూనిన భీష్ముడు తప్ప వంశాన్ని నిలుపడానికి వేరెవ్వరూ లేకపోయారు. అందువల్ల సత్యవతి భీష్ముని బ్రహ్మచర్యవ్రతం చాలించి వివాహమాడి సంతతిని పొందమని కోరింది.

అందుకు భీష్ముడు, అమ్మా! నా ప్రతిజ్ఞ మరిచిపోయినట్లున్నావు. నా ప్రతిజ్ఞను ఎన్నడూ ఉల్లంఘించను. సముద్రాలు ఇంకిపోవచ్చు నేను త్రిలోకాధిపత్యాన్నైనా త్యజిస్తాను కానీ, సత్యాన్ని వదలి నా ప్రతిజ్ఞాభంగం చేయను" అన్నాడు.

తర్వాత సత్యవతి, వ్యాసమహర్షిని సలహా అడగమని భీష్మునితో చెప్పింది. అందుకు భీష్ముడు అంగీకరించాడు. సత్యవతి, వ్యాసమహర్షిని మనస్సులో స్మరించింది. వెంటనే వ్యాసుడు ఆమె ముందు ప్రత్యక్షమైనాడు. ఆమె అతనితో తన దుర్దశను వివరించి తనను ఆదుకోమని ప్రార్థించింది. వ్యాసుని వరప్రదానంతో, అంబికకు ధృతరాష్ట్రుడు, అంబాలికకు పాండు, తక్కువ కులానికి చెందిన అంబిక దాసీకి విదురుడు పుట్టారు. తర్వాత వ్యాసమహర్షి, సత్యవతి వద్ద సెలవు తీసుకుని ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

## 8
## ముగ్గురు సోదరులు

రాజవంశానికి చెందిన ఇద్దరు రాకుమారులు, తక్కువ కులానికి చెందిన విదురుడు శంతనుని కులజులు అయ్యారు. ఈ ముగ్గురు సోదరులను భీష్ముడు కన్నబిడ్డలలా పోషించాడు. విలువిద్యలో పాండురాజు అందరిలోను మేటి అయ్యాడు. ధృతరాష్ట్రుడు మంచి బలశాలి అయినాడు. విదురుడు ధర్మంలోను, నీతిశాస్త్రంలోను ప్రవీణుడైనాడు. ధృతరాష్ట్రుడు పుట్టుకతోనే అంధుడు. అందువలన పాండురాజు రాజసింహాసనాన్ని అధిరోహించాడు.

ముగ్గురు కుమారులు పెద్దవారైన తర్వాత, ఒక రోజు భీష్ముడు వారితో, "మన వంశం వృద్ధి చెందాలనే ఉద్దేశంతో మిమ్మల్ని పెంచి పెద్దచేశాను. మన కుటుంబ గౌరవానికి తగిన ముగ్గురు అందమైన కన్యలు వివాహానికి సిద్ధంగా ఉన్నారని విన్నాను. వారు యాదవ, సుబల, మద్ర రాజుల పుత్రికలు. ఈ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?" అని ప్రశ్నించాడు. అప్పుడు విదురుడు, "మీరు మాకు తండ్రి మాత్రమే కాదు, తల్లిగా కూడా ఉంటున్నారు. మా గురువు, మా సర్వస్వమూ కూడా మీరే. మీరు ఏది చెప్పితే దానిని శిరసావహిస్తాము" అన్నాడు.

## 9
## రాకుమారుల పరిణయం

సుబలుని పుత్రికయైన గాంధారి వందమంది బిడ్డలకు తల్లి అవుతుందని శివుని వల్ల వరం పొందినట్లుగా పురోహితుల ద్వారా భీష్ముడు విన్నాడు. వెంటనే ఆతడు ధృతరాష్ట్రునికి గాంధారిని ఇవ్వవలసిందిగా దూతల ద్వారా ఆమె తండ్రికి కబురు చేశాడు. ధృతరాష్ట్రుడు అంధుడైనా, వివాహం జరిగింది. గాంధారి సోదరుడైన శకుని తన చేతుల మీదగా ఎంతో వైభవంగా వివాహం జరిపించాడు. శకునే మహాభారత కథలో ముఖ్యపాత్ర వహించవలసి ఉన్నాడు.



వసుదేవుని తండ్రి అయిన శూరుడు యాదవ ప్రముఖుడు. ఆయనకు పృథ అనే అత్యంత రూపవతి అయిన కుమార్తె ఉంది. ఆయన తన పుత్రికను బిడ్డలు లేని తన బావమరిది కుంతిభోజునకు దత్తత ఇచ్చినాడు. అప్పటి నుండి పృథ 'కుంతి' గా వ్యవహరింపబడినది.



ఒకసారి ఆమె దుర్వాస మహామునికి అత్యంత భక్తి శ్రద్ధలతో సేవలు చేసింది. ఆమె ఒనర్చిన పరిచర్యలకు సంతుష్టుడైన ఆ మహర్షి ఆమెకు ఒక మంత్రంతో కూడిన వరం ఇచ్చాడు. ఆ మంత్రంతో ఆమె ఏ దేవతను ఉపాసించితే, ఆ దేవత అంశముతో, దివ్యశక్తిగల బిడ్డ ఆమెకు జన్మిస్తాడని వరం ఇచ్చాడు.

ఒకసారి కుంతి కుతూహలంతో ఆ మంత్రంతో సూర్యదేవుని ఆహ్వానించింది. తక్షణం తన దివ్య తేజస్సుతో వెలుగుతూ సూర్యదేవుడు ప్రత్యక్షమైనాడు. కుంతికి ఏం చేయడానికి తోచలేదు. భయంతో వణికిపోతూ "స్వామీ! క్షమించండి. మంత్రాన్ని పరీక్షించాలనే చాపల్యంతో ఇలా చేశాను. నా కెలాంటి వరమూ అక్కరలేదు" అన్నది. కానీ అందుకు సూర్యదేవుడు సమ్మతించక దుర్వాసుని మంత్రాన్ని నిష్ఫలం చేయలేనని చెప్పి సహజ కవచకుండలములతో ఉన్న చక్కని పుత్రుని ఆమెకు ప్రసాదించి వెళ్ళిపోయాడు. లోకనిందకు భయపడి కుంతి ఆ పుత్రుణ్ణి ఒక పెట్టెలో పెట్టి గంగానదిలో వదిలి వేసింది. ఆ పెట్టె అతిరథుడనే రథసారథికి దొరికినప్పుడు అతడు మహానందంతో ఆ బిడ్డను తన కన్నబిడ్డగా పెంచి అతనికి వసుసేనుడని పేరు పెట్టాడు.



వసుసేనుడు పెరిగి పెద్దవాడయ్యాడు. మంచి బలాఢ్యుడవడంతో పాటు శస్త్రాస్త్ర సంధానంలో సాటిలేని యోధుడయ్యాడు. ఆతడు ప్రతిరోజూ ప్రాతః కాలం నుండి (సూర్యోదయం) సూర్యాస్తమయం వరకు సూర్యుని పూజించేవాడు. అతనిది ఉదారహృదయం. ఎవరు ఏది యాచించినా తన వద్ద ఉన్నది అంతా దానం చేసేవాడు. వసుసేనుడు బ్రాహ్మణులకు దానం ఇవ్వనిది ఏదీ పృథివిలో లేదు. ఒకరోజు ఇంద్రుడు బ్రాహ్మణరూపంలో వచ్చి అతని కవచకుండలాలను యాచించాడు. వసుసేనుడు కొంచమైనా వెనుకాడక వెంటనే కత్తితో తన సహజకవచకుండలాలను కోసి ఇచ్చినందువల్ల కర్ణుడుగా పేరుగాంచాడు.

కుంతి భోజుడు తన కుమార్తె కుంతికి స్వయంవరం చాటించాడు. అచ్చట ఆసీనులైన రాజులలో చక్కని శరీరసౌష్ఠవం గల పాండురాజును చూచి ఆతనినే, తన భర్తగా వరించి వరమాలను ఆయన కంఠంలో వేసింది. పాండురాజు భార్యయైన కుంతితో తన అంతః పురమునకు తిరిగి వచ్చాడు.

కొంతకాలం తర్వాత భీష్ముడు పాండురాజుకు ఇంకొక వివాహం చేయ తలపెట్టి పెద్ద సైన్యంతో మద్ర దేశానికి పయనమైనాడు. ఆ దేశపు రాజు భీష్మునికి ఘనస్వాగతమిచ్చి ఆయన రాకకు కారణమడిగాడు. అప్పుడు భీష్ముడు "నీ చెల్లెలైన మాద్రిని పాండురాజుకు ఇవ్వమని అడుగడానికి వచ్చాను" అన్నాడు. అందుకు మద్రరాజు "మీతో బంధుత్వం మాకు గర్వకారణమే. కాని మా కులాచారం ప్రకారం మాకు మీరు కన్యాశుల్కంగా ఎంతో ధనం ఇవ్వాల్సి ఉంటుంది" అన్నాడు. అప్పుడు భీష్ముడు శల్యుని ముందు ధన సువర్ణ రాశులు, వజ్ర వైడూర్యాలు, అమూల్య వస్తువులు ఉంచాడు. ఈ విధంగా మాద్రి పాండురాజుల వివాహం వైభవోపేతంగా జరిగింది.

నెల రోజులు తన ఇరువురు భార్యలతో ఆనందంగా గడిపిన తర్వాత పాండురాజు దిగ్విజయానికై పెద్ద సైన్యంతో బయలుదేరాడు. ఎంతో మంది రాజులను యుద్ధంలో జయించి వారి వద్ద, వెండి బంగారు కానుకలను గోవులను, గుఱ్ఱములను, ఏనుగులను స్వీకరించి రాజధానికి తిరిగి వచ్చి భీష్మునికి ఇతర పెద్దలకూ పాదాభివందనం చేశాడు.

తరువాత భీష్ముడు యౌవన రూప లావణ్యములు గల దేవకుని కుమార్తెతో విదురునకు వివాహం జరిపించాడు.

## 10

## గాంధారికి కలిగిన పుత్రులు

పరమేశ్వరుని వరప్రసాదంతో గాంధారికి వందమంది పుత్రులు, ఒక పుత్రిక కలిగారు. ధృతరాష్ట్రునికి ఒక వైశ్యస్త్రీ వలన యుయుత్సు అనే కుమారుడు కూడా కలిగాడు. ధృతరాష్ట్రుని కుమార్తెయైన దుశ్శలను సింధు దేశపు రాజు జయద్రథునికిచ్చి వివాహం చేశారు.

దుర్యోధనుడు పుట్టినవార్త భీష్మునకు, మహాత్ముడైన విదురునకు తెలుపబడింది. దుర్యోధనుడు పుట్టగానే గాడిదలా ఓండ్ర పెట్టసాగాడు. అది విని గ్రద్దలు, రాబందులు, నక్కలు, కాకులు కూడా అరవసాగాయి. సుడిగాలులు వీచాయి. పలుచోట్ల అగ్నిప్రమాదములు సంభవించాయి. ఈ దుశ్శకునాలన్నీ కౌరవవంశాన్నే తుదముట్టింపడాన్ని సూచిస్తున్నాయని విదురుడు గ్రహించాడు. భవిష్యత్తులో కలిగే అనర్థాన్ని తప్పించడానికి ఆ బిడ్డను వెంటనే తుదముట్టించమని విదురుడు సలహా ఇచ్చాడు. 'కుటుంబ శ్రేయస్సు కోసం ఒకనినీ, గ్రామ శ్రేయస్సుకై ఒక కుటుంబాన్నీ, దేశ శ్రేయస్సుకై ఒక గ్రామాన్నీ, ఆత్మార్థమై సర్వాన్నీ త్యజించాలనీ పెద్దలు చెపుతారు.'

శ్లో॥ త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులంత్యజేత్ ।
గ్రామం జనపద స్యార్థే ఆత్మార్థే పృధివీని త్యజేత్ ॥

కురువంశ నాశనానికే కారణభూతుడు కానున్న ఆ శిశువును వదలివేయమని విదురుడు సలహా ఇచ్చాడు. కాని తన జ్యేష్ఠ కుమారుడైన దుర్యోధనుని వదలటానికి ధృతరాష్ట్రుడు ఇష్టపడలేదు. దుర్యోధనునిపై ఉన్న మమకారంతో ఆతడు విదురుని హితోపదేశాన్ని పెడచెవిన పెట్టాడు.

## 11

## పాండురాజుకు కలిగిన శాపం

ఒక రోజు పాండురాజు అడవిలో విహరిస్తూ ఒక జింకల జంట వినోదంగా క్రీడించడం చూచి ఐదు బాణములతో మగజింకను కొట్టాడు. అయ్యో! దురదృష్టవశాత్తు పాండురాజు కొట్టింది జింకకాదు, కర్దమ మహాముని పుత్రుడైన గొప్ప ఋషివరేణ్యుడు. అతడు తన భార్యతో కలిసి జింకల రూపంలో క్రీడిస్తున్నాడు. పాండురాజు కొట్టిన బాణాలవల్ల ప్రాణాలు వదలబోతున్న ఆ ఋషిపుంగవుడు పాండురాజుకు మరణం దాపురించుగాక అని శపిస్తూ మరణించాడు. ఆ ప్రకారమే పాండురాజు అనతికాలంలోనే మరణించాడు. అప్పటికే పాండురాజుకు ఐదుగురు పుత్రులు. కుంతికి ముగ్గురు, మాద్రికి ఇరువురు కలిగారు. కుంతి జ్యేష్ఠపుత్రుడు కర్ణుడు, అతిరథుని దగ్గర పెరుగుతున్నాడు. కుంతికి కలిగిన నలుగురు పుత్రులు దుర్వాసమహాముని మంత్రప్రభావం వల్ల కలిగిన వారే.

## 12

## పాండవుల జననం

పాండురాజు పుత్రులందరూ పాండవులని పిలువబడ్డారు. కుంతి, దుర్వాసుడు ఇచ్చిన మంత్రాన్ని ఉపాసించి, ధర్మదేవత అనుగ్రహంతో జ్యేష్ఠ పుత్రుడు



యుధిష్ఠిరుని పొందింది. అతను ధర్మపుత్రుడుగా కూడా పిలవబడ్డాడు. ధర్మరాజు యుద్ధంలో స్థిరుడు. అందువలన యుధిష్ఠిరుడు అయినాడు. ధర్మనిష్ఠ కలవాడు కావునా ధర్మపుత్రుడయాడు. వాయుదేవుని ఉపాసనతో భీముడు పుట్టాడు. భీముడు అనగా దృఢకాయుడు, అత్యంత బలశాలి అని అర్థం. అతనికి వృకోదరుడు అని ఇంకొక పేరు. ఎంత ఆహారమైన తిని జీర్ణించుకోగలడని దాని అర్థం. భీముడు పసిబిడ్డగా ఉన్నప్పుడు తల్లి ఒడిలోనుండి హఠాత్తుగా పెద్ద బండరాయి మీద పడినప్పుడు ఆ బండరాయి ముక్కలు ముక్కలుగా విరిగి పోయిందేగాని ఆ బిడ్డకు ఎలాంటి గాయమూ కలుగలేదు. భీముడు, దుర్యోధనుడు ఇద్దరూ ఒకే రోజు జన్మించారు.

తరువాత కుంతి ఇంద్రుని ఉపాసించి అర్జునుని కన్నది. అతడు విలువిద్యలో అత్యంత ప్రావీణ్యతను పొంది లోకంలోనే తనకు సాటియైన యోధుడు లేడనిపించుకున్నాడు.

తరువాత మాద్రి అశ్వినీ దేవతలను ఉపాసించగా నకుల సహదేవులు కలిగారు. ఆ ఐదుగురు పంచపాండవులు గానూ, గాంధారికి జన్మించిన వందమంది పుత్రులు కౌరవులుగానూ మహాభారతంలో వ్యవహరింపబడ్డారు.



## 13

## పాండవులు హస్తినాపురానికి రావటం

ఋషి శాపంతో పాండురాజు మరణించగా మాద్రి భర్తతో సహగమనం చేసింది. అప్పుడు ఐదుగురు పిల్లలను పోషించవలసిన భారం పూర్తిగా కుంతీదేవి మీద పడింది. ఆ తర్వాత విచిత్ర సంఘటనలు జరిగాయి. ఋషులందరూ సంప్రదించుకొని కుంతిని పుత్రులతో సహా హస్తినాపురానికి తీసుకు వెళ్ళారు. అంత మంది ఋషులు తమ నగరానికి రావడం చూచి ప్రజలు ఆశ్చర్యచకితులయ్యారు. ఆ వార్త ధృతరాష్ట్ర, భీష్ములకు తెలిసింది. వారు సత్యవతి, విదురుడు మున్నగు వారితో సింహద్వారం వద్దకు వచ్చి ఋషుల నందరిని సాదరంగా ఆహ్వానించి అతిథి సత్కారాలు చేశారు. అప్పుడు వారిలో ఒక వృద్ధ ఋషిపుంగవుడు వారినందరిని ఉద్దేశించి ఇలా అన్నాడు: "పాండురాజు మహానుభావుడు. మాతోపాటు ఆయన శతశృంగ పర్వతములలో కఠిన నియమాలు పాటిస్తూ నివసించాడు. మా అందరికీ ఆయన ఎంతో ప్రీతిపాత్రుడు. అక్కడ ఉంటున్నప్పుడు ఆతనికి ఐదుగురు పుత్రులు కలిగారు. ముగ్గురు కుంతికి, ఇద్దరు మాద్రికి జన్మించారు. వారికి అన్ని సంస్కారములు పాండురాజు జరిపించాడు. వారందరూ వేదపారంగతులయ్యారు. ధార్మిక జీవనం గడిపిన పాండురాజు పదిహేడు రోజుల ముందు దివంగతుడైనాడు. మాద్రి భర్తతో సహగమనం చేసింది. మేము కుంతినీ, పాండు పుత్రులనూ తీసుకువచ్చాము. వారిని ఆదరపూర్వకంగా స్వీకరించండి." అలా ఋషులు సందేశమిచ్చి అరణ్యానికి వెళ్ళిపోయారు.

నగరమంతా దుఃఖంలో మునిగింది. భీష్ముడు, విదురుడు, ధృతరాష్ట్రుడు దుఃఖ పూరితులైనారు. వారు పాండురాజుతో సంతోషంగా గడిపిన రోజులు గుర్తుకు వచ్చాయి. తమ్ముడు పాండురాజుకు రాజోచితంగా, శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరపమని ధృతరాష్ట్రుడు, విదురుని ఆజ్ఞాపించాడు. వ్యాసమహర్షి వచ్చి కర్మకాండ అంతా పర్యవేక్షించాడు.

తర్వాత కొన్ని రోజులకు వ్యాసుడు సత్యవతితో "అమ్మా! ఆనందమయమైన రోజులు గడచిపోయి, దుర్దినాలు రానున్నవి. ఇక రాను రాను పాపం పెరిగిపోతుంది. అందువల్ల నీవు ఈ చోటు విడిచి తపస్సుకై వనానికి వెళ్ళడం ఉచితం" అని చెప్పాడు.

సత్యవతి భీష్ముని అనుమతితో తన కోడళ్ళతో తపస్సుకై అడవులకు వెళ్ళిపోయింది. అక్కడ వారు తీవ్ర తపశ్చర్యలను ఆచరించి తమ దేహాలను వదలి స్వర్గధామాన్ని చేరుకున్నారు.



## 14

## దుర్యోధనుడు మాత్సర్య పీడితుడవడం

కుంతీ పుత్రులైన పాండవులు కౌరవులతో పాటు దినదిన ప్రవర్ధమానులవసాగారు. క్రీడలలోనూ ఇతర విషయాలలోనూ పాండవులదే పైచేయి. భీముడు వారినందరిని సునాయాసంగా ఓడించేవాడు. వారి కాళ్ళు పట్టి లాగుతూ, జుట్టుతో ఈడుస్తూ, నీళ్ళలో ఆడుతున్నప్పుడు పదిమందిని నీళ్ళలో అదిమిపట్టి ఉక్కిరిబిక్కిరయ్యే వరకు వదిలేవాడు కాదు. పండ్లు కోయడానికి వాళ్ళు చెట్లెక్కినప్పుడు ఆ చెట్టును ఊపి పండ్లతో సహా వారుకూడా క్రిందపడేలా చేసేవాడు. ఇవన్నీ బాల్యచేష్టల వల్ల చేసిన పనులే కాని వారిపై ఎలాంటి ద్వేష భావంతో చేయలేదు. కాని దుర్యోధనుడు మాత్రం భీమునిపైనా, అతని సోదరులపైనా మాత్సర్యాన్ని పెంపొందించుకోసాగాడు.



'భీమునిలాంటి బలిష్ఠులు మనలో ఎవరూ లేరు. అతను నిద్రపోతున్నప్పుడు గంగానదిలో పడవేసి చంపేద్దాము' అని దుర్యోధనుడు ఆలోచించాడు. ఇలాంటి కుతంత్రంతో గంగాతీరంలో ఆడుకోవడానికి ఒక భవనాన్ని నిర్మించి, రకరకాల రుచికర భక్ష్యాలు వండించి పాండవులను విందు భోజనానికి ఆహ్వానించాడు.

ఆ భవన సౌందర్యం పాండవులను ఆకర్షించింది. వారు ఆ రుచికర పదార్థాలు తింటున్నప్పుడు రహస్యంగా దుర్యోధనుడు, భీముని ఆహారంలో ఘోరమైన విషం కలిపి, స్నేహం నటిస్తూ దానిని భీమునితో తినిపించాడు. తర్వాత వారందరు నీళ్ళలో ఆనందంగా క్రీడించసాగారు.

కొంతసేపు ఆడి బాగా అలసిపోయిన భీముడు ఒక చెట్టునీడన పడుకున్నాడు. ఆ స్థితి గమనించి దుర్యోధనుడు చెట్టు తీగలతో అతని కాళ్ళు చేతులు బంధించి గంగానదిలో పారవేశాడు. భీముడు స్పృహ కోల్పోయిన స్థితిలో నాగలోకానికి కొట్టుకుపోయాడు.

అక్కడ వేలాది విషసర్పాలు భీముణ్ణి కాటువేశాయి. కాని ఆ విషసర్పపు కాటులన్నీ దుర్యోధనుడిచ్చిన ఘోర విషానికి విరుగుడుగా పనిచేశాయి. భీముడు మేల్కొని పాములపై నడవసాగాడు. కొన్ని పాములు భయంతో పారిపోయి తమ రాజైన వాసుకి వద్దకు వెళ్ళి, "ఓ సర్పరాజా! విషం త్రాగిన ఒక మానవుడు ఇక్కడున్నాడు. ఆతడు మా మీద పడ్డప్పుడు స్పృహలేని వాడుగా కనిపించాడు. కాని మేము అతణ్ణి కాటువేయ ప్రారంభించగానే అతడు మేల్కొని మమ్మల్ని చంపటం ప్రారంభించాడు. ఆతనెవరో మీరు తెలుసుకోవాలి" అన్నాయి. వెంటనే వాసుకి భీమసేనుని చూచాడు. ఆ సర్పాలలో ఆర్యకుడు అనే సర్పం కుంతీదేవి తండ్రికి పితామహుడు. అతడు భీముని చూడగానే ఆనందంతో కౌగలించుకున్నాడు. అది చూచిన వాసుకి స్నేహపూరిత హృదయంతో భీముని తీసుకువెళ్ళి అమృతంతో నిండిన 'రసకుండం' ఇచ్చాడు. ఒక్క గుటకలో భీముడు ఆ అమృతాన్నంతా త్రాగాడు. ఆ విధంగా ఎనిమిది కలశాల అమృతం భీముడు త్రాగి ఎనిమిదివేల ఏనుగుల బలం సంపాదించుకున్నాడు. తరువాత సర్పాలు చేసిన ఒక శయ్య మీద భీముడు హాయిగా నిద్రించాడు.

కౌరవ పాండవులు తమ ఆటపాటలు చాలించి హస్తినాపురం తిరిగి పోయారు. పాండవులలో భీముడు లేకపోవడం చూచి దుర్యోధనుడు ఎంతగానో ఆనందించాడు. "అమ్మా, భీముడు, తిరిగి వచ్చాడా?" అని యుధిష్ఠిరుడు తల్లి నడిగితే, ఆమె ఆశ్చర్యపోతూ "రాలే"దని చెప్పింది. యుధిష్ఠిరుని ముఖం చూచి కుంతి భయపడింది. దుర్యోధనుడు తప్పకుండా ఏదో కుతంత్రం



పన్ని ఉంటాడని ఊహించిన కుంతి, విదురుని దగ్గరకు వెళ్ళింది. విదురుడు ఆమెను ఓదారుస్తూ, "సోదరీ! బాధపడవద్దు. నీ కుమారులు దీర్ఘాయువులని ఋషులందరూ చెప్పారు కదా! భీముడు తప్పక తిరిగి వస్తాడు" అన్నాడు. కుంతి కుమారులతోపాటు ఆదుర్దాతో భీమునికోసం వేచివున్నది.

భీముడు ఆ విధంగా ఎనిమిది రోజులు నిద్రపోయి మేల్కొన్న వెంటనే అమృతం సేవించినందువల్ల తాను అత్యంత బలవంతుడయినట్లు గ్రహించాడు. నాగులు వీడ్కోలు చెప్పగా భీముడు అచ్చటి నుండి బయలుదేరి రాజాంతఃపురం చేరాడు. జరిగిన వృత్తాంతమంతా తన సోదరులకు వివరించాడు. అప్పుడు యుధిష్ఠిరుడు భీమునితో ఆ వృత్తాంతమంతా తనలోనే రహస్యంగా ఉంచుకోమని చెప్పి, "నీవు ఏ విధంగా తప్పించుకున్నావో ఎవ్వరికీ తెలియనీయవద్దు, మనం ఇప్పటి నుండి జాగరూకులై ఉండాలి" అన్నాడు.

కొన్నాళ్ళ తర్వాత మళ్ళీ దుర్యోధనుడు భీముని ఆహారంలో ఘోరవిషం కలిపాడు. కాని దుర్యోధనుని సోదరులలో యుయుత్సు ఆ విషయం తెలుసుకొన్నాడు. అతడు పాండవులకు మిత్రుడు. ఆ విషయం భీమునికి తెలియచేసి ఆతని ప్రాణాలు కాపాడాడు.

దుర్యోధనుడు, అతని మామయైన శకుని, భీముని చంపడానికి ఎన్నో పన్నాగాలు పన్నారు. కానీ అవి ఏవీ ఫలించలేదు. విదురుని సలహా ప్రకారం ఆ విషయం గురించి పాండవులు మౌనం వహించారు.



## 15
## ద్రోణుని ప్రవేశం

గౌతముని పుత్రుడైన కృపాచార్యుడు, కౌరవ పాండవులకు విలువిద్య మున్నగు యుద్ధ విద్యలు నేర్పడానికి నియమింపబడ్డాడు. వారు ఆ విద్యల్లో కొంత ప్రావీణ్యం సంపాదించిన తర్వాత భీష్ముడు యుద్ధకళలలో వారిని మరింత కోవిదులను చేయగల గురువు కోసం అన్వేషించసాగాడు. అప్పుడు ద్రోణాచార్యుడు ఆ పనిలో నియుక్తుడు అయినాడు.

ద్రోణాచార్యుడు భరద్వాజ మహర్షి పుత్రుడు. పాంచాల రాజైన ప్రిశతుడు భరద్వాజుని స్నేహితుడు. ప్రిశతుని కుమారుడు ద్రుపదుడు. అతడు రోజూ ద్రోణునితో ఆడుకోవడానికి భరద్వాజుని ఆశ్రమానికి వచ్చేవాడు. వారిరువురూ కలిసి చదువుకునేవారు. ప్రిశతుడు మరణించిన తర్వాత ద్రుపదుడు పాంచాల దేశానికి రాజయ్యాడు. ఆ సమయానికి ద్రోణుని తండ్రి మరణించాడు. కానీ ద్రోణుడు తన సమయాన్నంతా చదువులోను, తపస్సులోనే గడిపాడు. కృపాచార్యుని సోదరియైన కృపితో ఆతని వివాహం జరిగింది. ఆ దంపతులకు అశ్వత్థామ అనే పుత్రుడు కలిగాడు.

మహా తేజస్వియైన పరశురాముడు తన సంపదనంతా బ్రాహ్మణులకు దానం చేస్తున్నట్లు విని ద్రోణుడు దివ్యాస్త్రములు సంపాదించాలనే ఉద్దేశంతో అక్కడికి వెళ్ళాడు. అప్పుడు పరశురాముడు, "నేను నా బంగారము, మిగిలిన సంపత్తినంతా దానంగా ఇచ్చేశాను. ఇక మిగిలినవి నా శరీరమూ, దివ్యాస్త్రాలు. నీవు వీటిలో ఏది కోరినా దానిని ఇవ్వడానికి సిద్ధమే" అన్నాడు. ద్రోణుడు వినమ్రతతో దివ్యాస్త్రాలనన్నింటిని స్వీకరించి ఇంటిముఖం పట్టాడు.

ఒకసారి అశ్వత్థామ తోడిపిల్లలు పాలు త్రాగడం చూచాడు. వెంటనే తనకు కూడ పాలు కావాలని మారాం చేశాడు. ద్రోణుడు నిరుపేద కావడంతో తన పుత్రునికి పాలు కూడా ఇవ్వలేకపోయాడు. ఎన్నిచోట్ల యాచించినా ఒక్క పాడి ఆవు కూడా దానంగా లభించలేదు. అశ్వత్థామ స్నేహితులు బియ్యం పిండిని నీళ్ళల్లో కలిపి పాలని చెప్పి ఇచ్చారు. అశ్వత్థామ పాలు త్రాగాననుకున్నాడు. చివరికి ద్రోణుడు తన బాల్య స్నేహితుడైన ద్రుపదుని కలుసుకోవాలని తీర్మానించుకున్నాడు. అప్పటికి ద్రుపదుడు పాంచాలరాజైనాడు.

ద్రుపదుని ఆస్థానానికి వెళ్ళి అతణ్ణి 'మిత్రమా' అని సంబోధించాడు ద్రోణుడు. కాని రాజ్య, ధన, మద గర్వంతో ఉట్టిపడుతున్న ద్రుపదుడు ఆతణ్ణి నిరాదరణ చేస్తూ, "ఓ బ్రాహ్మణుడా! మాలాంటి మహారాజులు నీలాంటి దురదృష్ట జాతకులతో ఎన్నడూ స్నేహం చేయరు. బీదలు శ్రీమంతులు, విద్వాంసులు మూర్ఖులు, వీరులు పిరికిపందలు – వీరి మధ్య ఎన్నడూ స్నేహితం కుదురదు" అన్నాడు. ద్రోణుడు ప్రళయకాల రుద్రుడిలా మండిపడ్డాడు. ద్రుపదునికి తగిన గుణపాఠం త్వరలో నేర్పాలనే దృఢ సంకల్పంతో పగపట్టిన త్రాచులా అక్కడినుండి తిన్నగా హస్తినాపురానికి బయలుదేరాడు. తన బావమరది అయిన కృపుని ఇంటిలో కాలక్షేపం చేయసాగాడు.



ఒకసారి కౌరవ పాండవులు ఆడుకుంటున్న బంతి హఠాత్తుగా అక్కడున్న బావిలో పడింది. వారు దానిని బయటికి తీయలేక తికమక పడుతున్నారు. అప్పుడు అచ్చటికి వచ్చిన ద్రోణుడు మందహాసంతో, "మీరందరు క్షత్రియకుమారులని చెప్పుకుంటున్నారు, ఆ బంతిని బయటికి తీయలేకపోవడం మీ అస్త్రవిద్యకు సిగ్గుచేటు. నాకు విందు భోజనం పెడితే ఒక్క క్షణంలో మీకా బంతే కాకుండా ఈ నా ఉంగరాన్ని కూడా గడ్డిపరకలతో బయటికి తీస్తాను" అంటూ తాను వ్రేలికి ఉన్న ఉంగరమును తీసి ఆ నీరులేని బావిలో పడవేశాడు. తర్వాత కొన్ని రెల్లు తీగెలు తీసుకుని మొదటి తీగెను బంతికి గ్రుచ్చుకునేటట్లు వేసి తర్వాత క్రమంగా రెల్లు తీగెలను ఒకదానితో ఒకటిగా తాడులా అతికించి, బంతిని బయటికి తీశాడు. తర్వాత విల్లు తీసుకుని, బాణం సంధించి బావిలో వదలగా ఆ బాణం క్షణంలో ఉంగరాన్ని బయటకు తీసింది.

భీష్ముడు ఈ విషయం విన్నాడు. అటువంటి ప్రజ్ఞావంతుడైన ఆచార్యుడే యువరాజులకు గురువుగా మనగలడని నిశ్చయించుకుని ద్రోణుని సాదరంగా ఆహ్వానించి ఆయనతో, "ఈ రాకుమారులందరిని మీకు అప్పగిస్తున్నాను. విలువిద్యతో సహా సకల విద్యల్లో వీరిని ప్రవీణులను చేయండి. ఈ కురుకుల సంపద మీది. ఈనాటి నుండి కురుపుత్రులు మీవారు" అన్నాడు భీష్ముడు.

ద్రోణుడు అందుకు సమ్మతించి, రాకుమారులతో "నేను మీకు గురువుగా ఉండగలను. గురుదక్షిణగా నేను కోరిన దానిని ఇస్తామని మీరు నాకు ఇప్పుడే వాగ్దానం చేయాలి" అన్నాడు. రాకుమారులందరు మౌనం వహించారు. కాని అర్జునుడు మాత్రం ఏ షరతు లేకుండా వాగ్దానం చేశాడు. సంతోషంతో ద్రోణుడు అతణ్ణి కౌగలించుకొని, తనకు తెలిసిన సర్వ విద్యలనూ, దివ్యాస్త్ర ప్రయోగాలనూ నేర్పుతానని వాగ్దానం చేశాడు. అర్జునుని అందరికంటె మిన్నయైన యోధునిగా తీర్చిదిద్దాడు. కురుపుత్రులకూ, తన కుమారుడైన అశ్వత్థామకూ విద్యనేర్పుతూ వారిని నీరు తెమ్మని పంపించేవాడు. అశ్వత్థామ అందరి కంటె ముందుగా పాత్రను నీటితో



నింపుకుని ద్రోణుని వద్దకు రాగానే ఇతరులు వచ్చేలోపల అతనికి యుద్ధవిద్యలలోని ఉన్నత రహస్యాలన్నీ ఆ విరామంలో నేర్పేవాడు. అర్జునుడు ఆ విషయం తెలుసుకొని వారుణాస్త్ర సహాయంతో తన పాత్రను అతిత్వరగా నీటితో నింపి అశ్వత్థామతో పాటే వచ్చేవాడు. తత్ఫలితంగా అశ్వత్థామతో సమానంగా విద్య లభించింది.



ఒక రోజు ద్రోణుడు అర్జునునకు చీకటిలో భోజనం పెట్టవద్దని వంటవానితో చెప్పాడు. కాని ఒకసారి అర్జునుడు రాత్రిపూట భోజనం చేస్తున్నప్పుడు పెనుగాలి వీచి దీపం ఆరిపోయింది. అందువల్ల అర్జునుడు చీకటిలోనే భోజనం చేయాల్సి వచ్చింది. వెంటనే ఒక ఆలోచన అతని మనస్సులో కలిగింది. "చీకటిలో కూడా విలువిద్య ఎందుకు అభ్యసించకూడదు?" తర్వాత చీకటిలో అర్జునుడు విలువిద్య అభ్యసించటం చూచి ద్రోణుడు పరమానందభరితుడై అతణ్ణి కౌగలించుకొని "విలువిద్యలో నీకు సాటిరాగల విలుకాడు ఉండడని చెప్తున్నాను" అన్నాడు.

## 16
## ఏకలవ్యుడు

ఒక రోజు పాండవులు, కౌరవులు అందరూ వేటకు బయలుదేరారు. వారితోపాటు ఒక కుక్క, ఒక సేవకుడు ఉన్నారు. ఆ కుక్క దారితప్పి అడవి మధ్యకు పోయింది. ఆ సమయంలో ఏకలవ్యుడనే నిషాద రాజకుమారుడు పులిచర్మం ధరించి అటువైపు వెళ్తున్నాడు. అతణ్ణి చూచి కుక్క మొరిగింది. ఏకలవ్యుడు వెంటనే ఏడు బాణాలు దాని నోట్లోకి ప్రయోగించాడు. కుక్క నోరు మూయలేక పరుగెత్తుకుంటూ పాండవులున్న చోటికి వెళ్ళిపోయింది. నోటినిండా బాణాలున్న ఆ కుక్కను చూచి అందరూ ఆశ్చర్యపడ్డారు. ఇలాంటి విలుకాడు ఎవరా అని వెదుకసాగారు. అతణ్ణి కలువగానే "నీ వెవరవు?" అని అడిగారు. అప్పుడా విలుకాడు "నేను ద్రోణాచార్యుని శిష్యుడైన ఏకలవ్యుడను" అన్నాడు. అర్జునుడు ఆశ్చర్యపడి వెంటనే ద్రోణుని వద్దకు వెళ్ళి "నన్ను మీరు ఈ ప్రపంచంలో అత్యంత గొప్ప విలుకానిగా చేస్తానని మాట ఇచ్చారు, కానీ నా కంటే గొప్ప విలుకాడు ఇంకొక శిష్యుడు ఉన్నాడు" అన్నాడు. అర్జునుని మాటలు ద్రోణునికి అర్థం కాలేదు. అర్జునుడు, ద్రోణుని ఏకలవ్యుడు

విలువిద్య అభ్యసించే ప్రదేశానికి తీసుకువెళ్ళాడు. ఏకలవ్యుడు ద్రోణునికి సాష్టాంగ వందనం చేశాడు. ద్రోణుడు అతణ్ణి గుర్తుపట్టలేదు. కొన్ని సంవత్సరాల పూర్వం ఏకలవ్యుడు ద్రోణుని ఆశ్రయించి తనకు విలువిద్య నేర్పమని ప్రార్థించాడు. కాని ద్రోణుడు క్షత్రియులకు మాత్రమే విద్య నేర్పటం వల్ల ఏకలవ్యుని ప్రార్థనను నిరాకరించాడు. అయినా ఏకలవ్యుడు ద్రోణాచార్యుని విగ్రహం పెట్టుకుని ఆ విగ్రహ స్ఫూర్తితో విలువిద్యలో ఆరితేరాడు. ఇదంతా ఏకలవ్యుడు ద్రోణునకు వివరించాడు. అప్పుడు ద్రోణుడు గొప్ప సంకోచంతో ఇలా అన్నాడు: "నీవు నా శిష్యుడవు కదా! నాకు గురుదక్షిణ ఇవ్వాలి!" ఏకలవ్యుడు ఆనందంతో సమ్మతించాడు. ద్రోణుడు "నీ కుడిచేతి బొటన వ్రేలు గురుదక్షిణగా ఇవ్వు" అని అడిగాడు. ఏమాత్రం తొట్రుపాటు లేకుండా ఏకలవ్యుడు కత్తితో తన కుడి బొటనవ్రేలిని కోసి సమర్పించాడు. అర్జునునిలో ఉన్న మాత్సర్యం తొలగిపోయింది. విలువిద్యలో అర్జునునికి సాటిలేరనే ద్రోణుని వచనాలు నిజమైనాయి.

## 17

## అర్జునుని సర్వోత్కృష్టత

రాకుమారుల విద్యాభ్యాసం ముగిసిన తర్వాత వారందరికి ద్రోణుడు ఒక పరీక్ష పెట్టాడు. ఒక పెద్ద వృక్షంపై ఒక మరపక్షిని ఉంచి రాకుమారులను పిలిచి "ఆ చెట్టుమీద ఉన్న ఆ పక్షిని గురిచూసి మీ బాణాలు ఎక్కుపెట్టి నేను కొట్టమన్నప్పుడు ఆ పక్షి తలను మీ బాణాలతో ఛేదించాలి" అన్నాడు.

ద్రోణుడు మొదట యుధిష్ఠిరుని పిలిచి, "ముందు నీవు బాణం ఎక్కుపెట్టు" అన్నాడు. అతడు బాణం ఎక్కుపెట్టిన వెంటనే "నీకు పక్షి కనిపిస్తున్నదా" అని అడిగాడు. "అవును" "ఇంకొకసారి చూచి నీకు కనిపించేదంతా వివరించు" అన్నాడు.



యుధిష్ఠిరుడు "నేను పక్షిని, చెట్టును, మిమ్ము, సోదరులను చూస్తున్నాను" అన్నాడు. "ప్రక్కన నిలబడు, నీవంతు అయిపోయింది" అన్నాడు ద్రోణుడు. అలాగే తక్కిన వారినందర్నీ ప్రశ్నించాడు. అర్జునుడు తప్ప అందరూ యుధిష్ఠిరుని లాగానే సమాధానమిచ్చారు. అర్జునుడు తన వంతు వచ్చినప్పుడు నాకు పక్షితల తప్ప వేరేమీ కనపడటం లేదు అన్నాడు. ద్రోణుడు ఆనందభరితుడై "ఆ పక్షి ఎలా ఉందో వివరించు" అన్నాడు. "నాకు పక్షి తల మాత్రమే కనిపిస్తున్నది" అన్నాడు అర్జునుడు. "అయితే బాణం ప్రయోగించు" అన్నాడు ద్రోణుడు. మరుక్షణమే పక్షితల తెగి క్రింద పడింది. ద్రోణుడు ఆనందంతో అర్జునుని కౌగలించుకొని అర్జునుని ద్వారా ద్రుపదుని గర్వం అణచి అవమానించాలని మానసికంగా సంకల్పించుకున్నాడు.

ఒక రోజు ద్రోణుడు గంగానదిలో స్నానం చేస్తున్నప్పుడు భీకరమైన ఒక మొసలి హఠాత్తుగా అతని తొడను పట్టుకుంది. ఆ మొసలి పట్టు నుండి విడిపించుకోగల సామర్థ్యం తనకు ఉన్నా, శిష్యులందరిని ఎలుగెత్తి పిలిచి "అందరూ త్వరగా రండి, ఈ మొసలిని చంపి, నా ప్రాణాలు కాపాడండి" అన్నాడు. అందరూ స్తంభించిపోయి చూస్తున్నారు. కాని ఆ మాటలు విన్న వెంటనే అర్జునుడు తీక్షణమైన ఐదు బాణాలను ప్రయోగించి ఆ మొసలిని చంపాడు. ద్రోణుడు అర్జునుని తన శిష్యులందరిలో శ్రేష్ఠతమునిగా ఎంచటంలో ఆశ్చర్యంలేదు. అతనికి దివ్యాస్త్రాలన్నింటిలో శిరోభూషణమైన బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రసాదిస్తూ దానిని ఎటువంటి విరోధి మీదా ప్రయోగించవద్దనీ "అస్త్ర విద్యల్లో నిన్ను మించినవారు ఉండరు. నీవు అజేయుడవు, కీర్తిమంతుడవు" అని చెప్పాడు.

## 18
## ద్రోణుని ప్రతీకారం

ద్రుపదుడు తన బాల్య స్నేహితుడైన ద్రోణుని ఎలా అవమానించింది అందరికీ తెలుసు. అర్జునుని ద్వారా ఆ ద్రుపదునికి మంచి గుణపాఠం నేర్పాలని తీర్మానించుకొని అర్జునుని పిలిచి పాంచాలదేశం వెళ్ళి ద్రుపదుని బంధించి తీసుకొని రమ్మన్నాడు. తక్షణమే అర్జునుడు రథారూఢుడై బయలుదేరి యుద్ధంలో ద్రుపదుని జయించి, బంధించి తన గురువు వద్దకు తీసుకు వచ్చాడు.

అప్పుడు ద్రోణుడు "ద్రుపదా! ఒక రాజు మాత్రమే మరొక రాజుకు మిత్రుడు కాగలడని ఆనాడు నీవు నిండుసభలో అన్నావు. నేను ఇప్పుడు నీ రాజ్యాన్ని జయించి, రాజునయ్యాను. నీవు ఇప్పుడు రాజువు కాదు. అందువల్ల నాతో సరితూగటానికి నా రాజ్యంలో సగభాగం నీకిస్తున్నాను" అన్నాడు. ద్రుపదుడు అవమానంతో క్రుంగిపోయి నిరుత్తరుడయినాడు. తరువాత ద్రోణుడు ద్రుపదుని బంధవిముక్తుని చేసి రాజ్యాన్ని కూడా తిరిగి ఇచ్చి పంపించాడు. కాని, ద్రుపదుడు మాత్రము క్రోధంతోనూ, విషాదంతోనూ మరింత క్రుంగిపోయాడు.



# 19
# సూర్యపుత్రుడు

ద్రోణాచార్యుల వద్ద రాకుమారుల విద్యాభ్యాసం పూర్తయింది. వారు తాము నేర్చుకున్న విద్యలను ప్రదర్శించడానికి ఒక రోజు నిశ్చయించబడింది. ఆ రోజు రాజకుటుంబమూ, ఆ నగర ప్రజలు అందరూ ఆ ప్రదర్శనను తిలకించడానికి సమావిష్టులైనారు. భేరీలు, ఢంకాలు మ్రోగించబడ్డాయి. అందరు రాకుమారులు తమ యుద్ధ నైపుణ్యతను అద్భుతంగా ప్రదర్శించారు. భీమ దుర్యోధనులు గదాయుద్ధంలో చూపిన ప్రావీణ్యం అందరినీ ఆకర్షించింది. తుదకది నిజమైన యుద్ధంగా మారింది. వెంటనే అశ్వత్థామ వారిని ఆపాడు. చివరిగా విలువిద్యలో ఆరితేరిన అర్జునుడు సభాసదులకు ఎన్నో వింతలు చేసి చూపించాడు. ఆగ్నేయాస్త్రంతో మంటలు పుట్టించి, వారుణాస్త్రంతో వర్షం కురిపించి, ఆర్పివేశాడు. ఇలాంటివెన్నో అద్భుత ప్రదర్శనలు చేసి తనవంటి వాడు ఎవరూ లేరని అనిపించుకున్నాడు. అందరి మన్ననలూ పొందాడు. కాని దుర్యోధనుడు మాత్రం ఈర్ష్యతో కృంగిపోయాడు.

ప్రదర్శన ముగిసే తరుణంలో ఒక ఆజానుబాహుడు, దృఢకాయుడైన యువకుడు హఠాత్తుగా ప్రదర్శనశాలలో ప్రవేశించి అర్జునుని సవాలు చేశాడు. అతడు కుంతి మొదటి కుమారుడైన కర్ణుడు. సింహంలా ముందుకు దూకి గర్జిస్తూ, "అర్జునా! నీవు ప్రదర్శించిన విలువిద్యా కౌశలం కంటె మరింత కౌశలాన్ని నేను ప్రదర్శిస్తాను" అంటూ అందరూ చూస్తుండగానే అర్జునుడు చేసిన ప్రదర్శనలన్నింటిని అనాయాసంగా చేసి చూపాడు. దుర్యోధనుడు మహదానందంతో వెంటనే కర్ణుని దగ్గరకు పరుగెత్తుకుని వచ్చి అతణ్ణి కౌగిలించుకుని, "ఓ రాజకుమారా! నీకు స్వాగతం. నీవు ఎవరివైనా సరే, నేనూ నా కురురాజ్యమూ



నీ ఆజ్ఞకు వేచివుంటాము" అన్నాడు. అందుకు కర్ణుడు, "నాకు కావాల్సినవి రెండు! ఒకటి నీ స్నేహము, రెండవది అర్జుననితో యుద్ధం" అన్నాడు. అర్జునుడు, కర్ణుడు ఒకరినొకరు కవ్వించుకుంటూ పోరాటానికి నిలబడ్డారు.

కర్ణార్జునుల తల్లియైన కుంతి ఈ దృశ్యం చూచి మూర్ఛపోయింది. మొదటి చూపుతోనే కర్ణుని తన పుత్రునిగా గుర్తించింది. తన ఇద్దరు బిడ్డలు ఇలా పోట్లాడటానికి ఉపక్రమించడం చూచి ఆమె హృదయం విపరీతమైన వ్యధ చెందింది. అప్పుడు కృపాచార్యుడు లేచి కర్ణునితో, "రాకుమారుడైన అర్జునుడు ఒక అజ్ఞాత యోధునితో పోరాడడం కుదరదు. నీ రాజవంశాన్ని నిరూపించు. నీ తల్లిదండ్రులెవరు?" అని అడిగాడు. ఆ మాటలు విని కర్ణుడు తలదించుకున్నాడు. అప్పుడు దుర్యోధనుడు వెంటనే లేచి, "అర్జునుడు ఒక రాజుతోనే యుద్ధం చేస్తానంటే మంచిదే. ఇప్పుడే నేను కర్ణుణ్ణి అంగదేశానికి రాజుగా చేస్తున్నాను" అంటూ రాజకిరీటము, ఇతర ఆభరణములు తెప్పించి అంగదేశానికి రాజుగా అభిషిక్తుణ్ణి చేశాడు. అంతలో సూర్యుడు అస్తమించగా దుర్యోధనుడు, కర్ణుణ్ణి తన శిబిరానికి తీసుకువెళ్ళాడు.

పదునారేండ్ల ప్రాయంలో కర్ణుడు విలువిద్య నేర్చుకోవడానికి ద్రోణుని దగ్గరికి వెళ్ళాడు. ద్రోణుడు అతడు సూత పుత్రుడని తెలుసుకొని, తన శిష్యునిగా చేసుకోవటానికి నిరాకరించగా, పరశురాముని ఆశ్రయించి తాను బ్రాహ్మణుడనని అబద్ధమాడాడు. ఆతని శ్రద్ధను చూచి పరశురాముడు మెచ్చుకొని తనకు తెలిసిన సకల శస్త్రాస్త్రాలను ఆతనికి బోధించి బ్రహ్మాస్త్రాన్ని కూడ అనుగ్రహించాడు.

ఒక రోజు పరశురాముడు కర్ణుని ఒడిలో తల పెట్టుకొని నిద్రిస్తున్నాడు. అప్పుడు ఒక కందిరీగ కర్ణుని తొడను తొలవగా రక్తం ధారగా ప్రవహించి అతనికి భరింపరాని నొప్పి కలిగింది. కాని తన గురువుకు నిద్రాభంగం కలుగుతుందని కర్ణుడు కదలలేదు. వేడిరక్తపు స్పర్శ తగలగానే పరశురాముడు లేచి ఇంతటి బాధను భరించగల వాడు నిశ్చయంగా బ్రాహ్మణుడు కాడని గ్రహించాడు. అప్పుడు కర్ణుడు తాను సూతపుత్రుణ్ణి అనే సత్యాన్ని అంగీకరించక తప్పలేదు. పరశురాముడు కోపంతో, "నాతో అబద్ధమాడి విలువిద్య నేర్చుకున్నావు. బ్రహ్మాస్త్రం కావాల్సి వచ్చినప్పుడు నీకు జ్ఞాపకశక్తి పోతుంది" అని శపించాడు. ముందు జరుగబోవు కర్ణార్జునుల యుద్ధంలో పరశురాముని శాపం ఎలా నెరవేరిందో తెలుస్తుంది. కర్ణుడు, దుర్యోధనునికి అత్యంత ఆప్తమిత్రుడై చివరి వరకు విశ్వాసపాత్రుడై ఉన్నాడు.



# 20
# లక్క ఇల్లు

రోజులు గడిచాయి. అంధుడైన దృతరాష్ట్రుడు తన రాజ్యాధికారాన్ని యుధిష్ఠిరునికి అప్పజెప్పాలని ప్రజలందరు అభిప్రాయబడ్డారు. యుధిష్ఠురునికి మనిషిలో ఉండవలసిన మంచి గుణాలు అన్నీ, సహన శీలత, దక్షత, సత్యసంధత, నిస్వార్థత లాంటి శీలసంపదలన్నీ పుష్కలంగా ఉన్నాయి. అందువలన భీష్ముని సలహాతో ధృతరాష్ట్రుడు హస్తినాపురానికి యుధిష్ఠిరుని యువరాజుగా ప్రకటించాడు. అప్పటికే ఈర్ష్యతో మండిపోతున్న దుర్యోధనుడు పాండవులను హతమార్చడానికి తీవ్రప్రయత్నాలు చేయసాగాడు. దుష్టచతుష్టయమయిన శకుని, దుశ్శాసనుడు, దుర్యోధనుడు, కర్ణుడు ఆలోచన చేసి కుంతితో సహా పాండవులను కాల్చి చంపడానికి ఒక పన్నాగం పన్నారు.

ఆ ప్రణాళిక ప్రకారం దుర్యోధనుడు ధృతరాష్ట్రుని సమీపించి, "తండ్రీ! యుధిష్ఠిరుడు యువరాజైతే ఇక మా గతేమిటి? మేము భోజనానికి కూడా పాండవుల దగ్గర బిచ్చమెత్తుకోవాల్సిందే" అన్నాడు. అందుకు ధృతరాష్ట్రుడు, "మరి ఇంకేం చేయను? వారు గుణవంతులు కాబట్టి, ప్రజలందరూ వారిని ప్రేమిస్తున్నారు. మనం వారికి కీడు ఏమైనా చేస్తే ప్రజలు మన మీద తిరగబడతారు" అన్నాడు.

"నాకొక ప్రణాళిక ఉంది. మన వైపు చాలా మంది మహాయోధులున్నారు. పాండవులను వారణావర్తమునకు పంపించండి. వారు ఇచ్చట లేనప్పుడు మనం బలం కూడదీసుకోవచ్చు. ప్రజలు కూడ క్రమంగా పాండవులను మరచిపోతారు" అన్నాడు దుర్యోధనుడు.

పుత్రవ్యామోహ పీడితుడైన ధృతరాష్ట్రుడు ఇందుకు సమ్మతించాడు. ఆతడు పాండవులను పిలిచి, "నాయనలారా! వారణావర్తంలో శివుని గౌరవార్థం ఒక గొప్ప ఉత్సవం జరుగనున్నది. మీరు ఆ ఉత్సవానికి వెళితే అచ్చటి ప్రజలు సంతోషిస్తారు. అందువల్ల మీరందరు వెళ్ళి రండి" అన్నాడు. ఆతని ఆజ్ఞను శిరసావహిస్తూ ధర్మరాజు తన తల్లీ సోదరులతో



వారణావర్తానికి బయలుదేరాడు. దుర్యోధనుడు పాండవులు నివసించడానికి లక్కతో ఒక పెద్ద భవనాన్ని నిర్మింపవలసిందిగా పురోచనుడు అనే వానిని నియమించాడు. వారు ఆ లక్క భవనంలో నిద్రిస్తున్నప్పుడు రాత్రిపూట పాండవులను సజీవదహనం చేయాలనే కుతంత్రం. కానీ ధర్మరాజు విదురుని వద్ద సెలవు తీసుకుంటున్నప్పుడు, అతనికే అర్థమయ్యేటట్లు విదురుడు ఇలా అన్నాడు "తెలివిగల విరోధి కుతంత్రమును పసిగట్టగలిగే వారే ఆపదనుండి తప్పించుకోగలరు. అరణ్యమునే దహించగల అగ్ని, భూమి కన్నములో ఉంటున్న ఎలుకను ఏమీ చేయజాలదు."

విదురుడు రహస్యంగా లక్కభవనం నుంచి నదీతీరం వరకు ఒక సొరంగమార్గమును నిర్మింపచేసి, పాండవులకు ఈ విషయాన్ని రహస్యంగా తెలియజేశాడు. లక్క భవనానికి నిప్పు పెట్టడానికి పురోచనుడు ఒక సంవత్సరకాలం వేచివున్నాడు. కానీ ధర్మజుడు ఒక రోజు సోదరులను పిలిచి తాము తప్పించుకునే మార్గాన్ని వివరించాడు. యుధిష్ఠిరుని ఆజ్ఞ ప్రకారం భీముడు అర్ధరాత్రి ఆ భవనానికి నిప్పంటించి తన తల్లి సోదరులతో సొరంగమార్గం ద్వారా సురక్షితంగా నదీతీరానికి చేరుకున్నాడు. భీముడు నిప్పంటించే సమయానికి ఆ భవనంలో పురోచనునితో పాటు ఒక ఆటవిక స్త్రీ, ఆమె ఐదుగురు కుమారులు ఉన్నారు. ఆ భవనం వీరితో పాటు ధగ్ధమై బూడిద అయిపోయింది. పాండవులు దక్షిణదిశలో చాలా రోజులు పయనించారు.

అగ్ని ప్రమాదంలో పాండవులూ, కుంతీ చనిపోయారనే వార్త వ్యాపించింది. ప్రజలందరూ దుఃఖితులయ్యారు. దుర్యోధనుడు వెంటనే ఆ ప్రదేశానికి వచ్చి దుఃఖాన్ని నటించాడు. తన విరోధులు మరణించినందుకు ఆనందించాడు.



# 21
# ఘటోత్కచుని జననం

భీముడు తన తల్లిని మెడమీదా, నకుల సహదేవులను తొడల మీదా ఎక్కించుకొని ధర్మార్జునులను తన బాహువులతో తీసుకుని వెళ్ళాడు. చాలా దూరం పయనించిన తర్వాత వారందరు అలసిపోయి ఒక వటవృక్ష ఛాయలో విశ్రమించి గాఢనిద్రలో మునిగిపోయారు.

దగ్గరలో ఉన్న ఒక వృక్షం మీద హిడింబి అనే రాక్షసి తన సోదరుడైన హిడింబుడనే రాక్షసునితో వసిస్తూ ఉన్నది. ఆహారం కోసం వెదుకుతూ వెళ్ళుతూ ఉండగా హిడింబుడు సమీపంలోనే మానవుల వాసన పసిగట్టాడు. హిడింబిని పిలిచి ఆ వాసన ఎక్కడి నుంచి వస్తున్నదో తెలుసుకోమన్నాడు. ఆమె మానవుల వాసనను అనుసరించి వెళ్తూ ఒక చెట్టునీడన నిద్రిస్తున్న పాండవులను చూసింది. ధృడకాయుడు ఆజానుబాహుడయిన భీముని చూచి వెంటనే ప్రేమలో పడింది.

అతణ్ణి ఎలాగైనా పెళ్ళిచేసుకోవాలనే తీవ్రవాంఛ కల్గి ఒక అందమైన యువతిగా మారి భీముని ఆకర్షించడానికి ముసిముసి నవ్వులతో వచ్చింది. అతణ్ణి సమీపించి, “అయ్యా! మీరెవరు? ఈ అడవి మా అన్న హిడింబునికి



చెందినదని మీకు తెలియదా? నరమాంస భక్షకుడైన ఆతడు మిమ్మల్ని చూస్తే వెంటనే పట్టి తినివేస్తాడు. కానీ నేను నిన్ను వివాహం చేసుకోవాలని ఆశిస్తున్నందువల్ల నిన్ను కాపాడాలనుకుంటున్నాను" అన్నది. అంతలో హిడింబుడు తన సోదరిని వెదుక్కుంటూ వచ్చి, పాండవులను చూచాడు. భీమ హిడింబుల మధ్య ఘోర యుద్ధం జరిగింది. చాలాకాలం పోరాడిన తర్వాత భీముడు హిడింబుని చంపివేశాడు. ఇప్పుడు నిరాశ్రయురాలైన హిడింబి, కుంతీదేవిని తనకు భీమునితో వివాహం చేయమని బ్రతిమాలింది. ఆమె మాటలకు కరిగి తుదకు భీమునితో హిడింబిని వివాహం చేసుకోమని చెప్పింది. భీముడు తల్లి మాటను శిరసావహించాడు. కాలక్రమేణ వారికి ఘటోత్కచుడనే కుమారుడు కలిగాడు. కొన్ని రోజుల తరువాత పాండవులు హిడింబిని, ఘటోత్కచుని వదలి ముందుకు బయలుదేరారు. "మే మిరువురము మీకు సేవచేయటానికి సిద్ధంగా ఉన్నాం. మీరు ఎక్కడవున్నా మమ్ము తలచుకున్న మరుక్షణమే మీ ముందు ఉంటాం. మీకు సహాయం చేస్తాం" అన్నారు హిడింబి ఘటోత్కచులు.



# 22
# ఏకచక్ర నగరంలో పాండవులు

పాండవులు ఎన్నో కష్టాలను ఓర్చుకుంటూ అడవుల వెంబడి సంచరించసాగారు. వారు మార్గంలో వ్యాసమహర్షిని దర్శించి, ఆశీర్వాదాలు పొందారు. వ్యాసుడు కుంతిని ఓదారుస్తూ, "అమ్మా! కలిమిలేములు కావడికుండలు. ప్రతివారు ప్రారబ్ధాన్ని అనుభవింపక తప్పదు. మీకు మంచిరోజులు తప్పక వస్తాయి. అంతవరకు ఓర్పు వహించి ఉండండి" అంటూ వారిని ఆశీర్వదించాడు.

వ్యాసుని సలహా ప్రకారం వారు బ్రాహ్మణ వేషాలు ధరించి ఏకచక్రపురం చేరి ఒక బ్రాహ్మణుని ఇంట బసచేశారు. ప్రతిరోజూ భిక్షాటన చేసి తెచ్చిన ఆహారాన్ని కుంతి రెండు సమభాగాలు చేసేది. ఒక భాగం భీమునికి. రెండో భాగం తనకూ ఇతర సోదరులకు. తోడేలు ఆకలి గల భీమునికి భిక్ష ద్వారా లభించే ఆహారం సరిపోయేది కాదు. అతడు రోజు రోజుకు చిక్కిపోతూండడం వల్ల కుంతికి ఆందోళన కల్గింది.

ఒక రోజు వారందరు భిక్షకు వెళ్ళగా, భీముడు తన తల్లితో ఉండిపోయాడు. అప్పుడు వారి ఇంటి యజమాని బిగ్గరగా రోదించడం విన్నారు. విషయమేమిటో కనుక్కోవడానికి కుంతి లోనికి వెళ్ళగా బ్రాహ్మణుడు, అతని భార్య, ఇద్దరు బిడ్డలు పరస్పరం కౌగిలించుకుని ఏడుస్తున్నారు. కుంతి వారిని ఓదార్చి వారి ఏడ్పుకు కారణం అడిగింది. అప్పుడు ఆయన ఇలా అన్నాడు: "ఈ నగరం బకాసురుడనే రాక్షసుని అధీనంలో ఉంది. ఒక రోజు అతడు అడవిలోనుండి వచ్చి నగరంలో విచ్చలవిడిగా మానవులను చంపి, నగరాన్ని సర్వనాశనం చేయసాగాడు. చివరకు రాజు పారిపోయాడు. అప్పుడు ప్రజలందరు ఆ రాక్షసుని వద్దకు వెళ్ళి ఒక ఒప్పందం చేసుకున్నారు. ఈ ఒప్పందంతో రాక్షసుడు నగరానికి వచ్చి ప్రజలను నాశనం చెయ్యటం మాని వేశాడు. దానికి బదులుగా ప్రజలు ప్రతిరోజూ ఆతనికి ఒక ఎద్దుల బండి నిండుగా ఆహారం పంపేవారు. అతడు ఆ ఆహారంతో పాటు బండిలో వచ్చిన వానిని కూడా తినేవాడు. ఈ రోజు ఆహారం పంపవలసింది నా వంతు. మాలో ఒకరు వెళ్ళి తీరాలి. అందుకే ఈ రోదన." కుంతి లోనికి వెళ్ళి భీమునితో సంప్రదించి ఆ బ్రాహ్మణునితో, "అయ్యా! మీరు ఏడవకండి. నాకు ఐదుగురు పుత్రులున్నారు. వారిలో ఒకరు రాక్షసునికి ఆహారం తీసుకువెళతారు" అన్నది. కాని అందుకు బ్రాహ్మణుడు "అమ్మా మా కొరకు, మా అతిథులు ఎందుకు బాధపడాలి" అని సమ్మతించలేదు. కాని కుంతి "మీరేం భయపడకండి, నా కుమారుడు దివ్యశక్తులు గలవాడు. సులభంగా ఆ రాక్షసుణ్ణి సంహరిస్తాడు" అని నచ్చచెప్పింది.

ఈ విషయం మిగతా సోదరులకు తెలియగా, వారు భీముని పంపటానికి ఇష్టపడలేదు. తమ ఉనికి దుర్యోధనునికి తెలుస్తుందని భయపడ్డారు. అంతేకాక, దుర్యోధనుడు అపహరించిన తమ రాజ్యాన్ని తిరిగి పొందటానికి భీముడే వారికి బలము, అండ. చివరకు భీముడు ఆ నరహంతకునితో యుద్ధం చేయటానికి అంగీకరించాడు.

భీముడు వివిధ ఆహార పదార్థాలను ఎద్దుల బండిలో పెట్టుకుని అడవికి బయలుదేరాడు. రాక్షసుడు ఉన్న కొండ చేరిన వెంటనే భీముడు ఎద్దులను విప్పి ఆ బండెడు ఆహారాన్ని తానే తినసాగాడు. భయంకర రూపుడైన ఆ రాక్షసుడు తనకోసం తెచ్చిన ఆహారాన్నంతా



ఇంకొకరు తినడం చూచి ప్రచండ కోపంతో గర్జిస్తూ భీముని తన ముష్ఠిఘాతాలతో నొప్పించసాగాడు. కానీ మహాబలశాలియైన భీముడు వాటిని పట్టించుకోక ఆహారాన్ని తృప్తిగా తింటూ కడవలలో ఉన్న పాయసము, పెరుగు త్రాగాడు. ఇలా నెమ్మదిగా ఆహారాన్నంతా పూర్తిగా తిని, నీళ్ళు త్రాగి, ముఖము కడుక్కొని ఆ రాక్షసునితో యుద్ధానికి తలపడ్డాడు. ఇద్దరికీ ఘోరయుద్ధం జరిగింది. తుదకు బకాసురుని బంతిలా అవలీలగా పైకెత్తి గిరగిర త్రిప్పి భూమికేసి కొట్టగా భీకరారావం చేస్తూ ఆ అసురుడు మరణించాడు. మృతదేహాన్ని నగరద్వారం వద్ద పడవేసి నిశ్శబ్దంగా ఇంటికి తిరిగి చేరుకున్నాడు.

మరుసటి ఉదయం నగర ద్వారం ముందు పడివున్న బకాసురుని కళేబరాన్ని చూడడానికి నగర ప్రజలందరు తరలి వచ్చి ఆనందంతో గంతులు వేయసాగారు.

## 23

## ద్రౌపది - మహాభారత కథానాయికి

పాంచాల రాజైన ద్రుపదునికి సంతానప్రాప్తి కలుగలేదు. ద్రోణుడు తనకు చేసిన అవమానంతో ప్రతీకారం తీర్చుకోవడానికి తగిన పుత్రునికోసం ఒక ఋషి సలహా మేరకు యజ్ఞం తలపెట్టాడు. యజ్ఞంతో పుత్రుడు కలగాలని, అతని ద్వారా తనకు కలిగిన అవమానానికి ప్రతిక్రియ చేయాలని ఆశించాడు.

యజ్ఞం పరిసమాప్తి సమయంలో అందులో నుంచి తేజోవంతుడైన ఒక పురుషుడు ఉద్భవించాడు. అతడు అగ్నిజ్వాల వలె వెలుగుతున్నాడు. అదే సమయంలో ఆకాశవాణి, "అగ్ని శిఖలా వెలుగుతున్న ఈ యువకుడు నీ కుమారుడు. ఈతనికి ధృష్టద్యుమ్నుడని పేరు పెట్టు. కాలక్రమంలో ఈతడు ద్రోణునిపై ప్రతికారం తీర్చుకుంటాడు" అని పలికింది.



తర్వాత అగ్నిగుండంలో నుండి అపురూప లావణ్యం గల ఒక కన్య కూడ ఉద్భవించింది. ఆమెకు "కృష్ణ" అని పేరు పెట్టారు. ఆమె ద్రుపదుని కుమార్తె కావడం వలన ద్రౌపది అని పిలువబడింది. ద్రుపదుడు పరమానంద భరితుడయ్యాడు.

పాండవులు ఏకచక్రపురంలో ఉన్నప్పుడు ద్రుపదుడు ద్రౌపదికి స్వయంవరం చాటించినట్లు విన్నారు. తల్లి సమ్మతితో వారు బ్రాహ్మణ వేషంలో ఇతర బ్రాహ్మణులతో కలిసి పాంచాల దేశానికి బయలుదేరారు. స్వయంవరంలో పాల్గొనటానికి చాలా దూరం ప్రయాణం చేసి అలసిపోయిన పాండవులు ఒక కుమ్మరి ఇంటిలో బసచేశారు. తర్వాత సుందరంగా అలంకరింపబడ్డ పట్టణం చూడడానికి బయలుదేరారు. కన్నులకు, వీనులకు విందుగొలిపే సంగీతము, నృత్యము, క్రీడలు పదునాలుగు రోజులు జరిగాయి. స్వయంవరం రోజున బ్రాహ్మణ వేషాలలో ఉన్న పాండవులు బ్రాహ్మణుల మధ్య వెళ్ళి కూర్చున్నారు. ఆ స్వయంవరంలో ఎన్నో చోట్లనుండి వచ్చిన ఎంతోమంది యువరాజులు ఆసీనులై ఉన్నారు. వారిలో దుర్యోధనుడు, కర్ణుడు, శ్రీకృష్ణుడు కూడ ఉన్నారు. మంటపమంతా నిండిపోయింది.

అందరూ తమ తమ ఆసనాలను స్వీకరించిన తరువాత ధృష్టద్యుమ్నుడు ద్రౌపదిని స్వయంవర మంటపానికి తీసుకువచ్చాడు. అందంగా అలంకరించుకున్న ద్రౌపది దేవకన్యలా మెరసిపోతోంది. మధుర వాద్యాల నేపథ్యంలో ద్రౌపది ఏనుగు మీద సభాంగణం చేరుకున్నది. పట్టువస్త్రాలలో సౌందర్యరాశిగా వెల్గొందుతూ, ఆమె ఏనుగు దిగి, చేతిలో పుష్పహారంతో, అత్యంత మార్దవంతో ప్రవేశించింది. ధృష్టద్యుమ్నుడు ఆమెను సభాంగణం మధ్యలో నిలిపి గంభీరమైన వాక్కులతో ఇలా ప్రకటించాడు: "ఇదిగో రాకుమారి, ఇదిగో ధనుస్సు. ఈ మత్స్యయంత్రాన్ని మీరు చూస్తున్నారు కదా! నీళ్ళలో కనిపిస్తున్న ప్రతిబింబాన్ని చూచి పైన గిరగిర తిరుగుతున్న యంత్రరంధ్రము ద్వారా బంగారు చేపను ఐదుసార్లు వరుసగా ఛేదించే వీరుణ్ణి మా ద్రౌపది వరిస్తుంది."

ఎంతో మంది యువరాజులు ప్రయత్నించి విఫలులైనారు. వారు ఆ విల్లును సైతం ఎత్తలేకపోయారు. కొందరు అతి ప్రయాసతో ఆ విల్లును ఎత్తారు. కాని అలసటతో స్పృహ తప్పి పడిపోయారు. అందరి ఆశలు అడియాసలైనాయి. వీరందరి దుర్దశను చూసి కర్ణుడు ముందుకు వచ్చాడు. సునాయాసంగా విల్లును తీసి బాణం సంధించాడు. ద్రౌపది ఆతణ్ణి చూసి, "నేను సూతపుత్రుని వరింపజాలను" అంది. కర్ణుడు ఏమీచేయలేక విల్లంబులను వదలి ఒక్కసారి సూర్యునివైపు దృష్టి సారించి తన స్థానంలో కూర్చున్నాడు. తర్వాత శిశుపాలుడు, జరాసంధుడు, శల్యుడు, దుర్యోధనుడు ఇతర మహారాజులందరూ ప్రయత్నించి విఫలులయ్యారు. ఎవరూ దీనిని సాధించలేక పోవడంతో ............. మహారాజులందరినీ అవమానించడానికే ఇలా చేశారనే వదంతి బయలుదేరింది.

అప్పుడు విద్యుత్తీగలా బ్రాహ్మణుల మధ్య నుండి అర్జునుడు లేచి క్షణంలో ఆ విల్లును సునాయాసంగా ఎత్తి మానసికంగా శ్రీకృష్ణుని ప్రార్థిస్తూ ఐదు బాణాలను వరుసగా వదలి అవలీలగా మత్స్యయంత్రాన్ని ఛేదించాడు. ఆ బాణ వేగానికి యంత్రం కూలి నేలపైపడింది. అర్జునుని అంగ సౌష్టవము చూసి ద్రౌపది సమ్మోహితురాలయింది. ఆమె వయ్యారంగా నడుస్తూ వరమాలను అర్జునుని కంఠంలో వేసింది. సమావిష్టులైన యువరాజులందరూ



ఆ అవమానాన్ని సహించలేక ద్రుపదునిపై లేచారు. కానీ భీమార్జునులు వారినందరిని ఎదుర్కొని నిర్వీర్యులుగా చేసి ద్రౌపదితో సహా పాండవులందరూ తాము నివసించే కుమ్మరి ఇంటికి వెళ్ళారు.

సోదరులందరు ఇంటి బయటనుండి సంతోషంతో, "అమ్మా! మేము నీకొక బహుమతి తెచ్చాము" అన్నారు. కుంతి "అందరూ సమంగా పంచుకోండి" అంది. వారు తెచ్చిన బహుమతి ఎలాంటిదో ఇంటిలోపలనున్న ఆమెకెలా తెలుస్తుంది? కానీ ద్రౌపదిని చూచిన వెంటనే ఆమె తన మాటలకు పశ్చాత్తాప పడింది. కానీ తన భావములను తెలుపకుండా, "లోపలికి రామ్మా! ఈ ఇంటిలో నీకు స్వాగతము" అన్నది. ద్రౌపది కుంతీదేవికి నమస్కరించింది. తల్లి మాట ప్రకారం ఐదుగురూ ద్రౌపదిని వివాహం చేసుకోక తప్పలేదు. ఆ సమయానికి కృష్ణ బలరాములు అక్కడికి చేరుకున్నారు. కుంతీదేవి, శ్రీకృష్ణుని తండ్రి వసుదేవుని చెల్లెలు. అందువలన కృష్ణునికి కుంతి మేనత్త అవుతుంది. పాండవులకు శ్రీకృష్ణుడు ఆప్తబంధువు అయ్యాడు. స్వయంవరంలో వారిని చూచినప్పుడు ఆప్తబంధువులుగా గుర్తించామని బలరాముడు అన్నాడు. వారు పాండవులను ఆశీర్వదించి వెళ్ళిపోయారు. ద్రౌపది ఉదంతం, ఈ విధమైన వివాహానికి అనుజ్ఞ కాదు. తెలియక చేసినా ఎట్టి పరిస్థితులలోనైనా సత్యాన్ని పాటించటమే దీనిలోని నీతి.

పాండవులకు తెలియకుండా ధృష్టద్యుమ్నుడు వారిని వెన్నంటి కుమ్మరి ఇంటికి వెళ్ళాడు. అచ్చట కుంతితో వారి సంభాషణను విన్నాడు. తర్వాత బలరామకృష్ణులు వారితో మాట్లాడిన పలుకులు విని వారు ఎవరో కాదని పంచపాండవులని తెలుసుకుని ఎంతో ఆనందిస్తూ తన తండ్రికి ఈ శుభవార్త చెప్పటానికి



వేగంగా వెళ్ళాడు. ద్రుపదుడు కూడా ఆనందించాడు. తక్షణం రాజమర్యాదలతో కుంతినీ, పాండవులనూ ఆహ్వానించమని ఆజ్ఞాపించాడు. ద్రుపదుని ఆహ్వానంపై పాండవులూ, కుంతీ రాజభవనం చేరుకున్నారు. కానీ పాండవులందరూ కలిసి ద్రౌపదిని వివాహం చేసుకోవటం ద్రుపదునికి ఇష్టం లేదు. ఆ సమయంలో వ్యాసమహర్షి అక్కడికి వచ్చారు. అప్పుడు వ్యాసమహర్షి "ద్రౌపది తన పూర్వజన్మలో శివుని ప్రార్థించి ఐదుసార్లు తనకు మంచి భర్త కావాలని కోరుకొంది. అందువలన ద్రౌపది ఈ పంచపాండవులను పరిణయమాడటంలో దోషం లేదు" అన్నాడు. ఈ విధంగా సమస్య చిక్కు వీడిపోయింది. ఆ ప్రకారమే ద్రౌపది పంచపాండవుల వివాహం మహాత్ముడైన ధౌమ్యుని ఆధ్వర్యంలో జరిగింది. ద్రుపదుడు అనేక ధన కనక వస్తు వాహనాదులను, దాసదాసీ జనాలను పాండవులకు బహుకరించాడు. కుంతీదేవి కులవధువైన ద్రౌపదిని "అమ్మా! సుఖంగా ఉండు. భర్తలను భక్తితో పూజించు, అతిథి అభ్యాగతులను ఆదరంతో ఆదరించు" అని దీవించింది.

## 24

## పాండవులు హస్తినాపురం తిరిగి రావడం

పాండవులు జీవించి ఉండడమే కాకుండా ద్రౌపదిని వివాహమాడటంతో దుర్యోధనుడు మరింత కుమిలిపోయాడు. "అర్జునుడు మాత్రం బ్రాహ్మణ వేషం ధరింపకున్నట్లయితే ఆతనికి ద్రౌపది లభించేది కాదు. అంతా విధివైపరీత్యమే" అని దుశ్శాసనుడు అతణ్ణి ఓదారుస్తూ అన్నాడు.

కానీ విదురుడు మాత్రం ఈ విషయం విని ఎంతో ఆనందించాడు. ఆతడు వెంటనే ధృతరాష్ట్రుని సమీపించి, "కురుకులం భాగ్యంగా ద్రౌపది వారి కోడలయింది" అన్నాడు. ధృతరాష్ట్రుడు తన ప్రియ దుర్యోధనుడు స్వయంవరంలో పాంచాలిని జయించి ఉంటాడని కలగన్నాడు. సంతోషంతో "ఆహా! ఏమి భాగ్యం, ఏమి భాగ్యం. ద్రౌపది దుర్యోధనులకు ఘనంగా స్వాగతం చెప్పి తీసుకురండి" అని ఆజ్ఞాపించాడు. అప్పుడు విదురుడు పాండవులు ఇంకా జీవించి ఉన్నది, స్వయంవరంలో ద్రౌపదిని వివాహమాడింది పాండవులే అని, దుర్యోధనుడు కాదని వివరించాడు.

విదురుని మాటలు ములుకుల్లా తన చెవికి సోకినా, బయటికి కనపడనీయకుండా "పాండవులు కూడా నా పుత్రులే కదా! అందువల్ల ద్రౌపది నా కోడలే" అని సంతోషం నటిస్తూ అన్నాడు. విదురుడు వెళ్ళిన తర్వాత దుర్యోధనుడు, కర్ణుడు వచ్చారు. దుర్యోధనుడు తండ్రిని సమీపించి "నేను విదురుని సమక్షంలో ఏమీ అనటానికి సాహసించలేదు. మీరు పాండవులను ఎందుకు శ్లాఘించారు. మీ విరోధుల ఐశ్వర్యాన్ని మీదిగా భావిస్తున్నారు. మనమిప్పుడు పాండవులను దుర్బలులను చేయాలి. దానికి మీ సలహా చెప్పండి" అన్నాడు.

"ప్రియ దుర్యోధనా! నీ మాటలు నిజమే. కానీ పాండవుల పట్ల మనకు ఉన్న ద్వేషాన్ని విదురునికి తెలిసేటట్లు మనం నడుచుకోగూడదు. అందుకే విదురునితో అలా అన్నాను" అన్నాడు ధృతరాష్ట్రుడు.

దుర్యోధనుడు పాండవుల మధ్య అంతఃకలహాలు సృష్టించాలని అనుకొన్నాడు. అటువంటి కుట్రలు చేయకూడదనీ వారిని యుద్ధంలో పూర్తిగా ఓడించటమే మంచిది అని కర్ణుడు చెప్పాడు. ఎటువంటి చర్యలు చేపట్టడానికైనా ముందు భీష్మద్రోణుల సలహా పొందాలి అని ధృతరాష్ట్రుడు అన్నాడు. పాండవులు జీవించి ఉండటం విని ఆనందపడిన భీష్ముడు పాండవులకు అర్ధరాజ్యం ఇవ్వవలసిందిగా ధృతరాష్ట్రునికి సలహా ఇచ్చాడు. ద్రోణుడు కూడా దాన్ని ఆమోదించాడు. కానీ కర్ణుడు కోపోద్రిక్తుడై "కురువంశజుల ఉప్పు తింటున్న

ద్రోణుడు కూడా ఇలా సలహా ఇవ్వటం ఆశ్చర్యంగా ఉంది. మహారాజు ఇతరులు ఇచ్చిన సలహాలను కూడా పరిశీలించి తుది నిర్ణయం తీసుకోవాలి" అన్నాడు. తికమకపడుతూ ధృతరాష్ట్రుడు విదురుని వైపు చూడగా విదురుడు కూడా "భీష్మద్రోణుల సలహా ఉచితమైనదే" అని చెప్పాడు. చివరకు ధృతరాష్ట్రుడు విదురునితో "మీరు, భీష్ముడు, ద్రోణుడు చెప్పిన మాటలు న్యాయంగా ఉన్నాయి. రాజ్యంపై నా కుమారులకున్న హక్కు పాండవులకు కూడా ఉన్నది" అన్నాడు. ఇక గత్యంతరంలేక పాండవులను, ద్రౌపదిని హస్తినాపురం తీసుకురమ్మని విదురుని పంపించారు.

విదురుడు వెంటనే పాంచాల దేశం బయలుదేరాడు. ధృతరాష్ట్రుని కోరికను ద్రుపదునికి చెప్పి పాండవులను హస్తినాపురం తీసుకువచ్చాడు. పాండవులను చూచి ప్రజలు ఆనందంతో నాట్యం చేయసాగారు. పాండవులను ఆహ్వానించటానికి నగరం ఎంతో చక్కగా అలంకరింపబడింది. పాండవులు కుంతి, ద్రౌపది శ్రీకృష్ణునితోపాటు రాజ ప్రాసాదంలోకి ప్రవేశించారు. పెద్దలందరికి పాదాభివందనం చేసి, వారి ఆశీర్వాదాలు పొందారు. వారి విశ్రాంతి అనంతరం ధృతరాష్ట్రుడూ భీష్ముడూ పాండవులకు కబురంపించారు.

## 25

## పాండవుల కొత్త రాజ్యం

కుశల ప్రశ్నల తర్వాత ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో "నేను పాలిస్తున్న ఈ రాజ్యానికి మూలకారకుడు నీ తండ్రి. ఈ రాజ్యం పాలించే హక్కు నీకు కూడా ఉన్నది. అందువలన నీవు ఖాండవప్రస్థమునకు వెళ్ళి సగం రాజ్యము పరిపాలించు" అన్నాడు.

ధృతరాష్ట్రుని పలుకులు శిరసావహించి ధర్మరాజు ఖాండవప్రస్థమునకు బయలుదేరాడు. శ్రీకృష్ణుడు ముందు నడువగా ఊరేగింపుతో అరణ్యంలో ప్రవేశించారు. వేదావ్యాసుడు ఇచ్చిన సలహాతో ఒక మంచి ప్రదేశం ఎంచుకుని ఒక చక్కని నగరం నిర్మాణం చేశారు. దానికి ఇంద్రప్రస్థం అని పేరు పెట్టారు. ఆ నగరం ఇంద్రుని అమరావతి వలె శోభించి లోకంలో అందరి మన్ననలు పొందింది. తన సోదరుల సాయంతో యుధిష్ఠిరుడు తన వంశపు రాజుల సంప్రదాయానుసారం రాజ్యాన్ని న్యాయసమ్మతంగా పాలించసాగాడు.

ఒక రోజు నారదుడు పాండవులను చూడటానికి వచ్చాడు. అర్ఘ్యపాద్యాదులతో వారు ఆయనకు స్వాగతమిచ్చారు. ఆయన పాండవులందరికీ భార్యయైన ద్రౌపది విషయం గురించి వారిని హెచ్చరించటానికే వచ్చాడు. అతడు వారితో "మీకు సుంద ఉపసుందులు అనే సోదరులను గురించి చెపుతాను. వారిరువురు ఎంతో అన్యోన్యంగా ఒకే రాజ్యాన్ని పాలిస్తూ ఒకే సింహాసనంపై కూర్చుంటూ, ఒకరిగా భుజిస్తూ, ఒకే శయ్యపై నిద్రించేవారు. ఇంత అన్యోన్యంగా ఉండి కూడా తిలోత్తమ అనే సుందరిని పొందటానికై ఒకరితోనొకరు పోట్లాడుకొని చివరకు మరణించారు. అందువల్ల మీరందరూ అప్రమత్తులై మీ స్నేహానికి ఆటంకం రాకుండా చూసుకోవాలి" అని హితవు చెప్పాడు.

ఈ కథలోని గుణపాఠాన్ని విన్న పాండవులు ఒక నిర్ణయానికి వచ్చారు. ద్రౌపది ఒక్కొక్క సంవత్సరం ఒక సోదరుని ఇంట్లో గడుపాలి. ఆమె అలా ఉన్నప్పుడు వేరొక సోదరుడు వారి ఏకాంతంలో ప్రవేశించకూడదు. అలా చేస్తే అందుకు ప్రాయశ్చిత్తంగా పన్నెండేళ్ల తపస్సు చేసుకోవటానికి వనములకు వెళ్లిపోవాలి.

# 26
# అర్జునుడు స్వేచ్ఛానుసారం తపస్సుకు వెళ్ళడం

ఒక రోజు ఒక బ్రాహ్మణుడు తన పశువులను దొంగలు దొంగిలించుకు పోతున్నారని అర్జునునికి చెప్పాడు. అప్పుడు అర్జునుడు తాను ఆ ఆవులను విడిపించి ఇస్తానని ఆయుధములు తీసుకోవడానికి వెళ్లాడు. కానీ తన విల్లు ధర్మరాజు ఇంట్లో ఉన్నది. ఆ సమయంలో ద్రౌపది ధర్మరాజుతో ఉంది. వారిద్దరు ఏకాంతంలో ఉండగా అర్జునుడు లోనికి వెళ్లడానికి సంకోచించాడు. కాని విల్లుని ఎలాగైనా తీసుకురావాలి; వేరు గత్యంతరం లేక లోపలికి వెళ్ళి తన విల్లు తీసుకుని బయటికి వచ్చేశాడు. దొంగలను తరిమి వారి నుండి పశువులను విడిపించి బ్రాహ్మణునికి అప్పగించాడు. తిరిగి వచ్చిన తర్వాత ధర్మరాజు దగ్గరికి వెళ్ళి "మనం చేసుకున్న ఒప్పందం నేను ఉల్లంఘించాను. అందువల్ల నేను పన్నెండు సంవత్సరాలు తీర్థయాత్రలకు వెళతాను' అన్నాడు.

యుధిష్ఠిరుడు కలత చెంది తమ్మునికి నచ్చచెబుతూ, "నీవు కావాలని నా ఇంటిలో అడుగు పెట్టలేదు. అందువల్ల నీవు చేసిన పనిలో దోషం లేదు. నీవు వెళ్ళడం నేను అనుమతించను" అన్నాడు. కానీ అర్జునుడు తాను వెళ్ళి తీరుతానని పట్టుపట్టి అన్నను ఒప్పించి పన్నెండేళ్ళు శిక్షను అనుభవించటానికి వెళ్ళాడు.

అర్జునుడు నదులూ, అరణ్యాలూ, పట్టణాలూ దాటుకుంటూ తుదకు గంగానది ఉద్భవించే గంగోత్రి చేరుకున్నాడు. అచ్చట కొన్ని రోజులు ఉండి తరువాత



దక్షిణ సముద్రతీరానికి పయనించాడు. అక్కడ అనేకమంది ఋషులున్నారు. ఒకచోట ఐదు సుందర సరోవరాలు అతనికి కనిపించాయి. కాని ఎవ్వరూ అందులో దిగడం లేదు. విచారిస్తే, అందులో ఐదు పెద్ద మొసళ్ళున్నాయని ఆ సరోవరంలో దిగే వారిని అవి పట్టుకొని తింటాయని చెప్పారు. కానీ సాహసవంతుడైన అర్జునుడు సరోవరంలో స్నానం చేయడానికి దిగినప్పుడు ఒక పెద్ద మొసలి అతని కాలు పట్టుకుంది. ధైర్యంతో అర్జునుడు ఆ మొసలిని సరోవరంలో నుండి ఒడ్డుకు లాగాడు. నీళ్ళ నుండి బయటపడిన వెంటనే ఆ మొసలి సర్వాభరణ భూషితురాలైన ఒక అందమైన స్త్రీగా మారింది.

ఆమె అర్జునునితో "నేను 'వర్గ' అనే అప్సరసను. నేను నా నలుగురు స్నేహితురాండ్రతో వెళుతూ దారిలో ఒక బ్రాహ్మణుని చూసి, అతనిని మోహింపజేయాలని ప్రయత్నించాం. ఆతడు మాపై కోపించి మొసళ్ళు అవమని శపించాడు. మేము క్షమించమని బ్రతిమాలితే ఆయన కనికరించి వంద సంవత్సరాల తర్వాత ఒక సత్పురుషుడు మిమ్మల్ని నీళ్ళనుండి బయటికి లాగినప్పుడు, శాపవిముక్తి కలుగుతుందని చెప్పాడు," అన్నది. అర్జునుడు ఆమె స్నేహితురాండ్రను కూడా శాపవిముక్తులను చేశాడు. ఆ తర్వాత అతడు మరింత దక్షిణము వైపు ప్రయాణంచేసి ద్వారక సమీపంలో ఉన్న ప్రభాస తీర్థం చేరుకున్నాడు.

ఆ విషయం తెలిసిన శ్రీకృష్ణుడు, అర్జునుని కలుసుకోవడానికి ప్రభాస తీర్థం వచ్చాడు. కృష్ణార్జునులు నరనారాయణులు కాబట్టి ఒకరినొకరు కౌగిలించుకుని కుశల ప్రశ్నలు వేసుకున్నారు. వారు అచ్చట కొన్నాళ్ళుండి తర్వాత ద్వారక సమీపములో ఉన్న రైవతక పర్వతానికి వెళ్ళారు. శ్రీకృష్ణుడు ముందుగానే తమ రాకను తెలియచేయగా, అచ్చట వారు సౌకర్యంగా ఉండడానికి అన్ని వసతులూ సమకూర్చబడ్డాయి. అచ్చట కొన్ని రోజులు ఉన్న తరువాత వారు యాదవులకు రాజధానియైన ద్వారకకు బయలుదేరారు. శ్రీకృష్ణుడు బలరామునికి ముందుగానే ఈ రాక తెలియచేయటం వలన అర్జునునికి ద్వారకలో ఘనస్వాగతం లభించింది. నగర ప్రజలు బారులుగా నిలబడి స్వాగతం పలికారు. వారికి అర్జునుడు కృతజ్ఞతాభివందనం చేశాడు. తర్వాత అర్జునుడిని శ్రీకృష్ణుడు అంతఃపురానికి తీసుకువెళ్ళాడు. శ్రీకృష్ణుని నివాసస్థలం స్వర్గంలా ఉన్నది. అర్జునుడు శ్రీకృష్ణుని సాంగత్యంలో చాలా రోజులు గడిపాడు.

## 27

## సుభద్రా పరిణయం

కొన్ని రోజుల తర్వాత రైవతక పర్వతంపై ఒక పెద్ద పండుగ జరిగింది. ఆ పండుగలో అర్జునుడు ముఖ్య అతిథిగా గౌరవింపబడ్డాడు. ఆ పండుగలో ఆనందోత్సాహాలతో గడపటానికి యాదవులందరూ సమావేశమయ్యారు. ఆ జన సమూహం మధ్య అర్జునుడు కృష్ణుని సోదరి సుభద్రను చూచాడు. మొదటి చూపులోనే ఆమె అర్జునుని ఆకర్షించింది. అర్జునుని మనస్సును అర్థం చేసుకున్న కృష్ణుడు చిరునవ్వుతో, "ఏం బావా! నీ ముఖం చూస్తే నీవు హఠాత్తుగా ప్రేమలో పడినట్లు కనిపిస్తున్నది! అదే నిజమైతే దీనిని గురించి నా తండ్రితో మాట్లాడతాను" అన్నాడు.



అర్జునుడు బిడియంతో, "ఈ అందగత్తె ఎవరిని ఆకర్షించదు? ఆమె నా భార్య అయితే నేను జీవితంలో సుఖపడతాను. నాకు ఆమె ఎలా లభిస్తుందో చెప్పు" అన్నాడు. "బావా! క్షత్రియ ధర్మం ప్రకారం స్వయంవరం ద్వారానైనా కన్యను చేపట్టాలి లేదా బలవంతంగా ఆమెను తీసుకుపోయి పరిణయం చేసుకోవాలి" అన్నాడు శ్రీకృష్ణుడు. తన చెల్లెలిని అపహరించి తీసుకువెళ్లి పోవాలని శ్రీకృష్ణుడు చెబుతున్నాడని గ్రహించాడు అర్జునుడు. ముందుగా తన అన్న ధర్మరాజు అనుమతిని పొందడానికి కబురు పంపాడు. ధర్మరాజు సంతోషంగా దానికి అంగీకరించాడు.

అర్జునుడు శ్రీకృష్ణుని రథాన్ని తీసుకొని తగిన తరుణం కోసం వేచివున్నాడు. ఒక రోజు సుభద్ర రైవతక పర్వతం మీద ఉన్న దేవాలయానికి వెళ్ళింది. అర్జునుడు ఆ దేవాలయం వద్ద వేచి ఉండి, ఆమె పూజ ముగించి బయటకు రాగానే ఆమెను నెమ్మదిగా రథంలో ఉంచుకొని ఇంద్రప్రస్థానికి బయలుదేరాడు. ఆమె అంగరక్షకులు పెద్దగా అరుస్తూ ద్వారకలో ఉన్న బలరామునికి ఈ విషయం చెప్పారు. బలరాముడు కోపోద్రిక్తుడై అర్జునునికి శాస్తి చెయ్యాలని నిశ్చయించాడు. తక్షణమే యాదవ ముఖ్యులందరితో తాము అనుసరించవలసిన విధానాన్ని గురించి ఆలోచించడానికి సభ జరిపాడు. అందరూ బలరాముని సమర్థించారు. కానీ శ్రీకృష్ణుడు మాత్రం మౌనంగా ఉన్నాడు. శ్రీకృష్ణుని మౌనం చూసిన బలరాముడు "కృష్ణుడు ఏమీ మాట్లాడలేదు. ఆతడి మనస్సులో ఏమున్నదో తెలుసుకోకుండా మనం ఎలాంటి చర్య తీసుకోలేము. అరచి ప్రయోజనం లేదు. అందువల్ల కృష్ణుని ఉద్దేశమేమిటో తెలుసుకుందాం" అన్నాడు.

అప్పుడు ప్రశాంతంగా కృష్ణుడు, "అర్జునుడు మన వంశగౌరవాన్ని అవమాన పరచలేదు. బదులుగా మన కీర్తిని వృద్ధి చేశాడు. ఈ సంబంధం సబబుగా ఉన్నది. పైగా సుభద్ర కూడ ఆతణ్ణి చూచి ఇష్టపడింది. అర్జునుడు మన సుభద్రకు అన్ని విధాలా తగిన వరుడు. పరమేశ్వరుడు తప్ప అతణ్ణి ఎవరూ ఎదిరించలేరు. అందువల్ల మనం ఆతణ్ణి సాదరంగా ఆహ్వానించి వివాహానికి ఏర్పాట్లు చేయడం మంచిది" అన్నాడు.

శ్రీకృష్ణుని మాటలు వారికి ఉపశమనం కలిగించాయి. శ్రీకృష్ణుని సలహా ప్రకారం అర్జున సుభద్రల వివాహం ఘనంగా జరిగింది. అర్జునుడు ఒక సంవత్సరం భార్య సుభద్రతో గడిపి మిగిలిన కాలం పుష్కరతీర్థంలో గడిపాడు. పన్నెండు సంవత్సరాల గడువు పూర్తి కాగానే ఇంద్రప్రస్థం చేరుకున్నాడు. అచ్చటి స్త్రీలు అందరూ సుభద్రకు ఘనస్వాగతం చెప్పారు. అర్జునుడు ఇంద్రప్రస్థానికి తిరిగి వెళ్ళిన వార్త విని బలరామకృష్ణులు అనేక బహుమతులతో వచ్చారు.

కొంతకాలానికి సుభద్ర అభిమన్యుడు అనే కుమారుణ్ణి కన్నది. అనేక శుభలక్షణాలను ఆ శిశువు కలిగి ఉన్నాడు. శుభ సమయంలో ధర్మరాజు పదివేల గోవులను, బంగారు నాణెములను విప్రులకు దానం చేశాడు.

ద్రౌపది కూడా ప్రతి సంవత్సరం ఒక కుమారుని కన్నది. ఆమెకు యుధిష్ఠిరుని ద్వారా ప్రతివిందుడు, భీముని ద్వారా శృతసోముడు, అర్జునుని ద్వారా శృతకర్ముడు, నకులుని ద్వారా శతానీకుడు, సహదేవుని ద్వారా శృతసేనుడు అనే కుమారులు కల్గారు. వారందరు ప్రఖ్యాతులైనారు. ధౌమ్యమహర్షి వారికి యజ్ఞోపవీత సంస్కారం చేశాడు. శస్త్ర విద్యలోనూ, వేద శాస్త్రములలోనూ వారు మంచి ప్రావీణ్యం సంపాదించారు.

యుధిష్ఠిరుడు న్యాయసమ్మతంగా రాజ్యపరిపాలన సాగించాడు. సోదరులు తమ బాహుబలంతో పలుదేశాలను జయించి తమ రాజ్యాన్ని

విస్తరింపజేశారు. రాజ్యమంతట శాంతి సౌఖ్యములు సమృద్ధిగా నెలకొన్నవి.

## 28
## ఖాండవ దహనం

ఒక రోజు అర్జునుడు శ్రీకృష్ణునితో కలిసి యుధిష్ఠిరుని అనుమతితో పెద్ద సేవకబృందంతో యమునా తీరానికి వెళ్లాడు. సేవకబృందం వివిధ క్రీడలలో మునిగివుండగా కృష్ణార్జునులు ఒకచోట కూర్చుని మాట్లాడుకోసాగారు. అప్పుడు సాలవృక్షంలా బంగారపు రంగులో ఉన్న ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. పసుపు రంగు గడ్డంతో తామరాకుల లాంటి కళ్ళతోనూ ఉన్నాడు. కృష్ణార్జునులు ఆయనను సాదరంగా ఆహ్వానించారు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు, "అత్యంత ఆహారం తినేవాడినైన నాకు చాలా ఆకలి వేస్తున్నది. మృష్టాన్నం ప్రసాదించి ఇచ్చి నా ఆకలి బాధను పోగొట్టండి" అన్నాడు.

కృష్ణార్జునులు అతనికి మృష్టాన్న భోజనం పెడతామని వాగ్దానం చేశారు. అందుకు ఆతడు "నేను అగ్నిదేవుడను. నాకు సామాన్య ఆహారం పనికిరాదు. నేను ఈ ఖాండవ వనమును భక్షించాలి. నా అజీర్తి రోగానికి ఈ వనంలోని దివ్యౌషధ మూలికలే విరుగుడు. కాబట్టి ఖాండవవన భోజనమే నాకు కావలసింది. కాని నేను ఎన్నిసార్లు ప్రయత్నించినా నిష్ఫలమయింది. ఈ



వనంలో ఉంటున్న తక్షకుడనే నాగరాజును రక్షించడానికి ఇంద్రుడు మేఘములను పంపి వర్షం కురిపింపజేసి నా జ్వాలలు ఆర్పింపజేస్తాడు. మీరు అస్త్రప్రయోగంలో ఆరితేరినవారు. నేను ఖాండవ వనాన్ని దహించేటప్పుడు నా మీద వర్షం పడకుండా ఈ వనంలోని ఏ జంతుజాలం నానుండి తప్పించుకోకుండా చూడండి" అని ప్రార్థించాడు.

అప్పుడు అర్జునుడు అగ్నితో "నేను దివ్యాస్త్రాలు ఎన్నో సంపాదించాను. కానీ వాటిని ప్రయోగించడానికి తగిన ధనుస్సు నా వద్దలేదు. నీవు తగిన ధనుస్సు ఇస్తే నీవు కోరినట్లే చేస్తాను" అన్నాడు.

అగ్ని వరుణదేవుని తలచుకొని ఇలా ప్రార్థించాడు, "నీకు సోమరాజు నుండి లభించిన గొప్ప గాండీవ ధనుస్సునూ, అక్షయ తూణీరమునూ, కపిధ్వజము ఉన్న దివ్యరథాన్ని అర్జునునికి ప్రసాదించు. గాండీవంతో అర్జునుడు, సుదర్శన చక్రంతో శ్రీకృష్ణుడు లోకకళ్యాణార్థం ఎన్నో సేవలు చేయగలరు" అన్నాడు.

అర్జునుడు కవచమును ధరించి గాండీవం సారించాడు. శ్రీకృష్ణునికి సుదర్శన చక్రం ఇచ్చి "నీవు తప్పకుండా ఈ ఆయుధంతో ఎంతో మంది దుష్టులను సంహరిస్తావు" అని అగ్ని అన్నాడు.

తర్వాత అగ్ని సంపూర్ణ తేజముతో పెద్దపెద్ద జ్వాలలతో ఖాండవ వనము నలుదిక్కుల వ్యాపించి భీకరంగా దహించసాగాడు. కృష్ణార్జునులు వనము ఇరువైపులా నిలబడి అందులోని జంతువులేవీ తప్పించుకోకుండా చూశారు. పెద్ద వృక్షములు మంటల్లో కాలి దగ్ధమై పెళపెళమని క్రిందపడే శబ్దములు, అగ్నిలో కాలి మరణించిన వివిధ పక్షుల, జంతువుల అరుపులు మిన్నుముట్టాయి. దేవేంద్రుడు విపరీతమైన కోపంతో వెంటనే ప్రళయ మేఘములను పంపి వర్షం కురిపించాడు.

అగ్నికి, నీటికి మధ్య జరిగిన ఈ ఐతిహాసిక యుద్ధ సమయంలో సర్పరాజైన తక్షకుడు అచ్చట లేడు. హస్తినాపురంలో ఉన్నాడు. ఆతని కుమారుడు అశ్వసేనుడు ఆ అగ్ని నుండి తప్పించుకోవడానికి విశ్వప్రయత్నాలు చేశాడు. కానీ అర్జునుడి శర పరంపర నుండి తప్పించుకోలేకపోయాడు. తుదకు అతన్ని కాపాడటానికి అతని తల్లి ఒక ఉపాయం ఆలోచించింది. ఆతని తలను ముందు మ్రింగి తర్వాత తోక వరకు మ్రింగి ఆ స్థితిలో ఆకాశంలోనికి ఎగసింది. ఆమె తప్పించుకోవడం చూసిన అర్జునుడు ఒక వాడి బాణంతో ఆమె తలను ఖండించాడు. అప్పుడు ఇంద్రుడు సుడిగాలితో అర్జునుని స్పృహ కోల్పోయేట్లు చేశాడు. అశ్వసేనుడు తప్పించుకున్నాడు. తరువాత ఇంద్ర అర్జునుల మధ్య ఘోరయుద్ధం జరిగింది. దేవతలందరు ఇంద్రునికి అండగా నిలిచారు. వారు కృష్ణార్జునులను జయింపలేమనీ, అగ్నిజ్వాలలను ఆర్పజాలమని త్వరలో గ్రహించారు. కృష్ణార్జునుల సాహసాన్ని మెచ్చుకుంటూ



వారందరు ఇంద్రునితో సహా యుద్ధం నుండి విరమించుకున్నారు. అగ్ని ఎడతెగక పదిహేనురోజులు ఖాండవవనం దహించాడు. ఆ వనంలో నివసించే ఆరుగురు మాత్రం అగ్ని బారి నుండి తప్పించుకున్నారు. వారు అశ్వసేనుడు, మయుడు, సారంగికులు అనే నాలుగు పక్షులు.

శ్రీకృష్ణునిచే చంపబడే తరుణంలో మయుడు అర్జునుని వద్ద శరణుజొచ్చాడు. సారంగిక పక్షిగా పుట్టిన మందపాల మహర్షి సంతానమే ఆ సారంగిక పక్షులు. అగ్ని వనం దహిస్తున్నప్పుడు మందపాలుని ప్రార్థనతో ఆ పక్షులను అగ్ని వదిలేశాడు.

తర్వాత అగ్ని సంతోషంగా ఖాండవ వనాన్ని పూర్తిగా దహించి తన విపరీతమైన ఆకలిని తీర్చుకున్నాడు. "దేవతలు సాధించలేని ఘనకార్యాన్ని మీరు సాధించారు" అని శ్రీకృష్ణార్జునులను అగ్నిదేవుడు మెచ్చుకున్నాడు. అప్పుడు దేవతలతో సహా ఇంద్రుడు క్రిందికి దిగివచ్చి అర్జునుని వరం కోరుకోమన్నాడు. అర్జునుడు దివ్యాస్త్రాలనన్నింటినీ కోరుకున్నప్పుడు తగిన తరుణంలో వాటిని ప్రసాదిస్తానని చెప్పి ఇంద్రుడు వెళ్ళిపోయాడు.

తర్వాత శ్రీకృష్ణార్జునులు మయునితో పాటు కొంత కాలం విహరించి యమునా తీరం చేరుకున్నారు.



# బాలల మహాభారతం

## రెండవ భాగము

ఆంగ్లమూలం : స్వామి రాఘవేశానంద

తెలుగు సేత : స్వామి జ్ఞానదానంద

చిత్రాలు : పద్మవాసన్




రామకృష్ణ మఠం

దోమలగూడ,

హైదరాబాద్ – 500 029.






# విషయ సూచిక

## సభాపర్వం


మయసభ ... 1

రాజసూయ యాగం చేయమని
యుధిష్ఠిరునికి నారదుడు సలహా ... 2

ధర్మరాజుకి శ్రీకృష్ణుడు సలహా ఇవ్వడం ... 4

జరాసంధుని పరిమార్చటం ... 5

రాజసూయ యాగం ... 8

శ్రీకృష్ణుడు శిశుపాలుని వధించటం ... 9

దుర్యోధనుడి మాత్సర్యం ... 11

దూతగా విదురుడు వెళ్ళటం ... 13

దుర్యోధనుడు తన దురదృష్టాన్ని కొనితెచ్చుకోవడం ... 13

శ్రీకృష్ణుని అహేతుక కృప ... 16

ధర్మరాజు తిరిగి జూదమాడటం ... 17


## అరణ్య పర్వం


అక్షయపాత్ర ... 19

విదురుడు పాండవుల వద్దకు వెళ్ళడం ... 20

మైత్రేయుని శాపం ... 21

శ్రీకృష్ణుని వాగ్దానం ... 22

శివార్జునుల యుద్ధం ... 24

ఇంద్రుని నగరంలో అర్జునుడు ... 26

అర్జునుడు తమ మధ్య లేనందువల్ల
ధర్మజుడు దుఃఖించుట ... 28

గంధమాదన పర్వతాలకు పాండవుల రాక ... 30

భీముడు హనుమంతుణ్ణి కలుసుకోవడం ... 31

భీముడు సౌగంధికా పుష్పాలను ద్రౌపదికి ఇవ్వడం ... 34

అర్జునుడు తిరిగి రావడం ... 36

భీముణ్ణి కొండచిలువ పట్టుకోవడం ... 39

శ్రీకృష్ణుని పునరాగమనం ... 41

దుర్యోధనుడి పన్నాగం ... 41

ధర్మరాజు సహృదయత ... 42

ఊరడిల్లని దుర్యోధనుడు ... 44

దుర్యోధనుడు యాగాన్ని నిర్వర్తించటం ... 45

కృష్ణుడు తన భక్తులను కాపాడటం ... 46

జయద్రథుడు శిక్షింపబడటం ... 49

కవచ కుండలాల దానం ... 50

నకులుడు తదితరులు మరణించటం ... 53

యక్ష ప్రశ్నలు ... 54




# ఉపోద్ఘాతం

బాలల మహాభారతం మొదటి సంపుటంలో దాయాదులైన కౌరవ పాండవుల మధ్య వైరం ప్రారంభమైన కథనం చదివారు. రాజ్యం మీద విస్తృత విఘాతాలను తీసుకొచ్చిన కుటుంబ కలహం ఇది. నేటికీ ఎడతెగని పోట్లాటను కురుక్షేత్రయుద్ధంగా పరిగణిస్తారు. ఈ రెండవ సంపుటంలో ఈ మహా యుద్ధానికి నాంది పలికిన పూర్వాపరాలను తెలుసుకుంటాం. విధి ఎంత వైపరీత్యమైనదో కూడా చూస్తాం. ధర్మవర్తనులు పడరాని అగచాట్లు పడటం చూసి ధర్మం అనేది ఈ ప్రపంచంలో నిజంగా ఉన్నదా అని మనం ఆశ్చర్యపోతాం. పాత్రల చిత్రణలో వ్యాసునిది అందెవేసిన చెయ్యి. పరిస్థితుల కనుగుణంగా వర్తించే వీరోచితమైన వైవిధ్యంగల అనేక పాత్రలను వ్యాసుడు ఇందులో ప్రవేశపెట్టాడు. ఈ మహాభారతం కేవలం ధర్మసూక్ష్మాన్ని తెలియజేసే స్మృతే కాదు, మానవ నైజ అగాధాల గురించి ఉత్కంఠతో సాగిన కథనం కూడా. కాబట్టి ముందుకువెళ్లి చదవండి.



# సభాపర్వం

## 1
## మయసభ

ఖాండవవన దహనం తరువాత, ఒకనాడు శ్రీకృష్ణుడు, అర్జునుడు, మయుడు విశ్రమించుచుండగా మయుడు చేతులు జోడించి వారితో ఇలా అన్నాడు: "మీరు నా ప్రాణాలు కాపాడారు. అందుకు ప్రత్యుపకారంగా మీకు ఏదైనా చేయడం నా ధర్మం. వృత్తిరీత్యా నేను శిల్పిని. మీకు నచ్చినది ఏదైనా చేయమని ఆదేశించండి." అర్జునుడు చిరునవ్వుతో "ప్రత్యుపకారం ఆశించి నేను ఎవరికీ సహాయం చేయలేదు. కాని నీకు చేయాలని ఉంటే, శ్రీకృష్ణుడు కోరినదానిని చేస్తే సంతోషిస్తాను" అన్నాడు.

మయుడు శ్రీకృష్ణుని వైపు చూశాడు. శ్రీకృష్ణుడు క్షణం ఆలోచించి "ధర్మరాజు నాకు ప్రీతిపాత్రుడు. నువ్వు ఆతడికి ఒక సభామంటపాన్ని నిర్మించిస్తే సంతోషిస్తాను. నీ శిల్పచాతుర్యమంతా చూపించి దానిని అతిలోక సుందరంగా రూపొందించు" అన్నాడు. తన శిల్ప చాతుర్యానికి పరీక్షపెట్టే ఆ కార్యాన్ని, ఆదేశాన్ని మయుడు ఆనందంగా స్వీకరించాడు. సభామంటప నిర్మాణ పథకం పాండవులతో చర్చించాడు. పాండవుల వద్ద సెలవు తీసుకొని, మయుడు కైలాసపర్వతం వెళ్ళాడు. తాను అక్కడి బిందుసరోవరంలో భద్రపరచిన అమూల్య రత్నాలనూ, వాటితోపాటు తాను భద్రపరచిన ఒక గదను, దేవదత్త శంఖాన్నీ కూడా తీసుకుని పాండవుల వద్దకు వచ్చాడు. గదను భీముడికి, శంఖాన్ని అర్జునుడికి బహూకరించాడు. తరువాత ఒక శుభముహూర్తంలో సభామంటప నిర్మాణాన్ని మొదలుపెట్టాడు. కుడ్యాలు, తిన్నెలు, ప్రాకారాలు పొదగిన వానిని మణులతో రూపొందించాడు.

అక్కడక్కడ ఇంద్రనీలమణులు తారి వాటి కాంతులతో యథార్థమైన నీటికోనేరులా కనిపింపచేశాడు.



అందులో కెంపులను పొదిగి ఎర్రతామర పువ్వులలా అమర్చాడు. వెండితో తెల్ల తామరలూ, రాజహంసలూ చేశాడు. నిజానికి అది ఒట్టి గచ్చు మాత్రమే. అయినా చూసేవారికి అది నిజమైన కోనేరు అనే భ్రమ కలుగుతుంది. నిజమైన కోనేళ్లనూ ఆ సభామంటపంలో నిర్మించి స్ఫటిక రాతి కుద్యాలు ఆ కోనేళ్ళలో ప్రతిబింబించేటట్లు చేసి అది మామూలు గచ్చు అనే భ్రమ కలిగించాడు. ఇలా తన శిల్పచాతుర్యమంతా వినియోగించి ఆ సభామంటపాన్ని పదమూడు నెలల కాలంలో నిర్మించాడు. తరువాత పాండవులను ఆహ్వానించి ఆ అద్భుత సభామంటపాన్ని వారికి చూపించినప్పుడు అనేక మణులతో ఉన్న ఆ సభామంటపాన్ని చూచి వారు పరమానంద భరితులయ్యారు. మయుడికి కృతజ్ఞతలు తెలిపి, అతడిని ఘనంగా సత్కరించారు. జ్యోతిష్కులు నిర్ణయించిన ఒక శుభముహూర్తంలో బ్రాహ్మణోత్తములు ఆశీర్వచనాలు, పుణ్యాహవచనాలు పలుకుతూవుండగా తన సోదరులతో ధర్మరాజు సభామంటప ప్రవేశం చేశాడు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ధర్మరాజు అనేక వేలమంది బీదవారికి మృష్టాన్న భోజనం పెట్టాడు. విలువైన దానాలు చేశాడు. ఈ సమయంలో అనేక దేశాల రాజులూ, ఋషిపుంగవులూ ఆ వేడుకలలో పాల్గొని, ఆ ఉత్సవానికి మరింత శోభ తీసుకువచ్చారు.

## 2
## రాజసూయయాగం చేయమని, యుధిష్ఠిరునికి నారదుడి సలహా

అప్పుడు వచ్చిన అతిథులలో దేవర్షి, భక్తశిరోమణి నారదుడు కూడా ఉన్నాడు. ధర్మరాజు దేవర్షిని అర్ఘ్యపాద్యాదులతో పూజించి, ఆహ్వానించాడు. అప్పుడు నారదుడు "ధర్మరాజా! నేను అనేక సభామంటపాలను దేవలోకాలలో చూశాను. కానీ వైభవంలోనూ, సౌందర్యంలోనూ అవేవీ ఈ సభకు దీటురావు" అని ప్రశంసాపూర్వకంగా చెప్పాడు తరువాత నారదుడు



ధర్మరాజుతో ప్రజల యోగక్షేమాల గురించి విచారించాడు. అప్పుడు ధర్మరాజు వినయంతో "దేవర్షీ! వేదాధ్యయనమూ, సంపద, భార్య, ధీవికాసం అవన్నీ ఎప్పుడు ఫలవంతం అవుతాయి" అని అడిగాడు. అందుకు నారదుడు "వేదాధ్యయనం చేసినవాడు అగ్నిహోత్రాది యజ్ఞాలు నిర్వర్తించినప్పుడూ, ధనవంతుడు తన సంపదను ఇతరులకు పంచిపెట్టినప్పుడూ, భార్య మాతృస్థానాన్ని వహించినప్పుడూ, శాస్త్రజ్ఞానం వినయం మొదలైన సద్గుణాలు పెంపొందినప్పుడు ఫలవంతాలవుతాయి" అన్నాడు.

పరలోకపాలకుల సభామంటపాలు ఎలా ఉంటాయో తెలుసుకోవాలని ధర్మరాజు కుతూహలపడ్డాడు. ఇంద్ర, వరుణ, యమ, కుబేర సభామంటపాలు ఎలా ఉంటాయో నారదుడు సవివరంగా చెప్పాడు. మొదట ఇంద్రసభను వర్ణిస్తూ సూర్యవంశానికి చెందిన హరిశ్చంద్రమహారాజు ఇంద్రుని సింహాసనంలో భాగం పంచుకున్నాడని నారదుడు అన్నాడు. శంతనుడు, పాండురాజు లాంటి మహారాజులెందరో స్వర్గంలో ఉన్నట్లు చెప్పాడు. అప్పుడు ధర్మరాజు, "నారదమునీంద్రా! మా పెద్దలందరూ స్వర్గంలో ఉన్నారని చెబుతూ, హరిశ్చంద్ర మహారాజు మాత్రం ఇంద్రుడితోపాటు స్వర్గసింహాసనాన్ని అధిష్ఠించిన్నట్లు చెప్పారు కదా! ఇతరులు చేయని సత్కార్యాలేవైనా ఆయన చేశారా?" అని అడిగాడు. అందుకు నారదుడు ఇలా అన్నాడు: "హరిశ్చంద్ర మహారాజు రాజసూయ యాగం చేసి ఆ స్థానాన్ని పొందగలిగాడు. ధర్మరాజా! నువ్వు ఈ భూమినంతా జయించగల శక్తిమంతుడవు, నీ తమ్ములు అసహాయశూరులు. మీ తండ్రి నాతో వెలిబుచ్చిన ఆశయాన్ని నువ్వు నిర్వర్తించాలని చెప్పడానికే నేను వచ్చాను." "మా తండ్రి ఆశయం తప్పకుండా నెరవేరుస్తాను" అన్నాడు ధర్మరాజు.

నారదుడు "రాజులందరిలోనూ మేటివని నిరూపించడానికి నువ్వు రాజసూయయాగం తప్పకుండా చెయ్యాలి" అన్నాడు. తాను రాజసూయయాగం నిర్వర్తిస్తే తన తండ్రి ఆశయం నెరవేరడం మాత్రమే గాక, రాజులందరి మీద తన సార్వభౌమత్వం నిరూపించబడుతుందని ధర్మరాజు తలపోశాడు. తన తమ్ముళ్ళతోనూ, ఇతర పెద్దలతోనూ ఈ విషయం గురించి సంప్రదించాడు. అందరూ ధర్మరాజు అభిప్రాయంతో ఏకీభవించారు. తమ మార్గదర్శి, హితుడు అయిన శ్రీకృష్ణునికి ఈ విషయం తెలియజేసి తుది నిర్ణయానికి రావడానికి ముందు శ్రీకృష్ణునితో సంప్రదించాలని ఆయనను ఆహ్వానించారు.





## 3
## ధర్మరాజుకి శ్రీకృష్ణుడు సలహా ఇవ్వడం

ధర్మరాజు ఆహ్వానం అందగానే శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థానికి వచ్చాడు. పాండవులు శ్రీకృష్ణుని ఆప్యాయంగా ఆహ్వానించి, సముచితంగా సత్కరించారు. శ్రీకృష్ణుని సాన్నిధ్యమే పాండవులకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. యోగక్షేమాలన్నీ విచారించిన పిదప ధర్మరాజు, "కృష్ణా! నువ్వు మహాపురుషుడివి. నీకు తెలియని విషయమంటూ ఏదీ ఉండదు. నారదమహర్షి నన్ను రాజసూయయాగం చేయమని, మా తండ్రి మాటగా చెప్పాడు. అందరూ దానికి సమ్మతించారు. కానీ ఈ విషయంలో సలహా కోసం నిన్ను ఆహ్వానించాను" అన్నాడు.

శ్రీకృష్ణుడు క్షణకాలం ఆలోచించి "రాజసూయయాగం నిర్వర్తించడానికి అన్ని విధాల నీకు సమర్థతవున్నది. కానీ నీకు అడ్డుపడేది మగధరాజు జరాసంధుడొక్కడే. అతడు ఎంతోమంది రాజులను జయించి, వారిని చెరసాలలో పెట్టాడు. క్షత్రియ రాజులందరూ అతడికి భయపడుతున్నారు. అతడి బారి నుండి తప్పించుకోవడానికి మేము కూడా మధురానగరాన్ని వదిలి ద్వారక వెళ్ళాం కదా" అన్నాడు.

"నిజమే" అన్నాడు ధర్మరాజు. "నీవుగాని, భీమార్జునులు గానీ ఈ జరాసంధుణ్ణి హతమార్చలేరా? చూడబోతే నేను రాజసూయయాగం తలపెట్టకుండా ఉండటం మంచిదేమో!"

"కృష్ణుని దయవుంటే మనకు సాధ్యం కానిదంటూ ఏదీ ఉండదు" అని భీముడు అన్నాడు. "గెలిచినా ఓడినా పోరాడితే వీరునితోనే పోరాడాలి. అప్పుడే మన ఘనత తెలిసివస్తుంది. కృష్ణుని వివేకం, అర్జునుని విలువిద్యానైపుణ్యం, నా కండబలం ఏకమైతే సాధించలేనిది ఏదీ ఉండదు."

అప్పుడు కృష్ణుడు కూడా "జరాసంధుడు రాజులందరికీ సింహస్వప్నం అయి కూర్చున్నాడు. ఇప్పటికే ఎనభై ఆరు మంది రాజులను చెరసాలలో పెట్టాడు. ఇంకొక పదునాలుగు మంది రాజులను చెరసాలలో పెట్టి తరువాత భైరవపూజ ప్రారంభించి వారినందరినీ నిర్దాక్షిణ్యంగా బలి ఇస్తాడు. ఇంతమంది రాజులను కాపాడగలిగినవాడు ముల్లోకాలలోనూ కీర్తిమంతుడు అవుతాడు" అన్నాడు.

కాని ధర్మరాజు "ఈ సాహసానికి నేను ఒప్పుకోను. భీమార్జునులు నా రెండు కళ్లు, నువ్వు ఆత్మవి. మీకేమైనా జరిగితే నేను బ్రతకగలనా?" అన్నాడు.

అందుకు కృష్ణుడు "మరణం ఎప్పుడొస్తుందో ఎవరికి తెలుసు? రణరంగంలో మరణించడం క్షత్రియుడికి ఎంతో గర్వకారణం కదా! మన మందరం ఏకమై అతడిని ఎందుకు ఎదుర్కోకూడదు?" అని ప్రశ్నించాడు.

## 4
## జరాసంధుని పరిమార్చటం

ధర్మరాజు జరాసంధుని పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవాలని కోరగా శ్రీకృష్ణుడు అతడి గురించి ఇలా వివరించాడు: "మగధ దేశాధిపతి అయిన బృహద్రధుడు, కాశీరాజు కవల కుమార్తెలను వివాహం చేసుకొన్నాడు. ఇద్దరూ సౌందర్యవతులే కావడంతో ఇద్దరి పట్ల సమానమైన ప్రేమతో ఉండేవాడు. కానీ బృహద్రధుడికి ఎంతకాలానికీ సంతానం కలుగలేదు. ఎన్నో వ్రతాలూ, నోములూ చేసినా ఫలితం లేకపోయింది. ఇలావుండగా ఒక రోజు తన నగరానికి వచ్చిన చండకౌశికుడనే మునిశ్రేష్ఠుని బృహద్రధుడు భార్యలతోపాటు వెళ్ళి దర్శించుకున్నాడు. భక్తితో తనకు చేసిన సేవలకు సంతోషించిన కౌశికుడు బృహద్రధుణ్ణి ఏదైనా వరం కోరుకోమనగా "పుత్ర భాగ్యం ప్రసాదించండి" అని బృహద్రధుడు ప్రార్థించాడు. ఆ ముని మంత్రించిన ఒక మామిడి పండును రాజుకు ఇచ్చాడు. బ్రహ్మానందంతో బృహద్రధుడు ఆ పండును స్వీకరించి, ఇద్దరు భార్యలకూ ఇవ్వగా, వారు దానిని సమంగా కోసి తిన్నారు. క్రమంగా ఇద్దరూ గర్భవతులయ్యారు. కాని వారు



ఇరువురు విచిత్రంగా సగం శరీరభాగం గల శిశువులను కన్నారు. ప్రతి శరీరభాగంలో ఒక కన్ను, ఒక భుజం, ఒక కాలు, సగం కడుపు, ముఖం ఉన్నాయి.

రాణులిద్దరూ ఈ వైచిత్ర్యానికి భయపడ్డారు. దాదుల్ని పిలిచి "ఎవరికీ తెలియకుండా ఈ శరీర భాగాలను కోట బైట పారవేసిరండి" అనగా ఆ శరీరభాగాలు కోట బైటకు విసిరివేయబడ్డాయి.

ఆ రాత్రి అటువైపు వెళుతున్న 'జర' అనే రాక్షసి ఆ రెండు శరీర భాగాలు దారిలో పడివుండటం చూసి, మాంసం ముక్కలనుకుని సంతోషంగా వాటిని చేతుల్లోకి తీసుకొన్నప్పుడు ఆ రెండు శరీర భాగాలు మెల్లగా కదులుతున్నాయి. కుతూహలం కొద్దీ ఆ రాక్షసి రెండు శరీర భాగాలను సంధించగా ఆ శరీరభాగాలు అతుక్కున్నాయి. జర చేతిలో చిన్నారి బాలుడు రూపొందాడు. ఆ బాలుడిది వజ్రకాయమని ఆ రాక్షసి తెలుసుకొంది. అతడి శరీరం బరువెక్కి, ఆమె చేతులలో ఇమడలేకపోతున్నాడు. పిల్లవాడు ఏడవడం ప్రారంభించాడు. పిల్లవాడి ఏడుపు విని దాదులు పరిగెత్తుకుంటూ వచ్చారు. ఆ పసిబాలుణ్ణి చూసి ఆశ్చర్యపోయి, అతడిని రాజు వద్దకు తీసుకువెళ్ళారు. రాజు పరమానందభరితుడయ్యాడు. జర వలన ఆ పిల్లవాడికి ప్రాణం వచ్చింది అందువలన ఆతడికి జరాసంధుడని నామకరణం చేశారు.

తల్లిదండ్రులకు సంతోషాన్ని చేకూర్చుతూ జరాసంధుడు సాటిలేని వీరునిగా ఎదిగాడు. కాలక్రమంలో జరాసంధుడికి రాజ్యభారం అప్పగించి, భార్యలతో బృహద్రధుడు తపోవనానికి వెళ్ళి పోయాడు. తరువాత జరాసంధుడు కన్నుమిన్నూ కానక పిట్టల మీదికి దేగలా అనేకమంది రాజుల మీద దండయాత్ర జరిపి, వారిని నానాహింసలూ పెట్టాడు. జరాసంధుడి అల్లుడైన



కంసుణ్ణి నేను సంహరించినందువల్ల యాదవవంశాన్నే నిర్మూలిస్తానని జరాసంధుడు ప్రతిజ్ఞ చేసి, పదిహేను పర్యాయాలు మధురానగరంపై దాడిచేశాడు. చివరికి నేను మధురను విడిచి సముద్రం మధ్యలో ద్వారకానగరాన్ని నిర్మించి అందరమూ అక్కడికి తరలిపోయాము."

జరాసంధుని శక్తిసామర్థ్యాల గురించి తెలుసుకున్న తరువాత ధర్మరాజు అతడితో యుద్ధం చేయడానికి వెనుకంజవేశాడు. కానీ భీమార్జునులు పోరాడడానికి కృతనిశ్చయులై ఉన్నారు. అప్పుడు కృష్ణుడు "అతడు సేనతోపాటు ఉండగా గెలవటం అసంభవం. కానీ ద్వంద్వ యుద్ధంలో భీముడుగానీ, అర్జునుడుగానీ అతణ్ణిని ఓడించగలరు" అన్నాడు. ధర్మరాజు ఇష్టంలేకపోయినా, సమ్మతించాడు.

భీమార్జునులూ, కృష్ణుడూ స్నాతకవ్రతులైన బ్రాహ్మణవేషాలు ధరించి మగధకు బయలుదేరారు. గురుకులంలో విద్యాభ్యాసం పూర్తిచేసుకొని, వచ్చే వారిని స్నాతకవ్రతులంటారు. వీరిని గౌరవనీయులుగా పరిగణిస్తారు. మగధ రాజధాని వద్దకు రాగానే జరాసంధుడు, అతడి ప్రజలు అర్చించే చైత్యక గిరిని భేదించారు. అన్యులు నగరంలో ప్రవేశించినప్పుడు వాటంతట అవే మ్రోగే మూడు పెద్ద భేరీలను పగలగొట్టారు. రాజవీథిలో నడుస్తూ దారిలో కనిపించే వివిధ పుష్పగంధపరిమళాలతో గుబాళించిపోతున్న అంగళ్లను, వివిధ రమ్య వస్తువులతో శోభిల్లుతున్న ఆ నగర ఐశ్వర్యాన్ని చూసి వారు ఆశ్చర్యపోయారు. వారికి కావలసిన గంధాలు, చందనం, పుష్పాలూ అందుకొన్నారు. పూలమాలలు ధరించి ఠీవిగా రాచవీథిలో వెళుతూవుండగా పౌరులందరూ వారిని విచిత్రంగా చూడసాగారు.

కృష్ణుడు, భీమార్జునులతో జరాసంధుని మందిరంలో ప్రవేశించాడు. స్నాతకబ్రాహ్మణులుగా ఎంచి జరాసంధుడు వారిని సాదరంగా ఆహ్వానించాడు. కృష్ణుడు



"నా స్నేహితులు ఈ రోజు పూర్తిగా మౌనవ్రతం పూని ఉన్నారు. అర్ధరాత్రి తరువాతనే మాట్లాడతారు" అన్నాడు.

జరాసంధుడు "మంచిది! అంతవరకు మీరు విశ్రమించండి. అర్ధరాత్రి దాటాక మిమ్మల్ని నేను కలుసుకుంటాను" అంటూ వెళ్లిపోయాడు.

చెప్పినట్లుగానే అర్ధరాత్రి దాటాక స్నాతక బ్రాహ్మణులను కలుసుకోవడానికి జరాసంధుడు వచ్చాడు. వారి ధోరణి, ప్రవర్తన చూసి జరాసంధుడికి సందేహం కలిగింది. "మీరేదో వేషధారుల్లా ఉన్నారు. మీ వేషాలు బ్రాహ్మణులలా ఉన్నప్పటికీ, మీ చేతులమీది విల్లు నారి గుర్తులు, ఇతర అంశాలు చూస్తే మీరు క్షత్రియులని కొట్టవచ్చినట్లు తెలుపుతున్నాయి. ఏమిటి సంగతి?" అని అడిగాడు. అప్పుడు కృష్ణుడు, తామెవరైనది చెప్పి, కోపంతో ఉన్న జరాసంధుని ఉసిగొల్పుతూ "నువ్వు మా ముగ్గురిలో ఎవరినైనా మల్లయుద్ధానికి ఎన్నుకోవచ్చు" అన్నాడు. అందుకు జరాసంధుడు "కృష్ణా! నువ్వు గోపాలుడివి, అర్జునుడు ఇంకా చిన్నవాడు. నాకు సమ ఉజ్జీ భీముడే. అతడిని మల్లయుద్ధానికి ఎన్నుకొంటున్నాను" అన్నాడు.

వారి మధ్య మల్లయుద్ధం ప్రారంభమయింది. బలంలో ఇద్దరూ సమానులు. ఇద్దరూ భీకరంగా కలయబడుతూవుంటే కాలయముడు విజృంభించి ఈ

సంక్షోభాన్ని సృష్టిస్తున్నాడా అని ప్రజలు భయపడ్డారు. ఇలా వారిద్దరూ నిర్విరామంగా పదమూడు రోజులు పోరాడారు. పదునాలుగవ రోజు జరాసంధుడు అలసిపోయినట్లు కనబడ్డాడు. వెంటనే జరాసంధుణ్ణి చంపమని కృష్ణుడు, భీముణ్ణి ఉత్సాహపరిచాడు. తక్షణం భీముడు తన బలాన్నంతా కూడదీసుకొని జరాసంధుణ్ణి పైకెత్తి నూరుసార్లు గిరగిరా త్రిప్పి క్రిందపడవేసి, ఆతడి శరీరాన్ని రెండు ముక్కలుగా నిలువునా చీల్చివేశాడు. కాని విచిత్రంగా ఆ రెండు శరీర భాగాలు ఒకటై అతుక్కుని, జరాసంధుడు ప్రాణాలతో లేచాడు. భీముడు ఆశ్చర్యపోతూ కృష్ణుని వైపు చూశాడు. కృష్ణుడు ఒక గడ్డిపరకను తీసుకొని రెండుగా చీల్చి, ఆ ముక్కలను వ్యతిరేక దిశలలో పారవేశాడు. ఆ సూచనను గ్రహించిన భీముడు, విజృంభించి జరాసంధుణ్ణి నేల మీద పడవేసి అతడి శరీరాన్ని నిలువుగా చీల్చి, ఆ రెండు ముక్కలు తిరిగి కలుసుకోకుండా వాటిని వ్యతిరేక దిశలలో పారవేశాడు. అలా జరాసంధుడు భీముడి చేతిలో వధింపబడ్డాడు. జరాసంధుడి కళేబరాన్ని కోట ముఖద్వారం ముందు పడవేశాడు. చెరలో మగ్గుతున్న రాజులందరినీ విడిపించారు. బంధవిముక్తులైన రాజులు సంతోషించి, కృతజ్ఞతలు తెలుపుతూ, ధర్మజుడు నిర్వర్తించే రాజసూయ యాగానికి యథోచితంగా సహాయపడతామని వాగ్దానం చేశారు.

## 5

## రాజసూయ యాగం

వారు జయప్రదంగా తిరిగి రాగానే, యుధిష్ఠిరుడు శ్రీకృష్ణుని సగౌరవంగా ఆహ్వానించి, భీమార్జునులను అనురాగంతో కౌగిలించుకున్నాడు. కృష్ణుడు పాండవుల వద్ద సెలవు తీసుకొని ద్వారకకు వెళ్లిపోయాడు. జైత్రయాత్రకు బయలుదేరాలన్న సంకల్పంతో అర్జునుడు "అగ్రజా! నా వద్ద ఎన్నో దివ్యాస్త్రాలున్నాయి. వాటితో రాజసూయయాగానికి కావలసిన ధనాన్ని సంపాదిస్తాను. నన్ను ఆశీర్వదించి పంపు" అన్నాడు. ధర్మరాజు, అర్జునుణ్ణి దీవించి పంపాడు. చతురంగబలాలతో అర్జునుడు ఉత్తరదిశగా బయలుదేరాడు. భీముడు, నకులుడు, సహదేవుడు తక్కిన వైపులకు బయలుదేరారు. భీముడు తూర్పు, సహదేవుడు దక్షిణ, నకులుడు పశ్చిమ, అర్జునుడు ఉత్తర దిశలను జయించారు.

ఇలా నలుగురు సోదరులు తమ జైత్రయాత్ర ద్వారా సంపాదించిన అపార ధనరాశులతో యుధిష్ఠిరుని ఖజానాలు పొంగిపొరిలాయి. ధర్మరాజు రాజసూయ యాగానికి సన్నాహాలు చేయసాగాడు. శ్రీకృష్ణుడు తన పరిజనులతో, విలువైన కానుకలతో వచ్చినప్పుడు, కృష్ణుని చూసి పాండవుల ఆనందానికి అంతులేకపోయింది. కృష్ణుడూ, వ్యాసుడూ యజ్ఞానికి కావలసిన ఏర్పాట్లు చేయసాగారు. దేశంలోని రాజులందరినీ ఆహ్వానించడానికి దూతలు అన్ని దిక్కులకు పంపబడ్డారు. అతిథులు ఒక్కొక్కరుగా రాసాగారు. అతిథుల కోసం ఇంద్రప్రస్థంలో రమ్యమైన విడిదిగృహాలు నిర్మించబడ్డాయి. నగరమంతా భూతలస్వర్గంలా రూపొందింది. ధర్మరాజు ఖజానాలో ధనం ప్రవహిస్తోంది.



ఖజానాను చూసుకోవలసిన బాధ్యతను శ్రీకృష్ణుడు, దుర్యోధనుడికి అప్పగించాడు. ధర్మరాజుకి లభిస్తున్న అఖండగౌరవానికి దుర్యోధనుడు ఈర్ష్యతో లోలోన కుమిలిపోసాగాడు. కాని తన మనోభావాలను బయటపడనీయలేదు. వ్యాస ధౌమ్యులు యాగానికి ఋత్విక్కులయ్యారు. ధర్మరాజు యాగానికి యజమానిగా విభూషితుడయ్యాడు. రాజసూయయాగం ఆరు అగ్నులతో శాస్త్రోక్తంగా, ఎక్కడా ఏ లోపం రాకుండా నిర్విఘ్నంగా జరిగింది. దక్షిణలు ఇవ్వబడ్డాయి. రాజులందరూ గౌరవసత్కారాలతో సంతృప్తులయ్యారు. అగ్నిముఖంగా మంత్రాహుతులతో దేవతలూ తృప్తిపడ్డారు. అందరూ యుధిష్ఠిరుని, ఆతడి సోదరులను ఎంతగానో ప్రశంసించారు.

యాగం చివరి రోజు ధర్మరాజుకి అవబృధస్నానం జరిపించారు. అందరూ సమావేశమైన ఆ తరుణంలో భీష్ముడు తన ఆసనం నుండి లేచి ధర్మరాజుతో "నాయనా! రాజూ, ఋషీ, ఋత్విజుడూ, స్నాతకుడూ, గురువూ, ఇష్టుడూ వీరందరూ పూజనీయులు. యజ్ఞం దివ్యంగా జరిగింది. ఈ సమయంలో ఇక్కడ సమావేశమైన వారిలో ఒక మహాత్ముని నువ్వు పూజించటం సబబుగా ఉంటుందని నా అభిప్రాయం" అన్నాడు.

## 6

## శ్రీకృష్ణుడు శిశుపాలుని వధించటం

"తప్పకుండా. అయితే అలాంటి ఉత్తముడైన మహాత్ముడెవరో మీరే చెప్పి అనుగ్రహించండి" అన్నాడు ధర్మరాజు. "చెప్పడానికేముంది? యజ్ఞపురుషుడూ, సర్వలోకపూజ్యుడూ అయిన శ్రీకృష్ణుడే అందుకు అర్హుడు. ఆయన్నే పూజించు" అన్నాడు భీష్ముడు. ధర్మరాజు, భీష్ముని ఆనతిపై సహదేవునితో అర్ఘ్యాన్ని తెప్పించాడు. శాస్త్రరీత్యా ఆ మహాసభలో శ్రీకృష్ణునికి అర్ఘ్యమిచ్చి పూజించాడు. అది చూసి శిశుపాలుడు "ధర్మరాజా! ఇంతమంది మహారాజులూ, ఋషులూ, పండితోత్తములూ ఉండగా ఈ చరిత్రహీనుని పూజించడమా? ధర్మసూక్ష్మం తెలియని పసివాడిలా ప్రవర్తించావు! అందరికంటే



వయస్సులో పెద్దవారు వసుదేవుడున్నాడుగా? ఋత్విజుడైన వ్యాసుడేమయ్యాడు? ఆచార్యులంటావా? కృపాచార్య ద్రోణాచార్యులున్నారుగా? వీరిలో ఎవరితో సమానుడని ఈ గొల్లవాడిని పూజించావు? అగ్రపూజ కృష్ణుడికే చేయాలన్నది నీ నిర్ణయమైనప్పుడు ఇంతమంది రాజులను ఆహ్వానించింది వారిని అవమానించడానికే కదా!" అంటూ వ్యంగ్యంగా పలికాడు.

తరువాత శిశుపాలుడు, కృష్ణుడి వైపు తిరిగి "ఓరీ గొల్లా! ఈ పూజకు అర్హుడవుకాని నువ్వు ఏమాత్రం సిగ్గులేకుండా పూజను ఎలా స్వీకరించావు?" అంటూ నిందించాడు.

ఇలా నోటికి వచ్చినట్లు కృష్ణుణ్ణి నిందించి, శిశుపాలుడు సభనుండి వెళ్లిపోయాడు. ధర్మరాజు అతణ్ణి వెంబడించి, అనునయించి మళ్లీ సభలోకి తీసుకువచ్చాడు. శిశుపాలుడితో, ధర్మరాజు "నువ్వు శ్రీకృష్ణుణ్ణి అనరానిమాటలు ఎన్నో అన్నావు. చివరికి భీష్ముణ్ణికూడా నిందించావు. సభలోని పెద్దలందరూ శ్రీకృష్ణుణ్ణి పూజించడమే సరి అయినది అని ముక్తకంఠంతో పలికారు," అన్నాడు. అప్పుడు భీష్ముడు కలుగచేసుకొంటూ "శ్రీకృష్ణుని మహిమ తెలుసుకోలేని ఈ మూర్ఖుడితో మాట్లాడుతూ సమయం వృథా చెయ్యవద్దు. శ్రీకృష్ణుడు కేవలం మనకు మాత్రమేకాదు, ఈ ముల్లోకాలకూ పూజనీయుడు. మంత్రాలలో గాయత్రీమంత్రంలాంటివాడు. ఈ శిశుపాలుని వాచాలత్వాన్ని పట్టించుకోకు" అన్నాడు.

తరువాత సహదేవుడు సభను ఉద్దేశించి, "మేము చేసింది ముమ్మాటికీ సబబే! మాకు శ్రీకృష్ణుడే సర్వస్వం. శ్రీకృష్ణుని అగ్రపూజను వ్యతిరేకించే నీతో యుద్ధం చెయ్యడానికి నేను సిద్ధంగా ఉన్నాను. శ్రీకృష్ణుణ్ణి అర్చించనివారు బ్రతికివున్నా చచ్చినవారితో సమానులు" అన్నాడు.

శిశుపాలుని లెక్క చెయ్యక శ్రీకృష్ణుణ్ణి పూజించారు. శిశుపాలుడు మండిపడుతూ "యుద్ధానికి సిద్ధంకండి" అంటూ అరిచాడు. శిశుపాలుడు గొడవ చేయడానికే పూనుకున్నాడని శ్రీకృష్ణుడు గ్రహించాడు. ధర్మరాజు ఈ కల్లోలపరిస్థితిని చూసి తడబాటుతో భీష్ముని వైపు తిరిగాడు. భీష్ముడు ధర్మరాజుతో "సింహాన్ని చూసి కుక్కలు మొరుగుతాయి. వాటిని మొరగనీ, నీవు నీ పని చూడు" అన్నాడు. అప్పుడు శిశుపాలుని క్రోధం భీష్ముని మీదికి మళ్ళి భీష్ముణ్ణి నానామాటలూ అనసాగాడు. అప్పుడు కృష్ణుడు కలుగచేసుకొని "మా అత్త నూరు తప్పులు సహించమని కోరటంతో ఇంతవరకు ఈ శిశుపాలుణ్ణి సహించాను. ఇక ఇతడిని మన్నించను"



అంటూ ఉండగానే మంటలు చెలరేగుతూ కృష్ణుని చేతి నుండి చక్రాయుధం రావడం, శిశుపాలుడి కంఠం తెగి క్రిందపడటం రెండూ ఒకేసారి జరిగిపోయాయి. శిశుపాలుడి శరీరం నుండి ఒక దివ్యతేజస్సు వెలువడి కృష్ణునిలో లీనమైపోయింది. శిశుపాలుడు ఏదో శాపకారణంగా మానవజన్మ ఎత్తిన మహావిష్ణువు పరిచారకుడు. శ్రీకృష్ణుని ద్వారా అతడికి ముక్తి కలిగింది. యుధిష్ఠిరుడు శిశుపాలుడి మృతదేహానికి అనుజులతో యథారీతిగా దహనసంస్కారాలు చేయించాడు.

## 7

## దుర్యోధనుడి మాత్సర్యం

రాజసూయయాగం జయప్రదంగా ముగిసింది. కృష్ణుడు, పాండవుల వద్ద సెలవు తీసుకొంటూ "ప్రజలను కన్నబిడ్డలలా చూసుకో. మహావృక్షాలు పక్షులకు నీడనిచ్చినట్లు, ఇంద్రుడు దేవతలను చూసుకొన్నట్లు నీ స్నేహితులకు, బంధువులకు, ఆశ్రితులకు ఆశ్రయమివ్వు" అని ధర్మరాజుకు హితబోధ చేసి వెళ్ళాడు.

మేనమామ శకునితోపాటు దుర్యోధనుడు ఇంద్రప్రస్థంలో కొంతకాలం ఉన్నాడు. మయ నిర్మిత సభామంటప సౌందర్యానికీ, శిల్పచాతుర్యానికీ దుర్యోధనుడు ఆశ్చర్యపోయాడు. మయసభ నిర్మాణమే అతనికి అయోమయంగా కన్పించింది. తెరచివుంచిన



ద్వారం మూసివుందనుకొని వెళ్లేవాడు కాదు. మూసివున్న ద్వారం తెరచివుందని భ్రమపడి స్ఫటిక తలుపులకు తలను కొట్టుకొనేవాడు. ఇంద్రనీలాలు తాపడం చేసిన స్థలాలు కొలనులనుకొని అందులో దుస్తులు ఎత్తి దిగబోయేవాడు. ఒకసారి స్వచ్ఛమైన నీటికోనేటిని సామాన్య నాపరాయిగా భ్రమించి, అందులో పడిపోయాడు. నానా అవస్థలుపడి తడి దుస్తులతో పైకి వచ్చాడు. అతడి అవస్థను చూసి ద్రౌపది నవ్వు ఆపుకోలేక పకపకా నవ్వింది. భీముడు ఇతరులు చప్పట్లు కొట్టారు. దాంతో దుర్యోధనుడు సిగ్గుపడి, ప్రచండ కోపంతో హస్తినాపురం వెళ్లిపోయాడు.

ఆ పరాభవం దుర్యోధనుణ్ణి దావానలంలా దహించి చివరికి అతడు ఆత్మహత్యకు తెగించాడు. అప్పుడు అతడిని శకుని అనునయిస్తూ పాండవులను తుదముట్టించడానికి త్వరలో పథకం వేద్దామని నచ్చచెప్పాడు. "మహావీరులైన పాండవులను యుద్ధంలో జయించలేము, కాని మరో మార్గముంది. ధర్మరాజుకి జూదమంటే మోజు, కానీ అందులో అతడు నిపుణుడుకాదు. నేను జూదంలో ఆరితేరినవాడినని నీకు బాగా తెలుసు. నన్ను జూదంలో ఓడించే వాడు ఇంకా ఎవరూ పుట్టలేదు. నువ్వు ధర్మరాజును, జూదానికి ఆహ్వానించు; అతడి సామ్రాజ్యాన్నంతా గెలుస్తాను. కాని ఈ జూదానికి నీ తండ్రి అనుమతిని సంపాదించాలి సుమా!" అని అన్నాడు.

శకుని దుర్యోధనుణ్ణి వెంటబెట్టుకుని ధృతరాష్ట్రుని వద్దకు వచ్చి "బావా! నీ కొడుకు అవస్థ చూశావా?" అంటూ దుర్యోధనుడి మనోవ్యధను వివరించాడు. ధృతరాష్ట్రుడు ఆ మాటలకు భయపడ్డాడు. కొడుకును తడివి చూస్తూ "నాయనా! ఇంతగా చిక్కిపోయావు ఎందుకు? నీకేమయింది?" అంటూ అనునయంగా అడిగాడు. అప్పుడు దుర్యోధనుడు "పాండవుల కీర్తి దిగంతాలకు వ్యాపించింది. వారికి కప్పం చెల్లించని రాజు ఈ భూప్రపంచం మీద లేడు అనడం అతిశయోక్తికాదు. రాజసూయయాగ సమయంలో కోశాగారం చూసుకొనే బాధ్యత నా మీద పెట్టారు. ఇప్పుడు సప్తసముద్రాలలో ఉన్న రత్నాలన్నీ వారివద్దే ఉన్నాయి. ఇదంతా చూసి నా మనస్సు స్థిమితంగా ఎలా ఉంటుంది? జూదంలో శకుని మామ సమర్థుడు, యుధిష్ఠిరునితో జూదం ఆడడానికి శకుని మామకు అనుమతియిస్తే, పాండవుల సంపదనంతా మామ జూదంలో గెలుస్తాడు,"



అన్నాడు. కానీ ధృతరాష్ట్రుడు "నువ్వు చెప్పిన మాటలు మంచికో చెడుకో నాకు బోధపడటం లేదు. నాకు కొంత వ్యవధి కావాలి, విదురునితో సమాలోచించి చెబుతాను" అన్నాడు.

వెంటనే దుర్యోధనుడు "పాండవ పక్షపాతియైన ఆ విదురుడు ఇందుకు ససేమిరా ఒప్పుకోడు. మీరు దీనికి సమ్మతించకపోతే నాకు ఆత్మహత్యే శరణ్యం" అని బెదిరింపు ధోరణిలో అన్నాడు. ఆ మాటలతో ధృతరాష్ట్రుడికి కాళ్ళూ చేతులూ ఆడలేదు. జూదం చేయతగని పని అని తెలిసినా గత్యంతరంలేక తన సమ్మతినిచ్చాడు.

## 8

## దూతగా విదురుడు వెళ్ళడం

ధృతరాష్ట్రుడు వెంటనే జూదక్రీడకోసం ఒక చక్కని సభామంటపాన్ని నిర్మించమని ఆజ్ఞాపించాడు. విదురుడు ఈ వార్త వినిగానే పరుగున ధృతరాష్ట్రుని వద్దకు వచ్చి "మహారాజా! జూదక్రీడకు అనుమతించవద్దు. ఈ జూదం వల్ల కలహం తప్పదు, కురువంశం సర్వనాశనమౌతుంది" అంటూ హెచ్చరించాడు. కానీ ధృతరాష్ట్రుడు "దైవానుగ్రహంవల్ల అలాంటిదేదీ జరగదు. నీవూ, నేనూ, భీష్ముడూ అంతా అక్కడే ఉండగా కలహం ఎందుకు వస్తుంది? నీవు నా దూతగా ఇంద్రప్రస్థం వెళ్లి ధర్మరాజుని జూదక్రీడకు ఆహ్వానించు" అన్నాడు.

దుఃఖభారంతో విదురుడు ఇంద్రప్రస్థం బయలుదేరాడు. విదురుని రాకకు ధర్మజుడు ఎంతో ఆనందించాడు. కుశల ప్రశ్నలయ్యాక విదురుడు "దుర్యోధనుడు నూతనంగా ఒక సభామంటపాన్ని నిర్మించాడు. మీరందరూ ద్రౌపదితో హస్తినాపురానికి వచ్చి, నీకు ప్రియమైన జూదక్రీడలో పాల్గొనాలని ధృతరాష్ట్రుని సందేశం" అన్నాడు.

ఆ వార్త వినగానే యుధిష్ఠిరుడు తత్తరపాటు చెంది, "మహాత్మా! జూదం ఎప్పుడూ కలహంతో ముగుస్తుంది. వివేకవంతుడు దాని దగ్గరకుపోడు. జూదమాడటం తగినదేనా? మీ అభిప్రాయం ఏమిటి?" అంటూ ప్రశ్నించాడు.

"జూదం ఎలాంటి వినాశనకారో అందరికీ తెలిసిన విషయమేగదా! నేను సాధ్యమైనంతవరకు నచ్చచెప్పినా నా మాట వినకుండా ధృతరాష్ట్రుడు, నిన్ను ఆహ్వానించడానికి నన్ను ఇక్కడకు పంపించగా నేను వచ్చాను. నీ ఇష్టప్రకారం నువ్వు చేయి" అన్నాడు విదురుడు.

ధర్మరాజు ఆ హెచ్చరికను కూడా లెక్కచెయ్యక, ధృతరాష్ట్రుని ఆదేశాన్ని పాటించాలి అన్న ఏకైక తలంపుతో తన తమ్ముళ్ళతో, పరివారంతో హస్తినాపురానికి బయలుదేరాడు.

## 9

## దుర్యోధనుడు తన దురదృష్టాన్ని కొనితెచ్చుకోవడం

హస్తినాపురాన్ని చేరుకోగానే పాండవులు ధృతరాష్ట్రుని మందిరానికి వెళ్ళి పెద్దలందరికీ నమస్కరించి, ఆసీనులయ్యారు. ముందుగా శకుని "ధర్మరాజా! ఈ సభ నిండుగా ఉన్నది. వెంటనే జూదక్రీడ ప్రారంభిద్దాం" అన్నాడు. దానికి ధర్మరాజు "జూదం మహాపాపకార్యం. నీతినియమాలు లేనిది, వినాశనకారి. మమ్మల్ని మోసంతో ఓడించడానికి ఎందుకింత



కుతూహలపడుతున్నావు" అని అడిగాడు. "ధర్మరాజా! ఇద్దరు యుద్ధం చేస్తే వారిలో బలసంపన్నుడే గెలుస్తాడు, ప్రత్యర్థిని ఓడించడం క్రీడలో సహజమేకదా! నువ్వు నాతో ఆడడానికి భయపడితే, నువ్వు పాల్గొనవద్దు" అన్నాడు శకుని. అప్పుడు ధర్మరాజు "ఓ శకునీ! వెనుదీయడానికి నేను పిరికి పందను కాను. విధి బలీయం, నే నెవరితో ఆడాలి?" అని అడిగాడు.

వెంటనే దుర్యోధనుడు "ధర్మరాజా! మా మామ శకుని నా తరుపున ఆట ఆడతాడు" అన్నాడు. "ఒకరి తరుపున మరొకరు ఆడడం న్యాయం కాదు. కాని నువ్వు పట్టుబడితే, నేను ఈ నియమాన్ని ఉల్లంఘించడానికి సిద్ధమే. ఆట ప్రారంభిద్దాం" అన్నాడు ధర్మరాజు.

భీష్ముడు, ద్రోణుడు, కృపుడు మొదలైన పెద్దలెందరో అక్కడ కూర్చుని బాధతో ఆటను చూస్తున్నారు. ధర్మరాజు మొదట రత్నాల కడియాలు మణిహారాలు పణంగా పెట్టాడు. కపటి శకుని పాచికలు విసిరి వాటిని గెలుచుకున్నాడు. తరువాత ధర్మరాజు తన కోశాగారాన్నంతా పణంగా పెట్టాడు. ఈసారీ శకునే గెలిచాడు. శకుని వేస్తున్నవి మంత్రించిన పాచికలు కాబట్టి కపటంగా ప్రతిసారీ ధర్మరాజుని ఓడించాడు. తన సంపదలను, తన సామ్రాజ్యాన్ని, తన పరివారాన్నీ, ఒక్కొక్కరిగా తన తమ్ముళ్ళను, చివరికి తననుకూడా కోల్పోయి ఇంకా పణంగా పెట్టడానికి ఏమీ లేదని ధర్మరాజు అన్నాడు. అప్పుడు శకుని "ఏం, ద్రౌపదిని మరిచిపోయావా?" అన్నాడు. చివరికి ద్రౌపదిని కూడా కోల్పోయాడు.

పాండవులు భార్యతోసహా తనకు బానిసలయ్యారనే గర్వం ఒక్కసారిగా కళ్ళు కప్పి,



దుర్యోధనుడు ద్రౌపదిని తన అంతఃపురాన్ని శుభ్రం చేయడానికి పిలుచుకురమ్మని, విదురుడితో చెప్పాడు.

సభ నలుమూలలనుండి 'సిగ్గుచేటు' 'సిగ్గుచేటు' అనే కేకలు వినవచ్చాయి. దుర్యోధనుడి అహంకారం విదురుడు సహించలేక "దుర్యోధనా! అహంకారంతో నీ గోతిని నువ్వే తవ్వుకుంటున్నావని మరిచిపోకు. చేతిని నాగుపాము పుట్టలో తెలిసే ఎందుకుపెడుతున్నావు?" అని అడిగాడు.

కాని విదురుని నీతివాక్యాలు దుర్యోధనుడికి తలకెక్కలేదు. దుశ్శాసనుని వైపు తిరిగి "ఆ ద్రౌపదిని ఈడ్చుకునిరా!" అన్నాడు. వెంటనే దుశ్శాసనుడు ద్రౌపది వద్దకువెళ్లి "మా రాజు నిన్ను సభకు తీసుకురమ్మన్నాడు. మర్యాదగా వస్తావా? రావా? నీవిప్పుడు మా దాసివి" అన్నాడు.

ఈ మాటలు విన్న ద్రౌపదికి తన కాళ్ళక్రింది నేల కుంగిపోతున్నట్టనిపించి బిగ్గరగా విలపిస్తూ, తాను సురక్షితంగా ఉండగల గాంధారి మందిరం వైపు పరుగెత్తింది. కానీ దుశ్శాసనుడు ఆమెను వదిలిపెట్టక "ఎక్కడకు వెళ్తున్నావు" అంటూ ఆమె శిరోజాలు పట్టుకుని సభలోకి ఈడ్చుకు వచ్చాడు. ఆమె విడిపోయిన శిరోజాలతో, వివర్ణమైన ముఖంతో పరాభవంతో తలలువంచి కూర్చున్న భర్తలను చూసి "భరత చక్రవర్తి వంశంవారు తమ క్షత్రియ ధర్మాన్ని ఇలా జూదంలో మంటగలపడమా? ఇంతమంది కురువృద్ధులూ, పెద్దలూ తమ కళ్ళ ముందే నన్ను ఈ దుర్మార్గుడు ఈడ్చుకు రావటం చూస్తూ మాట్లాడకుండా ఊరకున్నారే! నా ప్రశ్నకు జవాబు చెప్పగలవారు ఈ సభలోనే లేరా? నన్ను పణంగా పెట్టడానికి నా భర్తకు హక్కు ఉందా?" అని అడిగింది.

సభలో అందరూ తలలు దించుకొని నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఆమెకు బదులు చెప్పే ధైర్యం ఎవరికీ లేకపోయింది. చివరికి భీష్ముడు "మహాసాధ్వీ! ధర్మం అత్యంతసూక్ష్మమైనది. దానిని అర్థం చేసుకోవటం ఎంతో కష్టం. నీ ప్రశ్నకు నేను జవాబు చెప్పలేకపోతున్నాను" అన్నాడు. ఏకధాటిగా విలపిస్తూ, నిస్సహాయంగా తన పతుల వైపు చూస్తున్న ద్రౌపదిని నానా దుర్భాషలూ ఆడాడు దుశ్శాసనుడు. భీముడు ఇక సహించలేక ధర్మరాజుని చూస్తూ "అన్నా! నువ్వు సామ్రాజ్యాన్నంతా కోల్పోయినపుడు బాధపడలేదు. మమ్మల్ని కోల్పోయినప్పుడు కూడా నాకు కోపం రాలేదు. కానీ ద్రౌపదిని పణంగా పెట్టటం మన్నించరాని పాపం" అంటూ "సహదేవా! నిప్పు తీసుకురా! ఇలాంటి పాపం చేసిన అన్న చేతులను కాల్చాలి" అన్నాడు.



కానీ అర్జునుడు కలుగచేసుకొని “అన్నా కోపం చూపడానికి ఇది సమయం కాదు. ధర్మజుడు మనకు అన్న. ఆయన మాటకు కట్టుబడి ఉండటం మన కర్తవ్యం” అంటూ ఎలాగో భీముణ్ణి శాంతపరిచాడు.

## 10
## శ్రీకృష్ణుని అహేతుక కృప

ఇదివరకు తనను కించపరచిన పాండవులను అగౌరవపరచడానికి ఇదే తగిన సమయం అని గ్రహించిన కర్ణుడు, దుశ్శాసనుడితో “ద్రౌపదితో సహా పాండవులందరి వస్త్రాలను తీసివేయించు” అన్నాడు. పాండవులు తమ రాజోచితమైన వస్త్రాలను తీసి కిందవేశారు. అందరి ముందు ద్రౌపది ధరించిన వలువలను దుశ్శాసనుడు లాగివేయసాగాడు. ద్రౌపది దీనంగా సభంతా కలయచూసింది. తనను కాపాడే నాథుడే లేదు. ఇక



ఆర్తత్రాణపరాయణుడు ఆ శ్రీకృష్ణుడే తనను రక్షించాలి అని ఎలుగెత్తి శ్రీకృష్ణుని ప్రార్థించినది. "హే గోవిందా! ఆపద్బాంధవా! నువ్వు తప్ప ఈ అనాథను రక్షించే వారెవ్వరూ లేరు. దీనబంధూ! నా మానం కాపాడు" అంటూ ఆర్తితో ప్రార్థిస్తూ కళ్లు మూసుకుంది.

ఆపద్బాంధవుడైన శ్రీకృష్ణుడు ఆమె మొరను విన్నాడు. అప్పుడు ఒక అద్భుతం జరిగింది. దుశ్శాసనుడు ఆమె చీరను విప్పుతూ ఉన్నాడు. ఆశ్చర్యం! ఆ చీరకు అంతమేలేదు. లాగేకొద్దీ ఆ చీర వస్తూనే ఉంది. ఒక వైపు అది గుట్టలాగా పెరిగిపోతూ ఉంది. చివరకు దుశ్శాసనుడు అలసిపోయి, క్రిందపడిపోయాడు. ఈ అద్భుతం అందరినీ ఆశ్చర్యచకితులను చేసింది. ఆపద్బాంధవుడైన భగవంతుడు తన భక్తులను ఎప్పుడూ ఆదుకుంటాడని ఈ సంఘటన చక్కగా నిరూపించింది.

భీముడు తమ కళ్ళ ముందు తమ భార్యను హేయమైన పరాభవానికి గురిచేస్తున్న దుశ్శాసనుణ్ణి చూసి పళ్ళు కొరుకుతూ భీకరంగా ప్రతిజ్ఞ చేశాడు. "కురువృద్ధులూ, పెద్దలూ, బంధువులూ అందరూ వినండి! ఇలాంటి మాటలు మీరు ఇంతవరకు విని ఉండరు. ఇకముందు ఎవరూ ఇలాంటి మాటలు పలకరు. రాబోయే యుద్ధంలో ఈ దురాత్ముడు దుశ్శాసనుని రొమ్మును నా చేతులతో చీల్చి, రక్తాన్ని తాగుతాను. ఇలా చెయ్యలేకపోతే నేను నా తండ్రులకు తప్పి పుట్టినవాడినవుతాను." ఈ భీమ ప్రతిజ్ఞకు సభంతా స్తంభించిపోయింది.



దుర్యోధనుడి ఈ పాపకార్యమే కాలక్రమంలో కురువంశం సర్వనాశనం కావడానికి మూలకారణంగా పరిణమించింది.

దుర్యోధనుడు 'తొడమీద కూర్చుందువుగానిరా' అంటూ ద్రౌపది కేసి కన్నుగీటాడు. దాన్ని చూసి భీముడు సింహంలా లేచి నిలబడి, క్రోధంతో, భీకరంగా "రాజగర్వం నెత్తికెక్కింది వీడికి, ద్రౌపదిని తొడ మీదికి పిలుస్తున్నాడు దురాత్ముడు. యుద్ధంలో నా గదతో వీడి తొడలు విరగ్గొట్టకపోతే నా పూర్వులు పోయిన పుణ్యలోకాలకు నేను పోలేను" అని గర్జించాడు.

భీముని ప్రతిజ్ఞలు విని ధృతరాష్ట్రుడు భయపడి దుర్యోధనుని బానిసత్వం నుండి పాండవులను విడుదలచేయడమే సర్వ శ్రేయస్కరమైనదని భావించి, ధర్మరాజు జూదంలో కోల్పోయినదంతా అతడికి తిరిగి ఇచ్చి వేశాడు.



## 11

## ధర్మరాజు తిరిగి జూదమాడటం

తరువాత ధర్మరాజు తన తమ్ముళ్ళతోను, భార్యతోను ఇంద్రప్రస్థానికి బయలుదేరాడు. తమ ప్రయత్నమంతా బూడిదెలో పోసిన పన్నీరైనదే అనుకొని

దుర్యోధనుడు, కర్ణుడు, శకుని మరోఎత్తు వేశారు. తీయని మాటలతో ధృతరాష్ట్రుని సమీపించి "పాండవుల్ని ఇలా వదిలివేస్తే వారు మనల్ని సర్వనాశనం చేస్తారు. ద్రౌపదికి మేము చేసిన అవమానం మరచిపోరు. మమ్మల్ని ఏనాటికీ క్షమించరు. ఇక మేము బ్రతికి ఉండాలంటే మరల జూదమాడటమే మార్గం. ఈ సారి జూదంలో ఓడినవారు పన్నెండు సంవత్సరాలు వనవాసం చేసి, ఎవరికంటికి కనబడకుండా ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చెయ్యాలన్న నియమం పెట్టుకుందాం. మనమే గెలిచి వారిని అడవులకు పంపించి ఆ పదమూడేళ్లకాలంలోను మన సామ్రాజ్యాన్ని సుస్థిరం చేసుకుందాం" అంటూ అనేక విధాల నచ్చచెప్పారు.

ధృతరాష్ట్రుడు మళ్ళీ దూతను పంపి పాండవులను పిలిపించాడు. విదురుడు, ద్రోణుడు మొదలైన పెద్దలు ఎంతగా వారించినా, అంధరాజు పట్టించుకోలేదు. శకుని ఈసారి పందెం గురించి వివరించినప్పుడు ఓడిపోయినవారు అజ్ఞాతవాసంలో వారి ఉనికి తెలిస్తే అందుకు శిక్షగా మళ్ళీ పన్నెండేళ్ళు వనవాసం చెయ్యాల్సివుంటుందని చెప్పాడు.

జూదం ప్రారంభమైంది. ఈ సారి కూడా శకునే గెలిచాడు. పాండవులు వనవాసం వెళ్ళడానికి సిద్ధమయ్యారు. అప్పుడు దుశ్శాసనుడు "ఇప్పటినుండి దుర్యోధనుని ఏకఛత్రాధిపత్యం ప్రారంభమయింది. పాండవుల ఆధిపత్యం ముగిసింది" అన్నాడు. ఆ మాటలు విన్న భీముడు కోపోద్రిక్తుడై అతడి వైపు తిరిగి "నువ్వు ఇలాంటి మాటలతో మా గుండెలను గుచ్చినట్లు, రణరంగంలో నీ గుండెను నేను చీలుస్తాను" అన్నాడు. దుర్యోధనుడు పాండవులు వెళుతూ ఉండగా, భీముని నడకను తాను అనుకరిస్తూ వెక్కిరించాడు. అప్పుడు భీముడు "దుర్మార్గుడైన ఈ దుర్యోధనుణ్ణి నా గదాఘాతంతో చంపి, క్రిందపడవేసి తల మీద తన్నుతాను. దుశ్శాసనుణ్ణి చంపి వాడి రక్తం తాగుతాను. అర్జునుడు, కర్ణుణ్ణి హతమారుస్తాడు. సహదేవుడు కుటిల శకునిని వధిస్తాడు. సూర్యుడు తన వేడిమిని కోల్పోయినా, హిమాలయాలు తన చోటు మారినా, చంద్రుడు తన చల్లదనాన్ని కోల్పోయినా మా ప్రతిజ్ఞలను నెరవేర్చడంలో మేం తప్పక సఫలీకృతులమౌతాం" అన్నాడు ఆక్రోశంతో.

"నేను ఇప్పుడు మీ అందరి వద్దా సెలవు తీసుకుంటున్నాను. వచ్చిన తరువాత మళ్లీ కలుస్తాను" అన్నాడు ధర్మరాజు.

ద్రౌపది కుంతీదేవి వద్దకు వెళ్ళి ఆశీర్వచనం పొందింది. ద్రౌపదితో పాండవులు వెళ్లిపోయాక, బెంగపడ్డ ధృతరాష్ట్రుడు పాండవులు నగరం విడిచి ఏ వైపు వెళ్ళారో అని విదురుణ్ణి వివరించమన్నాడు.

అప్పుడు విదురుడు ఇలా చెప్పాడు: "వస్త్రాన్ని ముఖంమీద కప్పుకొని ధర్మరాజు వెళ్లాడు. రెండు చేతులూ చాచి భీముడు వెళ్ళాడు. ఇసుక చల్లుకుంటూ అర్జునుడు వెళ్లాడు. ఒంటినిండా బూడిదపూసుకుంటూ నకులుడు వెళ్లాడు. సహదేవుడు సిగ్గుతో తలవంచుకొని వెళ్లాడు. వికారంగా తలవిరబోసుకొని, దుఃఖిస్తూ ద్రౌపది వెళ్ళింది. అప్పుడు ఆకాశంలో మబ్బులు లేకుండానే మెరుపులు మెరిసాయి. హఠాత్తుగా భూమి కంపించింది. ఇలాంటి చెడు శకునాలు నీవు దురాలోచనతో చేసినదానికి పర్యవసానంగా జరుగబోయే కురువంశ సర్వనాశనానికి నాంది పలుకుతున్నాయి." ఇలా వారు మాట్లాడుకునేటప్పుడు దేవర్షి నారదుడు అక్కడికి వేంచేసి "వచ్చే పధ్నాలుగో సంవత్సరంలో అత్యంత భయంకరమైన భారత సంగ్రామం జరుగుతుంది. దుర్మార్గుడైన దుర్యోధనుని కారణంగా కురువంశం సర్వనాశనమౌతుంది. భీమార్జునుల పరాక్రమంతో పాండవులు విజయం సాధిస్తారు" అంటూ వెళ్లిపోయాడు. అప్పుడు ద్రోణాచార్యుడు దుర్యోధనుని దుష్టచర్యలతో జరుగబోయే విపరీతాల గురించి ధృతరాష్ట్రుణ్ణి హెచ్చరించాడు. ధృతరాష్ట్రుడు భయంతో, దుఃఖంతో కూలబడిపోయాడు.

**సభాపర్వం సమాప్తం**

# అరణ్య పర్వం

## 1

## అక్షయపాత్ర

పాండవులు ద్రౌపదితో అడవులకు బయలుదేరారు. ప్రజలు భీష్మద్రోణ విదురులను నిందిస్తూ పాండవులతో పాటు బయలుదేరారు. ప్రజల ఆదరం



చూసి ధర్మరాజు చలించి, వారిని తిరిగివెళ్ళమని కోరాడు. అందరూ దుఃఖిస్తూ హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోయారు. తరువాత పాండవులు తమ రథాలను గంగాతీరం వైపు మళ్ళించి, గంగా స్నానం చేసి ఆ రాత్రి అక్కడే గడిపారు. మరునాడు ఎంతోమంది బ్రాహ్మణులు పాండవులతోపాటు అరణ్యవాసం చేయడానికి వచ్చారు. కానీ ధర్మరాజు "నా ప్రార్థన మన్నించి మీరు తిరిగి వెళ్ళండి. నేను ఇప్పుడు మునుపటిలా మిమ్మల్ని పోషించలేను, మేము ఎలాగో కందమూలాలు తిని అరణ్యవాసం పూర్తిచేసుకొంటాము" అన్నాడు. కానీ బ్రాహ్మణులు పట్టుబట్టారు, పాండవులతో పాటు కష్టాలలో పాలుపంచుకోవడానికి సిద్ధంగా ఉన్నారు. ఇంతమందికి ఆహారం ఎలా సమకూర్చగలమని ధర్మరాజు చింతించి తన తమ్ముళ్ళతోను, గురువు ధౌమ్యుడితోను ఈ సమస్య గురించి చర్చించాడు.

అప్పుడు ధౌమ్యుడు ధర్మరాజుతో "నువ్వు సహాయార్థం సూర్యదేవుని ఉపాసించు. సూర్యుడే ఆహారం సృష్టిస్తాడు. ప్రపంచంలోని సంపదకంతా కర్త ఆతడే. అందువల్ల అతడిని ఉపాసిస్తే నీ కోరిక నెరవేరుతుంది" అన్నాడు. ధౌమ్యుని ఉపదేశం అక్షరాల పాటించి ధర్మరాజు అత్యంత భక్తిశ్రద్ధలతో సూర్యదేవుని పూజించాడు. సూర్యుడు ప్రత్యక్షమయ్యాడు. "నీ తపస్సుకు సంతోషించాను. నీ పన్నెండేళ్ల వనవాసంలో, మీ



వంటఇల్లు తరుగు లేకుండా ఉంటుంది. కందమూలాలూ, కాయగూరలూ అన్నీ ద్రౌపది చేతిలో దివ్యంగా నాలుగు రకాల వంటకాలౌతాయి. ఇదిగో ఈ రాగిపాత్ర తీసుకో. ఇది అక్షయపాత్ర. ఎంతమందికి వడ్డించినా దీనికి తరుగంటూ ఉండదు. ద్రౌపది ఆ పాత్రనుండి ఆహారం స్వీకరించిన తరువాత ఆ రోజుకు పాత్ర ఇక ఆహారం ఇవ్వదు. మరల మరుదినం అది అక్షయంగా ఆహారం సమకూరుస్తుంది" అంటూ అక్షయపాత్రను ధర్మరాజుకు అందజేసి సూర్యదేవుడు అంతర్ధానమయ్యాడు. ధర్మరాజు ఆ అక్షయపాత్రను ద్రౌపదికిచ్చాడు. ద్రౌపది స్వల్పంగా ఆహారం వండి అందులో వేసింది. మరుక్షణమే రకరకాల ఆహారపదార్థాలు అందులో నుండి పుట్టుకొచ్చాయి. ద్రౌపది బ్రాహ్మణులందరికీ తృప్తిగా భోజనం పెట్టింది. పాండవులందరూ భోజనం చేశాక, ద్రౌపది కూడా భోజనం చేసింది. అంతటితో ఆనాటికి ఆ పాత్ర పని ముగిసింది.

తరువాత ధర్మరాజు, ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణోత్తములతో కామ్యక వనానికి ప్రయాణమయ్యాడు.

## 2

## విదురుడు, పాండవుల వద్దకు వెళ్ళడం

పాండవులు వనవాసానికి వెళ్ళిపోయాక ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి "ఇప్పుడేం చెయ్యాలి?" అని అడిగాడు. వివేకవంతుడైన విదురుడు "మహారాజా! నేను సలహా ఇవ్వగలను కానీ, అది మీకు నచ్చదని నాకు బాగా తెలుసు. పాండవులను పిలిచి వారి రాజ్యం వారి కిచ్చెయ్యి. ఇలా నువ్వు చెయ్యకపోతే కురువంశ సర్వనాశనం చూడడానికి సిద్ధపడి ఉండు. ఇదే నా ఉద్దేశం! తర్వాత నీ ఇష్టం" అన్నాడు.

విదురుని పలుకులు ధృతరాష్ట్రుడికి ములుకుల్లా గుచ్చుకున్నాయి. అతడు ఉక్రోషంతో "నువ్వెప్పుడూ పాండవ పక్షపాతివే! పాండవులకోసం నా బిడ్డలను వదలుకోమంటావా? నన్ను సముదాయించడానికి బదులు నీ మాటలతో నన్ను బాధపెడుతున్నావు. అసాధ్యమైన దానిని చేయమంటున్నావు. ఇక నా మొహం చూడకు. ఇక్కడ నుండి వెళ్లిపో" అన్నాడు. ఆ మాటలు వినగానే విదురుడు కట్టుగుడ్డలతో కామ్యక వనానికి వెళ్ళిపోయాడు.

పాండవులు విదురుని ఎంతో సత్కారపూర్వకంగా ఆహ్వానించారు. విదురుడు పాండవుల స్థితిని చూసి కంట తడిపెట్టాడు. ధృతరాష్ట్రుడితో తన అభిప్రాయభేదం గురించి చెప్పాడు. "ఆయన వెళ్లిపొమ్మంటే వచ్చేశాను" అన్నాడు.

విదురుడు వెళ్లిన తరువాత పశ్చాత్తాపపడి ధృతరాష్ట్రుడు స్పృహతప్పి పడిపోయాడు. కొంతసేపటికి తెప్పరిల్లి సంజయుణ్ణి పిలిపించి "నువ్వు తక్షణం వెళ్ళి విదురుణ్ణి పిలుచుకురా. అతడు మూర్తీభవించిన ధర్మదేవత" అంటూ విలపించసాగాడు. వెంటనే సంజయుడు వెళ్ళి విదురుణ్ణి కలుసుకొని ధృతరాష్ట్రుని నిస్సహాయ పరిస్థితి గురించి తెలిపాడు. విదురుడు పాండవులను ఆశీర్వదించి, ధృతరాష్ట్రునిపై తనకున్న ప్రేమకొద్దీ తక్షణమే హస్తినాపురానికి తిరిగి వచ్చేశాడు.



## 3

# మైత్రేయుని శాపం

విదురుడు తిరిగి రావడం దుర్యోధనుడికి నచ్చక వెంటనే దుశ్శాసన, కర్ణ శకునులతో చర్చ జరిపాడు. "విదురుడు పాండవుల దగ్గరకువెళ్ళి వెంటనే తిరిగి వచ్చేశాడు. దానికి కారణం తెలియదు. బహుశా పాండవులను పిలిచి, వారి రాజ్యం వారికి ఇప్పించివెయ్యాలని మా తండ్రిని ఒప్పించి ఉండవచ్చు. ఏ కారణంచేతనైనా పాండవులు తిరిగి వచ్చిన పక్షంలో నేను ఆత్మహత్య చేసుకుంటాను" అన్నాడు. అప్పుడు కర్ణుడు "వారు తిరిగి వస్తే మరల జూదంలో ఓడిస్తాం, లేకపోతే వెంటనే చతురంగబలాలతో వెళ్ళి వారిని ఎదుర్కొని యమలోకానికి పంపుదాం" అన్నాడు. ఈ సలహాకు అందరూ ఒప్పుకొన్నారు. పాండవులపై దాడిచేయడానికి తీర్మానించుకున్నారు. అదే సమయానికి అక్కడికి వ్యాసమహర్షి వచ్చి, వారిని వారించాడు. ధృతరాష్ట్రుని వద్దకు వెళ్ళి "నీవు పాండవులను అడవుల పాలుచేసి, ఇప్పటికే నీకు, నీ వంశానికీ ఎంతో అనర్థం మూటకట్టుకున్నావు. అడవుల్లో ఉన్న పాండవులు పదమూడు సంవత్సరాలు ఈ ద్వేషాగ్నిని బాగా రగిలింపజేసి, తమ అరణ్యవాసం ముగియగానే, తిరిగి వచ్చి ఈ భూమండలాన్నే భస్మంచేస్తారు. ఈ అన్యాయానికీ నీవే కారకుడివి. నీ కుమారుని అదుపులో ఉంచుకోలేకపోతే నీ వంశమే సర్వనాశనమైపోతుంది, జాగ్రత్త!" అంటూ హెచ్చరించాడు.

వ్యాసుడు వెళ్ళిపోయిన తరువాత మైత్రేయ మహర్షి హస్తినాపురం వచ్చాడు. ఆయన కామ్యకవనం నుండి వస్తున్నాడని తెలుసుకొని ధృతరాష్ట్రుడు పాండవుల క్షేమం గురించి విచారించాడు. అప్పుడు మైత్రేయుడు "పాండవులను కలుసుకున్న తర్వాతనే మీ వద్దకు వచ్చాను. నీవు పాండవులకు చాలా అన్యాయం చేశావు" అన్నాడు. తర్వాత దుర్యోధనుడితో "నీ మంచికోసమే చెబుతున్నాను.



పాండవులు సాటిలేని పరాక్రమవంతులు. వారు ఇప్పటికే అవలీలగా బకాసురుణ్ణీ, హిడింబుణ్ణీ, కిమ్మీరుణ్ణీ వధించారు" అన్నాడు.

మైత్రేయుడు చెబుతున్నంతసేపూ దుర్యోధనుడు పెడసరంగా ముసిముసిగా నవ్వుతూ కాలిబొటనవ్రేలు కిందరాస్తూనే ఉన్నాడు. తొడల మీద చేత్తో తాళం వేస్తూ కూర్చున్నాడు. దానితో మైత్రేయుడు ఆగ్రహించి "ఈ పెడసరానికి ప్రతిఫలం అనుభవిస్తావు. యుద్ధంలో భీముడు తన గదతో నీ తొడలు విరగ్గొట్టినప్పుడు నీకు మరణం కలుగుతుంది" అంటూ ఘోరంగా శపించాడు. ధృతరాష్ట్రుడు మైత్రేయుని శాంతింపచెయ్యడానికి కాళ్ళావేళ్ళాపడ్డాడు. ముని కొంత శాంతించి "పాండవులతో స్నేహం చేసుకొంటే నా శాపం తప్పుతుంది. లేకపోతే నా శాపానికి తిరుగులేదు" అన్నాడు.

ధృతరాష్ట్రుడు భీముడు వధించిన కిమ్మీరుణ్ణి గురించి తెలుసుకోవాలని, విదురుణ్ణి వివరించమన్నాడు. అప్పుడు విదురుడు ఇలా చెప్పాడు: "అది భీముడు వీరవిహారం చేసిన కథ. పాండవులు కామ్యక వనం చేరిన అర్ధరాత్రివేళ ఒక రాక్షసుడు వాళ్ళకు ఎదురయ్యాడు. మహాకాయుడుగా పెద్దపెద్ద కోరలతో చూడడానికి ఎంతో భయంకరంగా ఉన్నాడు. ధర్మరాజు అతణ్ణి ప్రశ్నిస్తే అందుకు ఆ రాక్షసుడు 'నన్ను కిమ్మీరుడంటారు. బకాసురుడి తమ్ముణ్ణి. ఈ వనంలో ప్రవేశించిన మనుష్యుల్నీ, మృగాల్నీ చంపి తినడమే నా పని. మీరెవరు?' అని గద్దించాడు. ధర్మరాజు తమను గురించి చెబుతూ భీముడి పేరు చెప్పగానే కిమ్మీరుడు ఎగిరి గంతేశాడు. "హిడింబ, బకాసురుల వధకు ప్రతీకారం కోసం ఇంతవరకు కాచుకుని ఉన్నాను. నా మిత్రుడైన హిడింబుణ్ణి, నా అన్న బకాసురుణ్ణి చంపిన భీముణ్ణి హతమార్చి, పగతీర్చుకొంటాను" అంటూ ముందుకు వచ్చాడు. భీముడు ఒక పెద్ద వృక్షాన్ని ఊడబెరికి ఆ రాక్షసుడితో యుద్ధానికి దిగాడు. వారి మధ్య ఘోరయుద్ధం జరిగింది. చివరకు భీముడు యమదండాల్లాంటి చేతులతో వాడి నడుమూ, కంఠమూ పట్టుకొని నేల మీద పడవేసి బకాసురుణ్ణి చంపినట్లే కిమ్మీరుణ్ణి వధించాడు." ఈ కథ విన్న కౌరవుల గుండెల్లో రాయి పడింది.

## 4

## శ్రీకృష్ణుని వాగ్దానం

శ్రీకృష్ణుడు పాండవులు తమ రాజ్యం కోల్పోయి అడవుల్లో ఉన్నారని వినగానే కామ్యకవనానికి బయలుదేరాడు. యాదవులూ, వృష్ణికులూ, భోజులూ, అంధకులూ అందరూ ఆయనతో వచ్చారు. పాంచాలం నుండి ద్రౌపది సోదరుడు ధృష్టద్యుమ్నుడు వచ్చాడు. పాండవుల అవస్థను చూసి శ్రీకృష్ణుడు సహించలేక కోపంతో కాలరుద్రునిలా "దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని వీళ్ల రక్తంతో భూదేవికి తర్పణం చేద్దాం. వీరందరిని వధించి సమస్త సామ్రాజ్యానికీ ధర్మరాజునే సామ్రాట్టుని చేద్దాం" అంటూ పిడుగులా ఉరిమాడు. "ధర్మరక్షణకు దుష్టసంహారం తప్పనిసరి" అన్నాడు.



అర్జునుడు, కృష్ణుణ్ణి శాంతపరిచి క్రిందటి జన్మలలో శ్రీకృష్ణుడు జగద్ధితార్థం చేసిన అనేక లీలలను నారదుని ద్వారా విన్నానని చెప్పాడు. అర్జునుని స్తోత్రంతో శాంతించిన శ్రీకృష్ణుడు "అర్జునా! నువ్వు నేనూ ఒకటేగా" అన్నాడు చిరునవ్వుతో. "మనం ఆదిపురుషులమైన నరనారాయణులం. నువ్వు నరుడివి, నేను నారాయణుణ్ణి. నువ్వు వేరు, నేను వేరు కాదు. అందుచే నీ మిత్రుడే నా మిత్రుడు; నీ శత్రువే నా శత్రువు. జగద్ధితార్థమే మనం జన్మను స్వీకరించాం" అన్నాడు.

ఆ సమయంలో ద్రౌపదివచ్చి శ్రీకృష్ణుని ముందు నిలబడి కోపంతో "నువ్వు ప్రజాపతివని మహర్షులంటారు. ఈ ప్రపంచ సృష్టికర్తవు, మహావిష్ణువు, సనాతన పురుషుడవు. సకల జీవరాసుల ప్రభువు. నా పట్ల నీకెంతో వాత్సల్యముంది. కాబట్టి నా మనస్సులోని విషయాలు చెబుతున్నాను. ఓ కృష్ణా! నన్ను ఎంత దారుణంగా సభకు ఈడ్చుకొచ్చారు? వీరాధివీరులైన భీమార్జునులు నేను ఆక్రోశిస్తుంటే కదలనైనా కదలలేదు. వీరి బాహుబలం వల్ల ఎవరికి ప్రయోజనం? అన్నదమ్ములున్నారు, కొడుకులున్నారు, బంధువులున్నారు. ఇందరూ ఉన్నా నేను దిక్కులేనిదాన్నే అయ్యాను. నా పరాభవానికి ప్రతీకారం లేదా?" అంటూ వెక్కివెక్కి ఏడ్చింది. ఆమెను ఓదారుస్తూ "చెల్లీ! నీవిప్పుడు దీనంగా విలపిస్తున్నట్లే నీ పరాభవానికి కారకులైన వారి భార్యలు రణభూమిలో వారి భర్తల మృతదేహాలను చూసి విలపిస్తారు. నా పలుకులు అక్షరాల నిజమని నమ్ము. నీవు మహారాణివౌతావు" అన్నాడు కృష్ణుడు. అప్పుడు అర్జునుడు "అవును ద్రౌపదీ! శ్రీకృష్ణుడు అన్నది తప్పక జరుగుతుంది, విలపించకు" అన్నాడు.

అప్పుడు ధృష్టద్యుమ్నుడు "నేను ద్రోణుణ్ణి చంపుతాను. శిఖండి భీష్ముణ్ణి, భీముడు దుర్యోధనుణ్ణి, అర్జునుడు కర్ణుణ్ణి చంపుతారు," అంటున్నప్పుడు అందరూ శ్రీకృష్ణుని వైపు చూశారు.

శ్రీకృష్ణుడు వారి వంక చూస్తూ ఇలా అన్నాడు. "నేను ద్వారకలో ఉండివుంటే ఇలా జరిగివుండేదికాదు. జూదంతో సంభవించే అనర్థాలను గురించి వివరించి, దానిని నివారించేవాణ్ణి. ఆ సమయంలో నేను శిశుపాలుడి సోదరుడైన సాల్వుని వధించి ద్వారకకు తిరిగి వచ్చినప్పుడు మీకు సంభవించిన అనర్థం తెలిసింది.



వెంటనే ఇక్కడకు వచ్చేశాను." శ్రీకృష్ణుడు కొన్నిరోజులు పాండవులతో గడిపి ద్వారకకు బయలుదేరాడు.

## 5

## శివార్జునుల యుద్ధం

శ్రీకృష్ణుడు వెళ్లిపోయిన తరువాత పాండవులు ద్వైతవనం చేరుకున్నారు. ప్రతిరోజూ బ్రాహ్మణోత్తములు వేదపారాయణం చేస్తూ, ధర్మసూక్ష్మాలను పాండవులతో చర్చించేవారు. ఒక రోజు ద్రౌపది పడుతున్న అవస్థలు చూసి భీముడు విచారిస్తూ "ఇలా అడవుల్లో ఉండటంవల్ల ఏమి లాభం? దుర్యోధనుడు మన రాజ్యం అపహరించాడు. ఆడినమాట తప్పినా, పాటించినా ఒక్కటే? ధర్మంకోసం ధర్మాన్ని పాటించడం అన్ని ముప్పులకు దారి తీస్తుంది. నాకో ఉపాయం తోస్తూంది. సంవత్సరాలకి బదులు నెలలు లెక్క పెట్టడంకద్దు. పదమూడు సంవత్సరాలు కదా ఒప్పందం. మనం అడవులకు వచ్చి పదమూడు మాసాలైనది. పదమూడు సంవత్సరాలకు పదమూడు మాసాలు సరిపోతాయి. ఇది ధర్మ విరుద్ధం కాదు. యుద్ధానికి తగిన సమయమిదే. అంతకంటే క్షత్రియుడికి వేరే ధర్మం ఏముంటుంది?" అన్నాడు. కానీ ధర్మరాజు అక్షరాల ధర్మం పాటించాలని గట్టిగా తీర్మానించాడు. ఆ సమయంలో వారి వద్దకు వ్యాసమహర్షి వచ్చి. ధర్మరాజుని చూసి మందహాసంతో, "భీష్ముడు, ద్రోణుడు మొదలైన వారిని ఎలా ఓడించడం అని భయపడుతున్నావా" అంటూ అతని మనసులోని విషయాన్ని బయటపెట్టాడు. "నేను నీకు సహాయం చేయడానికే వచ్చాను. నీకొక రహస్య విద్య ఉపదేశిస్తాను. అది ఎంతో యోగం ఉన్నవారికే లభిస్తుంది. ఈ మహావిద్య శక్తితో అర్జునుడు మహావీర్యవంతుడౌతాడు. ఇంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరుడు మొదలైన దేవతలనీ, శివుణ్ణీ ప్రత్యక్షం చేసుకొని, వారివల్ల దివ్యాస్త్రాలు పొందుతాడు. శత్రువులందరినీ అవలీలగా జయిస్తాడు" అంటూ



వ్యాసుడు 'ప్రతిస్మృతి' అనే ఒక రహస్య విద్యను ఉపదేశించి వెళ్లిపోయాడు.

కొన్ని రోజుల అనంతరం ధర్మరాజు, అర్జునుణ్ణి పిలిచి "భీష్ముడు, ద్రోణుడు మొదలైనవారు ధనుర్విద్యలో సర్వజ్ఞులు. అందువల్ల వ్యాసుడు నాకు ఉపదేశించిన దివ్యమంత్రాన్ని నీకు ఉపదేశిస్తాను. ఆ మంత్రప్రభావంతో నువ్వు దేవతల అనుగ్రహం పొందగలుగుతావు. ఇంద్రుని వద్ద దివ్యాస్త్రాలన్నీ ఉన్నాయి. తపోనిష్ఠతో దేవేంద్రుని మెప్పించి ఆ దివ్యాస్త్రాలనన్నిటిని సంపాదించు. తరువాత ఇంద్రుని ఉపదేశంతో శివుణ్ణి ఆరాధించి ఇష్టసిద్ధి పొందు" అన్నాడు. సోదరుల వద్ద సెలవు తీసుకొని, ఋషుల ఆశీర్వాదాలతో అర్జునుడు తపస్సుకు బయలుదేరాడు.

ఈశాన్యదిక్కుగా బయలుదేరిన అర్జునుడు హిమాలయం చేరి గంధమాదన పర్వతం దాటి ఇంద్రకీలపర్వతం అధిరోహించసాగాడు. ఆకాశంనుండి 'ఆగు' అనే పెద్ద శబ్దం వినబడింది. అర్జునుడు చుట్టూ చూశాడు. ఒక చెట్టు క్రింద కూర్చున్న ఒక ముసలి బ్రాహ్మణుడు కనబడ్డాడు. ఆతడి శరీరం కృశించివున్నా, ముఖంలో బ్రహ్మతేజస్సు ఉట్టిపడుతోంది. ఆయనకు అర్జునుడు నమస్కరించాడు. అప్పుడు ఆ బ్రాహ్మణుడు "ప్రశాంతంగా తపస్సు చేసుకొనే ఋషులు నివసిస్తున్న ఈ ప్రాంతంలో కత్తి, కవచం, ధనుస్సు ధరించి ఎందుకు వచ్చావు? ఈ పుణ్యభూమిలో ఆయుధాలు ధరించకూడదు. వాటిని విడిచిపెట్టు" అన్నాడు.

కానీ అర్జునుడు చలించకుండా ఆయుధాలను దృఢంగా పట్టుకొన్నాడు. "అయ్యా! నేను అర్జునుణ్ణి, దివ్యాస్త్రాలను పొందేందుకు ఇక్కడికి వచ్చాను" అన్నాడు. అప్పుడు ఆ ముసలి బ్రాహ్మణుడు ఇంద్రుని రూపంలో అర్జునుడికి దర్శనమిచ్చాడు. "అర్జునా! నీకు కావాల్సిన వరం కోరుకో నీ పట్ల ప్రసన్నుడినయ్యాను" అన్నాడు.

అర్జునుడు ఇంద్రుడికి ప్రణమిల్లి "దేవా! నాకు అన్ని దివ్యాస్త్రాలనూ ప్రసాదించు" అని కోరాడు. అందుకు ఇంద్రుడు "అర్జునా! నీకు కావాల్సినవి దివ్యాస్త్రాలే అయితే, తపస్సుచేసి శివుణ్ణి ప్రసన్నం చేసుకుంటే, నీ కోరిక సిద్ధిస్తుంది" అంటూ అంతర్ధానమయ్యాడు.

ఇంద్రుడు చెప్పినట్లే అర్జునుడు తపస్సుకు పూనుకున్నాడు. మొదట్లో కందమూలాలు తినేవాడు, తరువాత మూడు రోజులకు ఒకసారి ఒక రాలిన ఆకు తినేవాడు. అలా మొదటి నెల గడిపి, రెండో నెలలో ఆరు రోజులకు ఒక ఆకు తినసాగాడు. మూడవ నెలలో పదిహేను రోజులకు ఒక ఆకు తింటూ గడిపాడు. నాలుగవ నెలలో వాయుభోజనంతో గడుపుతూ, రెండు చేతులు పైకెత్తి, ఒకే కాలు మీద నిలబడి కఠోరమైన తపస్సు కొనసాగించాడు.

ఇది చూసి ఆశ్చర్యచకితులైన మునులు శివునికి ఆ విషయం విన్నవించారు. "అర్జునుడు ఎన్నడూ కనీవినీ ఎరుగని ఉగ్రమైన తపస్సు చేస్తున్నాడు. కాలమేఘాల్లాగా తపోగ్నిపొగలతో తపోవనం నిండిపోతున్నది. అతని కోర్కెమన్నించు మహాదేవా!" అన్నారు.

శివుడు "భయపడకండి" అని అభయహస్తం ఇస్తూ, "అతడి అభీష్టమేమిటో నాకు బాగా తెలుసు. అతడు కోరిన వరం ప్రసాదిస్తాను. మీరు నిశ్చింతగా వెళ్ళండి" అన్నాడు.

శివుడు, కిరాతుడిలా వేషం ధరించాడు. చేతిలో చక్కని విల్లును పట్టుకుని కిరాతుని భార్యలా వేషం



ధరించిన పార్వతీదేవితో, శివుడు బయలుదేరాడు. ఆ సమయంలో ఒక అడవిపంది అర్జునుడి మీదికి వచ్చింది. అర్జునుడు గాండీవంతో వాడి బాణాన్ని దాని మీదికి ప్రయోగించాడు. అదే సమయంలో కిరాతుడు కూడా ఒక బాణాన్ని ఆ పంది మీదికి ప్రయోగించాడు. కిరాతుణ్ణి చూసి "ఎవరు నువ్వు? నేను బాణప్రయోగం చేసిన ఈ పంది మీద మళ్ళీ నీవు ఎందుకు బాణం ప్రయోగించావు?" అని అడిగాడు. అందుకు కిరాతుడు "ఈ అరణ్యమే నా నివాసం. నువ్వు వనవాసిగా కనిపించడం లేదు. నేను ప్రయోగించిన బాణంతోనే ఆ పంది చనిపోయింది" అన్నాడు.

అది క్రమంగా వారి మధ్య వాదంగా ప్రారంభమై చివరికి పోట్లాటగా పరిణమించింది. కిరాతుని పరాక్రమం ముందు అర్జునుడు నిలువలేక తన ధనుస్సును కోల్పోయాడు. కిరాతుడు అర్జునుణ్ణి ఒడిసి పట్టుకున్నాడు. అప్పుడు అర్జునుడు సహాయార్థం శివుణ్ణి ధ్యానించగా, మరుక్షణం కిరాతుడు, శివుడిగా మారి దర్శనమిచ్చాడు.

అర్జునుడు భక్తిశ్రద్ధలతో శివుని పాదాల మీద సాష్టాంగపడ్డాడు. శివుడు అత్యంత ప్రసన్నుడై "అర్జునా! నీ తపస్సుకూ శౌర్యానికీ సంతృప్తుడనయ్యాను. నీకు పాశుపతాస్త్రాన్ని ప్రసాదిస్తున్నాను. దీన్ని అభిమంత్రిస్తే అనేక వేల శూలాలు, గదలూ, సర్పాల్లాంటి బాణాలు వెంటనే పుట్టుకొస్తాయి. ఈ పాశుపతాస్త్రానికి అసాధ్యమైనదేదీ ఈ లోకంలో లేదు. త్వరలోనే నీకు ఇంకొన్ని దివ్యాస్త్రాలు లభిస్తాయి" అంటూ శివపార్వతులు తమ నిజస్వరూపాలు చూపించి, అర్జునుణ్ణి ఆశీర్వదించారు. అర్జునుడు తాను ధన్యుడినయ్యానని భావించాడు. అప్పుడు శివుడు "నువ్వు ఇంద్రుణ్ణి కూడా దర్శించి, ఆయన ఆశీస్సులు కూడా పొందు" అంటూ పార్వతీదేవితో సహా అంతర్ధానమయ్యాడు.

## 6

## ఇంద్రుని నగరంలో అర్జునుడు

తరువాత అర్జునుడు ఇంద్రుణ్ణి స్మరించగా, క్షణంలో అతడి ముందు ఒక దివ్యరథం ప్రత్యక్షమైంది. అది ఇంద్రుని రథం. దాని సారథి మాతలి "అర్జునా! నీ



తండ్రి దేవేంద్రుడు నీ కోసం ఈ రథం పంపాడు. నిన్ను అమరావతికి తీసుకురమ్మన్నాడు" అని చెప్పాడు. అర్జునుడు రథాన్ని అధిరోహించగా క్షణాల మీద రథం అమరావతి చేరింది. దేవేంద్రుడు రత్న సింహాసనం మీద ఆసీనుడై ఉన్నాడు. దేవకన్యలు చామరాలు వీస్తున్నారు. అర్జునుడు తలవంచి తండ్రికి నమస్కరించాడు. ఇంద్రుడు సంతోషంతో కుమారుణ్ణి ఆలింగనం చేసుకొని తన సింహాసనం మీద కూర్చోపెట్టుకున్నాడు. అర్జునుడు రెండో ఇంద్రునిలా వెలిగిపోతుండగా, గంధర్వులు అర్జునుణ్ణి ప్రశంసిస్తూ గానం చేశారు. మేనక, ఊర్వశి మొదలైన అప్సరసలు నాట్యం చేశారు. ఇంద్రుడి ఆనతి మేరకు ఐదు సంవత్సరాలు అర్జునుడు అమరావతిలో ఆనందంగా కాలం గడిపాడు. ఆ సమయంలో అనేక దివ్యాస్త్ర ప్రయోగాలు నేర్చుకున్నాడు. చిత్రసేనుని వద్ద నృత్యం, గానం కూడా నేర్చుకున్నాడు.

ఇంద్రలోకంలోని ఊర్వశి అనే అప్సరస అర్జునుణ్ణి మోహించింది. అతడికి తన వలపును ప్రకటించి, తనతో కొంతసమయం గడపమని కోరింది. కానీ ఆమెను తల్లిగా భావించిన అర్జునుడు ఆమె కోరికను తిరస్కరించాడు. మోహితురాలైన ఊర్వశి తన కోరిక నెరవేరకపోవడంతో "నా అభిలాష నిష్ఫలం చేసినందుకు నువ్వు నపుంసకుడివై, మానవ లోకంలో మానాభిమానాలు లేకుండా ఆడవాళ్ళ మధ్య బ్రతుకు" అంటూ శపించి వెళ్ళిపోయింది. ఈ విషయం తెలుసుకున్న ఇంద్రుడు "మునులుకూడా సాధించలేని మనోనిగ్రహాన్ని నువ్వు చూపించావు. నీలాంటి కుమారులను కన్నతల్లి ధన్యురాలు. ఈ శాపానికి విచారించకు. మీ అజ్ఞాతవాసకాలంలో ఈ శాపం నీకు వరంలా పరిణమిస్తుంది" అన్నాడు.



కొన్నిరోజుల తరువాత రోమశమహర్షి లోకసంచారం చేస్తూ ఇంద్రలోకానికి వచ్చాడు. ఇంద్రునితోపాటు సింహాసనం అధిష్ఠించివున్న అర్జునుణ్ణి చూసి అలాంటి ఉన్నతస్థాయికి ఎదగడానికి అతడు ఎలాంటి పుణ్యకర్మలు చేశాడా అని విస్తుపోయాడు. అప్పుడు దేవేంద్రుడు "ఈ అర్జునుడెవరైనదీ, ఇక్కడికి ఎందుకు వచ్చిందీ చెబుతాను. ఇతడూ, శ్రీకృష్ణుడూ నరనారాయణులు. నివాతకవచులనే రాక్షసులు దేవలోకాలని నాశనమొనర్చాలని పథకాలు వేస్తున్నారు. దేవతలందరూ ఏకమైనా వారిని జయించలేరు. కానీ అర్జునుడు ఆ అసురులందరినీ తుదముట్టించగలడు. అతడు భూలోకానికి వెళ్ళడానికి ముందు ఈ అసురులందరినీ యుద్ధంలో పరిమారుస్తాడు. మహర్షీ మీరు నాకో సహాయం చేసి పెట్టాలి. ప్రస్తుతం కామ్యకవనంలో ఉంటున్న ధర్మరాజు వద్దకి వెళ్ళి అర్జునుని గురించి దిగులు చెందవద్దని నేను చెప్పినట్లుగా చెప్పండి. దివ్యాస్త్రాలన్నింటినీ అర్జునుడు సంపాదించాడనీ చెప్పండి. తన సోదరులతోనూ, ద్రౌపదితోనూ తీర్థయాత్రలు చేసి పుణ్యం సంపాదించుకోవలసిందిగా ధర్మరాజుకు చెప్పండి" అన్నాడు.

## 7

## అర్జునుడు తమ మధ్య లేనందువల్ల ధర్మరాజు దుఃఖించటం

అర్జునుడు ఇంద్రలోకంలో దేవేంద్రుని అతిథిగా ఆనందంగా కాలం గడుపుతున్నప్పుడు పాండవులు కామ్యకవనంలో ఉన్నారు. అర్జునుడు వారి మధ్య లేకపోవడం వారికి ఎంతో బాధ కలిగించింది. ఆ సమయంలో బృహదశ్వుడనే మహర్షి వారి వద్దకు వచ్చాడు. ధర్మరాజు తన హృదయపరితాపాన్ని ఆయనతో చెప్పుకున్నాడు. "నేనెంత దురదృష్టవంతుణ్ణో! అర్జునుడి కోసం నా హృదయం పరితపిస్తూ ఉంది" అన్నాడు.

ధర్మరాజుని ఓదార్చడానికి మహర్షి నలదమయంతుల కథ చెప్పాడు. "నలుడు ఒంటరిగా అడవుల్లో తిరిగాడు. కానీ నీ సోదరులు, ద్రౌపది నీతో ఉన్నారు. దుఃఖించవద్దు. మళ్ళీ నిన్ను ఎవరైనా జూదమాడడానికి రమ్మని సవాలు చేస్తారేమోనని భయపడుతున్నావా? అక్షహృదయ జూదంలో నేను ఆరితేరినవాణ్ణి. ఆ రహస్యం నీకు నేర్పి నిన్నుకూడా జూదంలో ఆరితేరినవాణ్ణిగా చేస్తాను" అంటూ ఆ విద్యను ధర్మరాజుకు నేర్పి వెళ్ళిపోయాడు.

ధర్మరాజు, తరువాత ధౌమ్యమహర్షితో "అర్జునుని గూర్చిన చింత మమ్ము వేధిస్తూ ఉంది. మా ఆశలన్నీ



అతడి మీదనే ఉన్నాయి. అర్జునుడు కౌరవ సేనలోని గొప్పయోధులందరినీ ఒంటరిగా ఎదుర్కోగల సమర్థుడు. అతడు తప్పక దివ్యాస్త్ర సంపన్నుడై తిరిగి వస్తాడు. కానీ అతడు మా మధ్యలేనంత వరకు ఈ కామ్యకవనంలో మాకు మనశ్శాంతి ఉండదు. అందువల్ల మేము దర్శించవలసిన పుణ్యతీర్థాలను గూర్చి తెలుపండి" అని కోరాడు.

పాండవుల దైన్యతను చూసి ధౌమ్యుడు "నేను మీకు కొన్ని తీర్థక్షేత్రాల గురించి వివరిస్తాను. వాటిని దర్శించడంతో మీకు ఎంతో పుణ్యం చేకూరుతుంది" అన్నాడు.

ధౌమ్యుడు పుణ్యక్షేత్రాలను గురించి వివరిస్తూన్నప్పుడు రోమశ మహర్షి అక్కడికి వచ్చాడు. ఆయన ధర్మరాజుతో "నేను ఈ భూమండలమంతా సంచారం చేసి ఇంద్రుని చూడడానికి ఇంద్రలోకానికి వెళ్లాను. అక్కడ నీ తమ్ముడు అర్జునుణ్ణి చూశాను. అర్జునుడి గురించి ఒక శుభవార్త ఇంద్రుడు నీతో చెప్పమన్నాడు. అర్జునుడు శివుణ్ణి మెప్పించి సాటిలేని పాశుపతాస్త్రం సంపాదించాడు. అంతేగాక సంగీతం, నృత్యం, సామవేదగానం కూడా నేర్చుకున్నాడు. ఇప్పుడు ఇంద్రుడితో ఆనందంగా కాలం గడుపుతున్నాడు. అసురులతో జరుగబోయే యుద్ధంలో దేవతలకు సహాయం చేసి త్వరలో తిరిగి వస్తానని చెప్పమన్నాడు. ఈలోపు మీరు తీర్థయాత్రలు చేసుకోవాలని అతడి అభిలాష. ఇంద్రార్జునుల అభిలాష మేరకు నేను మీతో తీర్థయాత్రలకు వచ్చి, మీకు రక్షణగా ఉంటాను" అని చెప్పాడు.

అర్జునుడి దిగ్విజయాన్ని విన్న పాండవులు ఎంతో సంతోషించారు. రోమశ మహర్షి ఆధ్వర్యంలో తీర్థయాత్రలకు బయలుదేరారు. ఎన్నో పుణ్యనదులలో స్నానమాడి చివరకు వారు ప్రభాస తీర్థం చేరుకున్నారు. ఆ పుణ్యజలాల్లో స్నానం చేసి ధర్మరాజు పితృదేవతలకు



తర్పణాలిచ్చాడు. పన్నెండు రోజులు జలం మాత్రమే తీసుకొంటూ గడిపాడు. తన చుట్టూ మంటలు రగిలించి, ఆ మంటల మధ్యలో కూర్చుని తీవ్రంగా తపస్సు చెయ్యసాగాడు. ఇలా ధర్మరాజు తీవ్ర తపస్సులో ఉన్నప్పుడు బలరామ కృష్ణులు పాండవులను చూడడానికి వచ్చారు. పాండవులు వారిని సంతోషంగా ఆహ్వానించారు. పాండవులు పడే అవస్థలను సహించలేక బలరాముడు, సాత్యకి వెంటనే కౌరవులతో యుద్ధంచేసి వారిని తుదముట్టించాలని అభిప్రాయపడ్డారు. అందుకు శ్రీకృష్ణుడు "నేను మీతో ఏకీభవిస్తున్నాను, కానీ తమ స్వశక్తి ద్వారా జయించని రాజ్యం ధర్మరాజు స్వీకరించడు. కీర్తిప్రతిష్ఠల కోసం అతడు ధర్మాన్ని త్యజించడు. ధర్మరాజు సమ్మతిస్తే మనమందరమూ ఏకమై కౌరవులను జయిద్దాం" అన్నాడు. వారి సంభాషణ విన్న ధర్మరాజు "మీరు అలా మాట్లాడటంలో ఆశ్చర్యం లేదు. నాకు సత్యవ్రతపరిపాలనే అన్నిటికన్న మిన్నయైనది" అన్నాడు. ధర్మజుడి అకుంఠిత సత్యవ్రతదీక్షను అభినందిస్తూ బలరామ కృష్ణులు వారి వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

# 8

## గంధమాదన పర్వతాలకు పాండవుల రాక

రోమశ మహర్షి వెంట పాండవులు గంధమాదన పర్వతాల వైపు ప్రయాణం సాగించారు. కందమూలాలు మాత్రమే స్వీకరిస్తూ గరుకురాళ్ళతో నిండిన ఎగుడు దిగుడు ప్రాంతాలను శ్రమతో దాటుకుంటూ వివిధ జంతుజాలాల్ని చూస్తూ నడకసాగించారు. చివరకు గంధమాదనం చేరుకున్నారు. అది గంధర్వులకు, కిన్నరులకు, సిద్ధులకు, ఋషులకు ఎంతో ఇష్టమైన ప్రదేశం.

గంధమాదన పర్వతాన్ని సమీపిస్తున్నప్పుడు పెనుగాలి వీచగా భూమీ ఆకాశమూ ఏకంచేస్తూ గొప్పధూళి రేగింది. పెద్దపెద్ద చెట్లు నేల కూలాయి. ధూళి దుమారంలో వారికి ఎటు వెళ్ళాలో తెలియలేదు. భీముడూ, ద్రౌపది ఒక మహావృక్షం క్రింద తలదాచుకున్నారు. ధర్మరాజు, ధౌమ్యుడు దట్టంగా ఉన్న చెట్ల క్రింద నిలబడ్డారు. సహదేవుడు ఒక మహాశిల క్రింద తలదాచుకున్నాడు. రోమశుడు, నకులుడు మొదలైనవారు ఒక చెట్టు నీడన అప్రమత్తతతో నిలబడ్డారు. పెనుగాలి వీస్తూనే ఉంది. అంతలో పెద్ద వడగళ్లవాన ప్రారంభమైంది. బ్రహ్మాండమైన వర్షం. అలా ఎంతోసేపు గాలీవానా కురిసి చివరకు ఆగిన తర్వాత అందరూ ఒకచోట చేరి తమ ప్రయాణం సాగించారు.

గరుకురాళ్లతో దారి ఇరుకుగా ఉంది. ద్రౌపది నడవలేక మూర్ఛపోయింది. వెంటనే భీముడు ఆమెను ఎత్తిపట్టుకున్నాడు. ధర్మరాజు ద్రౌపది పడే అవస్థలను చూసి దుఃఖించసాగాడు. ధౌమ్యుడు ఇతర బ్రాహ్మణులు ధర్మరాజును అనునయించారు. అంతలో భీముడు, ఇతరులు చేసిన శైత్యోపచారాలతో ద్రౌపది మూర్ఛనుండి తేరుకుంది. ధర్మరాజు ఆమె దగ్గర కూర్చుని ఓదార్చాడు. తరువాత భీముడితో "తమ్ముడూ, రాళ్ళూ రప్పలతో ఉన్న ఈ దారిలో ద్రౌపది ఇక నడవలేదు" అన్నాడు.



అప్పుడు భీముడు "చింతించకండి! ద్రౌపదిని, మిమ్ములను నా భుజాల మీద ఎక్కించుకొని తీసుకువెళతాను. లేదా మీరు అనుమతిస్తే ఘటోత్కచుణ్ణి పిలిచి మనందరినీ సురక్షితంగా తీసుకువెళ్లమంటాను" అన్నాడు. అందుకు ధర్మరాజు సమ్మతించాడు.

ఘటోత్కచుణ్ణి తలచుకోగానే అతడు ఎదుట ప్రత్యక్షమైనాడు. తండ్రులకు పాదాభివందనం చేసి, భీముని ముందు చేతులు జోడించి నిలబడి "తండ్రీ! ఏమి మీ ఆజ్ఞ?" అన్నాడు. భీముడు కొడుకును కౌగిలించుకున్నాడు. తండ్రి ఆనతిపై పాండవులనూ, ద్రౌపదినీ, ధౌమ్యునీ ఎత్తుకున్నాడు. మిగిలిన బ్రాహ్మణులకు తన సైన్యాన్ని నియోగించాడు. ఇలా అందరూ ఆకాశమార్గంలో మనోరంజకమైన నరనారాయణాశ్రమాన్ని చేరుకున్నారు. అక్కడ ఎంతోమంది ఋషులు ప్రశాంతంగా తపస్సు చేసుకుంటున్నారు. అక్కడి వారికి ఆకలి దప్పులుండవు, శీతోష్ణాలుండవు. ఎలాంటి క్లేశాలు కలుగవు. వేదపారాయణంలో మునిగివున్న ఆ ఋషులు తమ దివ్యశక్తితో పాండవులు అక్కడికి రానున్న విషయం తెలుసుకున్నారు. వనమంతా మెలికలు మెలికలుగా ఉన్న రేగుచెట్ల కొమ్మలతో రమ్యంగా ఉంది. అక్కడ ఎప్పుడూ చల్లగా, నీడగా ఉంటుంది. అదంతా చూసి పాండవులు ఆశ్చర్యపోయారు. వారు అర్జునుని రాక కోసం ఎదురుచూస్తూ అక్కడే ఆరు రోజులు సంతోషంగా గడిపారు.

## 9

## భీముడు హనుమంతుణ్ణి కలుసుకోవడం

ఒకనాడు భీముడు, ద్రౌపది గంధమాదన పర్వతసానువులలో విహరిస్తున్నప్పుడు ఒక సౌంగధికాపుష్పం గాలిలో ఎగురుకుంటూ వచ్చి వాళ్ళ ముందు పడింది. వెయ్యి రేకులతో ఎంతో మృదువుగాను, అందంగా ఉన్న ఆ పద్మాన్ని చూసి "ఒక్క పుష్పమే మనస్సును ఇలా ఆకర్షిస్తూవుంటే మరిన్ని పుష్పాలు ఉంటే ఎంత బాగుంటుందో! దగ్గరలో ఉంటే తెచ్చిపెట్టాలి" అంది ద్రౌపది.

భార్య కోరిక తీర్చడానికి భీముడు వాయువేగంతో బయలుదేరాడు. అతడు పెద్దగా సింహనాదం చేయగా, ఆ గర్జనకు అడవిలోని మృగాలన్నీ భయపడి పారిపోసాగాయి.



ఆ దగ్గరలోనే ఒక గుహలో నిద్రపోతున్న హనుమంతుడు, భీముని సింహనాదం విని లేచాడు. తన తోకను గాలిలోకెత్తి నేల మీద కొట్టాడు. ఆ భీకర శబ్దానికి కొండగుహలు ప్రతిధ్వనించాయి. హనుమంతుడు, భీముణ్ణి తన తమ్ముడిగా గుర్తించి అతడికి ఏ ఆపదా కలుగకుండా హెచ్చరించాలనుకున్నాడు. అరటితోట దారిమధ్యలో ఒక పెద్ద బండ మీద పడుకున్నాడు హనుమంతుడు. అతని పొడవైన తోక దారికి అడ్డంగా ఉంది. ఒక పెద్దకోతి తన దారికడ్డంగా పడుకుని ఉండటం చూసిన భీముడు దాని దగ్గరకు వెళ్ళి పెద్దగా సింహనాదం చేశాడు. హనుమంతుడు మెల్లగా కళ్ళు తెరచి నిర్లక్ష్యంగా భీముని చూస్తూ "ముసలివాణ్ణి! జబ్బుగా ఉన్నవాణ్ణి!నా మానాన నేను నిద్రపోతూవుంటే నన్ను ఇలా లేపుతావెందుకు నీకు కొంచెం జాలికూడా లేదా? నువ్వెవరివో, ఎందుకొచ్చావో ముందుగా చెప్పు. ఇక్కడినుండి ముందుకు వెళ్లటం దుస్సాధ్యం. ఎలాగూ వచ్చావు కాబట్టి కొంత సేద తీర్చుకుని తిరిగి వెళ్లిపో" అన్నాడు. ఆ మాటలకు భీముడు "నేను వాయుపుత్రుడైన భీముణ్ణి, నువ్వు సామాన్యమైన కోతిలా కనబడటం లేదు. నువ్వేదో రాక్షసుడవై ఇలాంటి వేషం ధరించి ఉంటావు" అన్నాడు. అప్పుడు అంజనేయుడు "నువ్వు ముందుకు వెళ్ళడానికి అనుమతించను. తిరిగి వెళ్ళిపోవడమే నీకు శ్రేయస్కరం" అన్నాడు. "ఓ మర్కటమా! మర్యాదగా నాకు దారి ఇవ్వు. లేకపోతే తగిన శాస్తి చేస్తాను" అన్నాడు భీముడు.

ఆ మాటలకు హనుమంతుడు "నాయనా! చాలా జబ్బుతో ఉన్నాను, లేవలేను నువ్వు ముందుకే వెళ్లాలని నిశ్చయించుకుంటే నన్ను దాటుకుని వెళ్లిపో" అన్నాడు.

"దాటి వెళ్లడమా? అందరి శరీరాల్లోను పరమాత్మ ఉంటాడు.



ఆయన్ను అవమానించలేను, లేకపోతే హనుమంతుడు సముద్రం దాటినట్లు నిన్ను దాటి వెళ్లిపోయేవాణ్ణే!" అని దర్పంగా అన్నాడు భీముడు.

"హనుమంతుడా? ఆయనెవరు?"

"ఆయన నా అన్న, మహా బలశాలి. జ్ఞానులలో అగ్రగణ్యుడు. సకల సద్గుణోపేతుడు. నేను కూడా ఆయనంతటి బలశాలినే. అందుకే నా దారికి అడ్డం తొలగు. లేకపోతే నా చేతులలో నీకు మరణం తప్పదు" అన్నాడు భీముడు.

భీముని కాస్త విసిగించాలని "ఓ అలాగా! సరే, నేను ముసలివాణ్ణి, లేవలేను. నా తోకను కొంచెం పక్కకు నెట్టి నీ దారిన నువ్వు వెళ్లిపో నాయనా" అన్నాడు హనుమంతుడు.

భీముడు నిర్లక్ష్యంగా ఎడమచేత్తో తోకను ఎత్తబోయాడు. అతని వల్లకాలేదు. అప్పుడు రెండు చేతులతో తోకను ఎత్తడానికి ప్రయత్నించాడు. కానీ, కుదరలేదు. బలాన్నంతా కేంద్రీకరించి ప్రయత్నించగా, బోర్లాగా పడిపోయాడు. ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. ఎందుకూ చేతకాని వాడిలా సిగ్గుపడిపోయాడు. రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ "అయ్యా మిమ్మల్ని తెలుసుకోకుండా దుర్భాషలాడాను, నన్ను క్షమించి మీ నిజస్వరూపం చూపించండి" అంటూ ప్రార్థించాడు.

హనుమంతుడు తన నిజస్వరూపాన్ని చూపించాడు. "తమ్ముడూ, నేనే హనుమంతుణ్ణి, శ్రీరాముని కీర్తి ఎంతకాలం ఈ భూలోకంలో నెలకొని ఉంటుందో అంతవరకు నన్ను జీవించి ఉండమని శ్రీరాములవారు నాకు వరం ప్రసాదించారు. శ్రీరామనామం సదా వినడం, జపించడమే నా ధ్యేయం నా జీవితం. ఈ మార్గంలో మానవమాత్రులు వెళ్ళలేరు. నేను అన్యులెవ్వరూ నిన్ను శపించకూడదనీ, ఓడించకూడదనీ నిన్ను ఆపాను. నువ్వు వెదుకుతున్న కొలను ఆ దిశలో ఉన్నది" అన్నాడు హనుమంతుడు.

"అన్నా! నీ దర్శనంవల్ల నేను కృతార్థుడినయ్యాను" అంటూ భీముడు, హనుమంతుడికి పాదాభివందనం చేశాడు. "సముద్రం దాటినప్పుడు నువ్వు దాల్చిన మహోన్నతరూపాన్ని చూడాలనే కోరిక నాకు చాలాకాలం నుండి ఉన్నది. దయచేసి నాకా రూపాన్ని చూపించు" అని ప్రార్థించాడు.

భీముడి వినయానికి ముచ్చటపడి ఆంజనేయుడు తాను సముద్ర లంఘనం చేసినప్పటి రూపాన్ని చూపించాడు. అతడి శరీరం మేరుపర్వతంలా పెరిగిపోయింది. దిక్కులను తాకేటంత పొడవైన తోక. మహోన్నతమూ, అద్భుతమూ అయిన ఆ విశ్వరూపాన్ని చూసి భీముడు పాదాభివందనం చేశాడు. తరువాత హనుమంతుడు తన సహజ స్వరూపం ధరించి, కుశలప్రశ్నలతో కొంతసేపు భీముడితో గడిపాడు. భీముడు సెలవు తీసుకొన్నప్పుడు హనుమంతుడు తమ్ముణ్ణి గాఢంగా కౌగలించుకున్నాడు. ఆ స్పర్శతో భీముడికి అంతవరకు పడిన శ్రమంతా తొలగిపోయి, నూతన బలం కలిగింది.



"తమ్ముడూ! నేను ఇక్కడ ఉన్న విషయం ఎవరికీ చెప్పవద్దు. నీకొక వరం ప్రసాదిస్తాను. నువ్వు కోరుకుంటే నేనిప్పుడే హస్తినాపురానికి వెళ్లి ఆ కౌరవులనందర్నీ సర్వనాశనం చేస్తాను. ఆ నగరాన్ని పిండి చేస్తాను, దుర్యోధనుని కాళ్లు చేతులుకట్టి తీసుకువస్తాను" అన్నాడు హనుమంతుడు. "అన్నా! జగదేకవీరుడివైన నీకు ఇదో పెద్దపనా? నీ కృపాకటాక్షంతో మేము నిశ్చయంగా వాళ్ళను పరిమారుస్తాం" అన్నాడు భీముడు.

"మంచిది, అతిరథుడైన అర్జునుడి రథ పతాకం మీద ఉండి యుద్ధాన్నంతా చూస్తూ మిమ్మల్ని ఉత్సాహపూరితుల్ని చేస్తూ ఉంటాను" అంటూ సౌగంధికా సరోవరానికి దారి చూపించి, జాగ్రత్తగా ఉండమని భీముణ్ణి హెచ్చరించి, హనుమంతుడు అంతర్ధానమయ్యాడు.

## 10
## భీముడు సౌగంధికా పుష్పాలను ద్రౌపదికి ఇవ్వడం

ఆంజనేయుణ్ణి కలుసుకున్న ఆనందంతో భీముడు వేగంగా సౌగంధికా సరోవరం వైపు నడిచాడు. అలా వెళుతూ ఒక వెండికొండ సమీపంలో ఉన్న అందమైన ప్రదేశాన్ని చూశాడు. అది కుబేరుడి ఉద్యానవనం. అందులో ఉన్న సరోవరంలో వేలకొలది సౌగంధికా పుష్పాలు వికసించి ఉండడం భీముడు చూశాడు. అనేకమంది యక్షులు ఆ సరోవరాన్ని కాపలా కాస్తున్నారు. వారు భీముణ్ణి చూచి "నీవు ఎవరు? ఇందులో ప్రవేశించడానికి నీకు ఎంత ధైర్యం?" అన్నారు. "నన్ను భీముడు అని అంటారు" అని ధీమాగా అన్నాడు. "ధర్మరాజు తమ్ముణ్ణి, ద్రౌపది కోసమే ఈ పద్మాలు తీసుకు వెళ్లాలని వచ్చాను" అన్నాడు. ఆ యక్షులు కుబేరుని



అనుజ్ఞలేనిదే ఆ పద్మాలు తీసుకోడానికి అనుమతించమన్నారు. అందుకు భీముడు "క్షత్రియులమైన మేము ఒకరి వద్ద ఏదీ యాచించం. కొండవాగులవల్ల రూపొందిన ఈ సరోవరం అందరికీ అందుబాటులో ఉండాలి. కుబేరుడు దీన్ని తవ్వించనప్పుడు అతని సొంతం ఎలా అవుతుంది? అందువల్ల నన్ను ఎవ్వరూ అడ్డగించలేరు" అంటూ పద్మాల కోసం ముందుకు వెళ్లాడు. యక్షులు కోపంతో వివిధాయుధాలు తీసుకొని భీమునిపై కలియబడ్డారు. భీముడు ప్రచండకోపంతో తన మీదికి వచ్చిన వారినందరినీ కొట్టాడు. భయభీతులైన ఆ యక్షులు పారిపోయి ఆ విషయం కుబేరునితో చెప్పారు. అంతా విన్న కుబేరుడు నవ్వుతూ "భీముడు మన స్నేహితుడే, అతణ్ణి కావలసిన పద్మాలను కోసుకోనివ్వండి. ఆతడితో పోట్లాడవద్దు" అన్నాడు. భీముడు తనకు కావలసిన సౌగంధికా పుష్పాలను తీసుకొని బయలుదేరాడు.

భీముడు ఇక్కడ యక్షులతో పోరాడుతుండగా అక్కడ బదరీవనంలో మబ్బులు లేకుండా పిడుగులు పడ్డాయి. కొండలు చలించాయి. ధర్మరాజు ఆ దుర్నిమిత్తాలకు భయపడి ఘటోత్కచుణ్ణి పిలిచి, అతడి భుజాల మీద ఎక్కి తమ్ముళ్ళతో భీముణ్ణి వెదుక్కుంటూ సౌగంధికావనానికి వచ్చాడు. అక్కడ సరోవరం వద్ద తన చేతులనిండా సౌగంధికా పుష్పాలతో ఆనందంగా కూర్చుని ఉన్న భీముణ్ణి చూశాడు. అతడి చుట్టూ అనేకమంది యక్షులు చనిపోయి ఉండటం చూసిన ధర్మరాజు "తమ్ముడూ, నిజంగా నీకు నా మీద ప్రేమ ఉంటే ఇకముందు ఇలాంటి పనులు చేయవద్దు" అని హిత బోధచేశాడు. అంతలో కుబేరుడు అక్కడికి వచ్చాడు. ఆయన కోరికమేరకు పాండవులు అక్కడ కొంతకాలం గడిపారు. ధర్మరాజు ఉత్తరదిక్కుకేసి తమ యాత్ర కొనసాగిస్తామని భీమునితో అంటూ ఉండగా అశరీరవాణి ఇలా పలికింది: "ముందుకు వెళ్లకండి నరనారాయణ ఆశ్రమానికి తిరిగి వెళ్ళండి. త్వరలోనే మిమ్మల్ని అర్జునుడు కలుసుకుంటాడు." ఆ ప్రకారమే వాళ్లు నరనారాయణ ఆశ్రమానికి తిరిగి వచ్చేశారు.

ఇలా ఉండగా ఒక రోజు జటాసురుడనే రాక్షసుడు బ్రాహ్మణ వేషం ధరించి వచ్చి, భీముడు లేని సమయం కనిపెట్టి ధర్మరాజుని ద్రౌపదినీ, నకుల సహదేవుల్నీ, ఆకాశమార్గంలో ఎత్తుకొని పారిపోసాగాడు. వాడి పట్టునుండి ఎలాగో తప్పించుకున్న సహదేవుడు భీముని కోసం ఎలుగెత్తి పిలువసాగాడు. "దురాత్మా! ఈ దుశ్చర్యతో నీ పుణ్యం నశిస్తుందని తెలియదా? ధర్మసమత్వాన్ని తలక్రిందులు చేశావు? ధర్మం యక్షులతో సహా అందరికీ సమానంగా వర్తిస్తుంది" అన్నాడు రాక్షసుడితో, ధర్మరాజు.



అంతలో గాలిలా దూసుకుంటూ భీముడు వచ్చి జటాసురుడితో యుద్ధానికి దిగాడు. భయంకరంగా వారి మధ్య యుద్ధం సాగింది. వారి తాకిడికి మహావృక్షాలు నేలకూలాయి; భూమి కంపించింది. చివరకు జటాసురుడి బలం తగ్గుముఖం పట్టింది. భీముడు వాడి మెడ కుంగిపోయేట్లు గుద్దాడు. పెద్ద పిడుగు పడితే విరిగిపడే నల్లటి కొండ శిఖరంలా జటాసురుడు క్రింద పడిపోయాడు. పడగానే భీముడు కళేబరాన్ని పైకెత్తి పెద్దబండరాయి మీద విసిరికొట్టాడు. జటాసురుడి శరీరం నజ్జునజ్జు అయింది. ఆ విధంగా భీముడు ఆ రాక్షసుడి బారినుండి తన సోదరులను, ద్రౌపదిని కాపాడాడు.

## 11
## అర్జునుడు తిరిగి రావడం

పాండవులు ఐదు సంవత్సరాల కాలం ఈ రకంగా వనవాసం చేస్తూ గడిపారు. కందమూలాలు తింటూ, రోమశ మహర్షి వినిపించే గాథలను వింటూ కాలం గడుపుతూ, అర్జునుడి రాక కోసం ఎదురుచూడసాగారు. ఒకనాడు ఆకాశంలో అకస్మాత్తుగా వెయ్యి మెరుపులతో పెద్ద వెలుగు కనబడింది. చూస్తూవుండగానే ఒక బంగారు రథం దేవలోకం నుండి గంధమాదనం మీద దిగింది. మాతలి రథం నడుపుతున్నాడు. రథం మీద అర్జునుడు సూర్యునిలా ప్రకాశిస్తున్నాడు. అర్జునుడు రథం దిగి ధర్మరాజు, భీములకు ప్రణమిల్లాడు. నకుల సహదేవులు అర్జునుడికి నమస్కరించారు.



అందరూ మహానంద భరితులయ్యారు. అర్జునుడి చుట్టూ అంతా కూర్చున్నారు. అంతలో వెలుపల పెద్దగా దేవదుందుభులు మ్రోగాయి. అప్పుడు దేవగణాలతో దేవేంద్రుడు పాండవులను చూడడానికి వస్తూన్నాడు. పాండవులు ఆయనను ఎంతో ఆదరంగా ఆహ్వానించారు. వారి నందరిని అభినందించి "ధర్మరాజా! నీ తమ్ముడు దివ్యాస్త్రాలు సంపాదించాడు. మీ కష్టాలన్నీ తీరిపోతాయి. ఇక శత్రువులను చూసి భయపడాల్సిన పనిలేదు. అర్జునుడు తిరిగి వచ్చాడు కాబట్టి మీరు కామ్యకవనానికి వెళ్ళిపోవచ్చు. అర్జునుడు నా నుంచి దివ్యాస్త్రప్రయోగాల్లో ఆరితేరాడు. శివుణ్ణి మెప్పించి పాశుపతం సంపాదించాడు. ఈ ముల్లోకాల్లోను అతణ్ణి జయించే వీరుడు లేడు" అంటూ వారినందరినీ సంతోషపరుస్తూ దేవేంద్రుడు వెళ్ళిపోయాడు.

ఇంద్రుడు వెళ్ళిన తరువాత పాండవులందరూ అర్జునుడి చుట్టూ కూర్చుని అతడి అనుభవాలను వివరించమన్నారు. అర్జునుడు ఇలా చెప్పసాగాడు: "ఇంద్రలోకంలో నేను ఎంతో ఆనందంగా ఉన్నాను. అమరేంద్రుడు ఒక రోజు 'నువ్వు నాకో సహాయం చెయ్యాలి. సముద్రగర్భంలో నివాతకవచులనే మూడు కోట్లమంది రాక్షసులున్నారు. వాళ్లెప్పుడూ దేవతలను బాధిస్తూ ఉంటారు. వారిని నువ్వు పరిమార్చాలి' అన్నాడు. ఒక రత్నాల కిరీటం నా తలమీదవుంచి 'ఈ రోజునుండి ఈ కిరీటం వలన నీకు 'కిరీటి' అని పేరు కలుగుతుంది' అన్నాడు. ఋషులు నన్ను ఆశీర్వదించగా, దేవేంద్రుడు నాకు తన రథాన్ని ఇచ్చి, మాతలిని సారథ్యం చెయ్యమన్నాడు. నేను ఆ రాక్షసులను జయించడానికి బయలుదేరాను. సముద్రగర్భానికి వెళ్ళి పెద్దపెద్ద సౌధాలతోను, విశాలమైన వీథులతోనూ ఉన్న రాక్షసనగరాన్ని చూశాము. నేను ఆ నగర ద్వారం వద్ద ఆగి, దేవదత్తం పూరించాను. ఆ శంఖారావం వింటూనే యావన్మంది రాక్షసులూ వివిధాయుధాలతో పరుగెత్తుకొచ్చారు. మాయాయుద్ధంలో ఆరితేరిన ఆ రాక్షసులు నాతో మాయాయుద్ధానికి తలపడ్డారు. రాక్షస మాయలను పటాపంచలు చెయ్యడానికి నేను ఎన్నో దివ్యాస్త్రాలు ప్రయోగించి చివరకు 'మోహిని' అస్త్రం ప్రయోగించి వారి మాయలనన్నీ నాశనంచేశాను. తరువాత వారు నాతో ప్రత్యక్ష యుద్ధానికి తలపడ్డారు. గాండీవంతో విరామం లేకుండా బాణాల జడివాన కురిపించాను. కొండలు పడినట్లు నివాతకవచులు కుప్పలుగా పడి చనిపోయారు. కన్నుమూసి తెరచే లోపల వేలమందిపడుతూ ఉండగా భూమి గడగడలాడింది. చివరకు అందరూ హతమైపోయారు. మాతలి నన్నెంతో ప్రశంసిస్తూ 'ఇలాంటి యోధుణ్ణి నేనింతవరకు చూడనేలేదు' అన్నాడు.



"నివాతకవచులను హతమార్చిన పిమ్మట వారి నగరాన్ని చూడడానికి వెళ్లాము. ఆ నగరం ఎంతో రమ్యంగా ఉంది. 'ఈ నగరం ఒకప్పుడు ఇంద్రుడిది. కానీ నివాతకవచులు తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి ఆ నగరాన్ని తమ పరం చేసుకున్నారు' అన్నాడు మాతలి.

"మేము తిరిగి వస్తున్నప్పుడు దారిలో ఒక విచిత్రమైన పట్టణం కనిపించింది. అది గాలిలో తేలే హిరణ్యపురం. పూర్వం పులోమ, కలక అనే ఇద్దరు దైత్యమహిళలు బ్రహ్మ గురించి తపస్సు చేసి తమ కుమారులైన పౌలోమ కాలకేయులు దేవతల వలన చావకూడదనీ, వారి కోసం అందమైన బంగారునగరం ప్రసాదించమనీ కోరుకుంది. వాళ్లతో యుద్ధం చేయమని మాతలి నన్ను ప్రోత్సహించాడు. వారిని యుద్ధానికి పిలవగా అరవై వేల మంది పౌలోమ కాలకేయులు ఒక్కసారిగా నా మీద విరుచుకుపడ్డారు. వారితో పోరాడటం దుస్సహమనిపించింది. చివరకు పరమేశ్వర ప్రసాదితమైన పాశుపతాస్త్రం ప్రయోగించాను. అమోఘమైన ఆ దివ్యాస్త్ర ప్రభావంతో అరవై వేల మంది పౌలోమ కాలకేయులు క్షణమాత్రంలో హతమైపోయారు.

"అటుపిమ్మట అమరావతికి తిరిగివచ్చి దేవేంద్రునితో కొంతకాలం ఆనందంగా గడిపాను. కానీ, మిమ్మల్ని చూడాలనే గాఢమైన తపన నాలో మిగిలిపోయింది. మీ సాన్నిధ్యంతో ఆ దేవలోక సుఖాలు తులతూగవు. ఇప్పుడు నేను ఎంతో ఆనందంగా ఉన్నాను."

"మన శ్రమ ఫలించింది. మనం కృతార్థులమయ్యాము. నీకు ఇంద్రుడు ప్రసాదించిన దివ్యాస్త్రాలు మాకు చూపించు" అన్నాడు ధర్మరాజు.

అర్జునుడు ప్రతి ఒక్క దివ్యాస్త్రాన్నీ తీసి అందరికీ చూపించాడు. తరువాత వాటిని ప్రయోగించి చూపడానికి పూనుకున్నప్పుడు భూమండలం కంపించింది. సముద్రాలు అల్లకల్లోలమైపోయాయి. సూర్యబింబం మాసింది. సుడిగాలులు వీచాయి. జంతుజాలమంతా భీతిల్లింది. మెరుపులా అక్కడకి నారదుడు వచ్చి "అర్జునా! ఆగు! ఎదుట శత్రువు లేకుండా ఈ అస్త్రాలను ప్రయోగించటం ఘోరం. ఇవి అమోఘమైన శక్తి గలవి. వాటిని కారణం లేకుండా ప్రయోగిస్తే ముల్లోకాలను నాశనంచేస్తాయి" అని వారించాడు. అంతటితో అర్జునుడు ఆ ప్రయత్నం విరమించాడు. నారదుడు తనదారిన వెళ్లిపోయాడు.



## 12

## భీముణ్ణి కొండచిలువ పట్టుకోవడం

పది రోజులు అక్కడ గడిపాక రోమశమహర్షి, అరిష్టసేన మహర్షి సలహాల మేరకు పాండవులు ముందుకు బయలుదేరారు. హిమాలయ మహారణ్యాలలో భీముడు ఒక రోజు వేటకు వెళ్లి తిరుగుతూ ఉండగా హఠాత్తుగా ఒక కొండచిలువను చూశాడు. తనకేమైనదీ తెలుసుకొనేలోపే అది భీముణ్ణి పట్టుకుని చుట్టేసింది. ఆ మహాసర్పం అతణ్ణి చుట్టుకోగానే అతడు సర్వశక్తులూ కోల్పోయాడు. అంత మహాబలం ఆ కొండచిలువకు ఎలా వచ్చిందో ఆశ్చర్యపోతూ "నువ్వెవరు? నేను భీముణ్ణి. వెయ్యి ఏనుగుల బలం కలవాడిని, అలాటి నన్ను ఎలా పట్టుకోగలిగావు?" అని అడిగాడు.

తన పట్టును సడలించకుండా ఆ కొండచిలువ ఇలా చెప్పింది: "చాలాకాలంగా నేను ఆకలితో ఉన్నాను. నా అదృష్టం కొద్దీ నువ్వు దొరికావు. ఇక నా కథ అంటావా! అదొక పెద్ద ఉదంతం. నేను నహుషుడనే చక్రవర్తిని. మీ పూర్వీకులకు పూర్వుణ్ణి. ఇంద్రుడితో సమానమైనవాడిని, ఐశ్వర్య మదంతో అగస్త్యమహర్షిని అవమానించాను. ఆయన కోపంతో నన్ను కొండచిలువగా పుట్టమని శపించాడు. ఆయన శాపంతో ఇంద్రపదవి కోల్పోయి క్రిందపడిపోతూ శాపవిమోచనం ఎలా కలుగుతుందో చెప్పమన్నాను. ఆయన కరుణించి 'నువ్వు భూలోకంలో చాలా కాలం ఉంటావు. ఒకనాడు నీవు అడిగే ప్రశ్నలన్నిటికీ జవాబు చెప్పే మహాత్ముణ్ణి కలుసుకుంటావు, అప్పుడు నీకు శాపవిమోచనం కలుగుతుంది' అన్నాడు."



కొండచిలువ రూపంలోని నహుషుడితో అప్పుడు భీముడు ఇలా అన్నాడు: "నేను నిన్ను కోపగించుకోవడం లేదు. విధిని ఎవరూ తప్పించుకోలేరు. నా సంగతే చూడు. మహాబలవంతుడినైన నేను నీకు చిక్కి, ఈ అవస్థకు వచ్చాను. నా చావును గురించి విచారించడం లేదు. రాజ్యం పోగొట్టుకుని ఘోరమైన ఈ కారడవుల్లో ఆకులు అలములు తింటూ, నా అన్నదమ్ములు తిరుగుతున్నారు. నన్ను చూడకుండా ఎంత దుఃఖిస్తున్నారో అని విచారిస్తున్నాను."

అక్కడ ధర్మరాజుకి ఎన్నో దుర్నిమిత్తాలు కనబడ్డాయి. భీముడు కనిపించకపోవడంతో అతణ్ణి వెతుక్కుంటూ వెళ్ళాడు. భీముడి అడుగుజాడలు చూసుకుంటూ వెళ్లి, ఆతణ్ణి ఒక కొండచిలువ పట్టుకుని ఉండటం చూసి నిశ్చేష్టుడయ్యాడు ధర్మరాజు. "తమ్ముడూ! ఏమిటీ వైపరీత్యం! ఈ పెద్దపాము నిన్ను ఎలా పట్టుకుంది" అని ప్రశ్నించి, జరిగినదంతా తెలుసుకున్నాడు.

అప్పుడు ధర్మరాజు "ఓ సర్పరాజా! నా తమ్ముణ్ణి విడిచిపెట్టు. నీకు కావలసినంత ఆహారం నేను సమకూర్చి పెడతాను" అన్నాడు.

అందుకా కొండచిలువ "నీ తమ్ముడే నాకు ఆహారం. నువ్వు ఇక్కడనుండి వెళ్లిపో. లేకపోతే నిన్నుకూడా పట్టుకొని రేపటికి ఆహారంగా చేసుకుంటాను. నేనడిగే ప్రశ్నలకు నువ్వు జవాబు చెబితే నీ తమ్ముణ్ణి విడిచిపెడతాను" అన్నది.

ధర్మరాజు "నీ ప్రశ్నలేమిటో అడుగు. జవాబు చెప్పడానికి ప్రయత్నిస్తాను" అన్నాడు.

కొండచిలువ ప్రశ్నలడగసాగింది: "బ్రాహ్మణుడు ఎవరు?"

"సత్యము, దయ, దానము, క్షమ, సత్ప్రవర్తన, అహింస, తపస్సు ఉన్నవాడే బ్రాహ్మణుడు."

"ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కరూ తెలుసుకోదగిన దేది?"

"సుఖదుఃఖాలకు అతీతమైనదీ, తెలుసుకున్న తర్వాత వాటిని కలగనీయనిదీ అయిన పరబ్రహ్మమే తెలుసుకోతగింది."

ఆ కొండచిలువ రూపంలోని నహుషుడు ఇలా వర్ణాశ్రమ ధర్మాలను గురించి, ధర్మం గురించి ఎన్నో ప్రశ్నలు వేశాడు. వాటన్నిటికీ ధర్మరాజు సంతృప్తికరంగా సమాధానాలిచ్చాడు. ఆ సమాధానాలు విన్న నహుషుడు ఇలా అన్నాడు: "నువ్వు నా ప్రశ్నలన్నిటికీ తృప్తికరంగా సమాధానాలిచ్చినందువల్ల నేను శాపవిముక్తుడినవుతున్నాను. నేను గర్వాంధుడినై మహర్షులచేత నా పల్లకీ మోయించాను. ఒకసారి అగస్త్యమహాముని నా పల్లకీ మోస్తున్నప్పుడు ఆయన్ను ఘోరంగా అవమానించగా కోపంతో రుద్రుడై నన్ను శపించాడు.

"ఆ శాపకారణంగా నేను కొండచిలువనయ్యాను. శాపవిమోచనం కోరితే ధర్మరాజు వచ్చి నిన్ను శాపంనుండి విముక్తుణ్ణి చేస్తాడని చెప్పాడు. ఇక నీ తమ్ముణ్ణి తీసుకువెళ్లు." చూస్తూ ఉండగానే సర్పశరీరం వదలిపెట్టి నహుషుడు దివ్యశరీరంతో స్వర్గానికి వెళ్లిపోయాడు.



# 13
# శ్రీకృష్ణుని పునరాగమనం

వృషపర్వుని ఆశ్రమంలో సుమారు ఒక సంవత్సరకాలం గడిపి, పాండవులు ద్వైతవనానికి తిరిగి వచ్చి అటుపిమ్మట కామ్యకవనానికి వెళ్లిపోయారు. పాండవులు కామ్యకవనంలో సాధుసాంగత్యంలో కాలం గడుపుతున్నప్పుడు సత్యభామతో శ్రీకృష్ణుడు పాండవులను చూడడానికి వచ్చాడు. శ్రీకృష్ణ దర్శనంతో పాండవులు ఎంతో ఆనందించారు. శ్రీకృష్ణుడు ద్రౌపదితో "సుభద్ర, అభిమన్యులు బాగున్నారు. అభిమన్యుడు విలువిద్యలో తండ్రిని మించేలా ఉన్నాడు" అన్నాడు. తరువాత ధర్మరాజు వైపు తిరిగి "అంధకులూ, వృష్ణికులూ, భోజులూ, కుకురులూ యావన్మందీ కౌరవులను పరిమార్చడానికి సిద్ధపడుతున్నారు" అన్నాడు.

అందుకు ధర్మరాజు "నీ శరణుజొచ్చిన మాకు కష్టమేముంటుంది కృష్ణా?" అని ఆనందంగా అన్నాడు. "వనవాసం దాదాపు పూర్తికావస్తూ ఉంది. ఈ అరణ్యవాసం తరువాత అజ్ఞాతవాసం కూడా పూర్తిచేసుకుని, ఏ దోషమూ లేకుండా శత్రువులను జయించడానికి పూనుకుంటాము. ఇదంతా నిర్వహించే భారం మాత్రం నీదే" అని అన్నాడు.

ఆ సమయంలో మార్కండేయ మహర్షి పాండవులను చూడడానికి వచ్చాడు. కృష్ణుడు పాండవులకు దేవతల గాథలూ, రాజుల చరిత్రలూ మొదలైనవి చెప్పమని ఆయనను ప్రార్థించాడు. అప్పుడే నారదుడు కూడా అక్కడకు వచ్చాడు. అందరూ మార్కండేయ మహర్షి చుట్టూ కూర్చుని ఆయన వినిపించే గాథలు వినసాగారు. ఆయన వారికి యుగధర్మం



గురించీ, మహావిష్ణువు అవతారాలను గురించీ, జ్ఞాన ప్రాశస్త్యం గురించీ వివరించాడు. కుమారస్వామి అసురులతో చేసిన యుద్ధం గురించి కూడా వివరించాడు.

శ్రీకృష్ణుడు, సత్యభామ పాండవులతో కొంతకాలం గడిపి ద్వారకకు తిరిగి వెళ్లిపోయారు.

# 14
# దుర్యోధనుడి పన్నాగం

అరణ్యంలో పాండవులను చూసివచ్చిన ఒక బ్రాహ్మణుడు ఒక రోజు ధృతరాష్ట్రుని వద్దకు వచ్చాడు. పాండవుల సంక్షేమం గురించి ధృతరాష్ట్రుడు విచారించాడు. పాండవులు అనుభవిస్తున్న కష్టాలను గురించీ, భీముడి బలం గురించీ, అర్జునుడు శివుణ్ణి మెప్పించి పాశుపతాస్త్రం సంపాదించిన విషయమూ ఆ బ్రాహ్మణుడు తెలిపాడు. అతడు వెళ్లిన తరువాత, తాను పాండవులకు చేసిన అన్యాయం తలుచుకొని ధృతరాష్ట్రుడు దుఃఖించాడు. కానీ, దుర్యోధనుడికి అది నచ్చలేదు. అతడు తనకు కర్ణుడు, శకునులతో పెద్దబలగం ఉందనీ, పాండవుల పరాక్రమం గురించి భయపడనక్కరలేదనీ ధృతరాష్ట్రునికి నచ్చచెప్పే ప్రయత్నం చేశాడు.

పాండవులకు కీడొనరించడానికి దుర్యోధనుడు, శకుని, దుశ్శాసనుడు మరో పన్నాగం పన్నారు.

శకుని వారితో ఇలా అన్నాడు: "ప్రస్తుతం పాండవులు ద్వైతవనంలోని ఒక సరోవరప్రాంతంలో నివసిస్తున్నారు. తన శత్రువు సంపదలనూ, వైభవాన్నీ కన్నులారా చూడడం కన్నా ఈ ప్రపంచంలో బాధాకరమైన విషయం ఇంకొకటి ఉండదు. మనం కామ్యక వనానికి ఉల్లాసయాత్రకోసం వెళ్ళి, కొన్ని రోజులు అక్కడ గడుపుదాం. స్త్రీ పరివారంతో వెళదాం. మన వైభవాన్నీ, సంతోషాన్నీ చూసి పాండవులు కోపంతోనూ, అసూయతోనూ మండిపోతారు."

ఈ మాటలకు దుర్యోధనుడు ఎంతో సంతృప్తి పొందాడు, కాని సందేహించాడు. "నువ్వన్నది యథార్థమే, కాని నా తండ్రికి వాళ్లంటే ఇష్టం. ఆయన అనుమతికోసం నేను వెళ్ళను. మరో ఆలోచన చేద్దాం" అన్నాడు దుర్యోధనుడు.

మరునాడు ఉదయం దుర్యోధనుని వద్దకు కర్ణుడు నవ్వు ముఖంతో వచ్చి ఇలా అన్నాడు: "ఈ ఉపాయం ఎలా ఉందో ఆలోచించు? మన ఆవులమంద ద్వైతవన ప్రాంతంలో మేస్తూవుంది. వాటిని పరిశీలించే పని మీద మనం అక్కడకు వెళదాం. దీనికి నీ తండ్రి తప్పక సమ్మతిస్తాడు." శకుని ఈ పథకానికి ఆనందంగా సమ్మతించాడు. ఆవుల మందను తక్షణమే పరిశీలించాల్సిన ఆవశ్యకతను వివరించడానికి సామంగుడనే ఆవులకాపరిని ధృతరాష్ట్రుని వద్దకు పంపారు.

"మనం పూర్తిగా ఆవుల కాపరుల మీదనే ఆధారపడకూడదు. అప్పుడప్పుడు మనం కూడా వెళ్లి ప్రత్యక్షంగా చూసుకోవాలి. కానీ, పాండవులు ఆ ప్రాంతంలోనే ఉన్నట్లు నేను అనుకుంటున్నాను" అన్నాడు ధృతరాష్ట్రుడు.

ఆ మాటలకు శకుని "మనం వెళ్ళేది పాండవుల గురించి కాదు. ఏ విధంగానూ వారి ఉనికికి భంగం కలిగించం" అన్నాడు.

చివరికి ధృతరాష్ట్రుడు అనుమతించగా దుర్యోధనుడు పెద్దపరివారంతో బయలుదేరాడు. అతడితో దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని, వారి భార్యలతో సహా అనేక మంది స్త్రీలూ, పెద్ద సైన్యం కూడా బయలుదేరింది.

## 15

## ధర్మరాజు సహృదయత

వాళ్ళు ఆలమందలున్న ద్వైతవన ప్రాంతంలో శిబిరాలు వేసుకొన్నారు. దుర్యోధనుడు ఆవులమందలను పర్యవేక్షించి, దూడలను లెక్కించాడు. తరువాత తన పరివారాన్ని వినోదక్రీడా భవనాలను నిర్మించమన్నాడు.

కానీ, అరణ్య సరిహద్దులో సైనికులకు అడ్డుగా గంధర్వులు బారులుతీరి ఉన్నారు. సైనికులు ఈ విషయం దుర్యోధనుడికి విన్నవించగా ఆ గంధర్వులను దుర్యోధనుడు ఎదుర్కోమన్నాడు. గంధర్వులు తమ రాజైన చిత్రసేనుడి ఆజ్ఞతో దుర్యోధనుడి సైన్యంతో యుద్ధం చేయగా దుర్యోధనుడి సైనికులు చెల్లాచెదరయ్యారు. కర్ణుడు ఒక్కడే గంధర్వుల ధాటిని ఎదుర్కొని నిలిచి పోరాడాడు. వాళ్ళు కర్ణుణ్ణి కత్తులతో, గొడ్డళ్ళతో, శూలాలతో పొడిచారు. కర్ణుడి రథం కాడి, పతాకధ్వజాన్ని విరుగగొట్టారు. కర్ణుడు ప్రాణరక్షణార్థం పారిపోయాడు. దుర్యోధనుడు కొంతసేపు యుద్ధం చేశాడు కానీ, అతడి రథంకూడా విరిగింది. నేల మీద నిలబడే యుద్ధం చెయ్యసాగాడు. అప్పుడు చిత్రసేనుడు అతడి మీదకు దుమికి, అతణ్ణి పట్టుకున్నాడు. పరివార సమేతంగా దుర్యోధనుడు బంధితుడయ్యాడు. కొంతమంది సైనికులు ధర్మరాజు ఉన్న ఆశ్రమానికి పరుగెత్తుకుని వెళ్లి ధర్మరాజుతో "గంధర్వులు దుర్యోధనుణ్ణి బంధించారు; స్త్రీలను కూడా వదలిపెట్టలేదు. మీరు ఎలాగైనా వారిని కాపాడండి" అన్నారు. ఆ మాటలు విన్న భీముడు "మంచిది, ఈ వార్త నాకు ఆనందాన్ని కలుగచేస్తుంది. మమ్మల్ని పరిహాసం చేసేందుకు దుర్యోధనుడు పన్నిన దుష్టపథకానికి ఇది ఫలితం. మా సహాయార్థం వచ్చేందుకు ఈ ప్రపంచంలో ఒక్కడైనా ఉన్నాడని తెలుసుకోవడం జరిగింది. దురాత్ముడైన దుర్యోధనుడు తగిన ఫలితాన్నే అనుభవించాడు" అన్నాడు.



కానీ ధర్మరాజు, భీముణ్ణి వారిస్తూ "ఇది వైషమ్యం చూపాల్సిన సమయం కాదు. వారు మన సహాయం కోరారు. వారు మన శత్రువులే అయివుండవచ్చు. కానీ మూడో వ్యక్తి ముందు మనం ఐకమత్యంగా ఉండాలి. గంధర్వరాజుకు మనం ఇక్కడ నివసిస్తున్న విషయం తెలిసే ఉంటుంది. మనల్ని అతడు అవమానించాడు. ఆయుధాలు ధరించి, వెంటనే వెళ్లి దుర్యోధనుణ్ణి కాపాడి, మన కుల గౌరవాన్ని కాపాడు" అన్నాడు.

వెంటనే అర్జునుడు అంగీకరించి, భీముడు ఇతరులతో యుద్ధం జరిగే చోటుకు వెళ్లాడు. "దుర్యోధనుణ్ణి వెంటనే విడిచిపెట్టండి" అంటూ అర్జునుడు కేకపెట్టాడు. ఆ మాటలకు గంధర్వులు నవ్వుతూ "మా రాజు చిత్రసేనుడి ఆజ్ఞలు తప్ప ఇతరుల ఆజ్ఞలను మేము పాటించం" అన్నారు. వెంటనే అర్జునుడు చాలామంది గంధర్వులను హతమార్చాడు.



నలుగురు అన్నదమ్ముల రథాలను గంధర్వులు నుగ్గునుగ్గు చేశారు. పైకి ఎగిరిపోతున్న గంధర్వుల మీదికి పాండవులు బాణవర్షం కురిపించారు. చిత్రసేనుడు తమ మీద ప్రయోగించిన ఆయుధాలను అర్జునుడు



తన బాణప్రయోగంతో నివారించాడు. అటు తరువాత చిత్రసేనుడు మాయా యుద్ధానికి దిగాడు. అతడు ఆకాశంలో అదృశ్యుడై, కనిపించకుండా బాణాలు ప్రయోగించసాగాడు. ఈ చర్యకు అర్జునుడు ఏమాత్రం జంకలేదు. అతడు దివ్యాస్త్రాలు ప్రయోగించగా చివరికి చిత్రసేనుడు క్రిందికి దిగివచ్చి "అర్జునా! నీతో నీ మిత్రుడే యుద్ధం చేస్తున్నాడు" అన్నాడు.

వెంటనే అర్జునుడు దివ్యాస్త్రాలను ఉపసంహరించాడు. చిత్రసేనుడు, అర్జునుడు, మిగిలినవారు తమ తమ రథాలలో ఆసీనులై క్షేమసమాచారాలు విచారించరు. "కౌరవులను శిక్షిస్తే నీకేం లాభం?

దుర్యోధనుణ్ణి ఎందుకు బంధించావు?" అని చిత్రసేనుణ్ణి, అర్జునుడు అడిగాడు. అందుకు చిత్రసేనుడు ఇలా అన్నాడు "ఓ అర్జునా! ఇక్కడికి రావటంలో దురాత్ములైన దుర్యోధనుడి, కర్ణుడి ఆంతర్యం నాకు తెలుసు. మిమ్మల్ని, ద్రౌపదిని పరిహసించడానికే వారు ఇక్కడికి వచ్చారు. ఇంద్రుడు మీకు సహాయం చేయమని నన్ను ఆజ్ఞాపించగా నేనిక్కడికి వచ్చాను. ఈ దురాత్ముల్ని గొలుసులతో బంధించి ఇంద్రుడి వద్దకు తీసుకెళతాను."

"నువ్వు నాకేదన్నా సహాయం చెయ్యాలనుకుంటే, వెంటనే దుర్యోధనుణ్ణి బంధవిముక్తుణ్ణి చెయ్యి. ఇది నా అన్నగారి ఉత్తరువు" అన్నాడు అర్జునుడు. వాళ్లందరూ ధర్మరాజు వద్దకు వెళ్ళారు. ధర్మరాజు దుర్యోధనాదులను విడిచిపెట్టమని చిత్రసేనుణ్ణి కోరాడు. తరువాత దుర్యోధనుణ్ణి మందలిస్తూ "మళ్ళీ ఎప్పుడూ ఇలాంటి పని చేయకు. ఆనందంగా నీ రాజధానికి తిరిగి వెళ్ళిపో" అన్నాడు. అవమానభారంతో, జీవితం మీద విరక్తితో దుర్యోధనుడు తన రాజధానికి బయలుదేరాడు. ధర్మరాజు ఉదాత్తచర్యను బ్రాహ్మణులు ప్రశంసించగా, సంతోషంగా ద్వైత వనంలో కాలం గడపసాగాడు.

## 16
## ఊరడిల్లని దుర్యోధనుడు

పచ్చిక, నీరు ఎక్కువగా లభించే ప్రదేశంలో దుర్యోధనుడు శిబిరం ఏర్పాటు చేసుకొన్నాడు. ఆనాటి రాత్రి కర్ణుడు వచ్చి దుర్యోధనుడితో ఇలా అన్నాడు: "ఓ దుర్యోధనా! నువ్వు బ్రతికి ఉండటమూ, మనిద్దరం తిరిగి కలుసుకోవడమూ అదృష్టమే. నువ్వు గంధర్వులను జయించటం మంచికే జరిగింది. ఆ గంధర్వుల ధాటికి నిలబడలేక నేను యుద్ధరంగం నుండి పలాయనమైనాను. నువ్వు నేడొనర్చినది ప్రపంచంలో వేరెవరూ చేయలేరు." ఆ మాటలు విని దుర్యోధనుడు ఇలా అన్నాడు: "నీ కసలు జరిగినదేమిటో తెలియదు కాబట్టి, నీ మీద నాకు కోపం లేదు. మేం గంధర్వుల బందీలమైనాము. పాండవులు



వచ్చి మమ్మల్ని బంధవిముక్తులను చేశారు. ఈ పరాభవం భరించటంకంటే ఆ యుద్ధరంగంలో మరణించి ఉంటేనే బాగుండేది. నన్ను ఒంటరిగా ఒదిలిపెట్టు. సౌశీల్యం, సంపద, స్నేహం, రాజరికం మొదలైనవాటితో నాకేం పనిలేదు. ఇక్కడ ఆమరణ నిరాహారదీక్ష చేయబోతున్నాను."

కర్ణుడు అతణ్ణి ఓదార్చడానికి శతవిధాలా ప్రయత్నించాడు. కానీ దుర్యోధనుడు ఓరడిల్లలేదు. అతడు తనకు సంభవించిన పరాభవం గురించి విచారిస్తూ దుశ్శాసనుడితో, "ఓ దుశ్శాసనా, నిన్ను ఇప్పుడే రాజుగా అభిషేకిస్తాను. కర్ణుడు, శకుని రక్షణతో ఈ భూమండలాన్ని పరిపాలించు" అన్నాడు. దుర్యోధనుడు ఆ మాటలు పలికి స్నానమాచరించి, దర్భల మీద ఆసీనుడై, బాహ్య ప్రపంచంతో అన్ని సంబంధాలు తెంపుకొని, తపస్సుకు పూనుకున్నాడు.

దుశ్శాసనుడు ఏడుస్తూ అన్నగారి కాళ్ళుపట్టుకున్నాడు. శకుని ఇద్దరి మధ్యకు వచ్చి "కర్ణుని మాటలు వినండి, ఎంతో కష్టం మీద నేను సంపాదించిన

ఐశ్వర్యాన్ని ఇలా ఎందుకు కాలరాచుకుంటారు? నిరాహారదీక్ష వల్ల ప్రయోజనం లేదు; ఇప్పటివరకు మీరు చేసిన దానికి యథార్థంగా పశ్చాత్తప్తులైతే పాండవులతో స్నేహం చేసుకొని వారి రాజ్యాన్ని వారికిచ్చివేయండి" అన్నాడు.

అదే సమయంలో దేవతలచేత ఓడింపబడ్డ దైత్యులు, దానవులు దుర్యోధనుడు తన నిశ్చయాన్ని మార్చుకోకపోతే తాము నాశనం అవుతామనే భయంతో పాతాళంలో ఒక బలిపూజా కార్యక్రమాన్ని మొదలుపెట్టారు. వారి బలిపూజకు సంతసించిన ఒక విచిత్రదేవత ప్రత్యక్షమై వారితో "మీకేం కావాలో కోరుకోండి?" అని అడిగింది.

వారు "దుర్యోధనుణ్ణి ఇక్కడికి తీసుకురావాలి" అని కోరారు. క్షణంలో ఆమె దుర్యోధనుణ్ణి వారి వద్దకు తీసుకువచ్చింది. వారు అతడితో ఇలా అన్నారు: "దేవతలకు పాండవులే ఆధారమైనట్లు నీవే మాకు ఏకైక ఆశాజ్యోతివి. జయం నిన్ను వరించుగాక! మేమంతా నీ



పక్షం వహిస్తాము. పాండవుల భయం లేకుండా భూమండలాన్ని పరిపాలించు." తరువాత ఆ దేవత దుర్యోధనుణ్ణి యథాస్థానానికి చేర్చింది. దుర్యోధనుడు కళ్ళు తెరిచాక, జరిగినదంతా కలగా భావించాడు. "పాండవులను యుద్ధంలో సంహరించాలి" అంటూ ప్రతిజ్ఞ పూనాడు.

కౌరవులు రాజధానికి తిరిగి రాగానే, భీష్ముడు, పాండవులు చూపిన వీరోచితచర్యను ప్రశంసించాడు. కౌరవుల కుతంత్రాన్ని గర్హించాడు. పాండవులతో సఖ్యంతో ఉండమని కౌరవులకు సలహా ఇవ్వగా, కోపంతో దుర్యోధనుడు అక్కణ్ణుండి వెళ్ళిపోయాడు.

## 17

## దుర్యోధనుడు యాగాన్ని నిర్వర్తించటం

దుర్యోధనుడు, కర్ణుడు కలుసుకొని భావి కార్యక్రమాన్ని గురించి సుదీర్ఘంగా చర్చించుకున్నారు. దుర్యోధనుడు "ధర్మరాజు నిర్వర్తించిన రాజసూయ యాగం చూసినప్పటి నుంచి, నాలో ఆ యాగాన్ని చేయాలనే కోరిక బలంగా నాటుకుంది" అని అన్నాడు.

ఆ మాటలకు కర్ణుడు నవ్వి "ఎందుకు జరిపించకూడదు? భూమండలంలోని రాజులందరూ నీ ఏలుబడిలోనే ఉన్నారు కదా. బ్రాహ్మణులను పిలిపించి, యాగకార్యక్రమాన్ని ప్రారంభించటమే ఆలస్యం" అన్నాడు.

బ్రాహ్మణులను పిలిపించారు. కానీ, వారు "ధర్మరాజు, ధృతరాష్ట్రుడు బ్రతికి ఉన్నంతవరకు రాజసూయయాగాన్ని నీవు చేయకూడదు. దానికి బదులుగా వైష్ణవయాగాన్ని చేయవచ్చు. అది రాజసూయానికి సమానమైనది" అని చెప్పారు.

దుర్యోధనుడు వారి సూచన మేరకు ఆ యాగానికి సమాయత్తమయ్యాడు. బంగారు నాగలి రూపొందించబడింది. భూమండలంలోని రాజులందరిని ఆహ్వానించడానికి వార్తావహులు పంపబడ్డారు.

దుశ్శాసనుడు ఒక వార్తావహుణ్ణి ద్వైతవనానికి పంపుతూ "తక్షణమే ద్వైతవనానికి వెళ్లి అక్కడ బ్రాహ్మణులనందరినీ, వారితోబాటు ఆ క్రూర పాండవులనూ ఆహ్వానించిరా" అన్నాడు.

ధర్మరాజు వచ్చిన వార్తావహుడితో ఇలా అన్నాడు: "దుర్యోధనుడు ఒక గొప్పయాగాన్ని జరిపించటం నాకు ఆనందాన్ని కలిగిస్తున్నది. కాని మేము పదమూడు సంవత్సరాలు పూర్తి కాకుండా నగరంలోకి ప్రవేశించరాదు."

అప్పుడు భీముడు "దుర్యోధనుడితో మేం పదమూడు సంవత్సరాల అనంతరం నగరంలో ప్రవేశించి ఒక గొప్ప యజ్ఞం చేస్తాం. ఆ యజ్ఞంలో దుర్యోధనుడు, అతని సలహాదారులే బలిపశువులు అని చెప్పు" అన్నాడు.

వార్తావహుడు తిరిగి వెళ్లి జరిగింది అంతా దుర్యోధనుడికి నివేదించాడు.

దుర్యోధనుడు ఆ యాగాన్ని ఎంతో వైభవంగా జరిపించాడు. యాగాన్ని చూడవచ్చిన రాజులలో అనేకులు కౌరవుల మిత్రులు, తక్కినవారు కర్ణుడి జైత్రయాత్రలో ఓడింపబడిన వాళ్లు. అక్కడ మహా ఆనందం నెలకొన్నది. ప్రతి ఒక్కరికి విలువైన బహుమతులు ఇవ్వబడ్డాయి. యాగకార్యక్రమం పూర్తయ్యాక పౌరులు దుర్యోధనుడు చేసిన యాగం, ధర్మరాజు నిర్వర్తించిన రాజసూయయాగ వైభవంలో పదహారవ వంతు కూడా లేదనుకున్నారు. కానీ వందిమాగధులు మాత్రం దుర్యోధనుణ్ణి ప్రశంసిస్తూ యయాతి, భరతుడు మొదలైన చక్రవర్తులు చేసిన యాగంతో ఈ యాగాన్ని పోల్చారు.

అంతా పూర్తి అయిన తరువాత దుర్యోధనుడు, కర్ణుణ్ణి ఆలింగనం చేసుకొని, "కర్ణా! నీ వల్లే ఈ యాగం విజయవంతంగా పూర్తి చెయ్యగలిగాను. నీ సహాయ సహకారాలతోనే భవిష్యత్తులో నేను పాండవులను హతమార్చి ఈ భూమండలాన్ని నిశ్చింతగా పరిపాలించాలి" అని అన్నాడు.

కర్ణుడు ఆ మాటలకు పొంగిపోతూ ఇలా అన్నాడు: "రారాజా! నేను అర్జునుణ్ణి చంపేటంత వరకు నా కాళ్ళు కడుక్కోను, మాంసం మదిరలను ముట్టను, యాచకులు ఏది అడిగనా సరే ఇచ్చివేస్తాను." ఈ శపథం విన్న కౌరవులు, అప్పటికే పాండవులు చనిపోయారనే భావంతో ఆనందంగా కేకలు పెట్టారు.

ఈ వార్త పాండవులకు చేరింది. కర్ణుడి బలపరాక్రమాల పట్ల గొప్ప అభిప్రాయం గల ధర్మరాజు ఆ వార్త విని దిగులుపడ్డాడు.

ధర్మరాజు ఒక రాత్రి కలగన్నాడు. ఆ కలలో అడవిలో ఒక జింక అతడి వద్దకు వచ్చి తన సంతతిని పూర్తిగా నాశనం గావించవద్దని వేరే అరణ్యానికి వెళ్లమనీ దయనీయంగా వేడుకుంది. ఆ కలతో చలించిపోయిన ధర్మరాజు తన తమ్ములతో కామ్యక వనానికి బయలుదేరాడు.

పాండవులు అరణ్యంలో సంతోషంగా ఉన్నారనే వార్త దుర్యోధనుడికి తెలిసి అతడి హృదయం అసూయతో భగ్గుమన్నది. మరల కర్ణుడు, దుశ్శాసనులతో పాండవులకు కీడు కలిగించే పథకం వేయసాగాడు.

## 18

## కృష్ణుడు తన భక్తులను కాపాడటం

ఒకనాడు దుర్వాస మహాముని తన పదివేల మంది శిష్యులతో దుర్యోధనుణ్ణి చూడడానికి వచ్చాడు. అతివినమ్రంగా దుర్యోధనుడు దుర్వాసుణ్ణి ఆహ్వానించాడు. దుర్వాసుడు శపిస్తాడనే భయంతో రేయింబవళ్లు ఆయనకు స్వయంగా సేవలు చేశాడు. కొన్ని సమయాలలో దుర్వాసుడు హఠాత్తుగా "నాకు ఆకలిగావుంది, వెంటనే ఆహారం పెట్టు" అనేవాడు. ఒక్కోసారి స్నానం చేయడానికి వెళ్లి, ఆలస్యంగా తిరిగి

వచ్చి "ఈ రోజు నేను ఏమీ తినను" అనేవాడు. తర్వాత, ఎవరికీ కనబడకుండా అంతర్ధానమయ్యేవాడు. ఒకొక్కప్పుడు అర్ధరాత్రి నిద్రలేచి ఆహారం సిద్ధంచెయ్యమని ఆజ్ఞ ఇచ్చి ఏమీ తినకుండా ఉండేవాడు. దుర్వాసుడు ఈ విధంగా ప్రవర్తిస్తున్నప్పటికీ దుర్యోధనుడు చికాకు కనబరచలేదు. అప్పుడు దుర్వాసుడు, దుర్యోధనుణ్ణి ప్రశంసిస్తూ "ఏదైనా వరం కోరుకో" అన్నాడు.

దుర్యోధనుడు తను అడగదలచుకున్న వరాన్ని ఇదివరకే ఆలోచించి పెట్టుకున్నాడు. అతడు ఎంతో వినయంతో ఇలా అన్నాడు. "ధర్మరాజు నా అన్న, తన తమ్ములతో ఆయన ప్రస్తుతం అరణ్యంలో ఉన్నాడు. నా అతిథి సత్కారాలు పొందినట్లే, మీ శిష్యులతోకూడా మీరూ ఆయన ఆతిథ్యం స్వీకరించడమే నా కోరిక." అంతేగాక ధర్మరాజు పరివారమంతా భోజనాలు ఎప్పుడు పూర్తిచేస్తారో తనకు తెలుసు కాబట్టి, ఆ వేళకే మునిని అక్కడకు వెళ్ళమని సూచించాడు. అకస్మాత్తుగా వచ్చిన అతిథులకు ఇవ్వడానికి ధర్మరాజు వద్ద ఏమీ మిగలదని



దుర్యోధనుడి దురాలోచన. అరణ్యంలో పాండవులు తమ ఆహారానికే నానా అగచాట్లు పడుతూ, దుర్వాసుడికి, ఆయన పెద్దపరివారానికి ఎలాగూ సక్రమంగా ఆతిథ్యం ఇవ్వలేరని దుర్యోధనుడి ఆలోచన. కోపిష్టియైన దుర్వాసుడు వెంటనే పాండవులను శపిస్తే ఆ విధంగా తన చిరకాల వాంఛితమైన పాండవ వినాశం జరుగుతుందని దుర్యోధనుడి వక్ర ఆలోచన.

దుర్యోధనుడు సూచించిన మేరకు దుర్వాసుడు శిష్యగణంతో అరణ్యంలో పాండవుల వద్దకెళ్ళాడు. ఆ సమయంలో పాండవులు మధ్యాహ్న భోజనాలు పూర్తిచేసుకొని, విశ్రాంతి తీసుకుంటున్నారు. వారు మునిని గౌరవపూర్వకంగా ఆహ్వానించారు. "మహామునీ! స్నానం, ఆచమన కార్యక్రమాలు పూర్తిచేసుకొని రండి" అన్నాడు వినమ్రంగా ధర్మరాజు. దుర్వాసుడు, ఆయన శిష్యులు నదిలో స్నానమాచరిస్తుండగా, ద్రౌపది ఆందోళనతో, మునిగణానికి ఇవ్వడానికి ఆహారం ఏమీ లేనందువల్ల విచారంగా కృష్ణుణ్ణి ప్రార్థించింది. "ఓ కృష్ణా! నువ్వే సర్వజగద్రక్షకుడివి. నిస్సహాయులకు నీవే శరణు. నిన్ను శరణుకోరుతున్నాను, నన్ను కాపాడు." అప్పుడు కృష్ణుడు ఆమె ముందు ప్రత్యక్షమై "నాకు చాలా ఆకలిగా ఉంది. ఏదన్నా ఉంటే వడ్డించు, తరువాత తీరికగా మాట్లాడుకుందాం" అన్నాడు.

ద్రౌపది కంగారుపడి "నేను భోజనం చేసేంతవరకు సూర్యుడు ప్రసాదించిన అక్షయపాత్ర నిండుగా ఉంటుంది. నేను ఇప్పటికే భోజనం చేశాను, అక్షయపాత్ర ఖాళీ అయింది" అని అన్నది. కృష్ణుడు "పరిహాసాలకిది సమయం కాదు. ఆ పాత్రను తీసుకురా, చూస్తాను" అన్నాడు. ద్రౌపది అక్షయపాత్రను కృష్ణునికిచ్చింది. ఒక చిన్న అన్నపు మెతుకు అక్షయపాత్ర ఒక మూలలో అతుక్కుని ఉండడం కనబడింది. దాన్ని తీసుకుని నోట్లో వేసుకుని "ఈ విశ్వానికి ఆత్మయైన శ్రీహరి దీనితో తృప్తిపడుగాక! యజ్ఞ హవిస్సులను గైకొనే దేవుడు దీనితో సంతృప్తిపడుగాక!" అన్నాడు. కృష్ణుడు

అప్పుడు సహదేవుడితో, మునిగణాన్ని భోజనాలకు ఆహ్వానించమన్నాడు.

సహదేవుడు వెంటనే నది వద్దకు వెళ్ళినప్పుడు మునులందరు తమ పొట్టలను నెమ్మదిగా తడుముకుంటూ, తమ కడుపులు ఆశ్చర్యంగా నిండిపోయాయని ఒకరితో ఒకరు చెప్పుకోవటం విన్నాడు. వాళ్ళు నదిలో నుంచి బయటకు వచ్చి దుర్వాసుడితో "మనం భోజనం సిద్ధంచేయమన్నాం. కానీ, ఇప్పుడు మా కడుపులు నిండిపోయాయి. ఇప్పుడేం చేయాలి?" అని అడిగారు. "మనం ధర్మరాజుకి గొప్ప అపకారం తలపెట్టాము. అతడు ధర్మశీలుడు. అతడి కోపం మనలను దగ్ధం చేయగలదు. కాబట్టి ఇక్కడ నుండి తక్షణమే వెళ్ళిపోదాం" అన్నాడు దుర్వాసుడు. అలా అంటూ వెంటనే అక్కణ్ణుండి కదలిపోయారు. సహదేవుడు కృష్ణుడికి, ధర్మజుడికి, ద్రౌపదికి, మిగిలినవారికి జరిగినదంతా వివరించాడు.

ఆ మునిగణం అర్ధరాత్రి తిరిగి వచ్చి ఆహారం సిద్ధం చెయ్యమంటారేమోనని ధర్మరాజు ఆందోళనపడసాగాడు. అది చూసి కృష్ణుడు "ధర్మరాజా! ద్రౌపది ప్రార్థన నన్ను ఇక్కడకు తీసుకువచ్చింది. ఈ క్లిష్టపరిస్థితిలో మీకు సహాయం చేయడానికి నేనిక్కడకు పరిగెత్తుకొచ్చాను. ఈ పాటికే దుర్వాసుడు, అతడి శిష్యులు పలాయనం చేసివుంటారు. వారు తిరిగి ఎన్నడూ ఇక్కడకు రారు. ధర్మనిరతికి ఎన్నడూ అపజయం ఉండదు" అన్నాడు. కృష్ణుడు ఇలా మాట్లాడి పాండవుల వద్ద సెలవు తీసుకొని నిజస్థానానికి వెళ్ళిపోయాడు.



## 19
## జయద్రధుడు శిక్షింపబడటం

ప్రతి ఋతువులోను నూతన అనుభవాలతో రోజులు గడిచిపోతున్నాయి. ఐదుగురు సోదరులు కలిసి ఒకనాడు వేటకు వెళ్ళారు. సింధురాజైన జయద్రధుడు ఆ సమయంలో పాండవుల ఆశ్రమం ప్రక్కగా వెళ్లటం జరిగింది. ఆశ్రమ ద్వారం వద్ద ద్రౌపది నిలబడివుండటం చూసి ఆమె అపురూప సౌందర్యానికి ముగ్ధుడయ్యాడు. తన మిత్రుడు కోటికాస్యునితో "వెళ్లి ఆమె ఎవరో ఎక్కణ్ణుంచి వచ్చిందో, ఎందుకు ఇక్కడ ఉన్నదో తెలుసుకో? నన్ను తన నాథుడిగా అంగీకరిస్తుందా?" అన్నాడు. అతడి మిత్రుడు ద్రౌపది వద్దకు వెళ్ళి వచ్చి జయద్రధుడితో "మిత్రమా, విచారిస్తున్నాను. శక్తిమంతులైన పాండవుల పత్ని ఆమె. ఆమె గురించిన ఆశలన్నీ వదలుకుని వెళ్లిపోవడం మంచిది" అన్నాడు.

జయద్రధుడికి మిత్రుడి మాటలు రుచించలేదు. ఆరుగురి అనుచరులతో ఆశ్రమంలో ప్రవేశించాడు. కుశల ప్రశ్నలయ్యాక తన మనసులోని మాటను బయటపెట్టాడు. ఆమె పట్ల తనకెంతో ప్రేమ ఉన్నట్లు, పనికిమాలిన భర్తలను వదలిపెట్టి తనతో వచ్చేయమని ద్రౌపదితో అన్నాడు. అప్పుడు ద్రౌపది "నీవు ప్రసవిస్తూ నశించే ఎండ్రకాయవంటి వాడివి. నా భర్తలు నిన్ను హతమారుస్తారు" అంది. జయద్రధుడు "పాండవులంటే నాకేం భయం లేదు, నీ మాటలు నిన్ను రక్షించవు నాతోరా, బలవంతంగా నిన్ను ఎత్తుకు వెళ్ళే పరిస్థితి తెచ్చుకోకు" అంటూ ఆమెను పట్టుకోవడానికి ముందుకు రాబోతుండగా ద్రౌపది, ధౌమ్యుడి కోసం కేకలు పెట్టింది. కానీ, జయద్రధుడు ఆమెను పట్టుకుని బలవంతంగా తన రథం మీద ఎక్కించుకున్నాడు. అప్పటికి ధౌమ్యుడు అక్కడికి వచ్చి "ఆమె భర్తలతో పోరాడకుండా ఆమెను తీసుకువెళ్ళడానికి నీకు హక్కులేదు. ఈ నీచకార్యానికి నీవు తగిన ఫలం అనుభవిస్తావు" అన్నాడు. కానీ జయద్రధుడు ధౌమ్యుని హితవాక్యాలు పట్టించుకోలేదు. ద్రౌపదిని అపహరించుకుపోసాగాడు.

ఆశ్రమానికి తిరిగి వచ్చిన పాండవులు ద్రౌపది చెలికత్తె ద్వారా జరిగింది తెలుసుకున్నారు. ఐదుగురూ జయద్రధుణ్ణి వెన్నంటడానికి బయలుదేరారు.



దారిలో జయద్రథుణ్ణి నిస్సహాయంగా వెంబడిస్తున్న ధౌమ్యుణ్ణి చూశారు. విపరీతమైన కోపంతో పాండవులు జయద్రథుడి పరివారాన్ని ఎదుర్కొన్నారు. వారి బాణవర్షంతో ఆకాశం గాఢాంధకారమైంది. చావు భయంతో జయద్రథుడు రథం దిగి పారిపోసాగాడు.

అప్పుడు భీముడు, ధర్మరాజుతో "అన్నా! ద్రౌపదిని తీసుకుని నువ్వు ఆశ్రమానికి వెళ్ళు. పాతాళంలో దాక్కున్నా జయద్రథుణ్ణి వదలిపెట్టను" అన్నాడు. "భీమా! జయద్రథుడు మన బంధువని మరిచిపోవద్దు" అన్నాడు ధర్మరాజు.

భీముడు, అర్జునుడు, జయద్రథుణ్ణి వెంబడించారు. అతడి గుర్రాలు రెండు మైళ్ళ దూరంలో ఉన్నప్పటికీ అర్జునుడు తన బాణాలతో వాటిని నేలకూల్చాడు. "వెనక్కు తిరుగు, ఆడవాళ్లను అపహరించేవాడా!" అంటూ భీమార్జునులు అరిచారు. కానీ జయద్రథుడు ఒక్కమారుకూడా తిరిగి చూడలేదు. భీముడు తన రథం దిగి, అతడి వెంట పరిగెత్తి వాడి సిగపట్టుకున్నాడు. జయద్రథుడు స్పృహతప్పి కింద పడిపోయాడు. అర్జునుడు కష్టంతో కిందపడ్డ అతడి శరీరాన్ని ఈడ్చాడు. కానీ, భీముడు అతడి తలను తన్నుతూ, అతడి రొమ్ము మీద కూర్చుని తిరిగి స్పృహకోల్పోయేదాకా పిడిగుద్దులు గుద్దసాగాడు. ధర్మరాజు మాటలు గుర్తుచేస్తూ, జయద్రథుణ్ణి చంపవద్దని భీముణ్ణి వారించాడు అర్జునుడు. "ఈ దురాత్ముడు జీవించడానికి అనర్హుడు. కానీ నేనేం చేయగలను, మన అన్నగారు దయామయుడు" అన్నాడు భీముడు. ఒక వాడి బాణంతో జయద్రథుడికి శిరోముండనం చేసి, ఐదు పిలకలను ఉంచాడు. పిమ్మట జయద్రథుడితో ఇలా అన్నాడు: "నువ్వు జీవించాలంటే బహిరంగ సభలలో 'నేను పాండవుల బానిసను' అంటూ చెప్పుకోవాలి." జీవితం మీద ఆశతో జయద్రథుడు దానికి అంగీకరించాడు. భీమార్జునులు, జయద్రథుడి చేతులూ, కాళ్ళూ కట్టి రథం మీద వేసుకొని ఆశ్రమానికి తీసుకువచ్చి, ధర్మరాజు ముందు పడవేశారు. ధర్మరాజుతో "ద్రౌపదికి చెప్పండి, ఈ దురాత్ముడు పాండవ బానిస అయ్యా అని" అన్నాడు భీముడు.

ధర్మరాజు, ద్రౌపదీ జయద్రథుణ్ణి వదలిపెట్టమని భీముడికి నచ్చజెప్పారు. జయద్రథుడు పరాభవంతో, వెంటనే గంగానది తీరానికి వెళ్ళి అక్కడ శివుణ్ణి గురించి తపస్సు ప్రారంభించాడు. శివుడు అతడి తపస్సుకు మెచ్చి, ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. "పాండవులను యుద్ధంలో హతమార్చే వరం ప్రసాదించు" అని జయద్రథుడు ప్రార్థించాడు. అందుకు శివుడు ఇలా అన్నాడు: "అసంభవం, భూమి మీద ఏ మానవుడికీ అది వీలుపడదు. కానీ నీకు ఈ వరం ఇస్తాను. ఒకే ఒక్కసారి నీవు అర్జునుణ్ణి తప్ప ఇతర పాండవులను జయించగలవు."

ఆ తరువాత శివుడు అంతర్ధానమైనాడు. జయద్రథుడు తన రాజ్యానికి వెళ్ళిపోయాడు. పాండవులు కామ్యకవనంలో రోజులు వెళ్ళబుచ్చుతున్నారు.

కొన్ని రోజులు గడిచాక మార్కండేయమహర్షి పాండవులను చూడడానికి కామ్యకవనానికి వచ్చాడు. ఆయన ప్రగాఢ దుఃఖంలో ఉన్న ధర్మరాజుకి అనేక నీతికథలు చెప్పి, ఊరడించాడు. దురదృష్టాన్ని వరించిన రాజు అతడొక్కడేకాడనీ, శ్రీరాముడు, సావిత్రి కూడా ఎన్నో కష్టాలు పడ్డారనీ; సావిత్రి యమధర్మరాజునే తన మాటలచాతుర్యంతో, పాతివ్రత్యంతో మెప్పించినదనీ, ధర్మరాజుతో చెప్పాడు. ఆ విధంగా మార్గండేయమహర్షిచే ఊరడింపబడ్డ ధర్మరాజు, కామ్యకవనంలో తమ్ముళ్ళతో, ద్రౌపదితో కాలం గడపసాగాడు.

## 20
## కవచ కుండలాల దానం

పాండవుల పన్నెండు సంవత్సరాల అరణ్యవాసం పూర్తయ్యే సమయంలో, పాండవులకు

సహాయపడాలని ఇంద్రుడు, కర్ణుని కవచకుండలాలు సంపాదించాలనుకున్నాడు. కానీ ఇంద్రుడి పథకం తెలిసిన సూర్యుడు, కర్ణుడికి కలలో బ్రాహ్మణరూపంలో దర్శనం ఇచ్చి "కుమారా! నేను చెప్పేది సావధానంగా విను, పాండవులకు సహాయపడాలనే ఉద్దేశంతో ఇంద్రుడు నీ వద్దకు బ్రాహ్మణరూపంలో వచ్చి నీ కవచకుండలాలు అర్థిస్తాడు. కవచకుండలాలు నీ శరీరం నుండి తీసి ఇవ్వకు. వాటిని కోల్పోతే, ఆయుష్షు తగ్గి, నువ్వు చనిపోతావు" అన్నాడు. కర్ణుడడిగాడు "మీరు ఎవరు? నా యోగక్షేమాల గురించి మీ కెందుకంత ఆదుర్దా?" ఆ ప్రశ్నకు బ్రాహ్మణుడు "నేను సూర్యుణ్ణి. నీ మంచికోరే ఈ సలహా ఇస్తున్నాను" అన్నాడు. అప్పుడు కర్ణుడు ఇలా అన్నాడు: "మీ సలహాకు నేనెంతో కృతజ్ఞుణ్ణి. కానీ నేనొక మాట మీతో చెప్పాలి, ప్రతిరోజు నేను మిమ్ము (సూర్యుడు) అర్చిస్తాను. అర్చించి, దానం కావలసిన వాళ్ళకోసం ఎదురు చూస్తాను. వాళ్ళు అడిగినదేదైనా తక్షణం ఇచ్చేస్తాను. ఇది ఎన్నో సంవత్సరాలుగా మీరు చూస్తూనే ఉన్నారు. అడిగినప్పుడు, నా ప్రాణాన్ని కూడా ఇవ్వడానికి నేను వెనుకంజవెయ్యను. కాబట్టి ఇంద్రుడే వచ్చి అర్థిస్తే నా కవచకుండలాలను ఇవ్వడానికి నిరాకరించను." ఆ మాటలకు సూర్యుడు "నీ ప్రతిజ్ఞను ఏదీ భంగపరచలేదు. కనీసం నీ కవచకుండలాలు దానం ఇస్తూన్నప్పుడు, ఇంద్రుడినుండి శక్తి ఆయుధాన్ని ప్రతిఫలంగా అడుగు. ఈ శక్తి ఆయుధం నీ కవచకుండలాలు లేని లోటును కొంతవరకు తీరుస్తుంది." ఇలా అంటూ సూర్యుడు అంతర్ధానమైనాడు.

కర్ణుడు నిద్రనుండి మేల్కొని, మిగిలిన రాత్రంతా కలను గురించే ఆలోచిస్తూ గడిపాడు.

మరునాడు యథాప్రకారం కర్ణుడు సూర్యుని అర్చించాడు. అప్పుడు చేతులు జోడిస్తూ ఒక బ్రాహ్మణుడు కర్ణుడి వద్దకొచ్చాడు. అతడెవరైనదీ కర్ణుడికి తెలుసు. సంప్రదాయ ప్రకారం ఆ బ్రాహ్మణుడికి నమస్కరించి, కూర్చోవడానికి ఆసనం చూపించాడు. పిమ్మట "మీరు కోరింది ఏదైనా ఇస్తాను, సంకోచించక అడగండి" అన్నాడు కర్ణుడు. ఆ బ్రాహ్మణుడు "నాకు బంగారం, సంపదలు, ఆవులు ఏవీ వద్దు. నీ కవచకుండలాలే కావాలి" అన్నాడు దృఢంగా. అందుకు కర్ణుడు స్పందిస్తూ ఇలా అన్నాడు: "మీ కోరిక విచిత్రంగా ఉంది. ఈ కవచకుండలాలు నా శరీరంలోని అంగాల వంటివి. వాటిని నా శరీరం నుండి వేరు చేయలేను, కావాలంటే నా రాజ్యాన్ని కూడా ఇచ్చేస్తాను; వీటిని మాత్రం అడగవద్దు." ఆ మాటలకు బ్రాహ్మణుడు ఇలా అన్నాడు: "నిన్ను దానకర్ణుడంటారు, దాతలలో నువ్వే శ్రేష్ఠుడవంటారు, నీ పేరు ప్రతిష్ఠలు సార్థకం చేసుకోవాలని నీకు ఉంటే కవచకుండలాలు నీ శరీరంనుండి కోసి నా కిచ్చెయ్యి. నువ్వు ఇప్పటి వరకు ఇచ్చిన, ఇకముందు ఇవ్వబోయే అన్ని దానాలకంటే ఇది గొప్పదానంగా పరిగణింపబడుతుంది." కర్ణుడు నవ్వుతూ "దేవాధిదేవా, మీరు ఎవరో నాకు తెలుసు, ఇంద్రా! దేవతలకే దేవుడవైన నీకు నిరుపయోగంగా ఒక కానుక ఇవ్వటం సముచితం కాదు. నాకేదైనా వరం ప్రసాదించటం నీకు ధర్మం.



నీకు కవచకుండలాలు దానం చేశాక, నేను చనిపోవటం నిశ్చయం. నీ కారణంగా నాకు చావు సంభవించినదనే అపవాదు నీకు రాకూడదు. కాబట్టి నా కవచకుండలాలు స్వీకరించి, నేను అడిగింది ప్రసాదించు. లేకుంటే వాటిని నీకు ఇవ్వలేను." ఆ మాటలకు ఇంద్రుడు "సూర్యుడు నా రాకను నీకు ముందుగా తెలిపాడని తెలుసు. నా వజ్రాయుధం తప్ప ఏదన్నా కోరుకో, ఇస్తాను" అన్నాడు. ఎవరి మీద ప్రయోగించినా వారిని సంహరించే శక్తి ఆయుధాన్ని కర్ణుడు కోరాడు. అప్పుడు ఇంద్రుడు "సరే, దానిని ప్రసాదిస్తాను. ఇది నీవు చంపాలనుకునే ఏకైక శత్రువును సంహరిస్తుంది" అన్నాడు. కర్ణుడు "నేను ఒక్క శత్రువునే సంహరించాలనుకుంటున్నాను" అన్నాడు. దానికి ఇంద్రుడు "ఆ శత్రువు శ్రీకృష్ణుడి రక్షణలో ఉన్నాడు. ఇంకొక మాట జ్ఞాపకం ఉంచుకో, ఈ ఆయుధాన్ని నీకు ప్రాణాపాయం సంభవించే సమయంలోనూ, అన్ని అస్త్రాలు నిష్ప్రయోజనమైనప్పుడూ మాత్రమే ప్రయోగించాలి. లేకపోతే అది తిరిగి వచ్చి నిన్నే సంహరిస్తుంది" అని అన్నాడు.

కవచకుండలాలు శరీరంనుండి ఖండించి ఇచ్చాక కర్ణుడి శరీరంలో గాయపు మచ్చలు పడకుండా ఇంద్రుడు వరం ఇచ్చాడు. అప్పుడు కర్ణుడు తన శరీరంలో భాగాలైన కవచకుండలాలను కోసి, ఇంద్రుడికి ఇచ్చాడు. దేవతలు కర్ణుడి మీద ఆకాశం నుండి పువ్వుల వర్షం కురిపించారు. వచ్చిన పని విజయవంతంగా ముగించుకుని ఇంద్రుడు తన లోకానికి వెళ్ళిపోయాడు.



# 21

# నకులుడు తదితరులు మరణించటం

ఒకనాడు ఒక బ్రాహ్మణుడు అగ్ని రగిలించే అరణితో ఒక లేడి తన శరీరాన్ని రుద్దుకోగా, ఆ రెండు మండే కట్టెల ఆ అరణి దాని కొమ్ములలో ఇరుక్కుపోయింది. భయపడిన లేడి అడవిలోకి పారిపోయింది. ఆ బ్రాహ్మణుడు పాండవుల వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చి, ఆ అరణిని తెచ్చి పెట్టమని కోరాడు. పాండవులు లేడి వెంటపడ్డారు. ఆ లేడి అమితవేగంగా పాండవులకు కనబడకుండా అడవిలో అదృశ్యమైంది. పాండవులు బడలికతో, నిరుత్సాహంతో ఒక మర్రిచెట్టు నీడలో కూర్చున్నారు. అప్పుడు నకులుడు ధర్మరాజుతో "విచిత్రంగా ఉంది, ఆ లేడి ఎలా మాయమైంది? మనం ఎన్నడూ ధర్మపథం తప్పలేదు. ఇలా ఎందుకు జరిగింది?" అన్నాడు.

అందుకు ధర్మరాజు "దురదృష్టాలకు కారణాలు వెదకటం కష్టం. పాపపుణ్యాల ఫలితాన్ని ఆ ధర్మదేవతే ఇస్తాడు" అని చెప్పాడు.

భీముడు "కారణం నాకు తెలుసు. ద్రౌపదిని సభలోకి ఈడ్చుకుని వచ్చినప్పుడే దుశ్శాసనుణ్ణి నేను వధించి ఉంటే ఈ కష్టాలు మనకు వాటిల్లేవి కావు" అన్నాడు.



అప్పుడు సహదేవుడు "మాయాజూదంలో శకుని నిన్ను ఓడించినప్పుడే అతణ్ణి నేను వధించి ఉంటే ఇలా జరిగివుండేదికాదు" అన్నాడు. ధర్మరాజు "నకులా! ఈ చెట్టుపైకెక్కి దగ్గరలో త్రాగడానికి నీరు దొరుకుతుందేమో చూడు" అని అన్నాడు. నకులుడు చెట్టు పైకెక్కి "కాస్త దూరంలో నీటిమొక్కలు, కొంగలు కనబడుతున్నాయి. బహుశా అక్కడ నీరు తప్పక ఉండి ఉంటుంది" అన్నాడు.

ధర్మరాజు నీరు తీసుకురావడానికి నకులుణ్ణి పంపాడు. నకులుడు తటాకం వద్దకు వచ్చి నీరు త్రాగబోతుండగా ఒక కంఠం, "ఆగు! ఈ తటాకం నాది. నువ్వు దాహం తీర్చుకోవాలంటే, ముందు నా ప్రశ్నలకు జవాబు చెప్పు" అని పలికింది. బాగా అలసి ఉన్న నకులుడు ఆ మాటలు పట్టించుకోకుండా తటాకంలోని నీటిని త్రాగాడు. వెంటనే చనిపోయి, క్రిందపడిపోయాడు.

ఎంతసేపటికీ నకులుడు తిరిగి రాకపోయేసరికి, ధర్మరాజు, నకులుణ్ణి వెదకడానికి, నీరు తీసుకురావడానికి సహదేవుణ్ణి పంపాడు. తటాకం వద్దకు వచ్చిన సహదేవుడు, చనిపోయిన నకులుణ్ణి చూసి, తానూ దాహం తీర్చుకోబోయాడు. మళ్ళీ అదే కంఠం వినవచ్చింది. కానీ విపరీతమైన దాహంతో ఉన్న సహదేవుడు, ఆ హెచ్చరికను నిర్లక్ష్యం చేసి నీళ్ళు త్రాగి, మరణించాడు.

ధర్మరాజు తరువాత అర్జునుణ్ణి పంపాడు. అర్జునుడు విల్లంబులతో ఆ తటాకం వైపు బయలుదేరాడు. అక్కడ తన తమ్ముళ్ళు చనిపోయి ఉండటం చూసి దిగ్భ్రమ చెంది, చుట్టూ చూచాడు. కానీ చుట్టుప్రక్కల ఏ జంతువూ కనబడలేదు. దాహం తీర్చుకోవడానికి నీటి వద్దకు వెళ్లాడు. "నా ప్రశ్నలకు బదులివ్వకుండా నువ్వు ఈ నీళ్ళు త్రాగగలవా?" అని అదే కంఠం వినిపించింది. "నీ

ప్రాణాల మీద ఆశ లేకపోతే అలా చెయ్యి, నీ తమ్ముళ్ళ గతి చూడు."

ఆ మాటలు విని, అర్జునుడు ఇలా అన్నాడు: "నా ముందు నిలబడి, నేను నీళ్ళు తాగకుండా ఆపు. నా బాణాల రుచి చూస్తే నీవు ఇలా మాట్లాడవు." అర్జునుడు



ఆ కంఠం వినవచ్చిన దిక్కుకేసి వేల బాణాలు ప్రయోగించాడు. కానీ నిష్ప్రయోజనమే అయింది. ఆ కంఠం "పార్థా, అలసిపోకుండా ముందు నా ప్రశ్నలకు జవాబు లివ్వు, తరువాత నీళ్ళు తాగు." ఆ మాటలు నిర్లక్ష్యం చేస్తూ అర్జునుడు నీరు త్రాగి, మరణించాడు.

తరువాత ధర్మరాజు, భీముడితో ఇలా అన్నాడు: "భీమా! నీ తమ్ముళ్ళందరూ వెళ్లారు, తిరిగి రాలేదు. నీవు వెళ్ళి, వాళ్ళ ఉనికి తెలుసుకొని, నీళ్లతో వాళ్ళను కూడా వెంటబెట్టుకునిరా." భీముడు తటాకం వద్దకు వచ్చి తన సోదరులు మరణించి ఉండటం చూసి నిర్ఘాంతపోయి ఇలా తలపోశాడు: 'ఈ దురంతం ఏ రాక్షసుల పనో అయివుంటుంది. ముందు కాస్త దాహం తీర్చుకుని, వాళ్ళను చంపుతాను.' ఆ ఆలోచనలతో, నీటిమడుగుకేసి అడుగులు వేయగానే అదే కంఠం మరల వినవచ్చింది. భీముడు ఆ మాటలు పట్టించుకోకుండా నీళ్ళు తాగి, మరణించాడు.

ధర్మరాజు ఎంతో కంగారుపడ్డాడు. తన సోదరులు ఒక్కరు కూడా ఎందుకు తిరిగిరాలేదో అర్థం కాలేదు. తనే స్వయంగా తటాకం వద్దకెళ్ళి, అక్కడి దృశ్యం చూసి నిశ్చేష్టుడయ్యాడు. అతడి సోదరులందరూ చనిపోయారు. అర్జునుణ్ణి చూసి నిట్టూరుస్తూ, దుఃఖించాడు. భీముణ్ణి ఉద్దేశించి "నాయనా భీమా, దుర్యోధనుడి తొడలు విరక్కొడతానని శపథం చేశావే!" అంటూ వాపోయాడు. దగ్గరగా పరిశీలించి చూడగా వారు నిద్రపోతున్నట్లే ఉంది. వాళ్ళ శరీరాల్లోని కళాకాంతులు చెక్కుచెదరలేదు. ధర్మరాజు సందిగ్ధంలో పడ్డాడు. కానీ నిస్సహాయుడే అయ్యాడు.

## 22

## యక్ష ప్రశ్నలు

బాధ, దాహాలతో ధర్మరాజు తటాకం వద్దకు వెళ్ళినప్పుడు ఒక కంఠం వినిపించింది. "నా మాటలు నిర్లక్ష్యం చేసి, నీ తమ్ముళ్ళు ఈ గతిని పొందారు. చేపలు

ఆహారంగా తిని బ్రతికే కొంగను నేను. నా ప్రశ్నలకు జవాబులు చెప్పకుండా నీరు త్రాగితే, నీవూ మరణిస్తావు." ఆ మాటలకు ధర్మరాజు "నీవు ఎవరవు? రుద్రుడివా, మరుత్తుడివా, వసువువా? ఒక సాధారణ పక్షి నా తమ్ముళ్ళను చంపలేదు. కాబట్టి నీవు ఎవరవు అని మళ్ళీ అడుగుతున్నాను?" అన్నాడు. "నేనొక యక్షుణ్ణి" అంటూ అతడు ధర్మరాజు ముందు ప్రత్యక్షమయ్యాడు. ఆ యక్షుడు తాటి ప్రమాణంలో, పెద్ద కళ్ళతో, శరీరం సూర్యుడిలా వెలిగిపోతూ, మబ్బులా గర్జిస్తూ కనబడ్డాడు. తరువాత ధర్మరాజు "నీ ప్రశ్నలకు నా శాయశక్తులా జవాబు లివ్వడానికి ప్రయత్నిస్తాను. యథేచ్ఛగా నీ ప్రశ్నలడుగు" అన్నాడు. తరువాత యక్షుడి ప్రశ్నలు, ధర్మజుడి జవాబులు ఈ క్రింది విధంగా సాగాయి:

*ప్రశ్న:* ఏది సూర్యుణ్ణి ఉదయింపచేస్తుంది? ఏది సూర్యుణ్ణి అస్తమింపచేస్తోంది? ఎవరు అతడితో కూడా ఉంటారు? ఎవరు అతణ్ణి కదిలించేది?

*జవాబు:* బ్రహ్మము అతణ్ణి ఉదయింపచేస్తున్నది. ధర్మము అతణ్ణి అస్తమింపచేస్తున్నది. దేవతలు అతడితో కూడా ఉన్నారు. సత్యమే అతణ్ణి కదిలిస్తున్నది.

*ప్రశ్న:* ఏది గొప్ప భాగ్యం?

*జవాబు:* ఆరోగ్యం.

*ప్రశ్న:* గొప్ప ఆనందమేది?

*జవాబు:* సంతృప్తి.

*ప్రశ్న:* నిజమైన జ్ఞానమేది?

*జవాబు:* భగవంతుణ్ణి తెలుసుకోవడమే.

*ప్రశ్న:* దయ అంటే ఏమిటి?

*జవాబు:* అందరూ సంతోషంగా ఉండాలనుకోవడమే.

*ప్రశ్న:* అజ్ఞానమంటే ఏమిటి?

*జవాబు:* తన కర్తవ్యం తెలుసుకోకుండుటే.



ప్రశ్న: ఎవడు ఉత్తముడు?
జవాబు: అందరి మంచిని కోరేవాడు.
ప్రశ్న: సోమరితనమేది?
జవాబు: తన కర్తవ్యాన్ని నిర్వర్తించకపోవటం.
ప్రశ్న: ఒకరిని బ్రాహ్మణుణ్ణిగా చేసేది జన్మ, శీలం, అధ్యయనం, వివేకం వీటిలో ఏది?
జవాబు: జన్మ, అధ్యయనం, వివేకం ఇవేవీ కావు. శీలం మరియు నడవడి మాత్రమే ఒకణ్ణి బ్రాహ్మణుడిగా చేస్తుంది.

ప్రశ్న: నిజమైన సంతోషి ఎవడు?
జవాబు: ఋణం లేనివాడు నిజమైన సంతోషి.
ప్రశ్న: ప్రపంచంలో అత్యంత విచిత్రమైన దేది?
జవాబు: కొన్నివేల మంది రోజూ మరణిస్తున్నారు. అదే సమయంలో బ్రతికివున్న వాళ్ళు తాము మాత్రం శాశ్వతంగా ఉంటామని భావించుకుంటారు. అదే అన్నింటికంటే విచిత్రమైన విషయం.

ప్రశ్న: సంతోషానికి మంచి మార్గం ఏది?
జవాబు: సత్ప్రవర్తనులు నడిచిన వెళ్ళిన దారే.

అప్పుడు యక్షుడు ఇలా అన్నాడు: "నాయనా! నా ప్రశ్నలన్నిటికి తృప్తికరంగా జవాబులిచ్చావు. కాబట్టి నీ సోదరులలో ఒక్కరిని బ్రతికిస్తాను, కోరుకో." అందుకు ధర్మరాజు "ఓ యక్షా! నల్లని దేహం గలవాడైన నకులుణ్ణి బ్రతికించు" అన్నాడు. ఆ మాటలకు యక్షుడు ఆశ్చర్యపోతూ ఇలా అన్నాడు: "భీముడు నీకు మిక్కిలి ప్రియుడంటారు. అర్జునుడు నీ బలానికి మూలాధారం, అటువంటప్పుడు నీ సవతి తమ్ముడైన నకులుణ్ణి ఎందుకు ఎంచుకున్నావు?" "ధర్మాన్ని బలిపెట్టేవాడు నశిస్తాడు. కాబట్టి నేను ధర్మాన్ని బలిచెయ్యను. నా తండ్రిగారికి ఇద్దరు భార్యలు కుంతి, మాద్రి. నేను వారిద్దరిని సమానంగా చూస్తాను. వారిలో నాకేభేదమూ కనబడదు. నకులుడు బ్రతికితే, మాద్రి కుమారులలో ఒకరు బ్రతికి ఉంటారు" అన్నాడు. ఆ మాటలు అంటూ ఉండగానే సోదరులందరూ నిద్రనుండి మేలుకొన్నట్లు లేచారు. వారి బడలిక, దాహం అన్నీ మాయమైనాయి. అప్పుడు ధర్మరాజు "ఒకే కాలిమీద తటాకంలో నిలబడ్డ నీవు ఒక సామాన్య యక్షుడివి కావు? నువ్వు ఏ దైవానివి?" అని అడిగాడు. యక్షుడు నవ్వుతూ "నాయనా! నేను యమధర్మరాజును, నీ తండ్రిని, నిన్ను చూసి సంతోషిస్తున్నాను. ఏదన్నా వరంకోరుకో" అన్నాడు. "ఒక బ్రాహ్మణుడి అగ్నిహోత్రం రగిలించే అరణి లేడితో సహా మాయమైనది. ఆ అరణిని ప్రసాదించండి" అన్నాడు ధర్మరాజు. యక్షుడు నవ్వుతూ "నిన్ను పరీక్షించాలనే నేను లేడిరూపంలో వచ్చి ఆ బ్రాహ్మణుడి అరణిని, మండేకట్టెలను ఎత్తుకుపోయాను. మరేదన్నా వరం కోరుకో" అన్నాడు. ఆ మాటలకు ధర్మరాజు "మేము పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం చేశాం. మా అజ్ఞాతవాసంలో ఎవరూ మమ్మల్ని గుర్తించకుండా వరం ఇవ్వు" అన్నాడు. అప్పుడు యమధర్మరాజు ఇలా అన్నాడు: "ఈ వరంకూడా నీకు ఇస్తున్నాను. మీరు మారువేషంలో లేకుండా తిరిగినప్పటికీ, ఈ త్రిలోకాలలో మిమ్మల్ని ఎవరూ గుర్తించలేరు. మీ అజ్ఞాతవాస సంవత్సరకాలాన్ని విరాట నగరంలో గడపండి. కోరిన రూపాన్ని ధరించే శక్తి మీకు వస్తుంది." అలా అంటూ, యమధర్మరాజు అంతర్ధానమైనాడు. పాండవులు ఆనందంగా ఆశ్రమానికి తిరిగి వచ్చారు. బ్రాహ్మణుల వద్ద సెలవు తీసుకొని, అజ్ఞాతవాస కాలాన్ని ఎలా గడపాలో ధౌమ్యుడితో చర్చిస్తూ ముందుకు బయలుదేరారు.

**అరణ్య పర్వం సమాప్తం**



# బాలల మహాభారతం

## మూడవ భాగము

ఆంగ్లమూలం : స్వామి రాఘవేశానంద
తెలుగు సేత : స్వామి జ్ఞానదానంద
చిత్రాలు : పద్మవాసన్



రామకృష్ణ మఠం
దోమలగూడ,
హైదరాబాద్ - 500 029.

# విషయ సూచిక



## విరాటపర్వం


| | | |
|---|---|---|
| పాండవుల రహస్యాలోచన – విరాటనగర ప్రవేశం | ... | 1 |
| విరాటుని కొలువులో – పాండవులు | ... | 4 |
| కీచకుని నీచ దృష్టికి గురైన ద్రౌపది | ... | 6 |
| ద్రౌపది భీముని ఆశ్రయించుట | ... | 9 |
| కీచక వధ | ... | 9 |
| గోగణ హరణం | ... | 12 |
| ఉత్తరుని ప్రగల్భాలు | ... | 14 |
| అర్జునుడు ఉత్తరకుమారునికి ధైర్యం చెప్పుట | ... | 15 |
| ఉత్తర గోగ్రహణం | ... | 18 |
| దుర్యోధన గర్వభంగం | ... | 20 |
| నిజరూపాలలో పాండవులు | ... | 23 |


## ఉద్యోగపర్వం


| | | |
|---|---|---|
| ద్వారకలో దుర్యోధనార్జునులు | ... | 26 |
| సంధి ప్రయత్నాలు | ... | 29 |
| సంజయ రాయబారం | ... | 31 |
| దుర్యోధనుని యుద్ధకాంక్ష | ... | 32 |
| సంధీ... సమరం? | ... | 36 |
| ద్రౌపది విన్నపం | ... | 38 |
| కృష్ణునికి ఘనస్వాగతం | ... | 39 |
| విదురుని ఆతిథ్యం | ... | 41 |
| కౌరవసభలో కృష్ణుడు | ... | 43 |
| దుర్యోధనుని వితండవాదం | ... | 45 |
| శ్రీకృష్ణుని విశ్వరూపం | ... | 47 |
| కర్ణుడికి వాసుదేవుని ఉపదేశం | ... | 49 |
| కుంతి – కర్ణుడు | ... | 51 |
| యుద్ధ సన్నాహాలు | ... | 54 |
| రాయబారిగా ఉలూకుడు | ... | 56 |
| భీష్ముని ఏకైక శత్రువు | ... | 58 |

## ముందుమాట

బాలల మహాభారతం రెండవ భాగంలో వీరులు, ఉత్తములు అయిన పాండవులు ఎలా దురాత్ములైన తమ కౌరవ దాయాదులచేత వంచించబడి పన్నెండేళ్ళు వనవాసానికి పంపబడిందీ చూశాం. వనవాసానంతరం వారు ఒక సంవత్సరంపాటు అజ్ఞాతవాసంలో ఉండాలి. ఈ భాగంలో ఆ సంవత్సర కాలంలో జరిగిన అద్భుత సంఘటనలను మనం చూస్తాం. చిట్టచివరకు పాండవులు తమ అజ్ఞాతవాసం పూర్తిగావించి, తమ రాజ్యభాగాన్ని కోరగా, కౌరవులు ఒక్క అంగుళం నేలను కూడా ఇవ్వటానికి నిరాకరించారు. శ్రీకృష్ణుడు స్వయంగా రాయబారిగా వెళ్లినా, ఫలితం శూన్యమే అయింది. కుంతి కూడా దుర్యోధనుడికి అండగావున్న తన ప్రథమ సంతానమైన కర్ణుణ్ణి తమ పక్షానికి త్రిప్పుకోవాలని ప్రయత్నించినా, ఫలించలేదు. ఒక ఘోరసంగ్రామం అనివార్యమైంది.

ఈ భాగం మనలను ఆ ఘోర విషాదాంతం చూపే అంచులకు తీసుకెళుతుంది.

# విరాటపర్వం

## 1

## పాండవుల రహస్యాలోచన - విరాటనగర ప్రవేశం

పాండవులు, ద్రౌపది, ధౌమ్య సమేతంగా ఒక ఏకాంత ప్రదేశంలో తమ భావి కర్తవ్యాన్ని గురించి ఆలోచించి నిర్ణయం తీసుకునేందుకు సమావేశమయ్యారు.

ధర్మరాజు అర్జునుడితో "అర్జునా! మనం శత్రువులకు తెలియకుండా ఏడాదిపాటు అజ్ఞాతంగా ఉండి గడిపేందుకు వీలైన ప్రదేశమేదంటావు" అని సలహా అడిగాడు.

అందుకు అర్జునుడు "నా దృష్టిలో పాంచాల, చేది, మత్స్య, మగధ, శూరసేన, కళింగ, విదేహ, బాహ్లిక- ఇవన్నీ కూడా కౌరవరాజ్యానికి దూరంగా ఉన్న సుభిక్షమైన రాజ్యాలే. వీటిలో ఏదైనా ఎన్నుకోవడం క్షేమం" అన్నాడు.

"ఆ... అయితే మత్స్యదేశం మన అజ్ఞాతవాసానికి అన్ని విధాలా అనువైంది. ఎందుకంటే, మత్స్యదేశపు రాజైన విరాటుడు వయసులో పెద్దవాడు, సుజనహితుడు, ఉదారుడు, శక్తిమంతుడూను" అన్న ధర్మజుని మాటలకు అంతా సరే నన్నారు.

"నేను బ్రాహ్మణుడిలా మారువేషం వేసుకొని, కంకుడు అనే పేరుతో ఉంటాను. జూదరిగా, పాచికలాటతో ఆ రాజును సంతోషపెడుతూంటాను. శాస్త్రపాండిత్యమున్న వాడిని. పంచాంగం గుణించగలను, జ్యోతిష్యం చెప్పగలను, పుణ్యకథాకథనం చేస్తూ వినోదమూ కల్గించగలను. ఒకవేళ రాజు నా యోగ్యతా వివరాలడిగినట్లయితే ధర్మరాజుకి మిత్రుణ్ణి, ప్రాణతుల్యుణ్ణి అని చెబుతా"నంటూ తన నిర్ణయాన్ని చెప్పి, భీముణ్ణి నీ యుక్తేమిటని అడిగాడు.



భీముడు "నేను వలలుడు అనే పేరుతో వంటలవాడుగా పాక కళాప్రవీణుడుగా ప్రవేశిస్తాను. ఇంతకు మునుపెన్నడూ రుచి చూసి ఎరుగని రకరకాల వంటలు, పిండివంటలు చేసి రాజును తృప్తిపరుస్తాను" అన్నాడు.

అప్పుడిక యుధిష్ఠిరుడు అర్జునుని వంక తిరిగి "అర్జునా! నీ ఆలోచన ఏమిటి...? ఏ రకమైన వృత్తిని చేపట్టాలనుకుంటున్నావు? నీ శౌర్యాన్ని ఎలా మరుగు పరచదలచావు?" అనడిగాడు.

"...నేను బృహన్నల అనే పేరుతో పేడిరూపంలో ఉండదలచాను. ధనుస్సు మోపడంవల్ల భుజంమీద, పిడికిలి బిగించి నారి సారించినందువల్ల ముంజేతుల మీది మచ్చలు గురుతులు కనబడకుండా దాచడం ఏదోవిధంగా కష్టం కనుకనే ఆ వేషాన్ని నాకు ముందున్న శాపవిముక్తిగా కూడ ఎన్నుకున్నాను. (ఊర్వశిని తల్లిగా భావించి ఆమెను తిరస్కరించినపుడు ఆమె విధించిన శాపం ఇంద్రుని కృపతో ఒక సంవత్సర కాలం అర్జునుని ఇష్టానుసారం పేడి రూపాన్ని పొందడానికి అనుగ్రహంగా లభించింది) ముంజేతి గుర్తులు కనబడకుండా తెల్లని శంఖుగాజులు ధరిస్తాను. ఆడవారిలా జడ వేసుకుంటాను. అంతఃపుర స్త్రీలకు ఆటా పాటా నేర్పిస్తాను. ఆ ధర్మరాజు రాజ్యంలో ద్రౌపదిని తన నాట్య గానాలతో అలరించే నేను, ఇప్పుడు ఉద్యోగాన్వేషణలో ఇంతదూరం రావలసి వచ్చిందని చెబుతా"నన్నాడు.

"భేష్... భేష్..." అని ధర్మరాజు ఆమోదించాడు.

ధర్మరాజు, "మరైతే, నకులా! నీ ఉద్యోగ మేమిటో? అసలే నీకు మొహమాటం, బిడియమూను..." అని అడిగాడు.

నకులుడు, "నేను దామగ్రంథి అనే పేరుతో విరాటరాజు అశ్వశాలలో అశ్వరక్షకుడుగా పనికి చేరుతాను. నాకూ మీలా గుఱ్ఱాలంటే మక్కువే గదామరి..." అంటూ బదులు చెప్పాడు.

తరువాత ధర్మరాజు, "శభాష్! అయితే, సహదేవా! నీ ఉద్దేశం...?" అని సహదేవుణ్ణి ప్రశ్నించాడు.

"నేను తంత్రీపాలుడనే నామధేయంతో విరాటుని పశుగణాన్ని కాపాడుతుంటాను" అన్నాడు సహదేవుడు. ఇంకేం బావుంది అంటూ చివరికి ధర్మరాజు ద్రౌపదిని "ఓ ద్రౌపదీ! నీవు మా కందరికీ, మా ప్రాణాలకంటే కూడా ప్రియమైన దానివి. నీవు మమ్మల్ని తల్లిలా కాపాడుతూ ఉన్నావు. అక్కలా ఆదరణ చూపుతున్నావు. నీవు సద్వంశంలో జన్మించినదానవు, సంస్కారవంతురాలవు, మహారాణివి. కష్టపడి



పనిచేయడమంటే, ఏమాత్రం అలవాటు లేనిదానివే, ఏం చేద్దామని నిర్ణయించుకున్నావు?" అని ప్రశ్నించాడు.

అంతా విని ద్రౌపది చిరునవ్వు నవ్వి, "విరాటుని రాణివాసంలో మహారాణికి పరిచారికనై ఉంటాను. సైరంధ్రి అనే పేరుతో పరిచర్యలు చేస్తూంటాను. యుధిష్ఠిరుని రాణివాసంలో చెలికత్తెగా సేవలందించానని వారికి చెప్తాను" అని బదులు చెప్పింది.

"భేష్...! అయితే ఒక్క విషయం గమనించాలి సుమా... ప్రపంచంలో ఎన్నో వక్రమార్గాలున్నాయి, నీకు ఈ ప్రపంచం పోకడ అంతగా తెలియదు. అందుకని జాగ్రత్తగా వ్యవహరించాలి. విషయలోలుర, దుండగుల, కిరాతకుల దృష్టిలో పడకుండా అనుక్షణం మెలకువతో మసలుకోవాలి సుమా" అంటూ హెచ్చరిక చేశాడు.

అటుపిమ్మట ధర్మరాజు, ధౌమ్యుడు మిగిలిన విప్రులతో "మా అజ్ఞాతవాసానికి అనువైన ఏర్పాట్లు తృప్తిగా సమకూరాయి కనుక మీరు ద్రుపదుని కొలువులో ఉండటం మంచిది" అనగానే ధౌమ్యుడు మిగిలినవారు వారిని దీవించి, సెలవు తీసుకు వెళ్ళిపోయారు.

అప్పుడిక పాండవులు తమ కత్తులు డాళ్ళు మున్నగు ఆయుధాలు, ఉడుంతోలు చర్మాల చేతిమేజోళ్ల వెంటదీసుకుని యమునా నదికి దక్షిణతీరాన ఉన్న మత్స్యదేశం వైపు ప్రయాణం సాగించారు.

"ఆహా, వచ్చేసినట్లే... అదుగో విరాటరాజు రాజధాని నగరపు జాడలు ఇక్కడి నుండి ఎంత బాగానో కనబడుతున్నాయి. ఈ రాత్రికి ఇక్కడే విశ్రాంతి తీసుకుందాం. నాకు బాగా అలసటగా ఉంది. ఇక ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేను" అన్నది ద్రౌపది.

కాని, ఆగకుండా ప్రయాణం సాగించి ఇంకొంత ముందుకు వెడితే, నగరానికి చేరువైనట్లు ఉంటుందిగదా! అని ఆలోచించి ధర్మరాజు అర్జునునితో "ద్రౌపదిని భుజాలపై ఎక్కించుకుని నడవ"మన్నాడు. సరేనని అర్జునుడు ద్రౌపదిని భుజాలపై ఎక్కించుకుని మోసుకుంటూ ఎలాగైతేనేం అంతా విరాటుని రాజధాని నగర పొలిమేరకు చేరుకున్నారు.

ఇప్పుడిక ఆయుధాల్ని ఎక్కడ దాచడం అంటూ ధర్మరాజు ప్రశ్నించాడు.

"ఆ శ్మశానానికి చేరువన కొండమీదున్న జమ్మిచెట్టు మీద దాచిపెడదాం" అన్నాడు అర్జునుడు.

సరే, ఆ దట్టమైన కొమ్మల చాటున ఆయుధాలు దాచేందుకు పదమన్నారు. నకులుడు చెట్టుపైకి ప్రాకి, బలమైన చిటారుకొమ్మల సందున ఆ ఆయుధాలన్నిటిని గట్టిగా కట్టి పదిలంగా పెట్టాడు. చూసేవారికి దూరాన ఏదో శవం వేలాడుతున్నట్లు కనబడుతుందంతే.

అక్కడున్న గొఱ్ఱెల కాపరులు కొందరు వారిని "మీరా చెట్టెక్కి ఏం చేస్తున్నారు?" అని అడిగారు.

అప్పుడు పాండవులు "అది 180 సం॥ల తమ తల్లిగారి మృతదేహమని, అలా మృతదేహాలను చెట్టుకొమ్మలకు వేలాడదీయడం మా వంశాచారం" అని చెప్పారు.

ఆ తరువాత వారు జయ, జయంత, విజయ, జయత్సేన, జయద్బల అనే సంకేతనామాలతో వారనుకున్న ప్రకారం రాజధానిలో ప్రవేశించారు.

## 2
## విరాటుని కొలువులో పాండవులు

విరాటనగరంలో అడుగుపెడుతూనే ధర్మరాజు మనసులో జగజ్జనని దుర్గామాతను ప్రార్థించాడు, జపించాడు. ఆమె గుణాలను స్తుతించాడు.

జగన్మాత అతడి భక్తికి మెచ్చి ప్రసన్నురాలై ఎదుట సాక్షాత్కరించి, "ఓ యుధిష్ఠిరా! తొలుత నీవు కోల్పోయిన రాజ్యాన్ని త్వరలోనే తిరిగి పొందగ"వంటూ దీవెన లిచ్చింది.

యుధిష్ఠిరుడు విరాటరాజు కొలువుకూటానికి చేరుకున్నాడు. ఉట్టిపడే రాజసంతో ఆస్థానంలో అడుగుపెడుతున్న అపర ఇంద్రునిలా ఉన్న ఆ యుధిష్ఠిరుని చూడగానే విరాటరాజు "ఎవ్వరీతడు? పరివారమూ, రథాలూ, ఏనుగులు వెంటలేకపోయినా రాజఠీవితో వెలిగిపోతున్న ఈతడెవరై ఉంటా"డని మంత్రుల్ని అడిగాడు.

అంతలోనే యుధిష్ఠిరుడు రాజును సమీపించి, "రాజా! నేనొక విప్రుణ్ణి, సర్వం పోగొట్టుకున్నవాణ్ణి, తమ సాయంకోరి వచ్చా" నని ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

"ఎంతమాట, తప్పకుండాను. అయితే మీరెవరో, ఎక్కణ్ణుంచి వచ్చారో ముందుగా మీ వివరాలు చెప్పండి?" అనడిగాడు విరాటుడు.

అప్పుడు యుధిష్ఠిరుడు, తానొక బ్రాహ్మణుడనని, ధర్మరాజుకి మిత్రుడనని, పేరు కంకుడని పాచికలాడటంలో బహునేర్పరినని, సకల విద్యాపారంగతుడనని పరిచయం చేసుకున్నాడు. చెప్పిందే తరువాయి అన్నట్లు విరాటుడు తన ఆస్థానంలో స్థాన మివ్వడమేకాక, తన ఆంతరంగిక సలహాదారుగా కూడా స్వీకరించాడు. గౌరవంగా జీవనం సాగించేందుకు వీలైనంత పూర్తి స్వేచ్ఛను కట్టబెట్టాడు. ఇంకా





విరాటుని ఔదార్యమెంతటిదంటె "ఈ రాజ్యం నాదని కాక మీదిగానే భావించండి. వేరుగా ఎంచకండి" అని కూడ మరీ చెప్పాడు.

తరువాత భీముడు పెద్ద పొడవాటి గరిటె, అట్లకాడ చేతబట్టుకుని మృగరాజులా ఠీవిగా, గంభీరంగా వచ్చాడు. ఆ శౌర్యమూ, సౌందర్యమూ చూసి విరాటరాజు విస్తుపోయాడు. "అయ్యా! నేను వంటలవాణ్ణి, నా పేరు వలలుడు, నేను పాక కళలో ప్రవీణుణ్ణి. దయచేసి నన్ను మీ రాజప్రాసాదంలో పాచకునిగా నియోగించవలసింది" అని కోరాడు.

"ముఖవర్చస్సు, అందచందాలు, ఆ శరీర సౌష్ఠవం చూస్తే పాచకుడవంటే నమ్మలేకుండా ఉన్నా"నన్నాడు విరాటరాజు.

"ఓ రాజా! ఒకప్పుడు నేను యుధిష్ఠిరుని దగ్గర వంటవాణ్ణి. నేను పాకకళలో మాత్రమే కాదు, ముష్టియుద్ధంలో కూడ ప్రావీణ్యం కలవాణ్ణి సుమా! నిరంతరం నేను ఏనుగులతో సింహాలతో కలియబడి పోరాడుతూ మీకు వినోదం కల్గించగలను" అంటూ వివరించాడు. విరాటరాజు "ఇకమీదట మా వంటశాలలో ప్రధానపాచకుడుగా నిన్ను నియమించాం" అన్నాడు.

ఆ తరువాత అర్జునుడు వచ్చాడు. చెవులకు బంగారు లోలకులు, చేతి నిండుగా శంఖుగాజులు, మెళ్ళో రకరకాల హారాలు, పతకాలు, వదులుగా పొడవైన జడతో ఎంతో అందంగా వయ్యారంగా ఆడవేషంలో రాజును సమీపించి, "నా పేరు బృహన్నల, నేను పాడతాను, నాట్యమాడుతాను, వాద్యాలన్నీ వాయిస్తాను. మీ రాకుమారి ఉత్తరకు నాట్యోపాధ్యాయుడిగా నన్ను నియమించవలసిందిగా అడుగుతున్నాను. అదే నా కోరిక. ఈ పేడిరూప మేమిటని మాత్రం దయచేసి నన్నడగకండి, అది ఎంతో బాధాకరమైన గాథలెండి" అన్నాడు.

"నీ గతచరిత్రను అంతగా గుచ్చిగుచ్చి అడిగి నిన్ను బాధించనులే, నీవు కోరినట్లు నిన్ను నాట్యోపాధ్యాయునిగా నియమించాం" అన్నాడు రాజు.

అటుతరువాత నకులుడు, "తాను అశ్వరక్షణలో దక్షుడనని, తన పేరు దామగ్రంథి" అని ఎంతో పొంకంగా చెప్పడం నియమితుడవడం జరిగిపోయింది.

నకులుని తరువాత సహదేవుడు వచ్చాడు. "నేను ఒకానొకప్పుడు, పాండవుల గోగణ రక్షకుడనని, చేతిచలువ గల పశువుల కాపరినని, తనకు పని ఇచ్చి పుణ్యంగట్టుకో"మని రాజుకు చెప్పి ఒప్పించి ఉద్యోగం సంపాదించుకున్నాడు.

ద్రౌపది 'సైరంధ్రి' అనే పేరుతో విరాటుని రాణి సుధేష్ణాదేవికి పరిచారికగా నియమించబడింది. ఆమె రాణిగారి అంతఃపురంలో చెలికత్తెగా అన్ని రకాల కార్యకలాపాలను, అలంకారాలు, అమరికలు సమర్థవంతంగా చూసుకునేది.

## 3

## కీచకుని నీచ దృష్టికి గురైన ద్రౌపది

ద్రౌపది తన సుఖాల నన్నిటిని ఆవలపెట్టి పరుల సేవల్లోనే విధిలేక కాలం గడుపుతోంది. సుధేష్ణను సంతృప్తి పరచేందుకు ఇంకా రాణివాసంలోని తదితర స్త్రీల మెప్పు పొందేందుకని ఎంతో శ్రమించి, ఎన్నో విధాల పరిచర్యలు, అమరికలు, అందింపులు చేసేది. అజ్ఞాతవాసం చివరి రోజుల్లో ద్రౌపది, మహారాణి సుధేష్ణాదేవి సోదరుడు విరాటరాజు సైన్యాధ్యక్షుడు అయిన కీచకుడి కంటబడటం జరిగింది.

లోలోపల రగులుతున్న కామంతో అతడు సోదరి దగ్గరకు వెళ్లి, "ఎవరా అందాలరాశి? ఆమె సౌందర్యం సరికొత్త మధువులా నాకు మత్తు కలిగిస్తూంది. అంతటి అందగత్తె నీ కిలా పరిచర్యలు చేస్తూ ఉండటాన్ని నే నెంతమాత్రమూ సహించలేను. ఆమెను నాతో పంపించెయ్యి" అని అడిగాడు.

అక్కణ్ణుంచి సరాసరి ద్రౌపదిని సమీపించి, "ఎవరు నీవు? నీ అందచందాల్ని గురించి చెప్పాలంటే మాటలే చాలవు. నీవు నన్ను అంగీకరించాను అంటే చాలు. నేనిక నా భార్యలందరిని వదిలేసి వారందరినీ నీకు పరిచారికలుగా చేస్తాను. నేనూ నీ చరణదాసుడనై ఉంటాను. నిన్ను నెత్తినపెట్టుకు గౌరవిస్తాను. నీ మాటకు లోబడి ఉంటాను. నా మాట కాదనకు" అని బ్రతిమాలుకున్నాడు.

అందుకు ద్రౌపది "నేను సైరంధ్రిని కులం తక్కువదాన్ని, అంతేకాకుండా వివాహితను, అందువల్ల నేను మీరు ఊహించినట్లు మీకు తగినదాన్ని కాను. ఉన్నతస్థితిలో ఉన్న మీబోటివారి కిది తగని పని" అని బదులు చెప్పింది.

కాని కీచకుడు ఆపరాని మోహావేశంలో పడి, "ఒక్కసారి నా వంక చూడు. జనులు కావాలని కోరుకునే సర్వమూ నా దగ్గర ఉన్నాయి. యౌవనముంది, అందముంది, ఐశ్వర్యమూ ఉంది. పరాక్రమంలోనా నన్నెదిరించగల ధీరుడెవ్వడూ ఈ లోకంలో లేడు. నీవు 'ఊ' అంటే చాలు నా రాజ్యమంతా నీ కర్పిస్తాను. నన్నంగీకరించు, నాతో కలిసి రాజ్యసుఖాలన్నిటిని సంతోషంగా అనుభవించు" అని ప్రాధేయపడ్డాడు.

అదంతా విని ద్రౌపది, "ఓరీ దురాత్మా! కీచకా! నీవు..., నేను నిస్సహాయురాలనని ఒంటరిదాన్నని ఊహించకు! నన్నెప్పుడూ అయిదుగురు గంధర్వులు వెన్నంటి కాపాడుతూ ఉంటారు. ఏమనుకున్నావో? వారికి కోపం తెప్పించి రెచ్చగొట్టావంటే వారు నిన్ను సర్వనాశనం చేస్తారు జాగ్రత్త. నీ చేజేతులా కీడు తెచ్చుకోకు అది నీకు క్షేమం కాదు" అంటూ ఉరిమింది.

అప్పుడా కీచకుడు మళ్లీ తన సోదరి దగ్గరకు వెళ్లి, "అక్కా! నాకా యువతి మీద చెప్పలేనంత మోహంగా ఉంది. నీ వెలాగైనా సరే ఆమె నా వద్దకు వచ్చే విధాన మాలోచించాలి" అని మొరపెట్టుకున్నాడు.

సోదరుని స్థితికి జాలిపడి అక్క సుధేష్ణ "నేను, పర్వదినం అనే వంకపెట్టి నా కిష్టమైన మద్యం

పట్టుకురమ్మని ఆమెను నీ నివాసానికి పంపుతాను. అదను చూసి, ఆమె మనోప్రవృత్తిని కనిపెట్టి మంచిగా మాలిమిచేసుకో, నటనగా వల్లో వేసుకో" అని సలహా చెప్పి పంపింది.

కాని సుధేష్ణ ద్రౌపదిని కీచకుని భవనానికి వెళ్లి మద్యం పట్టుకురమ్మని ఆజ్ఞాపించగానే, ఆమె "నే నక్కడికి వెళ్ళను, అందులోనూ ఛీ... ఆ సిగ్గుమాలిన వాడింటికి అసలు పోను" అని కచ్చితంగా సమాధానం చెప్పింది.

"నీవిలా అంటావని నాకు తెలిసే నిన్ను పంపుతున్నాను. కానీ, అతడు నీ కెట్టి హానీ తలపెట్టడని నేను నీకు హామీ ఇస్తున్నా వెళ్లిరా" అంది సుధేష్ణ.

అప్పుడిక గత్యంతరం లేక ద్రౌపది కర్మసాక్షియైన సూర్యదేవుని తన శీలాన్ని కాపాడమని వేడుకుని, భయంతో గజగజలాడిపోతూ కీచకుడి భవనానికి మద్యం తెచ్చేందుకు వెళ్లింది.

సూర్యభగవానుడు ఆమె ప్రార్థన ఆలకించాడు. ఆమెను రక్షించేందుకు ఒక రాక్షసుని తక్షణమే పంపాడు. ఆ క్షణం నుంచి ఆ రాక్షసుడు కనబడకుండా, వెంట ఉంటూ ద్రౌపదిని వెయ్యికళ్లతో కాపాడసాగాడు.

తన భర్తలు తనను కాపాడాలని మనసారా ప్రార్థిస్తూ ఆమె భీతిల్లిన లేడిపిల్లలా ఆ కీచకుడి ఇంట అడుగుపెట్టింది. "ఓహ్! వచ్చావా నీవు, ఈ రాత్రి నేను చాలా అదృష్టవంతుణ్ణన్నమాట" అన్నాడు కీచకుడు. "నీ కోసమని బంగారు కంకణాలు, హారాలు, విలువైన మణులు తాపిన ఎన్నో ఆభరణాలు ఉంచాను. అవన్నీ నేను నీ కివ్వాలనుకున్న కానుకలు. అంతేకాదు, నీకోసమని ఒక అపూర్వమైన తల్పం తయారుచేయించాను తెలుసా? రా... వచ్చి నా సరసను కూర్చో. ఈ తీయని మధువును కలిసి తాగుదాం రా... మహారాణికి మద్యం పంపే ఏర్పాట్లు నే చేస్తాగదా!" అన్నాడు. ద్రౌపది "నాకు మద్యం త్వరగా ఇప్పించండి. నేను వెళ్ళాలి" అన్నది.

"నీవు వెళ్ళక్కర్లేదు, అందుకు వేరే మనుష్యుల్ని నియమించాంలే" అంటూ కీచకుడు ఆమె కుడి చేతిని పట్టుకున్నాడు.

"నేనెన్నటికీ నా భర్తలకి ద్రోహం చెయ్యను. అట్టి తలంపు మనసులో కూడా చొరనీయను" అంటున్నప్పటికి కీచకుడు ఆమెను వదలకుండా బలాత్కరించబోయేసరికి ఆమె పెనగులాడి తప్పించుకుని పారిపోయింది. పోతూపోతూ అతణ్ణి ఒక్క తోపుతోసి నేలమీద విసురుగా పడేసి మరీపోయింది. కోపంతో భగ్గుమన్నాడు కీచకుడు. ద్రౌపది "రక్షించండి... రక్షించండి..." అంటూ రాజసభలో ఉన్న యుధిష్ఠిరుడి దగ్గరకు ఒక్క పరుగున వచ్చింది. అప్పటికీ కీచకుడు ఆమెను వెంబడించి తరుముతూ వచ్చి, ఆమె కొప్పుపట్టి లాగి, ఈడ్చి నేల మీద పడేసి ఆ యుధిష్ఠిరుని ముందే ఆమెను తన్నాడు.

ఆ పరిస్థితిలో మరుగున ఉన్న రాక్షసుడు కీచకుణ్ణి ఒక్క ముష్టిఘాతంతో... స్పృహతప్పి నేలమీద పడేట్లు చేశాడు. భీమసేనుడిదంతా చూశాడు ఒళ్ళు



తెలియని క్రోధావేశంతో, పటపటా పళ్లుకొరుకుతూ కీచకుణ్ణి చంపేందుకు ముందుకి ఉరికాడు.

యుధిష్ఠిరుడు తాము బయటపడిపోతామేమో ఎక్కడ తమల్ని గుర్తుపట్టేస్తారో అనే భయంతో, 'వద్దు మానమని' భీముని బొటనవేలు నొక్కిపెడుతూ, "పో... వెళ్లి వంటకి కావాల్సిన వంటచెఱకు కొట్టుకురా వెళ్లు" అంటూ ఆజ్ఞాపించాడు.

అప్పుడు ద్రౌపది విరాటరాజుతో "అతడు నన్నెంతగా అవమానించి, దౌర్జన్యం చేశాడో చూశారా ఆర్యా! నేను అయిదుగురు గంధర్వులకు విశ్వాసపాత్రురాలనైన ఇల్లాలిని. ఈ రాజ్యంలో ధర్మమన్నదే లేదా ప్రభూ? రక్షించేవారొక్కరూ లేరా?" అనడిగింది. అందుకు విరాటుడు, "మీకున్న విరోధమేమిటో మాకు తెలీదు. అటువంటప్పుడు అపరాధులెవరో మేమెలా నిర్ణయించగలం?" అన్నాడు.

కాని, ద్రౌపది విరాటరాజుని అడిగిన ప్రశ్నలకు సభికులంతా సంతోషించారు. శభాష్...! అని ఎంతో మెచ్చుకున్నారు. కీచకుడి అవినీతి చర్యను అసహ్యించుకున్నారు.

యుధిష్ఠిరుడు, మొహంమీదనుండి చెమటబిందువులు రాలుతుండగా "ఆ... సైరంధ్రీ! నీ నివాసానికి వెళ్లిపో, శూరులైనవారి భార్యలు తమ భర్తల నిమిత్తం ఇట్టి బాధలు భరించక తప్పదులే. బహుశా నీ గంధర్వభర్తలు కూడ ఈ దుర్మార్గుణ్ణి శిక్షించేందుకు ఇది అదను కాదనే ఊరుకుని ఉండొచ్చు. ఏదిఏమైనా వారు వదిలిపెట్టరులే. నీ పట్ల దుర్మార్గంగా ప్రవర్తించిన ఆ



దుండగుని శిక్షించి, శాస్తిచేసి నీకు వాటిల్లిన దుఃఖాన్ని పోగొడతారు" అంటూ అప్పటికి కావలసిన ఓదార్పు మాటలు చెప్పి పంపాడు.

## 4

## ద్రౌపది భీముని ఆశ్రయించటం

సైరంధ్రి విలపిస్తూ తన నివాసాన్ని చేరుకుంది. అక్కడికి చేరుకున్నాక తనలో తానిలా ఆలోచించుకుంది.

'నేనేం చెయ్యాలి, ఎక్కడికి వెళ్లాలి? అందుకు భీముడే తగు... ప్రతీకారం తీర్చుకునే శక్తి భీముడికే ఉంది. వేరెవ్వరికీ లేదు' అంటూ గొణుక్కుంటూ ఆమె ఆ రాత్రి భీముని నివాసానికి వెళ్ళింది. అతడప్పటికి ఆదమరచి సింహంలా గుర్రుపెడుతూ నిద్రపోతున్నాడు. వెళ్ళి నిద్రలేపి కూర్చోబెట్టింది. ఎంతో మృదుమధురంగా ఇలా అన్నది: "ఒక వైపు నేను ప్రాణాపాయంలో చిక్కుకుని అల్లాడిపోతుంటే, నీకేమీ పట్టనట్లు హాయిగా నిద్రపోతున్నావే? ఆ దుర్మార్గుడు కీచకుడు నన్ను బలాత్కరించబోయాడు, లొంగనందుకు పరాభవించాడు. వాణ్ణి, ఆ దురాత్ముని నీవిక ప్రాణాలతో వదిలిపెట్టరాదు. నేనీ అకృత్యాన్ని ఎంతమాత్రం సహించను. ఆ ఛండాలుని, కీచకుణ్ణి నీవు తక్షణం చంపి తీరాల్సిందే. మనందరి మేలుకోరే, నేనీ దాసీపనికి ఒప్పుకుని చేస్తున్నాను. అయినా నేను బాధపడటం లేదు.

"నాడు అత్తగారు కుంతీదేవికి, మీ అయిదుగురికి సేవ చేసిన ఈ చేతులే నే డెలా తయారయ్యాయో చూడు. ఇక్కడున్న ఈ అడ్డమైనవారికి ఊడిగం చేసిచేసి అరచేతులన్నీ పగుళ్ళతో ఎంతగా కమిలిపోయాయో చూడు నీకే తెలుస్తుంది.

"ఆ కీచకుడు నన్ను వెంటాడి వేధిస్తున్నాడు. 'నాకు అయిదుగురు గంధర్వ భర్తలున్నారు, నీవు కనుక నా మీద అత్యాచారం చేశావో నిన్ను వారు చంపి పారేస్తా'రని ఎంతగానో హెచ్చరించాను కూడ. అయినా వాడేమాత్రం లెక్కచెయ్యడం లేదు. వాడు పరమనీచుడు, దురహంకారి, కామాంధుడు. వాణ్ణి నీవెలాగైనాసరే అంతం చెయ్యాలి. నీవు వాణ్ణి హతమార్చకపోయావంటే ఏ విషమైనా పుచ్చుకుని ఆత్మహత్య చేసుకుంటాను." మనసులో కరడు కట్టిన వేదనంతా ఒక్కమారు కుమ్మరించింది. రెండు చేతులతో మొహం కప్పుకుని వలవలా ఏడ్చింది.

భీముడిక భరించలేకపోయాడు. ఆమె చేతులు పుచ్చుకుని, ఎంతో ప్రేమగా ఓదార్చాడు. అప్పటికే తాను మనసులో ఒక గట్టి నిర్ణయానికి వచ్చేశాడు భీముడు. "ద్రౌపదీ! విచారించకు, నాకు యుధిష్ఠిరుని వాగ్దానంతోగాని, అర్జునుని సలహాతోగానీ ప్రమేయమేం లేదు. నేను రేపే కీచకుణ్ణి వధిస్తానని నీకు మాట ఇస్తున్నాను. సరేనా...? వెళ్లి అతణ్ణి కలుసుకో నాట్యశాలకు ఒంటరిగానే రమ్మని ఆహ్వానించు, చాలు. ఆపైన సంగతి నే తేలుస్తా" అన్నాడు. అప్పటికి ద్రౌపది మనస్సెంతో తేలికపడింది.

## 5

## కీచక వధ

మర్నాడు కీచకుడు ద్రౌపదితో "నిన్న నీవు ఉన్న అపాయస్థితిలో ఎవరు నిన్ను రక్షించేందుకు ముందుకు వచ్చారో చెప్పు చూద్దాం. బహిరంగంగా సభాభవనంలో అందరి ఎదుట నిన్ను నేను తన్నుతుంటే ఎవరొచ్చి నీ గతి పట్టించుకున్నారో చెప్పు... కాబట్టి తెల్సిందా? ఇక్కడ ప్రభు వెవరో...? నేనే ప్రభువుని, విరాటుడు పేరుకి మాత్రమే రాజు. కనుక ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. నన్ను అంగీకరించి, వివాహం చేసుకో. అప్పుడు నేనిక నీకు దాసుణ్ణి అవుతాను. ఈ రాజ్యమంతా నీవు హాయిగా, ఆనందంగా అనుభవించవచ్చు" అన్నాడు.

సైరంధ్రి అందుకు సమ్మతించినట్లు నటించింది. "నీ సలహా నాకు నచ్చింది. నా కిష్టమే, నా భర్తలకు భయపడుతున్నా..., పోనీ, ఒక పని చేద్దాం. మన వ్యవహారం ఎవరికీ తెలియకుండా, ఆఖరికి మీ బంధు



మిత్రులకు కూడా తెలియకుండా గుట్టుగా ఉంచుతానని మాట ఇస్తే, నే వచ్చేందుకు సిద్ధమే" అన్నది. కీచకుడు సైరంధ్రి పెట్టిన షరతును సంతోషంగా అంగీకరించాడు. అప్పుడు సైరంధ్రి ఆ రాత్రికే నాట్యశాలకు రమ్మని కీచకుని ఆహ్వానించింది.

ఆ రాత్రి కీచకుడు అందమైన మంచి దుస్తులు, ఆభరణాలు, హారాలు, మాలలు ధరించాడు. విలువైన సుగంధద్రవ్యాలను ఒంటిపై చిలకరించుకుని, పూసుకుని నాట్యశాలకు తరలివెళ్లాడు. అక్కడ తలుపులు తెరిచి ఉండటం గమనించాడు. ఠీవిగా లోపలికి ప్రవేశించాడు. తను కోరుకున్న ఆనందాన్ని అనుభవించబోతున్నందుకు వేగంగా గుండె కొట్టుకుంటోంది.

ఆ మసకచీకట్లో అక్కడ శయ్య మీద, ఎవరో పడుకున్నట్లు చూశాడు. ఆ వ్యక్తి ద్రౌపదేనని భావించి దగ్గరకు వెళ్ళి మృదువుగా మీద చేయి వేశాడు. అక్కడ ఉన్న వ్యక్తి ఎవరో కాదు, భీముడే! కీచకుడి రాకకోసం అంతసేపు నిరీక్షిస్తున్నాడు. చేయి పడటమేమిటి అమాంతం ఆ మంచం మీదనుంచి లేచి కీచకుడి మీదికి ఉరికి అతడి జుట్టు గుప్పెట బిగించిపట్టాడు. అంతట కీచకుడు దెబ్బతిన్నట్లు భయవిస్మితుడైపోయాడు. కాని, అధైర్యపడలేదు. తన ప్రాణాన్ని కాపాడుకునేందుకు పోరాటం సాగించాడు. భీముడు దబ్బుమని నేలమీద పడ్డాడు. అయితే తక్షణమే పిడుగులా వేగంగా లేచి వెళ్లి కీచకుడి గుండెల మీద ఒక్కపోటు పొడిచాడు. అలా పోరాటం కొనసాగుతూనే ఉంది. చివరికి భీముడు దౌర్భాగ్యుడైన ఆ కీచకుడి చేతులు విరిచిపట్టి నేలపై కూలేసి ఈడ్చి ఊపిరాడకుండా మెల్లిగా గొంతు నొక్కేశాడు. కీచకుడిక భీముడి మారణవ్యూహంలోంచి బయటపడి తప్పించుకోలేకపోయాడు. చివరి శ్వాస వదిలేశాడు. అలా కొట్టుకు కొట్టుకు ఆగిపోయిన కీచకుడి కళేబరాన్ని భీముడు నేల మీద పడేసి దొర్లించాడు. బలంగా పోట్లు పొడిచాడు. పిడిగుద్దులు గుద్దాడు. రక్తమాంసాలు బయట తెగిపడేటట్లు కాళ్ళతో కుమ్మి కుమ్మి వదిలిపెట్టాడు. ఆ తరువాత కీచకుడు హతుడైనాడన్న సంతోషకరమైన వార్తను ద్రౌపదికి చెప్పాడు. ఇతరులకెవరికీ తెలియకుండా వడివడిగా తన నివాసాన్ని చేరుకున్నాడు.

తనని వేధించుకు తిన్న ఆ దుర్మార్గుడు అంతమైనందుకు ద్రౌపది ఎంతగానో సంతోషించింది. కావలివారిని లేపి తన గంధర్వపతులు కీచకుని వధించారని చెప్పింది.

వేలకొలది రక్షకభటులంతా చేత కాగడాలు పుచ్చుకుని పరుగు పరుగున వెళ్ళారు. అక్కడ నుగ్గునుగ్గయి పడి ఉన్న కీచకుని మృతదేహాన్ని చూసి విభ్రాంతులయ్యారు. అదేదో మానవాతీతమైన శక్తికలవారి కృత్యమే అయ్యుంటుందని భావించారు. ఆ చేరువనే సైరంధ్రి నిలబడి ఉండటం గమనించిన కీచకుని మిత్రులు కొందరు, ఈమే ఈ ఘాతుకచర్యకి కారకురాలని విరాటరాజుకి చెప్పి ఆయన అనుమతిని పొంది, ఆమెను కూడ కీచకునితోబాటు దహనం చెయ్యాలనే తలంపుతో దారుణంగా ఆమెను పట్టితెచ్చి, పాడెమీద పడుకోబెట్టి శ్మశానానికి బయల్దేరారు. అప్పుడు ద్రౌపది రక్షించమని కేకలు పెట్టింది.

ఆ ఆర్తనాదాన్ని విన్న భీముడు, తక్షణమే పక్కమీదనుంచి లేచి మారువేషం వేసుకుని, పరుగందుకున్నాడు. రాజభవనంలోంచి ఇవతలకు పాకుతూ గోడలు ఎక్కి దూకి బయటపడి, ఒక చెట్టును కూకటివేళ్ళతో పెళ్ళగించి తలక్రిందుగా చేతపట్టుకుని శ్మశానభూమిని చేరుకున్నాడు. అతణ్ణి చూసి అక్కడి వారంతా తమకూ మరణం సమీపిస్తున్నంతగా బెదురు పుట్టి గడగడ వణికిపోయారు. "అదుగో వాడే మహాబలవంతుడు, గంధర్వుడు వస్తున్నా"డని పరస్పరం చెప్పుకోసాగారు. ఆపళంగా సైరంధ్రిని అక్కడే వదిలేసి ఎవరికివారు పారిపోదామనుకుంటూండగా భీముడు వెళ్ళడం, వెనకముందు చూడకుండా వందలమందిని హతం చేసి ద్రౌపదిని తీసుకుని పారిపోవడం క్షణాల మీద జరిగిపోయాయి.

పురజనులు రాజుగారి వద్దకు పరుగిడిపోయి "సైరంధ్రి తప్పించుకుపోయింది. కీచకుడి పరిజనులంతా హతులైనారు. ఆ సైరంధ్రి అందకత్తె కావడంవల్ల తన సౌందర్యంతో అందరిని ఊరిస్తూంది. పురుషులందర్నీ మోహింపజేస్తూంది. కాబట్టి ఏం చేయాలో మీరే ఆలోచించండి" అని చెప్పారు.

రాజుగారికి చెప్పలేనంత బెదురు పుట్టింది. రాణీ సుధేష్ణతో "ఆ సైరంధ్రి తిరిగి రాగానే రాజ్యంనుంచి వెళ్లిపొమ్మని ఆజ్ఞాపించు. గంధర్వుల రక్షణలో ఉన్న ఆ మనిషితో నేనే స్వయంగా చెప్పేందుకు సాహసించలేకుండా ఉన్నాను" అన్నాడు.

ద్రౌపది తన నివాసానికి తిరిగి చేరుకుంది. అక్కడికి రాగానే రాణి ఆమెతో "సైరంధ్రీ! మీ గంధర్వపతులంటే రాజుగారికి భయంగా ఉంది కనుక నీవు మమ్మల్ని ఇంతటితో విడిచి నీ ఇష్టమైన చోటికి వెళ్లవలసిందంటూ" విరాటుడు చెప్పమన్న మాటల్ని చెప్పేసింది. అందుకు సైరంధ్రి "అమ్మా! ఇంక పదమూడు రోజులు మాత్రం నన్నిక్కడ ఉండనీయండి. అప్పుడు నా గంధర్వుపతులు వచ్చి నన్ను తీసుకువెళతారు. అంతవరకు ఆశ్రయమిప్పించండి చాలు. వారుకూడ మీరు చేసిన మేలుకు ఎంతో సంతోషిస్తారు" అని ప్రాధేయపడి, ఆమోదాన్ని పొందింది.



# 6
# గోగణ హరణం

అట్టి పరిస్థితుల్లో దుర్యోధనుని వేగులు పాండవులు దాక్కునేందుకు అనువైన ప్రదేశాలన్నిటిని మాసాల తరబడిగా గాలిస్తూ వచ్చారు. ఎక్కడా ఆచూకీ చిక్కలేదు. వారు పడిన శ్రమంతా వృథా అయింది. చివరికి వారు దుర్యోధనునికి 'పాండవులు బహుశా మరణించే ఉంటా'రని తెలియజేశారు.

అదే సమయంలో మహాబలుడైన కీచకుడు ఒక గంధర్వయోధుని చేత హతుడైనట్లు వార్త అందింది. దుర్యోధనుడా వార్త విని విస్తుబోయాడు. వ్యవధేమో చాలా తక్కువ, ఏం చేయడమా అని ఆలోచించాడు. అప్పుడు కర్ణుడు, "పాండవులున్నారో, లేరో ఎవరికి తెలుసు. ఒకవేళ అడవులలో క్రూరమృగాల వాతబడి ఉండవచ్చు లేదా ఏ అపాయాల్లోనో ప్రమాదవశాత్తు మరణించి ఉండొచ్చు. ఇక వారిని గురించి మర్చిపోవడం మంచిది" అన్నాడు.

కీచకుని చంపగల సామర్థ్యం భీమునికే ఉన్నది. కాబట్టి భీముడే అతణ్ణి చంపి ఉండవచ్చుని, బహుశా పాండవులు మత్స్యదేశంలో దాగి ఉండవచ్చని దుర్యోధనుడు భావించాడు. మత్స్యదేశంపై దండెత్తి విరాటుని గోగణాన్ని స్వాధీనం చేసుకొన్నట్లయితే ధర్మరాజు తన సోదరులతో తమను ఎదుర్కొంటాడని అప్పుడు వారి అజ్ఞాతవాసానికి భంగం కలిగిందని, వారిని మరల అరణ్యవాసం ప్రారంభించమని అదేశించవచ్చని అక్కడ ఉన్న వారితో అన్నాడు.

త్రిగర్త రాజు సుశర్మ తరచూ కీచకుడి చేతిలో ఓటమి పొందుతూండేవాడు. అతడు ఇలా అన్నాడు: "కీచకుణ్ణి గంధర్వుడే కనుక నిజంగా చంపినట్లయితే, ఇప్పుడిక విరాటరాజు నిస్సహాయుడే. అతడు మా శత్రువు. మా పొరుగుననున్న రాజ్యమే అది కాబట్టి మనం ఆ మత్స్యదేశం మీద దండెత్తితే?" అన్నాడు. కర్ణుడు ఆయన అభిప్రాయాన్ని అభినందించి బలపరిచాడు.

సుశర్మ మత్స్యదేశం దక్షిణ దిక్కును ముట్టడించినట్లయితే, అప్పుడిక విరాటరాజు సైన్యమంతా ఆ దిశని రక్షించేందుకు తరలివస్తుంది గదా! ఆ అదను కనిపెట్టి దుర్యోధనుడు కౌరవసైన్యంతో విరాటరాజు ఊహించని విధంగా ఉత్తర దిశవైపు దండెత్తితే అప్పుడిక ఎటూ రక్షించుకోలేని పరిస్థితి ఏర్పడుతుంది అని నిర్ధారించారు.

బహుళ అష్టమి నాడు కౌరవ రాజులు రెండు సైన్య విభాగాలుగా విడిపోయి విరాటరాజు గోగణాన్ని దొంగలించి తేవాలని పన్నాగం పన్నారు.

అది పాండవుల అజ్ఞాతవాసానికి ఆఖరి రోజు. విరాట రాజు గోగణాన్ని కౌరవులు దొంగలించారు. పాపం పసుల కాపరులు తమ గోవుల్ని రక్షించుకోలేకపోయారు. తక్షణం రాజుగారి కొలువు కూటానికి పరుగుదీశారు. వినయంగా రాజును సమీపించి, "ఓ రాజా! త్రిగర్తులు వచ్చి మన వేలాది గోవుల్ని తోలుకుపోతున్నారు. వారు పట్టుకుపోకుండా త్వరగావెళ్లి మన గోవుల్ని విడిపించి తేవాలి ప్రభూ" అని విన్నవించారు. వెంటనే రాజు ఏనుగులు, రథాలు, గుఱ్ఱాలు, కాలిబంట్లు అనే నాలుగు విధాలైన సైన్యసన్నాహాలతో శత్రువులను తరిమేందుకు సిద్ధమయ్యాడు.

విరాటుని తమ్ములు శతానీకుడు, మదిరాశ్వుడు, ఆయన పెద్దకుమారుడు శంఖుడు యుద్ధసన్నద్ధులై నిలిచారు. రాజుగారి రథానికి పూన్చేందుకు గుర్రాల్ని తెచ్చినప్పుడు విరాటుడు శతానీకునితో, కంకుడు, వలలుడు, తంత్రీపాలుడు ఇంకా శౌర్యవంతుడైన దామగ్రంథి యుద్ధంలో సాయపడగలవారు కాబట్టి వారందరికి రథాలు కవచాలు ఏర్పాటు చేయమని చెప్పాడు. అప్పుడు పాండవుల్లో అర్జునుడు తప్ప తక్కిన నలుగురు రాజాజ్ఞ ప్రకారం ఉత్సాహంగా రథాలెక్కారు.

సైన్యం నగరాన్ని దాటి పొలిమేరవైపు ప్రయాణం సాగించింది. పోరు ప్రారంభమైంది. త్రిగర్తాధీశ్వరుని సోదరులు బలశాలులైన యోధులు. కీచకుడే జీవించి ఉన్నట్లయితే, తక్షణమే అవతలవారి సైన్యం వచ్చిన దోవపట్టి ఉండేది. అతడు లేకపోవడంవల్ల విరాట రాజు ఆ శత్రురాజైన సుశర్మను ప్రబలుడుగా భావించాడు. సుశర్మ విరాటుని కలుసుకున్నాడు. ఇరువురికి ద్వంద్వయుద్ధం జరిగింది.

యుద్ధరంగమంతా దుమ్ములేచి దుప్పటి కప్పినట్లు దుమ్ముతో కప్పబడిపోయింది. సుశర్మ మత్స్యపతిని ఖైదు చేశాడు. విరాటుని వింటిని రెండు ముక్కలు చేశాడు. అతడు తన రథాన్ని కోల్పోయాడు. కాని, ప్రాణాలతోనే ఉన్నాడు. అప్పుడు సుశర్మ అతణ్ణి తన రథం మీద ఎక్కించుకుని వడివడిగా రథాన్ని పోనిస్తున్నాడు. తమ రాజును చెరబట్టి శత్రురాజు తీసుకువెళుతూండటం చూసిన మత్స్యరాజు సైనికులు భయపడి తలొకదారినబడి పారిపోతున్నారు. వెంటనే యుధిష్ఠిరుడు భీమునితో “భీమా! వెళ్లి రాజును విడిపించుకు తీసుకురా. ఆయన శత్రురాజుల చేజిక్కి ఖైదీగా ఉండటానికి వీల్లేదు” అనడమేమిటి, అంతే, భీముడు దగ్గర్లో ఉన్న ఒక చెట్టును అమాంతంగా వేళ్ళతోసహా పెళ్ళగించేశాడు. అంతట యుధిష్ఠిరుడు నవ్వి, “భీమా నా మాట విను, అటువంటి పనిమాత్రం చెయ్యకు, మనల్ని ఎవరూ గుర్తుపట్టరాదు. నీవు కనుక అలా చేస్తే మాత్రం గుర్తుపట్టేస్తారు. కాబట్టి దయచేసి మిగతావారి మోస్తరే పోరాడాలి సుమా!” అని హెచ్చరిక చేశాడు.

అప్పుడు భీముడు, అతని సోదరులైన నకులుడు, సహదేవుడు రథం మీదెక్కి వేగంగా సుశర్మ వైపు పోనిచ్చారు. యుధిష్ఠిరుడు వారిని అనుసరించాడు. ఆ నలుగురు సోదరులు త్రిగర్తాధీశుని పోరుకి కవ్వించారు. ఆ నలుగురు యోధుల అండచూసుకుని విరాటుడు ఎక్కడలేని బలంతో సుశర్మ రథం మీదనే కూర్చుని అతడితో పోరుసల్పాడు.

ఉన్నట్టుండి భీముడు సుశర్మ రథంలోకి ఒక్కదూకు దూకాడు. ఆ సుశర్మ మెడపట్టుకున్నాడు. తీసుకువచ్చి తన రథం మీద కూర్చోబెట్టి యుధిష్ఠిరుని ఎదుట నిలబెట్టాడు. యుధిష్ఠిరుడు సుశర్మని వదిలిపెట్టమని, అతడెలాగూ విరాటునికి లొంగిపోయినట్లేనని అంతకుమించి శిక్షించడం అనవసరం వదిలిపెట్టెయ్యమని చెప్పాడు.

సుశర్మ అవమానంతో రగిలి సెగలు కక్కుతున్న మొహంతో వారి ఎదుట నుంచి నిష్క్రమించాడు. ఈ విధంగా



శత్రువుని తరిమికొట్టి గోగణాన్ని పట్టితెచ్చారు పాండవులు. ఆ నలుగురు పాండవులు చేసిన సహాయానికి విరాటరాజు చెప్పలేనంత సంతోషించాడు. తరువాత విరాటరాజు ఆనందభరితుడై పాండవులకు ధన్యవాదాలర్పించాడు.

"ఈనాడు నన్ను రక్షించింది మీ పరాక్రమమే. విజేతనంటూ నాకు కీర్తి కట్టబెట్టింది మీ శౌర్యమే. అందువల్ల ఈ మత్స్యదేశానికి మీరంతాకూడ ప్రభువులనే భావిస్తున్నాను. నా సంపదలన్నీ మీకు సంపదలే. మీ ఋణం నేనెలా తీర్చుకోవాలో, ఎలా తీర్చుకోగలనో చెప్పండి" అని అర్థించాడు.

అప్పుడు యుధిష్ఠిరుడు "ఓ రాజా! మేము ఏదో తగుపాటి సాయం చేయగలిగినందుకు మా కెంతో సంతోషంగా ఉంది. మీరు మాకు ఉండడానికి ఆశ్రయమిచ్చారు. దాని ముందు మేము మీకు చేసిందేపాటి... కేవలం కృతజ్ఞత చూపుకునేందుకు మాకిదో తరుణం కలిసివచ్చిందంతే..." అని అన్నాడు. అంతగా చెప్పినప్పటికీ విరాటరాజు మాటలతో సంతృప్తిచెందలేదు.

"రండి, మీరందరూ మత్స్యదేశాధీశులే మిమ్మల్నందరినీ నేను పట్టాభిషిక్తుల్ని చేయాలి. మీ అందరికి నేను సాష్టాంగవందనం చేయాలి. సమయానికి నాకు మీరందించిన అండదండలవల్లే నేనీ రోజున నా రాజ్యాన్ని నా బిడ్డలను మళ్ళీ చూడగల్గుతున్నాను అందుకు నా కృతజ్ఞతను తెల్పుకోవాలి" అన్నాడు.

యుధిష్ఠిరుడప్పుడు రాజుగారిని, "మీ విజయవార్తను నగరంలో నలుమూలలా ప్రకటించేందుకు సేవకుల్ని పంపవలసింది" అన్నాడు. దానితోబాటు విజయవంతంగా తమ రాజు రాజధానికి తిరిగి వచ్చిన సందర్భంలో విజయోత్సవానికి కావాల్సిన ఏర్పాట్లన్నీ చేయించమని ఆదేశించాడు. వారంతా రణరంగంలోనే ఆ రాత్రంతా ఎంతో సంబరంగా గడిపారు. సూర్యోదయానంతరం నగరానికి వెళ్ళాలని నిశ్చయించుకున్నారు.

## 7

## ఉత్తరుని ప్రగల్భాలు

విరాటరాజు త్రిగర్తాధీశుని వెంబడించి తరిమేందుకు వెళ్ళిన సమయం కనిపెట్టి దుర్యోధనుడు, భీష్ముడు ఇంకా మరికొందరిని తీసుకుని విరాట రాజ్యాన్ని ఉత్తర దిశ నుండి ముట్టడించాలని పన్నాగం పన్నారు.

కౌరవ సైన్యం తగినంత కట్టుదిట్టంగా బయల్దేరి వెళ్ళి వారి అసంఖ్యాకమైన గోగణాన్ని చుట్టుముట్టింది.

అప్పుడు పసులకాపరుల ముఖ్యుడు వెంటనే రాజధాని నగరానికి పరుగున వెళ్ళి విరాటరాజు కుమారుడైన ఉత్తరునితో "ఓ రాకుమారా! కౌరవులు దండెత్తి వచ్చారు. వారు మనల్ని, మన గోగణాన్ని దోచుకుంటున్నారు. విరాటరాజుగారు త్రిగర్తాధీశుడైన సుశర్మతో పోరాటానికి దక్షిణ దిశకు వెళ్ళారు. ఇట్టి పరిస్థితుల్లో మాకేం చేయాలో తోచడంలేదు. ఇప్పుడు మమ్మల్ని రక్షించేందుకు ఎవరూ లేరు. మీరు రాకుమారులుగదా కనుక, మీరే మమ్మల్ని రక్షించాలని కోరుతున్నాం.



"రాజ్యంలో ఇంత ప్రమాదస్థితి సంభవించి, కల్లోలంగా ఉంటే మీపాటికి మీరు హాయిగా వీణ వాయించుకుంటూ కూర్చుంటారా? ఆ వీణ ముందు అవతలపెట్టి, విల్లు చేతబట్టండి. నారి సారించి గంభీర నాదాన్ని నింపండి. వింట బాణం సంధించి శత్రువుల గుండెల్ని గుభేలు మనిపించండి. ఇప్పుడు మనకు అటువంటి సంగీతం కావాలి" అన్నాడు.

ఆ పనులకాపరుల నాయకుడు ఆ విధంగా రాకుమారునితో అందరి ఎదుట, ముఖ్యంగా అంతఃపుర స్త్రీల ఎదుట ఫిర్యాదు చేయడంతో రాకుమారుడు రోషపడి డాంబికంగా ధైర్యాన్ని ప్రదర్శిస్తూ ఠీవిని ఒలకబోస్తూ "నాకు తగిన రథసారథి లేక ఆలోచిస్తున్నాగానీ, లేకపోతే నాకిదో లెక్కా, ఇట్టే శత్రువుల్ని చెండాడి, అట్టే గోగణాన్ని విడిపించనా...! ఇటీవలే నా సారథి ఒక ఘోరయుద్ధంలో మరణించాడు. సుమారుగా నెల అయ్యుంటుంది" అని అన్నాడు.

"నాకు తక్షణమే ఒక మంచి సారథి కావాలని చెబుతూనే ఉన్నాను. నేను శత్రువుల్ని చూసి బెదిరేవాణ్ణి కాను. యుద్ధంలో పోరాడుతున్నప్పుడు నన్ను చూసినవారు అర్జునుడే అనుకుంటారు అంతబాగా పోరాడగలవాడు, అతణ్ణి మించినవారెవరున్నారు? నాపై నాకంతటి నమ్మకముంది" అని డంబాలు పలికాడు.

ఉత్తరుడు చెబుతున్న మాటలన్నీ విన్న ద్రౌపది రాకుమారి వద్దకు పరిగెత్తుకువెళ్ళి "రాకుమారీ! మీ సోదరుడు తమకు తగిన సారథి లేనందువల్ల పోరుకి పోలేనంటున్నాడు, నాకు తెలిసిన ఒక సారథి ఉన్నాడు, అతడు సహాయపడగలడు, సమర్థుడు అని నా ఉద్దేశం. ఎవరో కాదు బృహన్నలే. అతడు మంచి రథసారథి. అర్జునుడికి రథసారథ్యం వహించేవాడు. నేను అప్పట్లో పాండవుల రాణి ద్రౌపదిదేవికి పరిచారికనై ఉన్నప్పుడు ఇతడు అర్జునుడి వద్దనే ధనుర్విద్యాభ్యాసం చెయ్యడం కూడ నేనెరుగుదును. అందుకని రాకుమారుడు ఉత్తరుని రథానికి సారథ్యం వహించమని బృహన్నలని ఆజ్ఞాపించండి" అని సలహా చెప్పింది.

సమయానికి కావలసిన అంత చక్కని సలహా నందించినందుకు ఎంతో సంతోషపడింది రాకుమారి. తక్షణమే సోదరుని చేరుకుని "బృహన్నల సారథ్యం వహించడంలో మహానైపుణ్యం ఉన్నవాడట. అర్జునుడంతటివాడికి కూడ సారథ్యం నెరపాడట... అని సైరంధ్రి నాకు చెప్పగా తెలిసింది కనుక, అతణ్ణి నియమించుకో. బయల్దేరు మనవారిని రక్షించు, నీ ప్రతాపం చూపించు" అని పోరి పోరి చెప్పింది.

## 8

## అర్జునుడు ఉత్తరకుమారునికి ధైర్యం చెప్పటం

రాకుమారుని ఒప్పించి తక్షణమే రాకుమారి నాట్యశాలకు పరుగిడిపోయి బృహన్నలతో, "మీరు రథ సారథ్యం వహించాలి అత్యవసరం" అంటూ పరిస్థితిని తెలియజెప్పింది.

బృహన్నల యుద్ధానికి వెళ్ళేందుకు కావలసిన సామగ్రిని, పరికరాలన్నిటిని రాకుమారి సిద్ధం చేయించింది. కాని బృహన్నల తానేమి ఎరుగనట్లు ఏంచేయాలో, ఎలా ధరించాలో తెలియనట్లు నటించసాగాడు. ఆ అంతఃపురంలో ఉన్న ఆడపిల్లలంతా నవ్వుకునేటట్లు మూర్ఖుడిలాగా ప్రవర్తించాడు. అప్పుడిక రాకుమారుడే బృహన్నలకు కవచం తొడిగాడు. ఆ తతంగమయ్యాక ఉత్తరుడితో "నేను సిద్ధమే రాకుమారా! ఎక్కడికి వెళ్లాలంటే అక్కడికి తీసుకువెళతా చెప్పండి" అన్నాడు. అప్పుడు ఉత్తరుడు "ఆ కౌరవులున్న చోటికి తీసుకువెళ్లు నా శత్రువుల్నెదుర్కొనే వరకు నాకు స్థిమితం లేదు, పద" అన్నాడు. సరేనని, ఆదేశించిన ప్రకారం బృహన్నల కౌరవులున్న దిశకు రథం పోనిచ్చాడు.

రణభూమిలో వ్యూహరచనా విధానంగా అమర్చబడి ఉన్న శత్రుసైన్యాన్ని వారు చూశారు. అది

పెద్ద పెద్ద సైనికదళాలతో మహాసముద్రంలా కనబడుతోంది. కర్ణుడు, దుర్యోధనుడు, అది చూసి భీష్ముడు ఆ కురుసైన్యానికి ప్రధానులై నడిపిస్తున్నారు. ఉత్తరుడి నరనరాలు బలహీనమైపోయాయి. చాలా శోచనీయమైన స్థితిలో పడిపోయాడు. గడగడ వణికిపోతూ, బృహన్నలతో "ఈ యుద్ధం నా వల్ల కాదు, కానేకాదు, తిరిగి వెళ్లిపోతాను. ఆ కౌరవులు గోవుల్ని తీసుకుపోతేపోనీ, నేనే మాత్రం లెక్కచెయ్యను. వారా ఊహించలేనంత మహాబలశాలురు, వారిముందు నేనెంత? నా బలమెంత? అంతటి శక్తిమంతులతో నే తలపడడంలో అర్థంలేదు, నిష్ఫలం, అందుకని రథం మళ్ళించమంటున్నా, రథం రాజభవనానికే పోనీ లేకపోతే నేనీ రథం మీద నుంచి దూకి నడిచి అయినా పోతాగాని యుద్ధం మాత్రం చెయ్యను" అంటూ తన రాజమర్యాదను, తీవిని విడనాడుకుని రథం మీది నుంచి ఒక్క దూకు దూకాడు. ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని నగరం వైపు పరుగు లంకించాడు.

అప్పుడిక బృహన్నల అతణ్ణి పోనీయకుండా ఎలాగైనా ఆపాలని "ఓ ఉత్తరకుమారా! బ్రతకాలనుకుంటే క్షత్రియుడిలాగానే బ్రతకాలి. పిరికివై బ్రతకడంకన్నా మరణం మేలు" అని హెచ్చరికలు చేస్తూ వెంటబడ్డాడు. ఉత్తరుడు వందగజాలు కూడా వెళ్ళకుండానే బృహన్నల అతణ్ణి పట్టేశాడు.

బృహన్నల చేతచిక్కిన ఉత్తరుడు ఏంచేయలేక ఏడుపు మొదలుపెట్టాడు. "ఓ బృహన్నలా! రథం మళ్ళించు వెళ్ళిపోదాం..., ఊపిరితో ఉంటే ఉప్పు అన్నం తిన్నా చాల్లే... బ్రతికుంటే భాగ్యమే దొరకదా?... నా మాట వినవా..., నే చెప్పినట్లు చేశావంటే, నీకు వంద మేలిమి బంగారు నాణాలు బహూకరిస్తా" నని కాళ్ళా వేళ్ళాబడి బ్రతిమాలుకున్నాడు. కాని బృహన్నల అతణ్ణి వదలకుండా గట్టిగా పట్టుకుని, "ఓ రాజకుమారా! నీవు నీ శత్రువులతో యుద్ధం చెయ్యొద్దనుకుంటే పోనీ, చూడు..., వచ్చి ఈ గుర్రాల్ని అదుపులోపెట్టు నేను వెళ్ళి వారితో పోరాడతాను" అంటూ అతడు ఉత్తరుని శమీవృక్షం దగ్గరకు తీసుకువెళ్లాడు.

"ఊ... ఇప్పుడిక త్వరగా చెట్టుపైకి ఎక్కి ఆ చిటారు కొమ్మల గుబుర్లలో పాండవుల ఆయుధాలుంటాయి, వాటిని క్రిందికి పట్టుకురా, ఎక్కు" అన్నాడు.



"అయ్యో! అక్కడేదో శవం వేలాడుతుందే, ఎలా ఎక్కను. నేనింతటి మహారాజునై ఉండి నా చేతులతో దాన్నెలా ముట్టుకోను?" అంటూ బిక్కమొహం పెట్టాడు. "భయపడకు అక్కడే శవమూ లేదు, అక్కడున్నది ఆయుధాలే" అన్నాడు బృహన్నల. బిక్కుబిక్కుమంటూ ఉత్తరుడు చెట్టు పైకి ఎక్కాడు. తళతళ మెరిసిపోతున్న ఆ ఆయుధాల కట్టను క్రిందికి తెచ్చాడు.

"ఈ ఆయుధాలెవరివి?" అనడిగాడు ఉత్తరుడు. "ఈ ధనుస్సుందే... దీన్ని గాండీవం అంటారు. ఇదేమో అర్జునుడిది. ఈ గద భీముడిది, ఈ మిగతావన్నీ యుధిష్ఠిరుడు, నకుల సహదేవులవన్నమాట" అని బదులు పలికాడు బృహన్నల.

"అయితే వారంతా ఏరీ? ద్రౌపది ఎక్కడుంది?" అని ప్రశ్నించాడు ఉత్తరుడు.

"నేను అర్జునుణ్ణి..., మీ తండ్రిగారి ఆప్తుడై రాజసభలో ఉన్నాడు యుధిష్ఠిరుడు. భీముడు మీ రాజభవనంలో వంటలవాడు. మీ గుర్రాలను, గోవులను సంరక్షించేవారే నకుల సహదేవులు. మా అర్ధాంగి ద్రౌపదియే రాణివాసంలో కేశాలంకరణాదులు చేసే సైరంధ్రి"... అని సూటిగా బదులు చెప్పేశాడు.

ఆ మాటల్ని ఉత్తరుడు నమ్మలేకపోయాడు. "అయితే, ఒక పని చెయ్యాలి. నీవు కనుక అర్జునుడికున్న పది పేర్లేవో చెప్పగలిగితేనే నేను నీ మాటలు నమ్ముతాను, అంతవరకూ నమ్మను"..., అన్నాడు ఉత్తరుడు. అప్పుడు అర్జునుడు నవ్వి, "అయితే విను శ్రద్ధగా, ఆ పది పేర్లూ చెబుతా..." అంటూ, "అర్జున, ఫల్గున, పార్థ, కిరీటి, శ్వేతవాహన, బీభత్స, విజయ, జిష్ణు, సవ్యసాచి, ధనంజయ" అంటూ పేర్లన్నీ ఏకరువు పెట్టి (అర్జునము=ఏరుమద్ది అని ఒక చెట్టు పేరు, తెలుపు, బంగారు, పరిశుద్ధము)



1. చేతలలో పరిశుద్ధుడు దేహచ్ఛాయ బంగారు వన్నె, కాబట్టి 'అర్జునుడు' అని,

2. ఉత్తర ఫల్గుణీ నక్షత్రంలో జన్మించబట్టి 'ఫల్గును' డని,

3. కోపమే రాదు... వచ్చిందంటే ఎవ్వరూ దగ్గరకు రాలేరు. ఇతరులకు జయింప నలవికానివాడు, ఇంకా శత్రువులకు భయంకరుడు కనుక 'జిష్ణు' డని,

4. 'పృథ' అను తల్లికి తనయుడు కనుక 'పార్థుడు' అని,

5. యుద్ధంలో ఎప్పుడూ తెల్లని గుర్రాలు పూన్చిన రథమే ఎక్కుతాడు కనుక 'శ్వేతవాహను' డని

6. ఎంతటి వీరులనైనా గడగడ లాడించి భీతి కలిగిస్తాడు కనుక 'బీభత్సు' డని

7. అపజయమన్నది ఎరుగనివాడు కనుక 'విజయు' డని

8. పోరాడే సమయంలో తలపై సూర్యోదయమైనట్లు కాంతులీనే ఇంద్రుడిచ్చిన కిరీటం అమరివుండటం వల్ల 'కిరీటి' అని

9. రెండు చేతులా బాణప్రయోగం చేయగలవాడు కనుక 'సవ్యసాచి' అని

10. రాజసూయయాగంలో ధరణినంతా గెల్చి ధనరాశులు తెచ్చినందువల్ల 'ధనంజయు' డని పేర్లు గలిగాయని వివరంగా చెప్పాడు.

ఉత్తరుడు తృప్తిపడ్డాడు. అప్పుడిక అర్జునుని దరిచేరి, సగౌరవంగా "నా అదృష్టంవల్ల మిమ్మల్ని చూడగలిగాను. నేనజ్ఞానం చేత పొరబాటున ఏదైన మాట్లాడి ఉంటే మన్నించండి. నేనిక మీకు సారథి నవుతాను, ఎటువెళ్లాలో సెలవియ్యండి అటు తీసుకువెళతా" నని మన్ననగా అడిగాడు.

"నీవు సారథ్యం వహిస్తానన్నందుకు నాకూ సంతోషంగా ఉంది. నేను మీ శత్రువులందర్నీ చెండాడుతాను. హతమార్చేస్తాను, అమ్ముల పొదులనన్నీ తెచ్చి రథానికి కట్టేసెయ్. బంగారు పిడితో ఉన్న కత్తిని మాత్రం నీవు ధరించు" అన్నాడు.

## 9
## ఉత్తర గోగ్రహణం

అర్జునుడి రథం పిడుగుపాటు వేగాన వెళుతూంటే భూమి కంపించిపోయింది. అర్జునుడు మత్స్యపతుల పతకాన్ని తీసి, రథంపై వానర చిహ్నితమైన తన కపిధ్వజాన్ని ఎగురవేశాడు. గాండీవమనే ధనుస్సు నారి సారించాడు. ఆ ధ్వని చెవినబడగానే కౌరవసేన భయంతో దద్దరిల్లిపోయింది. వారి గుండెలు దడదడలాడాయి.

గాండీవ ధనుష్టంకారాన్ని, దేవదత్త మనే శంఖానాదాన్ని విని ద్రోణుడు పులకరించిపోయాడు. ఆశ్చర్యచకితుడై, "అడుగో అర్జునుడు, ఇటే వస్తున్నాడు. అతడంటే మన సైన్యానికి హడలే, ముందు మన సైన్యం చెల్లాచెదరైపోకుండా చూడాలి" అని హెచ్చరించాడు ఆచార్య ద్రోణుడు.

ద్రోణుడు అర్జునుని పొగడటం దుర్యోధనుడికి ఏమాత్రం నచ్చలేదు. సహించలేకపోయాడు, అందుకు దుర్యోధనుడు... "అదేమిటి? పాండవులు పన్నెండేళ్ళు అరణ్యవాసం చేసి, తరువాత ఒక ఏడాది అజ్ఞాతవాసం చేస్తామని శపథం చేశారుగదా... ఈ ఏడాది వారికి అజ్ఞాతవాసం; ఇంకా పదమూడో ఏడు పూర్తికాకుండానే అర్జునుడు ముందుగా ఎదురయ్యాడు,



నియమోల్లంఘనమైంది, కాబట్టి పాండవులు తిరిగి పన్నెండేళ్ళు వనవాసం చెయ్యవలసిందే."

"భీష్ముడు హెచ్చుతగ్గులు రాకుండా అరణ్య, అజ్ఞాతవాస కాలాన్ని సరిగ్గా లెక్కవేసి మనకు తెలియజేస్తాడు... ప్రస్తుత పరిస్థితిలో అర్జునుని ఎదుర్కోవడం మన కర్తవ్యం" అని చెప్పాడు. అర్జునుడు వచ్చాడని భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడు తమ తమ రథాలెక్కి మెదలకుండా కూర్చున్నాడు.

"అర్జునుడు వస్తేమాత్రం...? అంత భయపడాల్సిన అగత్యమేమిటి? అతడిని చూసి మనం ఎందుకు బెదరాలి? అక్కర్లేదే... అనవసరం. మనం మన సైన్యాన్ని అతను బెదరగొట్టలేని తీరున మనమే వ్యూహరచన చేసుకోవాలి" అన్నాడు దుర్యోధనుడు.

అప్పుడు కర్ణుడు కల్పించుకుని, పెద్దల నుద్దేశించి, "మీ ముఖాల్లో ఏదో విపరీతమైన భయమూ, యుద్ధమంటే అయిష్టత నాకు కనబడుతోంది!... నేనొంటరిగానే పోరుసల్పి, దుర్యోధనుని కిచ్చిన మాట నెరవేర్చుకుంటాను... యుద్ధంలో అర్జునుని హతమార్చి తీరుతాను" అంటూ మామూలు ధోరణిలో తన ప్రతాపం ప్రదర్శించాడు.

కర్ణుని మాటల వైఖరి కనిపెట్టి కృపాచార్యుడు "అది వట్టి బుద్ధిహీనత, మనం గెలవాలనుకుంటే, అర్జునుని ఎదుర్కోవాల్సిన తీరుతెన్నులు మనమే నిర్ధారించుకోవాలి. అప్పుడైతేనే మనం గెలవగల్గుతాం. అందువల్ల అక్కరమాలిన ప్రజ్ఞలు, ప్రతాపాలు, విరోధాలు కట్టిపెట్టడం మంచిది" అని చీవాట్లు పెడుతున్నట్లు చెప్పాడు. కర్ణుడికి పట్టరానంత కోపమొచ్చింది.

"ఆచార్యులకు ఎప్పుడూ అర్జునుని ఘనత చెప్పుకోవడంలోనే అమితానందం. అంత భయస్థులెవరైనా ఉంటే యుద్ధం చెయ్యక్కర్లేదు. వారు నేను చేసే యుద్ధాన్ని తటస్థంగా ఉండి చూస్తే చాలు" అని ఎద్దేవాగా మాట్లాడాడు కర్ణుడు.

కర్ణుడు పెద్దల్ని ఆ విధంగా అగౌరవపరచడం అశ్వత్థామకి గిట్టలేదు. అప్పుడు అశ్వత్థామ "ఇంకా యుద్ధంలో గెలవనూ లేదు, గోగణాన్ని హస్తినకు చేర్చనూ లేదు, ఎందుకొచ్చిన ప్రగల్భాలివి. ఔనూ, అసలు ఈ డంబాలు చెప్పే శూరులంతా పాండవుల్ని ఏ యుద్ధంలో ఓడించారో? మీరు కులకాంతయిన ద్రౌపదిని సభలోకి ఈడ్చుకు వచ్చారు. అదో ఘనకార్యమనుకుంటున్నారు. అర్జునుడితో యుద్ధం చెయ్యటమంటే, పాచికలాటలో పాచికలు విసిరేసినట్లు కాదు, చూస్తారుగా మీకే తెలుస్తుందిలెండి"... అంటూ ఉన్నమాట చెప్పేశాడు. ఆ మాటలు విన్న తరువాత కౌరవసైన్యాధిపతుల సహనం పూర్తిగా సన్నగిల్లిపోయింది. ఇదంతా చూస్తూ భీష్ముడు అమితవేదన పడ్డాడు.

"బుద్ధిమంతుడు తన గురువులను దూషించరాదు, అవమానించరాదు. ఓ అశ్వత్థామా! నీవు కర్ణుని మాటలను అంతగా పట్టించుకోనక్కర్లేదు. విరోధాన్ని పెంచేందుకు, భేదాభిప్రాయాల్ని నాటేందుకు ఇది సమయం కాదు. నా మాట విని ద్రోణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ... మీరు కర్ణుని మాటలు మర్చిపోండి, మన్నించండి. మనమందరమూ ఏకమై పోరాడితేనే అర్జునుని గెలువగలం" అని భీష్ముడు వారికి హితవు చెప్పాడు.

తరువాత భీష్ముడు దుర్యోధనునితో, "పాండవులిచ్చిన మాటప్రకారం పదమూడు సంవత్సరాల అరణ్య, అజ్ఞాతవాస కాలవ్యవధి నిన్నటితోనే ముగిసింది. ఆ తరువాతనే అర్జునుడు కనబడటం జరిగింది కనుక నీ ఊహ తప్పు, సరైనది కాదు.



"ఆ గాండీవాన్ని సారించిన నాదం నా చెవినబడగానే అనుకున్నా, ఇక నీ పాలనకి ఉద్వాసన అయినట్లేనని, అర్జునుడు యుద్ధానికి రానున్నాడని అప్పుడే తెలిసింది.

"అర్జునుడితో యుద్ధానికి దిగేముందు ఆలోచించి మరీ దిగు. నీవు కనుక పాండవులతో విరోధభావం లేక సఖ్యతగా, శాంతిగా ఉండాలనుకుంటే ఇదే సరియైన తరుణం, ఆలోచించి చూడు"...అన్నాడు.

"నీకు ఘనత, గౌరవమిచ్చే సంధి కావాలా? లేక అందరిని హతమార్చి అనర్థాలు కలిగించే యుద్ధం కావాలా?" అనడిగాడు భీష్ముడు. అందుకు దుర్యోధనుడు "నేను సంధి కోరుకోవడం లేదు. నేను పాండవులకు ఆఖరికి ఒక్క ఊరుకూడా ఇవ్వను. అందుకని యుద్ధానికి సిద్ధం" అన్నాడు. అప్పుడు భీష్ముడు "అయితే తక్షణం నాల్గోవంతు సైన్యాన్ని నగరం వైపు మళ్ళించు. మిగతా కొంత సైన్యంతో గోగణాన్ని చుట్టుముట్టి వశంచేసుకోవాలి. ఆ మిగిలిన సైనికబలసాయంతో అర్జునునితో పోరాడాలి.." అంటూ దుర్యోధనుని పంపి, భీష్ముడు సైనికదళాలను యుద్ధభూమిలో వ్యూహరచనా విధానంలో ఏర్పాటుచేసి యుద్ధానికి సన్నద్ధం చేశాడు.

కర్ణుడు ముందుగా నిలబడి అర్జునునిపై బాణవర్షం కురిపించాడు. కాని అర్జునుడు ఒంటరిగానే అంతమంది కౌరవ వీరులను ఎదుర్కొవడానికి సిద్ధంగా నిలబడ్డాడు. అతడి బాణాలకి వందలమంది నేల కొరిగారు. అర్జునుడి బాణ కౌశలాన్ని చూసి ద్రోణుడు విస్తుబోయాడు. సైనికులంతా భయావహమైన ఆ దృశ్యాన్ని చూస్తూ నిశ్చేష్టులై నిలబడిపోయారు. అర్జునుడు బాణవర్షం కురిపించడంతో భీష్ముడి శరీరంలో పదిచోట్ల బాణాలు నాటుకున్నాయి. దాంతో ఆయన వెనుకంజ వేశాడు. అప్పుడు అర్జునుడు ఉత్తరుడితో "దుర్యోధనుడేడీ... కనబడటంలేదే... కొంపదీసి ప్రాణాలు దక్కించుకోవాలని పారిపోయాడేమో... మనమిప్పుడు తక్షణమే అతణ్ణి వెంటాడాలి. ఉత్తరా! రథాన్ని దుర్యోధనుడి వైపు నడపాలి, పోనీ" అన్నాడు.

కృపాచార్యుడు అర్జునుని అభిప్రాయాన్ని గ్రహించాడు. "అర్జునుడు దుర్యోధనుని వెంబడించాలనుకుంటున్నాడు. మనం వెళ్ళి అర్జునుణ్ణి ముట్టడిద్దాం. అతడు క్రోధావేశంలో ఉన్నప్పుడు ఎవ్వరూ ఒంటరిగా వెళ్ళి అతణ్ణి ఎదిరించడం సాధ్యంకాదు. దుర్యోధనుడే మరణిస్తే, ఆ గోవులు, సంపదలూను ఎవరు కావాలనుకుంటారు పదండి" అన్నాడు.

ఇలా అంటూండే లోపలే అర్జునుడు సైనికులపై తీవ్రంగా బాణవర్షం కురిపిస్తూ తన రాకను తెలియజేశాడు.

అంతటా బాణాలతో ముంచెత్తేప్పటికి ఆ యోధులకు అంతా చీకటి అలుముకోవడంతో ఏమీ కనబడలేదు. వారికిక ఎటూ తోచని పరిస్థితి ఏర్పడింది. తప్పించుకుని పారిపోయే మార్గమేదీ తెలియలేదు. అంతే, అర్జునుడు శత్రువుల్ని ఆక్రమించి, గోవుల్ని వశంచేసుకున్నాడు; అప్పుడిక దుర్యోధనుడి వైపు సాగాడు.

## 10

## దుర్యోధన గర్వభంగం

ఒకవైపు నుంచి కర్ణుని పక్షంలోని శక్తిమంతులైన యోధులు అర్జునునిపై దాడిచేశారు. మరోవైపు నుంచి భీష్మ, ద్రోణ, కృపాచార్యులు అతణ్ణి ముట్టడించారు. వారిమధ్య అప్పుడొక భయంకర పోరాటం జరిగింది.

అర్జునుని గుర్రాలు గాయపడ్డాయి. అయినా అతడు వెనుదీయలేదు. తన గాండీవాన్నే చేయూతగా చేసుకొని రణరంగం నుంచి తప్పించుకుని పారిపోతున్న కర్ణుని తీవ్రంగా గాయపరిచాడు. కర్ణుడు నిష్క్రమించగానే, సూర్యుడు తన కిరణాలతో నేలంతా కప్పిపెట్టినట్లు, మిగతావారూ దుర్యోధనుని నాయకత్వంలో అర్జునుడిపై బాణాలు గుప్పించారు. అర్జునుడు గాండీవాన్ని ఎక్కుపెట్టి, అందుకు పదింతలు శరవర్షం కురిపించాడు. శత్రువులు



అతణ్ణి సమీపించినప్పుడు అతడి రథం మాత్రమే కనబడింది. అర్జునుని శౌర్యాన్ని చూసి, బెదురుపుట్టి కురుసైన్యం శక్తినంతటినీ కోల్పోయింది. అర్జునుడు పన్నెండు బాణాలు దుశ్శాసనుడి మీదికి, మూడు బాణాలు కృపాచార్యుల మీదికి ప్రయోగించాడు. ఆరు బాణాలతో భీష్ముడి శరీరం తూట్లు చేశాడు. ఆ తరువాత ద్రోణుడి వైపు కదిలాడు.

ఉత్తరుడితో "చూడు, ద్రోణునిపట్ల నా భక్తి గౌరవాలు ప్రత్యేకమైనవి. కాబట్టి ముందు రథాన్ని ఆయన చుట్టూ ప్రదక్షిణం చేయించాలి, ఆయనకు నేను వందనం చేయాలి. ఆయన మొదట నాపై దాడిచేసి కవ్వించిన తరువాతనే నేను ఎదురు తిరుగుతాను. అప్పుడైతే ఆయనకి కోపం రాదు" అన్నాడు.

ద్రోణుడు అర్జునుడి వైపు వేగంగా ఉరికాడు. అర్జునుడు సంతోషంగా చిరునవ్వు నవ్వాడు, నమస్కారం చేశాడు. "గురుదేవా! మా వనవాసకాలం పూర్తయింది. కాని, అన్యాయంగా తప్పుడు లెక్కవేసినందుకు మేమిప్పుడు పగదీర్చుకోవాల్సి వచ్చింది. దయచేసి ఆగ్రహించకండి, మీరు మొట్టమొదట నా మీద బాణప్రయోగం చేశాకనే, నే చేస్తాను. అంతవరకు చెయ్యను... ఇది నా శపథం" అని మనవి చేశాడు.

అప్పుడిక ద్రోణుడు అర్జునుడిపై ఎన్నో బాణాలు ప్రయోగించాడు. వాటిని అర్జునుడు దరిదాపులవరకు రానిచ్చి నిర్వీర్యం చేసి ఖండించేస్తున్నాడు. వారిరువురూ కూడా పోరాటంలో నేమిటి... దివ్యాస్త్రప్రయోగంలో నేమిటి..., సమ ఉజ్జీలు. ఎంతో చౌకచక్యమూ, నైపుణ్యమూ కలవారు. వారు బాణాలతో ఒక వల పరిచారు.

అది గురుశిష్యుల మధ్య జరిగే పోరాటం. మిగిలిన సైనికయోధులు పదునైన బాణాల ననేకం అర్జునుని రథం మీదికి ప్రయోగించారు. అర్జునుని గాయపరిచినప్పటికి అతడూ అంతటి మొనతేలిన బాణాలనే అతివేగంగా ద్రోణునిపై ప్రయోగించాడు. పూర్తిగా ఆయన్ని అన్నివైపులా ప్రాణాంతకమైన అగ్ని బాణాలతో కమ్మేశాడు.

ద్రోణుడు మంటలు అలలుకొన్న కొండలా ఉన్నాడు. అప్పుడిక ద్రోణుడికి సాయంగా అశ్వత్థామ వచ్చాడు. అంతటి కోపధారే అయినప్పటకీ అతడూ అర్జునుని శౌర్యాన్ని మెచ్చుకునే ఔదార్యం ఉన్నవాడే. అతడి రాకతో ద్రోణుడు వెనక్కి తగ్గేందుకొక అవకాశం కల్గింది. అప్పుడు అర్జునుడు అశ్వత్థామను ఎదుర్కోవాల్సి వచ్చింది. అయితే అతడు కూడా అర్జునుని ఎదిరించలేక తిరోగమించాడు.

ఆ పరిస్థితిని చూసి కర్ణుడు మళ్ళీ రంగంలోకి దూకాడు. అప్పుడిక అర్జునుడు క్రుద్ధుడై బిగ్గరగా ఒక రంకెవేసి "ఓ కర్ణా! రా... నీవు అందరి ముందు ఏదో అతిగా పేలావు..., నిన్ను నీవే పొగడుకున్నావు. అందుకే నీకు మరో అవకాశం కూడా ఇస్తున్నాను. యుద్ధవిద్యలో నన్ను మించిన వాడెవ్వడూ లేడు" అంటూ కవ్వించాడు.

వారిద్దరిమధ్య బ్రహ్మాండమైన పోరాటం ప్రారంభమైంది. కర్ణుడు బాణాలతో కుండపోతలా వర్షం కురిపించాడు. అర్జునుడా విపరీతమైన ముట్టడిని సహించలేకపోయాడు. వెంటనే కర్ణుని వింటి నారిని ఖండించేశాడు. అంతట కర్ణుడు విల్లు లేకుండానే చేతులతోనే బాణాలు గుప్పించడం మొదలెట్టాడు. ఆ దెబ్బతో అర్జునుడి వింటి గురి తప్పింది. అయినా వెనుకడుగు వేయలేదు. మరో శక్తిమంతమైన బాణాన్ని కర్ణుడి గుండెలకి తాకేటట్లు కొట్టాడు. ఆ బాధకు తట్టుకోలేక కర్ణుడు మరోసారి యుద్ధభూమి నుంచి పలాయనం చిత్తగించాడు.

అదిచూసి అర్జునుడు, ఉత్తరుడు ఇరువురు కడుపుబ్బ నవ్వుకున్నారు. అప్పుడిక దుర్యోధనుడు వింటిని ఒడుపుగా లాగి ఒక సర్పముఖ బాణాన్ని అర్జునుడిపై ప్రయోగించాడు. అది అర్జునుని నొసటిని తాకింది, రక్తం చింది పడుతూంది కాని అతడేమాత్రం చలింపలేదు. క్రోధావేశంతో అర్జునుడు లెక్కకు మించిన సర్పబాణాల్ని దుర్యోధనుడిపై ఎడతెరపి లేకుండా ప్రయోగించాడు.

అంతట దుర్యోధనుడు తప్పించుకు పారిపోవాలనుకున్నాడు కాని, అర్జునుడు కవ్వించి రెచ్చగొట్టేసరికి వెనక్కి మళ్ళాడు..., యథాప్రకారం యుద్ధానికి తలపడ్డాడు.

భీష్ముడు మొదలైన వారంతా తిరిగివచ్చి అతణ్ణి రక్షించేందుకు ప్రయత్నించారు. అర్జునుడు మాత్రం నదురూ బెదురూ లేని నిర్భయుడై పోరాటం సాగిస్తూనే ఉన్నాడు. చివరికి అదను కనిపెట్టి 'సమ్మోహన' మనే విచిత్రమైన అస్త్రాన్ని ప్రయోగించడంతో అంతా ఒక్కుమ్మడిగా మూర్ఛబోయారు. వారంతా అలా స్పృహకోల్పోయి పడి ఉన్న సమయంలో వారి వస్త్రాలను చింపి పేలికలు తీసుకున్నాడు. (తరువాత బొమ్మపొత్తిక లడిగిన వారి కిచ్చాడు)

కొంచెం తేరుకుని దుర్యోధనుడు భీష్ముడితో "నీవు అర్జునుని చంపక ఎందుకు విడిచిపెట్టావు..." అని అడిగాడు. భీష్ముడు నవ్వి... "నీవు మామూలు ధ్వని వినబడితేనే, స్పృహ కోల్పోతావని నాకు తెలీదు" అంటూ... అధిక్షేపించాడు. ఆ తరువాత అర్జునుడు ఉత్తరకుమారునితో "ఇక మనం వెనుదిరిగి పోదాం. శత్రువుల్ని ఎదిరించాం... గోగ్రహణం చేశాం ఇక పోదాం పద..." అంటూ త్రోవలో ఉత్తరునితో అర్జునుడు "చూడు రాకుమారా, మేము మీ తండ్రి నాశ్రయించి ఉంటున్నామని, పాండవులమని నీకు మాత్రమే ఇప్పటికి తెలుసు. ఈ విషయాన్ని నీ వరకే రహస్యంగా ఉంచాలి సుమా. మీ తండ్రికి తెలిసిందంటే ఇంకేం లేదు, భయంతో అమాంతం ప్రాణాలు వదిలేస్తాడు. అందుకని నగరంలో ప్రవేశించిన తోడనే ఇది నీవు సాధించిన విజయవార్తగా ప్రకటించాలి. కౌరవులు ఓడిపోయారు, గోగణాన్ని రక్షించానని వెల్లడిచేయాలి" అని చెప్పాడు.

వారు తిరిగి జమ్మిచెట్టున్న ఆ శ్మశానభూమికి చేరుకున్నారు. అక్కడికి రాగానే రథం మీదనుంచి కపికేతనాన్ని తీసి, సింహధ్వజం ఎగురవేయడం జరిగింది. మళ్లీ యథాప్రకారం ఆయుధాలన్నిటిని మునుపు పెట్టిన చోటనే అమర్చేశారు.

వార్తాహరులను పంపి విరాటరాజుకు ఉత్తరుని విజయవార్తను అందచేసే ఏర్పాటు చేయవలసిందిగా అర్జునుడు ఉత్తర కుమారునికి సూచించాడు. ఆ పిదప ఉత్తరుని రథం మీద కూర్చోమని తాను ఎప్పటి బృహన్నలలా సారథ్యం చేస్తూ రథాన్ని రాజధాని నగరానికి చేర్చాడు.

## 11
## నిజరూపాలలో పాండవులు

విరాటరాజుకి విజయవార్త చేరగానే "బృహన్నల రథసారథ్యం వహించినప్పుడు శత్రువులు గోగ్రహణం చేయడమా? అది ఎన్నటికీ జరగదంటూ" యుధిష్ఠిరుడు వ్యాఖ్యానించాడు.

అప్పుడు విరాటుడు సభికులకు, గాయకులకు రాజధాని పొలిమేరలకు వెళ్ళి విజేతగా తిరిగివస్తున్న రాకుమారునికి స్వాగతం చెప్పవలసిందిగా ఆజ్ఞాపిస్తూ... తన సోదరునికి సుస్వాగతం పలికేందుకు రాకుమారి ఉత్తరని కూడా పంపించాడు. అప్పుడిక యుధిష్ఠిరుని చూసి, నే నిప్పుడెంతో సంబరంలో ఉన్నాను. ఏదీ... ఒక్క ఆట ఆడుదాం. పాచికలు పందెం వెయ్యమన్నాడు. అందుకు యుధిష్ఠిరుడు "సంతోషం ఎక్కువ మోతాదులో ఉన్నప్పుడు జూదం ఆడరాదని వినికిడి..., కాబట్టి నేనివాళ ఆడదల్చుకోలేదు. ఈ విషయంలో యుధిష్ఠిరుడి దురదృష్టాన్ని గురించి వినే ఉంటారనుకుంటాను. జూదమాడి, రాజ్యాన్నీ, సోదరుల్నీ కోల్పోయాడు గదా! అయితే, మీరు కనుక, కాదు కూడదు...., ఆడి తీరాల్సిందే అని ఆజ్ఞాపిస్తే తప్పదుగదా ఆడాల్సిందే" అన్నాడు.

విరాటుడు బలవంతపెట్టగా ఆట ప్రారంభించాడు. ఆట మధ్యలో విరాటుడు... "చూశావా, విరాట రాకుమారుడు కౌరవుల్ని గెలిచాడు" అన్నాడు. "ఔను మరి బృహన్నల సారథి అయితే?..." అన్నాడు యుధిష్ఠిరుడు. వెంటనే ఆ ఎత్తిపొడుపుమాటకి క్రుద్ధుడై విరాటుడు, "దుర్మార్గుడా! ఏమన్నావు? నా అంతటి వాని పుత్రుడికి యుద్ధంలో గెలవాలంటే ఒక పేడివాని సాయం కావాలా? ఛీ, మన స్నేహాన్ని పురస్కరించుకుని ఈ సారికి నిన్ను క్షమిస్తున్నా గానీ, ఇక ఎన్నడూ పొరబాటునైనా ఈ కూత కూయరాదు సుమా" అంటూ హుంకరించాడు.



"దానికేంగానీండి... ద్రోణుడు, భీష్ముడు మిగతా యోధానుయోధులంతా యుద్ధానికి ఒక్కుమ్మడిగా కూడివస్తే వారిని ఎదిరించడం బృహన్నలకి తప్ప ఎవరికి సాధ్యమయ్యేను...? అతడితో సమానులెవ్వరూ లేరు. ఇక ఉండరు కూడాను" అంటూ వక్కాణించాడు యుధిష్ఠిరుడు.

ఆ మాట విన్న విరాటుడు ఆగ్రహంతో పాచికల్ని యుధిష్ఠిరుని మొహం మీదికి విసిరికొట్టాడు. అప్పుడు అవి ఆయన ముక్కుకు తగిలి గాయమై బొటబొట నెత్తురు కారింది. యుధిష్ఠిరుడు నెత్తురు నేలమీద పడకుండా ఒడుపుగా గుప్పెట పట్టి ఆపాడు. ఆయన వైఖరిని కనిపెట్టి, అంతలోనే సైరంధ్రి బంగారు కూజాలో ఆ రక్తాన్ని పట్టింది.

ఆ తరుణంలోనే ఉత్తరుడు రాజధానిలో అడుగుపెట్టాడు. కాపరులు, పురజనులు అంతా అతణ్ణి మెచ్చుకుంటున్నారు. అతడో వార్తాహరుని "మీ పుత్రుడు బృహన్నలతో నగర ద్వారం వద్ద వేచివున్నా"డని చెప్పవలసిందిగా విరాటునికి కబురు పంపాడు. వారిని వెంటనే ఇక్కడికి తోడ్కొని రమ్మని, తాను వారిని కలుసుకునేందుకు ఆతురతతో ఎదురుచూస్తున్నానని చెప్పి విరాటుడు కబురుపంపాడు.

కాని, యుధిష్ఠిరుడు ఆ వచ్చిన వార్తాహరునితో ఏదో గుసగుసలాడాడు. అదే, "ఉత్తరుని మాత్రమే రమ్మని..." చెప్పమన్నాడు. ఎందుకంటే, ఎవరైనా యుధిష్ఠిరుని వేధించినా... యుద్ధంలో తప్ప ఆయనను గాయపరచి ఒక్క నెత్తురుబొట్టు చిందించినా... వారిని ప్రాణాలతో వదలనని బృహన్నల శపథం... అంతేకాదు... ఆయన రక్తం నేల చిందితే ఆ రాజ్యం అనావృష్టికి గురౌతుందన్న కారణాలవల్ల అలా చెప్పాడు.

కోపోద్రేకంలో విరాటుడు పాచికలు విసరడంతో ముక్కుకి గాయమై రక్తం కారింది. కాబట్టి బృహన్నల ఆ దృశ్యం చూశాడంటే వెంటనే విరాటుని అంతం చేస్తాడనే ఉద్దేశంతో "ఉత్తరుడు ఒంటరిగా రావడమే ఇప్పటికి క్షేమ"మని హెచ్చరిక చేశాడు.

ఉత్తరుడు రానేవచ్చాడు. అతడు రక్తం కారుతున్న యుధిష్ఠిరుని ముక్కువంక చూశాడు. ఏం జరిగిందని, తండ్రిని అడిగాడు. అప్పుడు విరాటుడు "నిన్ను కాదని, నీ కంటేకూడ ఆ పేడివాణ్ణే మెచ్చుకున్నందుకు సహించలేక నేనే ఆ పని చేశాను" అని అన్నాడు.

అందుకు ఉత్తరుడు... "అయ్యో! మీరు చాలా పెద్ద పొరపాటు చేశారు. ఆయన మనలనందర్ని శపించి ప్రాణాలు తీయకుండా ముందు ఆయన్ని చేసిన తప్పుకు క్షమాపణ అడగండి" అంటూండగానే బృహన్నల రావడం, యుధిష్ఠిరుని గాయం రక్తం కారకుండా ఆగిపోవడం ఒకేసారి జరిగాయి. బృహన్నల మౌనంగా నిలబడ్డాడు. విరాటుడప్పటికి శాంతపడి యుధిష్ఠిరునికి క్షమాపణ చెప్పాడు. తరువాత ఉత్తరుని ప్రశంసించాడు.

"ఓ రాకుమారా! శత్రువుల్ని హతమార్చి, గోగణాన్ని కాపాడితెచ్చిన నీ సాహస పరాక్రమాలు నా కెంతో ఆనందాన్నిచ్చాయి సుమా..." అన్నాడు.

అప్పుడు ఉత్తరుడు... "నేను కౌరవుల్ని ఎదుర్కోనూ లేదు..., గోగణాన్ని రక్షించిందీ లేదు. నేనసలు భయపడి బెదిరిపోయి యుద్ధరంగం నుంచి పారిపోతూ ఉంటే, ఒక ఘనుడు నన్ను ఆపాడు. తాను నా రథమెక్కాడు, శత్రువుల్ని చెండాడాడు. యుద్ధంలో విజయం చేకూరగానే అతడు కాస్తా అదృశ్యుడైపోయాడు. ఒకవేళ నేడో రేపో రానూ వచ్చు... రాకనూపోవచ్చు. వస్తాడో, రాడో ఎవరు చెప్పగలరు" అన్నాడు.

నాటికి మూడో రోజున పాండవులంతా స్నానంచేసి తెల్లని ఉడుపులు, లెక్కలేనన్ని ఆభరణాలు ధరించి రాజాస్థానానికి వచ్చారు. వచ్చి రాజులకై అమర్చిన సింహాసనాల్లో కూర్చున్నారు. వారి ప్రవర్తన చూసి విరాటరాజు మండిపడ్డాడు.

"ఓరీ కంకా! పాచికలాడుతూ జీవించే నీవు పోయి ఒక రాజు కూర్చునే సింహాసనం మీద కూర్చునేందుకు నీకెన్ని గుండెలు" అంటూ హుంకరించాడు.

అప్పుడిక అర్జునుడు కలుగజేసుకున్నాడు: " సాక్షాత్తూ ఆ ఇంద్ర సింహాసనమే అధిష్ఠించగల మహామహుడు, పాండునందనుడైన యుధిష్ఠిరుడికి కేవలమైన ఈ రాజసింహాసనం ఒక లెక్కలోనిదా?" అని వాస్తవాన్ని వెలిబుచ్చడమే కాకుండా మిగతా సోదరుల పేర్లను కూడ సూచించాడు. అంతట విరాటరాజు వారే పాండవులని తెలియగానే, ఆశ్చర్యంతో నిశ్చేష్టుడైపోయాడు.

అంతటి వీరసింహాలను ఇంతకాలం తమ పరిచారకులుగా ఉపయోగించుకున్నందుకు ఎంతగానో దుఃఖించాడు. తక్షణమే వారితో బంధుత్వం కలుపుకోదల్చుకున్నాడు. తమ రాజ్యాన్నంతా కట్టబెడతానన్నాడు. తన కుమార్తె ఉత్తరను అర్జునున కిద్దామనుకున్నాడు. యుధిష్ఠిరుడందుకు అర్జునుడేమంటాడో నని అతని వంక చూశాడు. అర్జునుడు "మీ కుమార్తెను నా కోడలుగా చేసుకుంటాను. అభ్యంతరమేం లేదు. అది యుక్తం..." అన్నాడు.

"అదికాదు అర్జునా! నీ సహధర్మిణిగా ఆమెను అంగీకరించవచ్చు గదా! నీకు అందులో ఏమిటి అభ్యంతరం?" అనడిగాడు విరాటరాజు.

"నేను రాణివాసంలో ఉంటూ ఆమెను చూసినప్పుడు నా కామెపట్ల పుత్రిక భావమే కల్గింది. పుత్రికలాగానే చూశాను. ఆమెకూడ నన్ను తండ్రి భావనతోనే చూసుకుంది.. కాబట్టి..." అంటూ సమాధానం చెప్పాడు అర్జునుడు.

అర్జునుని పుత్రుడైన అభిమన్యుడితో రాకుమారి ఉత్తర వివాహవేడుకలు చూసేందుకు దగ్గరున్నవారే కాక, దూరతీరాల నున్న ఎక్కడెక్కడి రాజులంతా హాజరైనారు.

అందమైన పూలదండలు తీసుకుని కృష్ణుడు, బలరాముడు మిగిలిన వృష్ణికులజులందరితో కలసి అక్కడికి వచ్చారు.

వైదికాచార విధుల ప్రకారం సాక్షాత్తు శ్రీమన్నారాయణుడైన శ్రీకృష్ణపరమాత్మ, కీర్తిమంతులైన బంధుమిత్రుల సమక్షంలో ఉత్తరాభిమన్యుల వివాహం అంగరంగవైభవంగా జరిగింది.

**విరాటపర్వం సమాప్తం**



# ఉద్యోగపర్వం

## 1
## ద్వారకలో దుర్యోధనార్జునులు

ఉత్తరాభిమన్యుల వివాహ మహోత్సవానంతరం పాండవులంతా విరాటరాజు కొలువుకూటంలో సమావేశమైనారు. యుధిష్ఠిరుడికి ఒకవైపు కృష్ణుడు మరోవైపు విరాటుడు ఆసీనులయ్యారు. సభామర్యాదలన్నీ అయిన తరువాత కృష్ణుడు లేచి సభలోని వారందరిని ఉద్దేశించి ఇలా అన్నాడు:

"ధర్మరాజును పాచికలాటలో మోసగించి ఓడించారన్న విషయం మీ అందరికి తెలిసినదే. పాండవులను రాజ్యహీనులను చేశారు. పదమూడు సంవత్సరాలపాటు వారిని దేశం నుంచి తరిమేశారు... కానీ, వారు బలవంతంగా ఏ సమయాన్నైనా తమ రాజ్యాన్ని పొందగలిగిన సర్వసమర్థులే అయినప్పటికీ అన్న మాటకు కట్టుబడి దేశం విడిచి అరణ్యాలకి వెళ్లిపోయారు. వారు పదమూడు సంవత్సరాలు ఎన్నో కష్టాలు ఎదుర్కొన్నారు, ఓర్చుకున్నారు. మంచిదే అయిందనుకోండి. ఓ భూపాలకులారా! ఆనాడు కౌరవసభలో చేసిన వాగ్దానాన్ని పాండవులు పాటించి తమ నిజాయితీని నిరూపించుకున్నారు.

"అయినా దుర్యోధనుని ఆశయమేమిటో ఇంతవరకు మనకు బోధపడటం లేదు. అందువల్ల యోగ్యుడైన ఒక దూతను దుర్యోధనుడి దగ్గరకు పంపి, యుధిష్ఠిరుని రాజ్యాన్ని తిరిగి ఇయ్యవలసిందిగా కోరుతూ కబురు పంపుదాం" అన్నాడు.

అంతట బలరాముడిలా అన్నాడు: "కృష్ణా! దుర్యోధనుడి అభిప్రాయమేమిటో నాకు తెలుసు..., అయినా నే చెప్పేది వినండి. మనం కోరేది శాంతినే కానీ యుద్ధాన్ని కాదు. ఏ విషయాన్నైనా శాంతియుతంగా పరిష్కారం చేసుకోవడమే లాభసాటి గానీ, యుద్ధం అనర్థాలకు దారితీస్తుంది."



కాని సాత్యకి, ద్రుపదుడు దుర్యోధనుడికి ఎట్టి శాంతి సందేశాన్ని పంపనవసరం లేదని, యుధిష్ఠిరుడు దుర్యోధనుని దేనికీ యాచించనవసరం లేదని అభిప్రాయపడ్డారు. ఏదేమైనా కృష్ణుడు దుర్యోధనుడికి ఒక అవకాశం ఇద్దామనుకున్నాడు... మంచిదే..., అతడి ఉద్దేశం బయటపడుతుంది. దానితోపాటు ఎందుకైనా మంచిది, ధృతరాష్ట్రుడికి కూడ ఈ విధంగా కబురు పంపండి:

"కౌరవులు కనుక శాంతియుతంగా రాజ్యంలో పాండవులకున్న వాటాను తీసుకునేందుకు అంగీకరించారా సరేసరి, లేదంటే మేము దానికి తగిన ప్రతిచర్యలు తీసుకోవాల్సి ఉంటుంది." ఈ విధంగా నిర్ణయించిన తరువాత కృష్ణుడు తన పరిజనంతో ద్వారకకు వెళ్లిపోయాడు.

తరువాత ద్రుపదుడు తమ రాజగురువును కౌరవుల వద్దకు పంపినప్పుడే అదే తరుణాన, దుర్యోధనుని వేగులు విరాటరాజసభలో జరిగిన సమావేశాన్ని గురించిన వార్తలు మోసుకొచ్చారు. అప్పుడిక దుర్యోధనుడు రాబోయే యుద్ధానికి సన్నాహాలు ప్రారంభించేశాడు. అంతేకాదు తమ మిత్రరాజ్యాల వారికి సైన్యాన్ని సిద్ధపరచవలసిందిగా కూడా కబురు పంపాడు.

పాండవులు కూడా తమకు యుద్ధంలో సాయపడతామన్న రాజులకు, తమ తమ సైన్యాలను సంసిద్ధం చేయమని వార్త నందించారు. అర్జునుడు, కృష్ణుని సాయం కోరాలని ద్వారకకు వెళ్ళాడు. కృష్ణుని సాయం అర్థిద్దామనే దుర్యోధనుడూ ద్వారకకు బయల్దేరాడు. దుర్యోధనార్జును లిరువురు ఒకే రోజు ఒకేసారి ద్వారక చేరుకున్నారు. వారు వెళ్లేసరికి కృష్ణుడు నిద్రపోతున్నాడు. దుర్యోధనుడు తిన్నగా వెళ్లి కృష్ణుని తలవైపున మెత్త మీద కూర్చున్నాడు. అర్జునుడు మాత్రం చేతులు జోడించి పాదాల వైపున నిలబడి ఉన్నాడు.

కృష్ణుడు లేచాడు. లేస్తూనే మొట్టమొదట అర్జునుణ్ణే చూశాడు, తరువాతనే దుర్యోధనుని చూడటమైంది. కృష్ణుడు వారిరువురిని ఆహ్వానించాడు. ఏం పని మీద వచ్చారంటూ ప్రశ్నించాడు. అప్పుడు దుర్యోధనుడు "ఓ కృష్ణా! రానున్న యుద్ధంలో నీవు నాకు సహాయం చేయడం సముచితమని భావిస్తాను. మేమిరువురమూ నీకు కావలసినవారమే అయినప్పటికీ నీ సాయం అర్థించేందుకు నేనే ఇక్కడికి మొదట వచ్చాను. మొదట వచ్చినవారికి మొదట తోడ్పడాలన్నది సంప్రదాయం గదా!" అన్నాడు.



అందుకు కృష్ణుడు, "నీవు మొదటే వచ్చి ఉండొచ్చు కాని, నా చూపులు మొట్టమొదట అర్జునుని మీదనే పడ్డాయి గదా, మరి! ఆహా... నేను మీ ఇరువురికి సాయం చేస్తాననుకో. చిన్నవాళ్లడిగింది ముందు చెయ్యాలి. అందుకని నేను మొట్టమొదట అర్జునుడేం కోరతాడో అడుగుతాను. నా వద్ద పదివేల మంది గోపాలురున్నారు. వారంతా మహాయోధులు, యుద్ధనిపుణులు, నారాయణ నామధేయాలతో ప్రసిద్ధులు. వారంతా ఒకరికి..., నేనొంటరిగా ఒకరికి సాయపడేటట్లు నిర్ణయించాను. నేనున్నానంటే, ఆయుధాలు అంటను, యుద్ధంలో పాల్గొనను. అయితే, కూడా ఉంటానంతే... అదీ విషయం. అర్జునా! మొదట నీవు కోరుకో నీకు నిరాయుధుణ్ణయిన నేను కావాలా? పదివేలమంది యాదవవీరులు కావాలా చెప్పు?" కృష్ణుడలా అడిగిందే తరువాయి అన్నట్లు అర్జునుడు వెంటనే, ఏమాత్రం వెనకా ముందూ ఆలోచించకుండా "నీవు యుద్ధం చేయకపోయినాసరే, నాకు నీవు మాత్రం చాలు" అన్నాడు.

దుర్యోధనుడికి బోలెడంత సైన్య మొచ్చింది కనుక అతడెంతగానో సంతోషించాడు. ఎందుకంటే ఆయుధాలు, సైన్యం లేకుండా కృష్ణుడు ఒంటరిగా ఏమంత సాయం చెయ్యగల్గుతాడు? అని అనుకున్నాడు. కృష్ణుడికి ఎంతగానో ధన్యవాదాలర్పించుకుని బలరాముని సాయం అడిగేందుకు వెళ్లాడు.



మహావీరుడైన బలరాముడు "దుర్యోధనా! నేను అభిమన్యుడి వివాహమప్పుడు అన్నమాటలు వినే ఉంటావనుకుంటా, కాని ఇప్పుడు కృష్ణుడు విభాగాలు ఏర్పరచి పాండవుల పక్షం చేరాడే..., అందువల్ల నేను నీ పక్షాన చేరలేను. అటు అర్జునుడికి అండకాలేను. కృష్ణుడికి ఎదురొడ్డి యుద్ధం చెయ్యనూలేను. నీకేమిటి నీవెంతో ఘనతకెక్కిన కురువంశంలో పుట్టినవాడివి. వెళ్ళి ధైర్యంగా పోరాడు. ఏమాత్రం ధర్మం తప్పక, ధర్మనియమానికి అనుగుణంగా నడచుకో" అన్నాడు.

అప్పుడిక దుర్యోధనుడు కృతవర్మ దగ్గరికి వెళ్ళాడు. అతడు దుర్యోధనుడికి ఒక అక్షౌహిణి సైన్యాన్ని ఇచ్చాడు. (అక్షౌహిణి అనగా చతురంగ బలాలున్న సైన్యం లెక్క 1,09,350 కాల్బలం; 65,610 గుఱ్ఱాలు; 21,870 రథాలు, అన్ని ఏనుగులు = 1 అక్షౌహిణి)

దుర్యోధనుడు వెళ్ళిపోయిన తరువాత కృష్ణుడు "నేను యుద్ధం చెయ్యనని తెలిసికూడ నీవు నన్నే ఎందుకు ఎన్నుకున్నావు?" అని అర్జునుని అడిగాడు. అందుకు అర్జునుడు "నీవు వారందర్ని సంహరించగలవనడం సందేహం లేదు. నా వెంట నీవుంటే, నేనే ఒంటరిగా ఆ పని చేయగలను... ఈ ప్రపంచం మొత్తంలో ఘనుడవు నీవే, అటువంటి నీ అండ నాకు దొరికింది గదా..., నీవు చేసేపని నా చేతనే చేయించి, ఏకైకవీరుడననే కీర్తిని నాకు



దక్కించాలనుకున్నావని నాకు అర్థమైంది. ఆయుధం పట్టకుండా నా రథ సారథివై నన్ను యుద్ధంలో గెల్పించి విజయుణ్ణి చేస్తావనే... నాడు నేడూ కూడ నా కోరికదే. అందువల్ల నా కోరిక సఫలం చేయవయ్యా!" అన్నాడు.

అర్జునుడికి తనపై ఉన్న గాఢవిశ్వాసానికి కృష్ణుడెంతో సంతోషించాడు. "ఓ అలాగే నేను నీకు రథ సారథ్యం వహిస్తాను. నీ కోరిక ఫలించుగాక!" అని దీవించాడు. తరువాత వారిరువురు యుధిష్ఠిరుని వద్దకు వెళ్ళారు.

మాద్రి సోదరుడైన శల్యుడు సేనాసహితుడై వచ్చి చేరువ ప్రదేశంలో విడిది చేసినట్లు విని, దుర్యోధనుడు ఆయన్ని కలుసుకునేందుకు వెళ్లాడు. మర్యాదలు చేశాడు. ప్రశస్తమైన విందులు వినోదాలు ఏర్పాటుచేశాడు.

శల్యుడెంతో సంతోషించి దుర్యోధనుని కౌగలించుకుని, "దుర్యోధనా! నావల్ల నీకేం సాయం కావాలో కోరుకో" అని అడిగాడు. "మీరు మా సేనాధిపతులు కావాలి" అని దుర్యోధనుడు కోరాడు. శల్యుడికి ఇష్టం లేకపోయినా ఒప్పుకున్నాడు.

అసలతడు పాండవులకు సాయం చేయాలనే ఉద్దేశంతో వారిని కలుసుకునేందుకు వెళుతున్నవాడు... అనుకోకుండా అభిప్రాయం మార్చుకోవాల్సిన పరిస్థితి తటస్థించింది.

## 2
## సంధి ప్రయత్నాలు

ద్రుపద మహారాజు ఆస్థానం నుండి రాజగురువు హస్తినాపురానికి రాగానే, ధృతరాష్ట్రుడు, ద్రోణుడు, భీష్ముడు ఆయన్ని సగౌరవంగా ఆహ్వానించారు.

రాజగురువు తమ రాకకు గల ఉద్దేశాన్ని తెలుపుతూ, "ఓ రాజా! ఇది కౌరవ పాండవుల వంశ మర్యాదకు సంబంధించింది, కుటుంబ విషయం. అందువల్ల నేనీ వ్యవహారాన్ని గురించి చర్చించను, కాని ఒక్క సలహా మాత్రం ఇవ్వదలచాను... అదే, ఈ రాజ్యాన్ని

కౌరవ పాండవులకు సరిసమానంగా పంచడం న్యాయమంటాను.

"తీసుకున్న దేదో తిరిగి ఇచ్చేయమంటుంది ధర్మపక్షం. కాబట్టి చేసుకున్న ఒప్పందాన్ని నెరవేర్చడం న్యాయం" అన్నాడు. ఆ మాటలు విని భీష్ముడు "పాండవుల కౌరవుల మధ్య శాంతియుత పరిష్కారం జరిగితే మాకూ ఎంతో సంతోషమే. మీరు నిజాన్ని చక్కగా రుజువు చేస్తూ, వ్యవహారానికి చక్కని పరిష్కారాన్ని సూచించారు" అని అంటూండగానే, కర్ణుడు కోపంతో రుసరుసలాడుతూ, విషయం మధ్యలో జొరబడి, "ఓ బ్రాహ్మణుడా! మీరు చెప్తున్నదేమీ కొత్తవిషయం కాదు. అందరికీ తెల్సిందే..., అనుకునేదే..., దాన్నే పదేపదే రెట్టించడంలో అర్థంలేదు.

"పాండవులు సగం రాజ్యం తమకు కావాలని దుర్యోధనుణ్ణి ఒత్తిడి చేయడం పొరబాటు. వారసలు చేసుకున్న ఒప్పందం ప్రకారం కాకుండా, అజ్ఞాతవాసం నుంచి పూర్తిగాకుండా ముందుగానే బయటపడిపోయారు. నియమానుసారమైతే వారు తిరిగి అరణ్యవాసం చెయ్యాలి" అన్నాడు.

"అయిందా, ఇంకా మిగిలిందా? నీ వాగుడు, ప్రేలాపన" అంటూ భీష్ముడు, "చూడు, విరాటరాజ్యంలో



అర్జునుడు ఆరుగురు కౌరవవీరుల్ని గెల్చాడన్నమాట గుర్తుంచుకో. ఈ బ్రాహ్మణుడు సూచించిన పరిష్కారానికి మనం అంగీకరించక పోయామో, అర్జునుడి చేతిలో హతం అవక తప్పదు సుమా" అని హెచ్చరించాడు.

ధృతరాష్ట్రుడు భీష్ముని మాటల్ని సమర్థిస్తూ కర్ణుని వాదాన్ని ఖండించాడు. "మీరు పాండవుల్ని కలుసుకుని, నేనీ విషయం పరిశీలిస్తానన్నానని, అందరికి అనుకూలమైన పరిష్కారమార్గాన్నే ఆలోచిస్తామని, వెళ్ళి చెప్పండి. మా నిర్ణయం సంజయుని ద్వారా వాళ్ళకి అందజేస్తామని చెప్పండి, మీరిక బయల్దేరండి" అని చెప్పాడు.

రాజగురువు తిరిగి వెళ్లిపోయాడు. అప్పుడిక ధృతరాష్ట్రుడు సంజయుని పిలిపించి, ప్రక్కన బెట్టుకుని చెప్పవలసిన దానిని ఇలా ఆదేశించాడు: "ఓ సంజయా! నీవు పాండుపుత్రుల దగ్గరకు వెళ్లి, గౌరవాభినందనలు తెలియజేయి. వారి యోగక్షేమాలు విచారించు. వారెప్పుడు బుద్ధిమంతులూ, వినమ్రులే, సహజంగా మనమంటే అపేక్షగలవారే. పగ, విరోధం, పోరాటానికి సంబంధించిన మాటలేవీ నీ నోటినుండి జారరాదు సుమా! నీ వివేకాన్ని ఉపయోగించు. ముఖ్యంగా కృష్ణునితో మర్యాదగా వ్యవహరించు. అతడు నిర్ణయం తీసుకున్నాడంటే, ఇక వారెవ్వరూ ఏమీ చెయ్యలేరు. అతడి అనుమతే వారికి సమ్మతి."

## 3
## సంజయ రాయబారం

ధృతరాష్ట్రుడు ఆదేశించిన ప్రకారం సంజయుడు పాండవులు బసచేస్తున్న ఉపప్లావ్యమనే చోటికి వెళ్ళాడు. యుధిష్ఠిరుడికి నమస్కరించాడు. ధృతరాష్ట్రుని తరఫున వారి యోగక్షేమాలన్నీ విచారించాడు. అప్పుడు యుధిష్ఠిరుడు "ఓ సంజయా! చాలాకాలానికి నిన్ను కలుసుకున్నందుకు మాకందరికీ ఎంతో సంతోషంగా ఉంది" అన్నాడు.

"నేను ధృతరాష్ట్రుడు ఆదేశించగా, మీకో సందేశాన్ని తెచ్చాను" అన్నాడు సంజయుడు. "దయచేసి మీరంతా దాన్ని జాగరూకులై వినవలసిందిగా కోరుతున్నాను. మీ నిజాయితీని, మీ విధేయతను ఆయన ఎంతగానో మెచ్చుకున్నారు. మీ ఆలోచన ఎన్నటికీ మంచిదిగానే ఉంటుంది. మంచి చేయాలనే ఉంటుంది. హాని తలపెట్టినందువల్ల వంశమర్యాదకే అది కళంకంగా మీరు భావిస్తారని ఆయనకు తెలుసు. తెల్లని బట్టకు మరకైతే కొట్టొచ్చినట్లు కనబడే తీరున, చెడు తలబెడితే కుటుంబ గౌరవానికే ఇది గొడ్డలి పెట్టయ్యేనని ఇంగితమున్నవారు మీరు. ఆయన తరపున నేను కృష్ణునికి, ద్రుపదరాజుకి సాష్టాంగవందన మాచరిస్తున్నాను. మీరంతా మీ కుటుంబ క్షేమాన్ని, సమృద్ధిని కోరుతూ అందుకు తగిన విధంగా నడుచుకుంటారని ఆశిస్తున్నాను."

ఆ మాట విని యుధిష్ఠిరుడు "ఇదేదో వింతగా ఉందే! నేను అన్న దేమిటి? మీరు అర్థం చేసుకున్నదేమిటి? నేను యుద్ధం కావాలని కోరానా? దుర్యోధనాదులతో మాకున్న బాంధవ్యం, మిగతా మా కథంతా మీకు తెలుసుగదా! మేము ఎప్పటి పాండవులమే..., మేమిప్పటికీ మైత్రి కోసమే ఎదురుచూస్తున్నాం. అయితే ఆ ఇంద్రప్రస్థపురం మాత్రం మా కిప్పించాల్సిందే" అని తెగేసి చెప్పాడు.

"మీ రదే కావాలని ఎందుకు పట్టుదలగా ఉన్నారు? చచ్చీ చెడీ సమరంచేసి, సామ్రాజ్యాలు గెల్చుకోవడం కంటే, బ్రతికుండి బిచ్చమెత్తుకుతిన్నా ఫర్వాలేదని నేను భావిస్తాను. పగ అన్నది విషపుమందు. అది తల్లోకి ఎక్కిందా అంటే అంతం చూడందే వదలదు. యుద్ధం వల్ల అనర్థమేకానీ మేలు జరగదు. కనుక శాంతికోరడం మంచిది కదా!" అన్నాడు సంజయుడు.

అప్పుడు యుధిష్ఠిరుడు "దానికేం?... తప్పకుండాను. అయితే, ఈ విషయంలో తప్పెవరిదో ఒప్పెవరిదో మీరు గమనించవలసి ఉంది. ఇదుగో కృష్ణుడిక్కడే ఉన్నాడు. ఆయన ఇరువైపులవారి క్షేమం కోరుకునేవాడు, ఆయనేం చెబుతాడో విందాం. ఒకవేళ నాది తప్పు అంటే నేను ఆయన సలహా ప్రకారమే నడచుకుంటాను ఎట్టి అభ్యంతరమూ లేదు" అన్నాడు.



అప్పుడు కృష్ణుడు, "ఓ సంజయా! నేను కౌరవ పాండవులిరువురి సంతోషాన్ని, అభ్యుదయాన్ని కాంక్షించేవాడిని. ఆ దుర్యోధనుడు రాజ్యమంతా తనకే కావాలంటే మాత్రం ఇచ్చేందుకు ఒప్పుకుంటావా? చెప్పు. తప్పేదో నాకంటే, యుధిష్ఠిరుడి కంటే కూడా నీకు బాగా తెలుసు, ఆలోచించు.

"ఆ కామాతురుడైన దుశ్శాసనుడు ద్రౌపదిని పట్టి నిండు సభలోకి ఈడ్చుకు వస్తూన్నప్పుడు కౌరవులెవ్వరూ నోరు విప్పలేదేం. విదురుడొక్కమాటన్నా అన్నాడు గానీ..., అక్కడే దుర్యోధనుడైతే నిలువెల్ల పగతో తానో మహావృక్ష మన్నట్లున్నాడు. కర్ణుడు ఆ చెట్టుకు బోదె, శకుని శాఖలు, దుశ్శాసనుడేమో దానికున్న లెక్కలేనన్ని పళ్లు, పూవులూ అయి కూర్చున్నారే! ఆ ధృతరాష్ట్రుడేమో ఆ చెట్టుకి ఉన్న వ్రేళ్ళు. ఈ యుధిష్ఠిరుడూ ఒక మహావృక్షమే. అయితే సుగుణాల రాశి. అర్జునుడు ఆ చెట్టు బోదె. భీమసేనుడు శాఖ. నకుల సహదేవులు పళ్ళు, పూవులూను. సర్వాధీశ్వరుడనైన నేను, బ్రాహ్మణులు ఆ చెట్టుకి వ్రేళ్లు, తెల్సిందా?.... నేనే స్వయంగా అక్కడికి వెళ్ళి మాట్లాడతాను. వినయం, వివేకం, విశిష్టమైన గుణాలు, విధుల్ని గురించి చెబుతాను. నన్ను గౌరవించి, నా మాటలు వింటారనుకుంటాను. వినకపోతే భీమార్జునులు వారికి తగిన సమాధానం చెప్తారు" అన్నాడు.

అప్పుడు యుధిష్ఠిరుడు "సంజయా! నిశ్చింతగా వెళ్ళు. దుర్యోధనుడితో నావంతు రాజ్యాన్ని నాకీయమని లేదంటే యుద్ధానికి సిద్ధంగా ఉండమని, నా మాటగా చెప్పవలసింది. దయచేసి ధృతరాష్ట్రునికి నా గౌరవాభివందనాలు... ఆయన కుశలమడిగినట్లు నా తరఫున మనవి చేయవలసింది: 'మీ ఔదార్యం వల్లనే మేం చిన్నప్పుడు రాజ్యంలో భాగాన్ని పొందగలిగాం. ఒకసారి నన్ను రాజుగా చేసిన మీరు ఇప్పుడు మా రాజ్యభాగాన్ని నిరాకరించి ఇతరుల దయాధర్మం మీద ఆధారపడి అడుక్కుతిని బ్రతికేట్లు చేయరని ఆశిస్తాను.'

"ఇంకా భీష్మ, ద్రోణ, విదురులకు, తదితర పెద్దలకు నా అభివందనాల నందచేయవలసింది" అని చెప్పి పంపాడు.

## 4

## దుర్యోధనుని యుద్ధకాంక్ష

సంజయుడు అందరి వద్ద సెలవు తీసుకుని హస్తినాపురాన్ని చేరుకున్నాడు. రాజభవనానికి వెళుతూనే ముందు ధృతరాష్ట్రుని కలుసుకుని "ఓ రాజా! యుధిష్ఠిరుడు క్షేమమే, మీకు అభినందనలు తెలుపమన్నాడు. అతడికి రాజ్యం దక్కకుండా చేసినట్లయితే కౌరవవంశ వినాశానికి మీరే కారకులౌతారనీ, మీరు మీ దురహంకారి అయిన పుత్రుడి మీది పక్షపాతబుద్ధితో యుద్ధానికి సమ్మతించినా, జయాపజయాలు ఎలా ఉంటాయో! కాబట్టి ఇకనైనా ఈ పాచికలాటను కట్టిపెట్టమని, లేకపోతే మీరు దుష్పరిణామాన్ని ఇక ఎదుర్కోక తప్పదనీ చెప్పాడు. సుదీర్ఘమైన ప్రయాణం చేసి నేను ఎంతో బడలికతో ఉన్నాను. దయచేసి నాకు విశ్రాంతి ఇప్పించండి. రేపు రాజసభలో పాండవుల సందేశాన్ని అందిస్తా"నని చెప్పి సంజయుడు వెళ్లిపోయాడు.

ధృతరాష్ట్రునికి మాత్రం మనోవ్యధతో ఆ రాత్రి కంటికి కునుకుపట్టలేదు. విదురుడికి కబురంపి పిలిపించి ఆ రాత్రంతా అతడితో మాట్లాడుతూ గడిపాడు. అప్పుడు విదురుడు "నీకు నిద్రపట్టడం లేదంటున్నావు. నిద్రపట్టనివారెవరో తెలుసా? ఓడిపోయినవాడికి నిద్ర ఉండదు. దొంగకి నిద్రపట్టదు. బలహీనుడు నిద్రపోడు. కామాతురుడు కునుకు తీయడు. ఇంకా వీరుడైన శత్రువును ఎదుర్కోవడం వల్ల తన సర్వస్వాన్ని కోల్పోయినవాడు నిద్రపోడు. కాబట్టి పై జాబితాలో నీవు ఉండవనుకుంటాను. నీవు పరుల సంపదను ఆశిస్తున్నావా?" అనడిగాడు.

మర్నాటి ఉదయం రాజసభ జనంతో కిటికిటలాడుతోంది. ప్రతిఒక్కరూ సంజయుడు చెప్పబోయే విషయానికై ఎదురుచూస్తున్నారు. అప్పుడిక ధృతరాష్ట్రుడు సంజయునితో "సంజయా! నీవు తెచ్చిన సందేశాన్ని ఉన్నది ఉన్నట్లు తు.చ తప్పక చెప్పమని ఆదేశిస్తున్నా"నన్నాడు.

అంతట సంజయుడు తన ఆసనంనుంచి లేచాడు. "దుర్యోధనా! అర్జునుని సందేశాన్ని అవధరించవలసిందిగా కోరుతున్నాను. 'దుర్యోధనుడు కనుక మా రాజ్యాన్ని స్వాధీనం చేయకపోయినట్లయితే, అందుకు తగిన ఫలితాన్ని పొందగలడని, తాను, కృష్ణుడు, దుర్యోధనుణ్ణి అతడి అనుచరబృందాన్ని హతమారుస్తామని, సమూలంగా నాశనం చేస్తామని అర్జునుడన్న మాట' " అని చెప్పాడు.

సంజయుడు చెప్పిన మాటలు విని, పితామహుడైన భీష్ముడు దుర్యోధనునితో "నా ప్రియమైన దుర్యోధనా! నీవు ఆ కృష్ణార్జునుల శక్తిసామర్థ్యాలు ఎరుగవు నాయనా! వారు నర నారాయణులని ఋషుల వాక్కు. వారి శక్తి మన ఊహకందనిది. అందుకని వారితో పోరాడాలనే నీ మూర్ఖపు ఆలోచనను వదిలిపెట్టు. నీకు దుర్బోధచేస్తున్న ముగ్గురు వ్యక్తుల మీద నువ్వు ఆధారపడి ఉన్నావు. వారే ఆ దురాలోచనపరుడైన శకుని, పాపిష్ఠివాడు ఆ దుశ్శాసనుడు, పరశురాముని శాపం పొందిన కర్ణుడూను. వారి సాంగత్యం వద్దు" అని సలహా ఇచ్చాడు.

భీష్ముని మాటలు దుర్యోధనునికి రుచించలేదు. ద్రోణుడు, భీష్ముడిలాగానే మాట్లాడాడు. "భీష్ముని మాటలు అక్షరాలా నిజం నాయనా! పాండవులతో కలిసిమెలసి శాంతియుతంగా ఉండటమే అన్నివిధాలా ఉత్తమం" అంటూ వక్కాణించాడు. ధృతరాష్ట్రుడు ఊరుకోకుండా పాండవుల బలపరాక్రమాలను గురించి వర్ణించి చెప్పమని సంజయుని పురమాయించాడు.

అప్పుడిక సంజయుడు స్పష్టంగా వ్యాఖ్యానించడం మొదలుపెట్టాడు. ధృతరాష్ట్రుడు హడిలిపోయాడు. "అబ్బ, సంజయా! నీ మాటలు వింటూంటే నా పుత్రుల బ్రతుకులు ఏమికానున్నాయో అని భయంతో నా గుండెలు దడదడలాడిపోతున్నాయి. సింహాన్ని చూసి బెదిరిపోయే జింక లాగా ఉంది నా విషయం. ఇక భవిష్యత్తులో నా కుమారుల క్షేమమెలా ఉంటుందో యేమో, అయ్యో! కౌరవుల వినాశమే స్పష్టంగా కనబడుతోంది సుమా. పాచికలాట ఆరంభం నుంచే కౌరవుల మీది కేదో ఉపద్రవం రానున్నట్లే తోస్తూంది. ఇప్పుడిక స్పష్టంగా, రూఢిగా తేలిపోయినట్లే.

"దుర్యోధనా! ఐశ్వర్యాన్ని ఆశించి దుర్మార్గమైన కృత్యానికి పాల్పడ్డావు, అంతా నా ప్రారబ్ధం. నూరుగురు కుమారులు హతులైనారని వినాల్సిన యోగం నాకుంది కాబోలు. అప్పుడు నే చేసేదేముంది వారి భార్యల ఏడ్పులు వింటూ అసహాయంగా పడి ఉండటమే ఖర్మ" అంటూ నిట్టూర్చాడు.

"అర్జునుడికి విజయం తప్ప కావాల్సిందేమీ లేదు. మూడు శక్తులు ఉమ్మడిగా చేరి రానున్నాయి. అందులో కృష్ణుడు – అర్జునుడు అతడి గాండీవ ధనుస్సు. అట్టి పరిస్థితుల్లో వారితో పోరుకు సిద్ధపడకుండా ఉండటమన్నది మన వివేకమనుకుంటా, అదీకాక



మనమే యుద్ధానికి దిగామో, కౌరవుల వినాశం తథ్యం. కనుక మనమూ శాంతికోసమే యత్నిస్తే? యుధిష్ఠిరుడెంతో ఉత్తముడు. ప్రత్యేకంగా అతడితోనే లావాదేవీలన్నీ మాట్లాడి వ్యవహారాన్ని సంబాళించుకోవచ్చుగదా!' అన్నాడు మళ్ళీ.

ధృతరాష్ట్రుడు అంటున్నదంతా దుర్యోధనుడు ఓపిగ్గా విన్నాడు. విని ఇలా అన్నాడు: "తండ్రీ! మీరెవ్వరికీ భయపడ నవసరం లేదు. మేమెంత బలశాలురమో మాకు తెలుసు. మాకు గెలుపు తప్పదు. ఆ విషయం యుధిష్ఠిరుడికీ బాగా తెలుసు. రాజ్యమంతా ఎలాగూ లభించదనే నిరాశలోపడి కనీసం అయిదూళ్ళయినా ఇవ్వమని యాచనకు దిగాడు. దీనిని బట్టి వారికెంత బెదురుపుట్టిందో అర్థం కావడం లేదూ?" అన్నాడు.

అప్పుడిక ధృతరాష్ట్రుడు పాండవుల బలమెంతో, వారికున్న సైన్యసహకార మెంతటిదో, సాయపడతామన్న రాజులెవరో, వారి పేర్లు వగైరా తెలుసుకోవాలనుకున్నాడు.

అప్పుడు అదంతా సంజయుడు ఏకరువు పెట్టాడు. వారికెంతటి సైనిక బలముంది దాని వీరవరులైన రాజులెవరెవరో అన్ని వివరాలు పూసగుచ్చినట్లు చెప్పాడు. సంజయుడు చెబుతున్న ఆ వర్ణనంతా విన్న తరువాత ధృతరాష్ట్రుడికి మరోసారి గుండె గుభేలుమంది. అప్పుడు ధృతరాష్ట్రుడు "నాకు తెలుసు, నా మూర్ఖపు సంతానం, దుర్యోధనుడు వీరికి వత్తాసుగా నిలబడనున్న ఆ పనికిమాలిన రాజులు అంతా కట్టకట్టుకు నాశనం కావాల్సిందే, తప్పదు. నా మనోనేత్రానికంతా స్పష్టంగా కనబడుతూనే ఉంది. మృత్యుదేవత గాండీవ ధనుస్సు రూపంలో వచ్చి అంతం చేయనుంది. నా సలహాని అలక్ష్యం చేసి దుర్యోధనుడు బలాబలాలు తెలియక ధార్మికశక్తి, దైవశక్తి అండదండలున్నవారితో యుద్ధానికి ఉబలాటపడుతున్నాడే!" అని వాపోయాడు.

ఇక దుర్యోధనుడికి ఓర్పు సన్నగిల్లింది. తండ్రి మీద విరుచుకుపడ్డాడు: "నా ప్రియమైన నాన్నగారూ! దయచేసి నమ్మకం వదలుకోకండి. ఇరువర్గాలవారు ఒకే కులానికి చెందిన వారే. ఇరువురు ఒకే నేల మీదనే నివసిస్తున్నారు. అటువంటప్పుడు మీరు వారికెందుకంతటి ప్రత్యేకతని ఆపాదిస్తున్నారో, అధికులుగా అంచనా వేస్తున్నారో అర్థం కావడం లేదు." ఎంత చెప్పినా ధృతరాష్ట్రుడికి దుర్యోధనుడి వైఖరి ఏమాత్రమూ నచ్చలేదు.

ధృతరాష్ట్రుడు "సంజయుడు చెప్పింది అక్షరాలా నిజం. యుద్ధం ఏవగించుకోదగినదీ, అనర్థదాయకమైనదీను. సగం రాజ్యమైతేనే నీకు సమృద్ధిగా సరిపోతుందే మిగతా సగం పాండవులకు ఇచ్చివెయ్యి. నే చెప్పదలచినది చెప్పాను కానీ, అంత తేలిగ్గా వినే నైజం నీకు లేదు. నేనే కాదు భీష్మ, ద్రోణ, సంజయాదులెవ్వరికీ కూడా ఈ యుద్ధం ససేమిరా ఇష్టం లేదు. 'వద్దు' అనే అందరి ఉద్దేశం. కనుక యుద్ధం మానడం మంచిది" అన్నాడు.

దుర్యోధనుడి ఆవేశానికి పట్టపగ్గాల్లేవు. "ఎవరేమనుకున్నా సరే, ఎవరి సాయమూ నా కవసరం లేదు. మనస్ఫూర్తిగా సాయం చేశారా, చేస్తారు, లేదా



నాకక్కర్లేదు. భీష్ముడు మిగతావారు, వారు కావాలనుకుంటే దూరంగానే ఉండొచ్చు. నాకేం దిగుల్లేదు. ఆ పాండవుల్ని ఎదుర్కోడానికి కర్ణుడు, దుశ్శాసనుడు, నేనూ మాత్రమే చాలు. పాండవుల్ని నేలకూల్చి ఈ సామ్రాజ్యమంతా మేమే అనుభవించాలి. లేదా నన్ను కూల్చి ఆ పాండవులే పట్టం గట్టుకోనీ, అంతే. అందుకు నేను నా ప్రాణాల్ని, నా రాజ్యాన్ని, నా సంపదల్ని, ఆఖరికి నా సర్వస్వాన్ని త్యాగం చేసేందుకు సంసిద్ధమే, కాని సంధికి మాత్రం ససేమిరా ఒప్పుకోను. ఆ పాండవులకి రాజ్యంలో రవ్వంత జాగా కూడా దక్కనీయను, అది ముమ్మాటికీ నిజం. వారితో యుద్ధమే నా దృఢనిర్ణయం" అని తన యుద్ధకాంక్షను వెల్లడించాడు.

పాండవులతో సంధి చేసుకోవడమే సర్వోత్తమమైనదని భీష్ముడు దుర్యోధనుడికి మరోసారి హితవు చెప్పాడు. కాని, ఆ మంచి సలహా దుర్యోధనుడికి గానీ, అతడి సహచరులకు గానీ ఏమాత్రం రుచించలేదు. వారు లక్ష్యపెట్టలేదు. సమావేశం పూర్తికాకుండా మధ్యలోనే వారంతా లేచి వెళ్ళిపోయారు. అంతటా గందరగోళం చోటుచేసుకొంది. సమావేశానికి అంతరాయం కలిగింది. కొలువుకూటం నిర్జనమైపోయింది. ఒక్క ధృతరాష్ట్రుడు, ఆయన సారథి తప్ప, అంతా శూన్యమే. ధృతరాష్ట్రుడు పరితపిస్తూ అక్కడే కూర్చుండిపోయాడు.



# 5
# సంధీ... సమరం?

పాండవుల వైపు యుధిష్ఠరుడూ ఎంతో విచారపడుతున్నాడు. అతడు యుద్ధం ఇష్టపడటం లేదు. కృష్ణుడితో "కృష్ణా! ఇక నిర్ణయం చేయాల్సిన తరుణం వచ్చేసింది. నీవే మాకు శరణ్యం. మేము ఏం చేయడం మంచిదో చెప్పు. మా క్షేమం కోరి దయచేసి హస్తినాపురానికి వెళ్లి ఆ ధృతరాష్ట్రుడితో చెప్పాల్సింది చెప్పు.

"ధృతరాష్ట్రుడు, ఆయన కుమారులు మా విషయం ఏం నిశ్చయించారో సంజయుడి ద్వారా విన్నాం. మీ ఆదేశానుసారం మేము పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం ఒక యేడు అజ్ఞాతవాసం చేశాం. అయినా, మా రాజ్యం మాకు తిరిగి ఇచ్చేందుకు ఇంకా నిరాకరిస్తూనే ఉన్నారే. వారు ధర్మాన్ని, న్యాయాన్ని లెక్కచేయరా? నేను యుద్ధం కోరను. నాకు అయిదు ఊళ్ళు ఇమ్మను చాలు. అక్కడ నేను నా సోదరులు ద్రౌపది ఉంటాం. మేమున్న ఈ కష్టదశలో మేమెవర్ని సంప్రదించగలం. మాకు నీవు తప్ప ఎవరున్నారు? మాకు



ఆప్తుడివి నీవే, మా క్షేమం కోరేవాడివి నీవేగదా! ఏది ఎలా జరుగనున్నదో పరిణామమేమిటో ఎవరి రుణం ఎలా తీర్చుకోవాలో ఎవరికెరుక" అన్నాడు.

కృష్ణుడు "యుధిష్ఠిరా! నేను తప్పకుండా మీ ఇరుపక్షాల క్షేమానికే ప్రయత్నిస్తాను. నా రాయబారమే ఫలించిందా, నేను ప్రపంచాన్నే వినాశం నుంచి రక్షించానన్న సంతోషం నాకు నిండుగా ఉంటుంది" అని సమాధానం చెప్పాడు.

అప్పుడు యుధిష్ఠిరుడు, "అయితే కృష్ణా! నిన్నచ్చటికి ఒంటరిగా పంపాలంటే నాకు భయంగా ఉంది సుమా! ఎందుకంటే, మాకున్న అమూల్యమైన సంపద నీవేనయ్యా! ఆ దుర్యోధనుడు నీకు హానిచేయ తలపెట్టవచ్చు. అటువంటిదేదైనా నీకు సంభవించినట్లయితే ఈ ప్రపంచమంతా దక్కినా మాకిక సంతోషమన్నదే లేదనుకో" అన్నాడు. అందుకు కృష్ణుడు చిరునవ్వు నవ్వి, "నీవంటున్నది యథార్థమే. దుర్యోధనుడు నన్ను దూషించవచ్చు, హాని చేసేందుకు ప్రయత్నించనూ వచ్చు. కానీ, ఒక్క సింహం ముందు చిట్టిపొట్టి జంతుజాలాలేవీ నిలువలేనట్లే, నాకు కోపం తెప్పించారా అంటే భూమి మీద ఉన్న రాజులంతా ఏకమై గుమిగూడి వచ్చినా ఎదిరించలేరన్న విషయం గుర్తుంచుకో, కౌరవులు నన్ను అవమానించినట్లైతే వారిని నేను హతమారుస్తాను.

"సంజయుడు చెప్పిందంతా విన్నావు గదా, ఇంకా నీకు కౌరవులతో స్నేహంగా కలిసిమెలిసి ఉండాలనే ఉందా? అయితే, ఒక నిజమైన క్షత్రియుడైనవాడికి, మరీ అంత శాంతగుణం, కనికరం కూడదు. క్షత్రియుడైనవాడు యుద్ధంచేసి విజయాన్ని సాధించాలి, లేదా పోరాడి వీరమరణమన్నా పొందాలి. నాకు దుర్యోధనుడి విషయంలో గట్టి నమ్మకమే, అతడు రాజ్యాన్ని పంచి ఇచ్చేందుకు ఇష్టపడడు. అందువల్ల మీ సైనికబలాన్ని యుద్ధానికి సిద్ధం చేయించు. నేను వెళ్ళి తిరిగి వచ్చేసరికి యుద్ధసన్నాహాలు పూర్తికావాలి" అని చెప్పాడు.

అప్పుడు భీముడు "ఓ కృష్ణా! నీవు కనుక సంధి చేసుకుని వచ్చావంటే నేనెంతో సంతోషిస్తాను. మరొక్కమాట యుద్ధ పరిణామాలు వివరించి వారిని బెదరగొట్టకు... పాపం దుర్యోధనుడు స్వాభావికంగా దుర్మార్గుడే అనుకో... అయినా అతణ్ణి తూలనాడకు. శాంతియుత సహజీవనాన్ని మించిందేముంది కనుక. ఆ విషయంలో నేను నా సోదరుడితో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. మా తాతగారైన భీష్మాచార్యుల్ని యుద్ధప్రసక్తి లేకుండా ఒప్పించడానికి వీలైనంతగా ప్రయత్నించు. నా సోదరుడు అర్జునుడు కూడ నా మాటతో ఏకీభవిస్తాడనుకుంటాను. అతడికీ యుద్ధం గిట్టదు. కాని, అదీ మనం యుద్ధం వద్దనుకుంటేనే సుమా..." భీముడు మనస్ఫూర్తిగా వెల్లడించిన అభిప్రాయాన్ని విని కృష్ణుడుఎంతో సంతోషించాడు. భీముడి నుండి కృష్ణుడు ఎదురుచూసిందీ ఆ మాటే.

అయితే చల్లని నిప్పు, తేలికైన కొండ ఉంటుందంటే కూడా నమ్మవచ్చేమోగానీ, భీముడిలో అంతటి సుతిమెత్తని హృదయముండడం చూసి కృష్ణుడు విస్తుబోయాడు.

అప్పుడు కృష్ణుడు, "నే వింటున్నది నిజమేనా భీమా? నిన్నటి వరకు యుద్ధమే కావాలన్నవాడివి... గడిచిన పదమూడు సంవత్సరాలు నీకు ఒక్క రాత్రికూడ కంటినిండా కునుకే లేదే, మనస్సుకు శాంతి కరవైనదే, పగబట్టిన పాము బుసకొట్టినట్టు నిట్టూర్చే నీవు కోపోద్రేకంతో ఉవ్వెత్తునలేవడం, ఏం చెయ్యాలో తోచక నిస్సహాయంగా చేతులు నులుముకుంటూ ఉండడం... నీ అగ్రజుడు నిన్ను శాంతింపజేయడం జరుగుతూ ఉండేదే. ఇప్పుడీ శాంతి, సంధి అని మాట్లాడుతూంది నీవేనా? ఏమిటీ విడ్డూరం అనిపిస్తూంది. భగ్గుమనాలి గానీ, దైన్యానికి లొంగరాదు. జడత్వం నీకు తగదు. అసలు నీ చేరువకే రారాదు సుమా" అన్నాడు. కృష్ణుని హెచ్చరికలు విని భీముడు "కృష్ణా! నీవు నన్ను అపార్థం చేసుకున్నావు. ఏళ్ళ తరబడిగా నీవు నన్నెరుగుదువు. ఎన్నడూ నీవు నన్ను పిరికిపంద అనలేదు. కౌరవుల్ని కాలరాచి పొడిచేసేందుకు చాలినంత శక్తి నాకు లేకపోలేదు. ఒకవేళ నా శక్తి తెలీనట్లయితే రానున్న యుద్ధంలో చూడవచ్చులే. ప్రస్తుతం జరుగుతున్న సంధి ప్రయత్నాల్ని చెడగొట్టదల్చుకోలేదు, అందుకని" అన్నాడు. అతడి మాటలకు కృష్ణుడు నవ్వి, "నీ గురించి నాకు తెలుసు భీమా! నీమీద నాకున్న గాఢమైన అపేక్షతో అలా అన్నానే గానీ, ఆహా... నీలోని శౌర్యాన్ని రెచ్చగొట్టాలనీ, అంతే. మన పక్షంలోని మహాబలిష్ఠుడైన వ్యక్తి నీవేనని నాకు తెలుసు. అంతేకాదు పాండవులంతా నీ శక్తిపై ఆధారపడినవారేననీ తెలుసు" అని ఉన్న యథార్థాన్ని చెప్పాడు. భీముడు శాంతించాడు.

అప్పుడిక అర్జునుడు, "కృష్ణా! యుధిష్ఠిరుడు నీకు చెప్పవలసిందంతా ఈపాటికి చెప్పేశాడు. కాని, నీ మాటలను బట్టి సంధి ఒడంబడిక సాధ్యంకాదనే స్పష్టమవుతోంది. అయినా నీవు తల్చుకుంటే



సాధించలేనిదంటూ యేదీ లేదు. ఏదియేమైనా సరే, నీ సలహా ఎట్టిదైనా మా కందరికీ శిరోధార్యమే సుమా..., నేను భవిష్యత్తును గురించి చింతించడం లేదు. కౌరవవినాశమే నీ నిర్ణయమైతే తక్షణమే యుద్ధం ప్రారంభిద్దాం. నీకేది మంచి అని తోచిందో అదే చేద్దాం. అది మాకే కాదు, లోకమంతటికీ 'మంచి' అవుతుంది. నీవు మా పక్షాన ఉన్నందుకు మాకెంతో ఆనందంగా ఉంది. అంతటి అదృష్టం మాకు చాలు" అన్నాడు.

అందుకు కృష్ణుడు "అర్జునా! నీవన్నది వాస్తవమే. దైవనిర్ణయమూ, మానవ యత్నమూ రెండూ ఒకటవ్వాలి. 'నేను తల్చుకుంటే వారినేమైనా చెయ్యగలను'... అనే నీ ఆలోచన తప్పు అంటాను. ఏం? దుర్యోధనుణ్ణి, అతని అనుచరుల్ని హతమార్చకుండానే నీ రాజ్యాన్ని నీవు పొందగలవనుకుంటున్నావా? కౌరవులు రూఢిగా శిక్ష ననుభవించి తీరాల్సిందే. వారిని రక్షించేందుకు నేను ఏ లీలలు ప్రదర్శించలేను. నా వరకు నేను యుద్ధం జరగకుండా ప్రయత్నించి చూస్తాను. కాని, శత్రువునుండి సంధిని గురించి ఎక్కువగా ఆశించకు. యుధిష్ఠిరుడు చెప్పమన్న సందేశాన్ని నేను వారికి అందజేస్తాను" అన్నాడు.

## 6
## ద్రౌపది విన్నపం

ద్రౌపది కళ్లవెంట ధారగా కన్నీరు కారుస్తూ, నల్లవైన నిడుపాటి కురులను అరచేతపట్టి కృష్ణుడితో "ఓ కృష్ణా! కౌరవులు పాండవుల జీవితంలో సంతోషమన్నదే లేకుండా చేశారన్న సంగతి నీ వెరిగిందే గదా! ఆ కౌరవులపట్ల ఎటువంటి కనికరం చూపించరాదని నా పట్టుదల. వారు చేసిన అక్రమచర్యలకి వారిని శిక్షించాల్సిందే నంటాను. వారిని శిక్షించడంవల్ల నీకుగానీ, పాండవులకు గానీ యే పాపమూ అంటదు. ఈ లోకంలో నాలాటి స్త్రీ ఎవరైనా ఉన్నారా చెప్పు? నాలాగా అంతటి అవమానం పొందిన స్త్రీ ఎక్కడైనా ఉంటుందా? నన్ను నా భర్తల ఎదుటే కొప్పుపట్టుకు ఈడ్చుకువచ్చారే! నన్నొక మామూలు దాసీమనిషిగా చూశారే, దుర్మార్గమంతా మూర్తీభవించినట్లున్నవారు రాజసభలోకి లాక్కొచ్చిపడేశారే! నా భర్తలైన పాండవులు ప్రేక్షకులై చూస్తూనే ఉన్నారే! ఆ దుర్యోధనుణ్ణి ఇంకా బ్రతకనిచ్చారంటే, ఆ అర్జునుడు ధనుర్విద్యానిపుణుడని, భీముడు బలశాలి అని చెప్పుకోవడం కూడ సిగ్గుచేటు అనాలి. నీకు కనుక నాపై జాలి ఉంటే దయచేసి కౌరవనాశనమే నీ పరమ లక్ష్యంగా పెట్టుకోవాలి" అంటూ నల్లతాచులా నిగనిగలాడుతున్న నిడువైన తన శిరోజాలను ఎడమచేత గుప్పెటపట్టి చూపుతూ, "చూడు, ఈ కేశపాశాన్ని చూడు ఆనాడు దుశ్శాసనుడి హస్తస్పర్శతో మలినమైపోయినందువల్ల వాటిని దువ్వలేదు, ముడిపెట్టలేదు.

"శత్రువులతో సంధి చేసుకోవాలనుకుంటున్న వారందరిని చిరస్మరణీయమైన పరాభవాన్ని నెమరువేసుకొని సిగ్గుపడమను. భీమార్జునులకు సంధిపట్ల అంతటి మక్కువే ఉంటే, ఉండనీ, నా తండ్రిగానీ, నా పుత్రులు గానీ వెళ్ళి ఆ కౌరవులతో యుద్ధం చేస్తారు... ఈ పగదీర్చుకునేందుకు పదమూడు సంవత్సరాలు ఓపికపట్టి ఎదురు చూశాను" అంటూ ద్రౌపది ఇక దుఃఖాన్ని ఆపుకోలేక భోరున విలపించింది.



కృష్ణుడు 'ద్రౌపదీ! నీ వనుకున్న తరుణం రానే వచ్చింది. రాణివాసంలో కౌరవస్త్రీల ఏడ్పులు, పెడబొబ్బలూ వింటావు. బంధుమిత్రుల్ని అయినవాళ్లందరిని పోగొట్టుకొని ఎలా గోడుగోడుమంటారో చూస్తావుగా..., పాండవుల సాయంతో నేను తప్పకుండా నీ వడిగింది సాధిస్తాను. దైవం అనుకూలించకపోదులే" అంటూ ఆమెను ఓదార్చాడు.

ఆ మర్నాడు కృష్ణుని హస్తినాపుర ప్రయాణానికి సన్నాహాలు ప్రారంభమయ్యాయి. కృష్ణుడు సాత్యకితో "నా రథం సిద్ధం చెయ్యి, శంఖ, చక్రాలు, గదాదండమూ కూడ. దుర్యోధనుడు దుర్మార్గుడు ఆ కపటికి సాయం కర్ణుడు, శకుని. ఇక చెప్పాలా! బలహీనుడైన శత్రువు ఆలోచనలూ అడ్డదిడ్డంగానే ఉంటాయి. బలవంతుని ఆలోచనల్లా తిన్నగా ఉండవుగదా" అన్నాడు.

యుధిష్ఠిరుడు మిగిలివారు అతని వెంట రథం దాకా వచ్చారు. కృష్ణుడు వారందరి వద్ద సెలవు పుచ్చుకున్నాడు. సాత్యకితో కలసి కృష్ణుడు హస్తినాపురానికి పయనమైనాడు.

## 7
## కృష్ణునికి ఘనస్వాగతం

ధృతరాష్ట్రునికి వేగుల ద్వారా కృష్ణుడు రాయబారిగా వస్తున్న కబురు తెలిసింది. వెంటనే భీష్మ, ద్రోణ, విదుర, సంజయ, దుర్యోధనుల్ని పిలిపించాడు. వారితో "పాండవ పక్షాన రాయబారియై సాక్షాత్తూ ఆ శ్రీకృష్ణుడే రానున్నాడు. ఈ చరాచర ప్రపంచ విధానమంతా అతడిపైనే ఆధారపడి ఉంది. సంధియో, సంగ్రామమో తేల్చేందుకే అతడు ఇక్కడికి వస్తున్నాడు.



అతణ్ణి మనం యథావిధిగా గౌరవించాలి. అన్ని విధాలా సంతోషపరచాలి. అతడు బస చేసేందుకు తగిన వసతులు కల్పించాలి. అతడి శుభాకాంక్షలు మనకెంతో అవసరం. అతణ్ణి మనం సంతుష్టుని చేస్తే, అతడి సాయం మనకుంటుంది. అతడికి మిక్కిలి ఘనంగా స్వాగతమివ్వాలని పురజనులను ఆదేశించండి. కట్టడాలపై జెండాలు ఎగురవేయించండి. స్తుతివచనాలతో ప్రకటనలు తగిలించండి. వీథులన్నీ ఇరుదెసల పరిశుభ్రం చేయించండి. నీళ్ళు చల్లించండి" అని సూచనలు చేశాడు.

భీష్ముడు మిగతావారంతా కూడ ఆయన సూచనల నంగీకరించారు. దుర్యోధనుడు కావలసిన ఏర్పాట్లన్నీ చేయించాడు. ధృతరాష్ట్రుడు విదురునితో "కృష్ణుని నేటిరాత్రికి కుశస్థలంలో విడిదిచేయించండి. రేపటికి హస్తినాపురం వస్తాడు. నేనతడికి మణులు, విలువైన కానుకలిచ్చి గౌరవించాలి. అతణ్ణి సంతృప్తి పరచాలని నాకు ఎంతో ఆరాటంగా ఉంది" అన్నాడు. అందుకు విదురుడు, "కృష్ణుడు ఈ భూమ్మీద అవతరించిన దివ్యపురుషుడు. నీవు చెప్పిన అన్ని మర్యాదలు, ఇంకా ఎక్కువగా కూడా పొందేందుకు అతడు అర్హుడు. కాని ఇక్కడ అదికాదు విషయం. నీ బాల్యం నుండే నేను నిన్నెరుగున్న వాణ్ణి గదా! ఎంతసేపు, అవతలవారిని వల్లో వేసుకుందుకు రకరకాల ఎత్తులు, జిత్తులు ప్రయోగించడమే అలవాటుగా పెట్టుకున్నావే! వారిని నీ వైపు తిప్పుకోవాలనే నీ తహ తహ.

"నీకు ఆ పాండవులడిగిన కేవలం అయిదు ఊళ్ళిచ్చేందుకు కూడా మనసు రాలేదే! అటువంటి నీలో ఉన్నట్లుండి ఇంతటి ఔదార్యం ఎలా పుట్టుకొచ్చిందబ్బా! ఆశ్చర్యం. ఏమైనాగానీ, ఆ కృష్ణుడి దృష్టి దేనిమీద పడదు. అతడు ఒక ముంతడు నీళ్లతో కాళ్ళుకడిగేందుకు మాత్రం అంగీకరిస్తాడనే నా నమ్మకం. ఆ పాండవులు నీ తమ్ముని బిడ్డలే కదా! వారిపట్ల కూడ అపేక్ష, ప్రేమ చూపించవచ్చుగదా... పెత్తండ్రిగా ఆ పాటి ప్రేమ, ఆదరణ చూపలేవా?" అనడిగాడు.

అంతా వింటూ దుర్యోధనుడు "విదురుడు కృష్ణుని గురించి చెప్పింది నూటికి నూరుపాళ్లు నిజమే. అతడికి పాండవులంటే వల్లమాలిన అపేక్ష. అనవసరంగా అతడి కేవో కానుకలు గట్రా ముట్టజెప్పాలనుకోవద్దు. మనమేదో అతడికి జంకి, గౌరవమర్యాదలు చేస్తున్నామని భావిస్తాడు" అన్నాడు. అందుకు భీష్ముడు "నీ వతణ్ణి గౌరవించావా లేదా అన్నది ఆ శ్రీకృష్ణుడికి ఎంతమాత్రం ముఖ్యం కాదు. అతడు పాండవులకు జరిగిన అన్యాయాన్ని పురస్కరించుకుని, వారికి న్యాయసమ్మతమైన హితాన్ని చేకూర్చేందుకై చర్చించడానికి వస్తున్నాడు. మనం కనుక పాండవులతో సంధి చేసుకొంటే అతడు సంతోషిస్తాడు" అనేసరికి దుర్యోధనుడు కోపంతో మండిపడుతూ, "ఓ తాతగారూ! నా పథకం వినండి. నేనిక్కడ కృష్ణుణ్ణి ఖైదు చేస్తాను. అది నా ఎత్తు తెల్సిందా? కృష్ణుడు లేకుండా పాండవులేం చేయగలరు? చెప్పండి" అన్నాడు ఆగ్రహంగా.

ధృతరాష్ట్రుడు దుర్యోధనుడి ఎత్తుగడ గూర్చి విని హడలెత్తిపోయాడు. మనసెంతో నొచ్చి, "సంధి ప్రయత్నంకోసం రాయబారియై వస్తున్న దూతని ఖైదు చేయడం ధర్మవిరుద్ధమైన పని. అదిగాక అతడు మనకి చేసిన చెరుపేమీ లేదే..." అన్నాడు ధృతరాష్ట్రుడు.

"దుర్యోధనుడు దుర్మార్గంగానే ఆలోచించగలడు. మా సలహాలు పాటించడానికి మారుగా నువ్వు పుత్రవాత్సల్యంతో అతణ్ణే అనుసరిస్తున్నావు. నేనిక ఇక్కడ క్షణంకూడా ఉండను" అంటూ భీష్ముడు రాజసభ నుంచి నిష్క్రమించాడు.

మర్నాడు ఉదయం కృష్ణుడు హస్తినాపురానికి వచ్చాడు. భీష్మ, ద్రోణ, కృపాచార్యులను వెంటబెట్టుకుని ధృతరాష్ట్రుడు వెళ్ళి స్వాగతమిచ్చాడు. పురజనులంతా శ్రీకృష్ణపరమాత్మ దర్శనానికి తరలి వచ్చారు.

తరువాత కృష్ణుడు రాజభవనానికి వెళ్ళాడు. పెద్దలందరికి సగౌరవంగా అభినందనలు తెలిపాడు. సభామర్యాదలు, పలకరింపులు అన్నీ అయిన తరువాత కృష్ణుడు విదురుడితో అతడి ఇంటికి వెళ్ళాడు. కుంతి విదురుని ఇంట ఉంది. బాధవల్ల పూడుకుపోయిన కంఠంతో అతణ్ణి పలకరించింది. పాండవుల యోగక్షేమాలను అడిగి తెలుసుకొంది. అప్పుడు కృష్ణుడు ఆమెకు పాండవులు అన్నేళ్ళు అరణ్యవాసంలో ఎలా గడిపింది చెబుతూ, "ఎప్పుడూ నిన్ను గురించి అనుకునేవారు. నీ పేరే జపించేవారు..." అంటూ, "పాండవులు, ద్రౌపది నీకు తమ వందనాలు తెలుపమన్నారు, త్వరలో నీవు వారిని కలుసుకోబోతున్నావు, వారికి సకల సౌభాగ్యాలు చేకూరుతాయి. నీకు నీ సంతానానికి సంతోషమైన కాలం రానున్న"దని వివరంగా చెప్పాడు.

## 8
## విదురుని ఆతిథ్యం

కృష్ణుడు దుర్యోధనుని రాజభవనానికి వెళ్లాడు. అది దేవేంద్ర భవనంలాగా ఉంది. రకరకాల మణులు, మాణిక్యాలతో అలంకరింపబడి ఉంది. దుర్యోధనుడొక సింహాసనం మీద కూర్చున్నాడు. కర్ణుడు, దుశ్శాసనుడు, శకుని ప్రక్కన వారి వారి ఆసనాల నలంకరించారు. కృష్ణుని చూచి వారంతా లేచి నిలబడ్డారు. కృష్ణుడు వారందిరికి హృదయపూర్వకమైన శుభాకాంక్షలు తెలిపాడు.

కృష్ణుడు కూర్చునేందుకు ఒక ప్రత్యేకమైన ఆసనం అమూల్యమైన మణులతో తాపబడినదై లోపల దంతం, బంగారపు నగిషీ పనితనంతో అమర్చబడింది. కృష్ణుడు చిరునవ్వుతో ఆసనాన్ని అలంకరించాడు.

అప్పుడు దుర్యోధనుడు "మేము నీ కోసం ఒక విందు ఏర్పాటు చేశాం... ఇక్కడే ఉండేందుకు చక్కని వసతులతో బసకూడ ఏర్పరచాం.



కానీ, నీవు విదురుని ఇంటికి ఆతిథ్యానికి వెళతానంటున్నావు, కారణం?" అనడిగాడు.

అందుకు కృష్ణుడు "దుర్యోధనా! నేను మీరిచ్చిన ఘనస్వాగతానికి ఎంతో సంతుష్టుడనయ్యాను. నేనిప్పుడిక్కడకి ఒక మధ్యవర్తిగా వచ్చాను. వచ్చిన వ్యవహారం ముగియగానే తప్పకుండా మీ ఆతిథ్యాన్నందుకుంటాను సరా?" అన్నాడు.

దుర్యోధనుడు "అది ఔననుకో, నీవు రాయబారిగా వచ్చి ఉండవచ్చు కానీ నీవు మా చుట్టానివి. మనలో మనకి ఎట్టి విరోధాలు, విభేదాలు లేవు. మాకందరికీ నీవంటే ఎంతో ఇష్టం. నీకేమిటి అభ్యంతరం?" అన్నాడు.

అప్పుడిక కృష్ణుడు "నేను మీ అతిథిగా ఉండదల్చుకో లేదు. ఎందుకంటావా? అధర్మవర్తనుని ఇంట భోజనం నాకు రుచించదు కనుక గడిచిన అనేక సంవత్సరాలుగా అకారణంగానే మీరు పాండవుల్ని ద్వేషిస్తున్నారు. వారు నాకెంతో ఇష్టులు. అత్యాశకు దాసులైనవారు, ఇతరులను అవమానించేవారు నా దృష్టిలో అయోగ్యులు. పాండవుల్ని ద్వేషిస్తే నన్నూ ద్వేషించినవారే అవుతారు, కారణం పాండవులతో నాకంతటి ప్రగాఢ మైత్రీ, బంధుత్వమూ ఉంది" అని నిర్మొహమాటంగా చెబుతూ లేచి సరాసరి విదురుని ఇంటి వైపు నడుస్తూ వెళ్లిపోయాడు.

అప్పటికీ, కృష్ణుణ్ణి తమ అతిథిగా ఉండమని ఎంతో బ్రతిమాలాడారు. కాని కృష్ణుడు అంగీకరించలేదు. విదురుని ఇంటికే వెడతానన్నాడు. ఓహ్... విదురుడు పరమానందభరితుడైపోయాడు. పరిపూర్ణమైన భక్తిప్రపత్తులతో ఆయనకు ఆతిథ్యమిచ్చాడు. ఆ రాత్రి కృష్ణుడు విదురుడు పరస్పర సంభాషణలు జరిపారు.

విదురుడు "ప్రభూ! నీవీ సంధి ప్రయత్నానికి రాయబారివై వచ్చి ఉండకూడదు. ఆ దుర్యోధనుడు వట్టి నయవంచకుడు, మూర్ఖుడు ఎవ్వరి సలహాను చెవినబెట్టడు. అతడు ఎంతసేపూ యుద్ధం వైపే మొగ్గి ఉన్నాడు. తాను భీష్మ, ద్రోణ, కృపా, అశ్వత్థామ, కర్ణ ఇంకా జయద్రథుల సాయంతో యుద్ధంలో పాండవులను జయించగల ననుకుంటున్నాడు. అహంకారం అవధులు దాటింది. లెక్కలేనంత భారీసైన్యాన్ని సమకూర్చిపెట్టుకున్నాడు. విజయం తనదేనన్నట్లు భావిస్తున్నాడు. అంతదాకా యెందుకు తన శత్రువుల్నందరిని హతమార్చేందుకు కర్ణుడొక్కడే చాలని కూడ గట్టినమ్మకంతో ఉన్నాడు. అందువల్ల అక్కడ 'సంధి' ని గురించిన ప్రసక్తే లేదనుకో. అందుకనే నీవసలు అక్కడికి వెళ్ళేందుకు కూడ నేనిష్టపడటం లేదు. వారెంతకైనా తెగిస్తారు. నిన్నవమానించనూ గలరు. కృష్ణా! అటువంటప్పుడు నేను చూస్తూ ఊరుకోగలనా? చెప్పు" అన్నాడు.

అందుకు కృష్ణుడు, "నీవు చెప్పిందంతా అక్షరాలా నిజమే. అందులో ఏమాత్రం సందేహం లేదు. ఏం జరిగినా నేనొచ్చింది ఆ పనికే గదా! యుద్ధానికి దిగితే, ఈ కౌరవులు మృత్యువు నోట పడే ప్రమాదముంది. అది తప్పించాలనే, నే చెయ్యాలనుకున్న ప్రయత్నమంతవరకే. నేను కనుక అంతపని చేయగలిగితే ఆనందమే. అనుకున్నది సాధించానని సంబరపడతాను. సంధి కోసం మనస్ఫూర్తిగా ప్రయత్నించి చూస్తాను. కౌరవ వంశం మీద మృత్యువు తాండవిస్తోంది. అది తెలిసి కూడ, దాన్ని ఆపడానికి దాని బారినుండి వారిని తప్పించేందుకే నేను కనుక ప్రయత్నించకపోతే, నేను వారికి మిత్రుణ్ణి ఎలా అవుతాను? మిత్రుడు చూస్తూ వదిలిపెట్టి ఊరకుంటాడా? అందువల్ల కౌరవులకు ఈపాటి సాయం



చెయ్యాలని నాకెంతో పట్టుదలగా ఉంది సుమా! నాకు యుధిష్ఠిరుడంటే ఎంతో ఇష్టం ఉండొచ్చు. అది వేరే సంగతి. అతడు ఈ భూమ్మీద జన్మించిన ఒక మహానుభావుడు. అతడు సంధినే కాంక్షిస్తున్నాడు. అందువల్ల అతని మాటకు విలువ నిచ్చి పాటించడం ఘనమైన విషయం. ఆ కారణంగానే నేనిక్కడికి రావడం తటస్థించింది" అని స్పష్టం చేశాడు.

ఈ విధంగా ఇరువురు మహాజ్ఞానుల సంభాషణతో ఆ రాత్రి గడిచింది.

# 9
# కౌరవసభలో కృష్ణుడు

మర్నాడు ఉదయాన్నే కృష్ణుడు విదురుడితో కలిసి కౌరవ రాజసభకు వెళ్లాడు. ధృతరాష్ట్రునితో సహా సభలోని అశేష ప్రముఖులు తమ తమ ఆసనాల నుండి లేచి నిలబడి కృష్ణుని పట్ల తమకుగల ఆదరాభిమానాలను వ్యక్తంచేశారు.

నారదుడు ఇంకా తదితర ఋషులు, మహర్షులు కూడ జరుగనున్న ఆ తతంగాన్ని దర్శించేందుకు సభకు విచ్చేశారు. సభలో ఉన్న వారందరి చూపులు ఆ కృష్ణుని మీదనే కేంద్రీకృతమై ఉన్నాయి. కృష్ణుని ఆకర్షణీయమైన కళ్ళ కాంతి ఆ మహాసభను ప్రకాశవంతం గావించింది.



అతడికత్యంత ప్రియమైన కౌస్తుభమణి వక్షస్థలం మీద తళతళ మెరిసిపోతోంది. అతడు, తన నీలమేఘ శరీరంపై పసుపుపచ్చని దుస్తుల్లో, బాలసూర్యుని బంగారు కిరణకాంతులు ప్రసరిస్తున్నప్పటి నీలాద్రిలాగా చూపరులకు కనువిందుచేశాడు.

సభాభవనమంతా మిక్కిలి నిశ్శబ్దంతో నిండింది. కృష్ణుడు ధృతరాష్ట్రుని వంకచూసి, "ఎంతోమంది మహావీరుల్ని మృత్యువు నుంచి కాపాడాలనే నేనిక్కడికి వచ్చాను. నేనిప్పుడు క్రొత్తగా చెప్పాల్సిన విషయమేమీ లేదు... అంతా మీకే తెలుసు. అన్ని వంశాల్లోకి కురువంశం ఎంతో శ్రేష్ఠమైంది గదా! అది జాలికి, దయకి, న్యాయానికి, నిజాయితీకి, ప్రేమ, ఔదార్యాలకి ఎంతగానో ప్రసిద్ధి చెందింది. కాని, నీ కుమారులు పాండవుల్ని మోసం చెయ్యాలనే తలంపుతో ఉన్నారు. మీరు కనుక వారిని సరిదిద్ది అదుపులో పెట్టకపోతే, లోకమంతటికీ చేటుగలుగుతుంది.

"మీరు వారిని నిజంగా అదుపు చేయాలనుకుంటే, వారిని పాండవులతో సంధికి ఒప్పుకోమని చెప్పాలి. అందరి క్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని, మీరాపని చేయడమే మేలంటాను. మీకు దృఢమైన ఆత్మవిశ్వాసమున్నట్లయితే, మీరది సాధించగలరు. స్థిరబుద్ధి కలిగి ఉండండి. మీ పుత్రులపై మీ ఆధిపత్యాన్ని చూపండి.

"మీరు ఈ వ్యవహారంలో జోక్యం చేసుకొని ఏదైనా సకారాత్మకంగా చేయగలిగితే కౌరవులకు, పాండవులకు కూడ క్షేమం కల్గుతుంది" అని తగినట్లు చెప్పాడు. ప్రతి ఒక్కరూ ఆ మాటలన్నీ శ్రద్ధగా ఆలకించారు.

ఆ తరువాత అదేతీరుగా పరశురాముడు, కణ్వుడు, నారదాది మహర్షులంతా కూడ ధృతరాష్ట్రుడికి, దుర్యోధనుడికి పాండవులతో సంధి చేసుకోవడమే వారికి క్షేమమని సలహా ఇచ్చారు.

అందరూ సంధి చేసుకోమనే సలహా ఇవ్వడంతో ధృతరాష్ట్రుడు ఆలోచించి, కృష్ణుడితో "కృష్ణా! నీ సలహా ఎంతో ఉత్తమమైంది, సహేతుకమైందే కాని, నా నిస్సహాయస్థితిని నీవు గమనించలేదు సుమా! నా పుత్రుల ఉద్దేశం నీకు బాగా బోధపడింది గదా! నీవు అతడికి చెప్పి సంధికి ఒప్పించగల్గితే నాకెంతో ఆనందం. అతడికి ఎవరు చెప్పినా, ఎంత మంచి సలహా ఇచ్చినా గిట్టదు, వినడు. వాళ్ళ తల్లి గాంధారి, విదురుడు, భీష్ముడు అంతాకూడ అతడికి నచ్చజెప్పి అతడి అభిప్రాయం మార్చాలని ఎంతగానో ప్రయత్నించారు. కాని, ఏం లాభం... అంతా నిష్ప్రయోజనమే. వారందరిమాటా అటుంచి, ఈ సంధి విషయంలో నీవు నెగ్గావా అంటే, నాకు అంతకుమించిన ఆనందం మరోటిలేదు" అన్నాడు.

అప్పుడు కృష్ణుడు దుర్యోధనుడితో "దుర్యోధనా! నేచెప్పేది శ్రద్ధగా ఆలకించు. నీ మంచికోరే చెబుతున్నా. నీవు విద్యావంతుడివి, మేధావంతుడివీను. ఎందుకీ విధంగా ప్రవర్తిస్తున్నావు? నీ మొండితనం, మూర్ఖపు పట్టుదల నీకే అపాయం సుమా! యుద్ధమే సంభవిస్తే



భయంకర వినాశం తప్పదు. అందుకని పాండవులతో సంధి కుదుర్చుకో..., రాజీపడితేనే నీకు క్షేమం, లోకానికీ క్షేమం. ఏదైనా సంక్షోభస్థితి ఏర్పడినప్పుడు పెద్దల సలహా పాటించడం ఉత్తమం. ఈ ప్రపంచంలో మూడు రకాల మనుష్యులున్నారు. స్వాభావికంగానే సత్యవర్తనులు మొదటి రకానికి చెందినవారు. కేవలం స్వార్థపరులైన వారు రెండోరకం వారు. వారికి తమని గురించే గానీ, ఇంకెవరి జోలీపట్టదు. నీవా రెండో రకానికి చెందినవాడివా? అయితే నీకు పాండవులతో సంధికి దిగడం లాభసాటే అవుతుంది. ఇకపోతే మూడోరకం వారున్నారు. వారు కేవలం చెడుసావాసాలు, చెప్పుడు మాటలు వినడమే వారికానందం. కాబట్టి ఆ మూడో జాబితాలో మాత్రం నీవు చేరకు. నీవిప్పటికే పాండవులకు చేయరానంత అన్యాయాన్ని చేశావు. అంత జరిగినా వారిప్పటికీ ఎంతో ఉదారచిత్తులై, మీ అపరాధాల్ని మన్నించేందుకు తమకు జరిగిన అవమానాల్ని మరిచేందుకు సిద్ధంగా ఉన్నారు" అంటూ హెచ్చరించాడు.

కృష్ణుడు చెప్పదల్చుకుంది చెప్పి ముగించాడు. కాని ఆ మాటల ప్రభావం దుర్యోధనుడి మనస్సులో ఏమాత్రం నాటుకున్నట్లు లేదు. అతడి ముఖకవళికల్ని భీష్ముడు గమనిస్తూనే ఉన్నాడు.

అప్పుడు భీష్ముడు "నాయనా నీ మూర్ఖపు పట్టుదలను వదిలిపెట్టు; కృష్ణుడి మాట లక్ష్యపెట్టు! నీకదే క్షేమం. లేకపోతే నీ తండ్రి బ్రతికి ఉండగానే నీకు వినాశం తప్పదు. నీతోబాటు భరతవంశం యావత్తూ నశించిపోతుంది" అంటూ బ్రతిమాలి చెప్పాడు.

అదేవిధంగా దుర్యోధనుడికి ద్రోణుడు బోధించాడు. "ఓ దుర్యోధనా! కృష్ణుడు చెప్పినట్లు విన్నావా, నీ జీవితం సుఖమయమవుతుంది. అలక్ష్యం చేయటం తగదు" అని బుద్ధిచెప్పాడు. విదురుడు "దుర్యోధనా! నీపట్ల నా కెట్టి సానుభూతిగాని లేదు. నాకు గాంధారీ ధృతరాష్ట్రుల్ని చూస్తేనే జాలిగా బాధగా ఉంది. వారు నిస్సహాయులై దిక్కులేని బ్రతుకు బ్రతకాల్సిన కాలం దగ్గరపడుతూందన్న మాట. ఈ విశాల ప్రపంచంలో వారిని పలకరించే దిక్కుండదు. వారి బ్రతుకులు దుర్భరమై పోతాయి" అన్నాడు.

## 10
## దుర్యోధనుని వితండవాదం

దుర్యోధనుడు అందరి ఉపదేశాలు, సలహాలు అన్నీ మౌనంగా ఆలకించాడు. చివరికి కృష్ణుడితో "కృష్ణా! నీకెప్పుడూ నాలోనే తప్పు కనబడుతుంది. ఇప్పుడిక నన్ను విమర్శించడంలో మా తండ్రి, కురువృద్ధుడు భీష్ముడు కూడ నీతోనే చేరి చేతులు కలుపుతున్నారు. మీరంతా ఒక్కటై నన్నింతగా నిందించడానికి నే చేసిన అంత పెద్ద నేరమేమిటి? మీ వరకు నా వల్ల కల్గిన అపచారమేమిటో చెప్పండి. ఆ యుధిష్ఠిరుడు కావాలనే వచ్చి మా మేనమామతో పాచికలాడాడు. రాజ్యాన్ని పణంగాపెట్టి కోల్పోయాడు. అందుకు నేనా బాధ్యుణ్ణి? నన్నెందుకు తిడుతున్నారు? ఏమైతే అయిందని మా తండ్రిగారిచ్చిన సలహా పాటించి వారి రాజ్యం వారికి తిరిగి ఇచ్చేశాను. మళ్లీ దాన్ని పందెంలో పెట్టి ఓడిపోతే అందుకూ నేనేనా కారకుణ్ణి? నాకెందుకొచ్చిన శాపనార్థాలు? వారు ఆటలో ఓడిపోయారు. అందుకని అడవులకు పోయారు. ఇప్పుడు మత్స్య, పాంచాలాది రాజులతో సంబంధమేర్పరచుకుని, నాతో పోరాడేందుకు సేనలు కూడ సమకూర్చుకుంటున్నారు గదా!

"వారు తమ మాటలతో, చేతలతో నన్ను బెదిరించాలని చూస్తున్నారు. నేను క్షత్రియుణ్ణి. ఇంద్రుడొచ్చి యుద్ధానికి కాలుదువ్వినా నేనెన్నటికీ బెదరను, వెనుకాడను. నా పక్షాన, నా వెంట భీష్ముడు, కృపుడు, ద్రోణుడు, కర్ణుడు ఉన్నారు. నేనున్నాను... నాకేం భయం. నన్నెదిరించి గెల్చే ధైర్యంగానీ, నాతో పోరాడేందుకు తగినంత బలంగానీ ఎవరికుంది? ఏ

ఒక్కరికీ లేదు. అనవసరంగా నాతో పోరాడాలని కాచుక్కూర్చున్నవారితో క్షత్రియుడుగా నా విధినిర్వహణకై నేనే సంసిద్ధుడనవుతున్నాను. నా శత్రువు చేతుల్లో లొంగిపోవడం కన్నా వీరోచితంగా పోరాడి యుద్ధంలో మరణించి వీరస్వర్గం పొందడం మిన్న. నేనెప్పుడూ రాజులాగానే జీవించాను. నేను పెద్దలయందున్న గౌరవంకొద్దీ వారి ముందు మాత్రం తలవొంచుతాగానీ, భయపడి శత్రువు కెన్నటికీ తల వొంచను సుమా!

"రాజ్యానికి సంబంధించినంత వరకూ ఇంద్రప్రస్థం వారికేనాడో మా తండ్రి కట్టబెట్టాడు. ఆ సంగతి నాకు తెలుసు. అయితే అప్పటికి నేను చాలా చిన్నవాడిని. అప్పటికి నేనే ఒకరిపై ఆధారపడి ఉన్నాను. ఆ ఇంద్రప్రస్థాన్ని ఇవ్వడం కేవలం వారి అవివేకమూ, భయమే కారణం. కాని, ఇప్పుడు నేను దాన్ని కూడా ఇచ్చేందుకు ఒప్పుకోను. ఆఖరికి కనీసం సూదిమొన మోపేటంత నేలను ఆ పాండవులకిచ్చేందుకు కూడ నేను ససేమిరా సమ్మతించను, ఇవ్వను. ఇదే నా తుది నిర్ణయం" అని కుండబద్దలు కొట్టినట్లు చెప్పేశాడు.

దుర్యోధనుని రోషం కృష్ణుడు గ్రహించాడు. నవ్వి, "దుర్యోధనా! ఇటీవల నీవు చేసిన అమానుష కృత్యాలకు కూడ నిన్ను దూషించరాదనా నీ ఉద్దేశం? నీవు చెప్పినదాంట్లో ఎంతవరకు నిజానిజాలున్నాయో పెద్దల్నే నిర్ణయించనీ. ఆ పాచికలాట నీవు ఏ పెద్దలనూ సంప్రదించి చేసింది కాదు. పాండవుల్ని రాజ్యవిహీనుల్ని చేయాలనే ఏకైక ఉద్దేశంతోనే ఆ ఆట ఆడించావు. అంత చేసీకూడా వారికేహాని, చెయ్యలేదంటున్నావు.

"సరే ద్రౌపది విషయమేమిటి? కురువంశీయులెన్నటికి మర్చిపోలేని అమానుషచర్య అది. అదే ద్రౌపదికి నీవు, నీ సోదరులు చేసిన పరాభవం నిండుసభలో అవమానించారే? నీకు నీ తల్లి, నీ తండ్రి, భీష్మ, ద్రోణ ఇంకా విదురుడు మొదలైన వారంతా పాండవులతో సంధి చేసుకోమనేగదా పోరిపోరి చెబుతున్నారు? కాని నీ వెన్నడైనా వారి సలహాను లక్ష్యం చేశావా? ఇదేనా నీవు పెద్దలకిస్తున్న గౌరవం?" అని మొహం వాచేటట్లు అడిగాడు.

కృష్ణుడన్న మాటలు విని దుశ్శాసనుడు లేచి, "ఓ సోదరా! వింటున్న మాటలనుబట్టి చూస్తే, నీవు సంధికి ఒప్పుకొనకపోతే, నీ వాళ్ళే నీ కాళ్ళూ చేతులు మూటగట్టి నిన్ను పాండవులకి అప్పగిస్తారన్నట్లుంది. మనం ఇక్కడ ఉండటం అనవసరం పోదాం పదండి..." అన్నాడు ధీమాగా.

దుర్యోధనుడు సోదరులందరితో కలసి, కోపంతో రుసరుసమంటూ రాజసభనుండి బయటికి వెళ్ళాడు. అప్పుడు కృష్ణుడు వారందరి వైపు చూస్తూ, "ఇక్కడ సమావేశమైన మీ అందరిలోను తప్పుందంటాను. నేను మీ కుటుంబ క్షేమం కోరే చెబుతున్నాను. ఈ పాపం ఇంత ముదిరిపోకుండా ఆనాడే వారిని తగినంత అదుపాజ్ఞల్లో ఉంచితే ఇంతగా బరితెగించక పోదురే? కనీసం ఇప్పటికైనా దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునులు నలుగుర్ని పాండవులకి అప్పగించండి, చాలు. మీరంతా నే చెప్పింది వింటున్నారని, విన్నది ఆచరిస్తారని ఆశిస్తాను..." అన్నాడు.



కృష్ణుడు క్రుద్ధుడై అన్న ఈ మాటల్ని విని ధృతరాష్ట్రుడు విదురుని వంక తిరిగి, "వెళ్లి గాంధారిని సభకు పిల్చుకురా ఆమె సాయంతో దుర్యోధనుణ్ణి దారికి తేగలమేమో ప్రయత్నిస్తాను" అన్నాడు.

గాంధారి సభకు వచ్చింది. దుర్యోధనుడూ వచ్చాడు. కోపంతో కళ్లు ఎర్రగా జేవురించి ఉన్నాయి. గాంధారి వచ్చి తండ్రి సలహాను కాస్త చెవినబెట్టమని పదే పదే చెప్పింది. దుర్యోధనుడు ఊహూ... అంటూ మళ్ళీ సభాభవనం నుంచీ రుసరుసలాడుతూ వెళ్ళిపోయాడు. సరాసరి కర్ణుడు, శకుని, దుశ్శాసనులతో సంప్రదించేందుకు వెళ్ళాడు. తాము ముందు ముందు తీసుకోవాల్సిన చర్యల్ని గురించి నిర్ధారించేందుకై వెళ్ళాడు.

"నాకు బాగా తెలుసు. వారంతాకూడ మనల్ని లోబరచుకోవాలని, పాండవులకు మనల్ని పట్టివ్వాలనే అభిప్రాయంలోనే ఉన్నారు. ధృతరాష్ట్రుడెలాగూ నిస్సహాయుడేగదా... అందుకు" అన్నాడు దుశ్శాసనుడు. దుర్యోధనుడు చిరాకుపడుతూ, నిట్టూర్చాడు.

కొద్దిసేపు సంభాషించిన తరువాత దుర్యోధనుడు "కృష్ణుడు మనల్ని బంధించాలనుకుంటున్నాడు గదూ, దానికి బదులు మనం కృష్ణుణ్ణే బంధించేద్దాం. కృష్ణుడిక్కడ బందీ అయినాడని తెలియగానే అక్కడ పాండవులంతా



చచ్చుబడిపోతారు. అప్పుడైతే మనం తేలిగ్గా వాళ్ళని ఎదుర్కోవచ్చు. కాబట్టి త్వరపడండి, లేవండి, అనుకున్నది చేసేద్దాం" అన్నాడు.

## 11
## శ్రీకృష్ణుని విశ్వరూపం

మేధావియైన సాత్యకి దుర్యోధనాదుల చేష్టల్ని బట్టి వారి పన్నాగాన్ని ఇట్టే పసిగట్టాడు. వెంటనే కృతవర్మ దగ్గరకు వెళ్ళి "దుర్యోధనుడు కృష్ణుణ్ణి బంధించేందుకు మిత్రులతో చేరి కుట్రపన్నుతున్నాడు. తక్షణమే మన సైన్యాన్ని రప్పించాలి. అంతలోపల నేను పోయి కృష్ణుడికీ విషయం తెలియజేస్తాను" అని చెప్పాడు.

సాత్యకి అక్కణ్ణుంచి బయల్దేరి సభలో ఉన్న కృష్ణుడి వద్దకు ఒక్క పరుగున వెళ్ళాడు. అక్కడ కృష్ణుడు ధృతరాష్ట్రుడు ఇంకా సభలోని వారందరి ముందు దుర్యోధనుడి పన్నాగం వెల్లడి చేశాడు. విన్నవారంతా విస్తుబోయారు.

విదురుడు గాబరాపడ్డాడు. కృష్ణుడు మాత్రం చలించలేదు, నవ్వుకున్నాడు. విదురుని సమాధానపరుస్తూ "ఏం భయం లేదు. నన్ను బంధించడం అంత తేలిక కాదు. వారి మొండిపట్టు, క్రౌర్యం వదలకపోతే వారికే చేటు. యుధిష్ఠిరుడి కది మంచి తరుణం. విజయానికి దోహదం..." అన్నాడు.

ఆ మాటలు విన్న ధృతరాష్ట్రుడు విదురుడితో "ఆ దుర్మార్గుడు దుర్యోధనుణ్ణి అతగాడి పాపిష్ఠి మిత్రుల్ని నా ఎదుటికి రమ్మను" అన్నాడు. దుర్యోధనుడు వచ్చాడు. ధృతరాష్ట్రుడు క్రోధంతో ఉరిమాడు "కృష్ణుణ్ణే బంధించాలని ఎత్తువేశావు? నీకేమైనా మతిపోయిందా? చిన్నపిల్లలు చందమామని పట్టుకునేందుకు చిట్టిచేతులు జాపినట్లుందిరా నీ ఆగడం" అని చీవాట్లు పెట్టాడు. కృష్ణుడు ఫక్కున నవ్వి, దుర్యోధనునితో "దుర్యోధనా! నిజంగా నీవు మూర్ఖుడివే. నీవు నేను ఒంటరివాణ్ణి అనుకున్నావు కదూ, అందుకని నన్ను

బంధించగలననుకున్నావు, ఔనా? అయితే నీ కళ్ళు తెరిచి నా వంక చూడు. పాండవులు, అంధకులు, వృష్ణులు, పన్నెండుగురు సూర్యులు, పదకొండుమంది రుద్రులు, ఎనమండుగురు వసువులు, ఇంకా మహర్షులు అందర్నీ నా దేహంలో చూడవచ్చు" అంటూ పెద్దపెట్టున నవ్వాడు. అలా అట్టహాసం చేస్తూనే కృష్ణుడు తన శరీరం పెంచసాగాడు. అతడి దేహంలో దేవతలంతా కదలాడుతున్నారు. చూస్తూ చూస్తూండగా బ్రహ్మాండమైన ఆకారమైపోయింది. అప్పుడా వేల్పులంతా ఆయన చేతిబొటనవేలి కంటె చిన్న ఆకృతితో ఉన్నారు. ఫాలభాగాన సృష్టికర్త బ్రహ్మదేవుడు, వక్షస్థలాన విరూపాక్షుడైన శివుడు, అఖిలాండకోటిబ్రహ్మాండమంతా అతడి భుజాల్ని ఊతగాచేసుకు నిల్చింది. వదనాన వహ్ని, పన్నెండుమంది సూర్యులు, ఎనమండుగురు వసువులు, అశ్వినీదేవతలు, వాయువులు, స్వర్గాధిదేవతలు అంతా ఆయన శరీరంలోనే ఉన్నారు. ఆయన ఎడమచేతిపై వీరవరులైన రాజులు, కుడిచేతిపై గాండీవధారియైన అర్జునుడు, మూపున యుధిష్ఠిరుడు, భీముడు, నకుల సహదేవులు, పార్శ్వాన ఇంద్ర, యమ, వరుణ, కుబేరులు; ఊరువులపై వృష్ణి, అంధకవంశ వీరులు, కాళ్ళముందు ఆయుధపాణులైన యోధాగ్రేసరులు, కళ్ళు, ముక్కుపుటాలు, చెవుల్లోంచి అగ్నిజ్వాలల భుగభుగ మంటలూను... కానవచ్చాయి.



రాజులంతా కృష్ణుని ఆ విశ్వరూపాన్ని చూసి దిగ్భ్రాంతులయ్యారు. భయంతో కళ్లుమూసుకున్నారు. భీష్ముడూ, ద్రోణుడు, విదురుడు తక్కిన

మహర్షులు మాత్రం రెప్పవాల్చకుండా తదేక ధ్యానంతో భక్తి సంభ్రమాలతో చూడసాగారు.

కృష్ణపరమాత్మ అపురూపమైన ఆ దృశ్యాన్ని చూసేందుకు వారికి దివ్యదృష్టిని ప్రసాదించాడు. అదే సమయంలో మరోవిచిత్రం జరిగింది. అదే కృష్ణుడు తన విశ్వరూపాన్ని చూసేందుకు పుట్టు అంధుడైన ఆ ధృతరాష్ట్రుడికి ఆ క్షణాన కంటిచూపును ప్రసాదించాడు.

కృష్ణునిపై స్వర్గలోకం నుంచి ఎడతెరిపిలేని పూలవాన కురిసింది. దేవదుందుభులు మ్రోగాయి. ధృతరాష్ట్రుడు ఆ విశ్వరూప సందర్శనం చేసుకుని, "హే జగద్రక్షకా, పరాత్పరా! నిన్ను చూసే భాగ్యం నాకు కల్గించావు ధన్యుణ్ణి. నిన్ను చూసిన ఈ కళ్ళతో నాకిక మరిదేనినీ చూడాలని ఆశలేదు. నాకీ అదృష్టం చాలు స్వామీ! దయచేసి నీవిచ్చిన నా కళ్ళ వెలుగును ఉపసంహరించుకో తండ్రీ!" అని వేడుకున్నాడు.

కృష్ణుడందుకంగీకరించాడు. ఆ తరుణాన భూమి కంపించింది. సాగరాలన్నీ ఏకమయ్యాయి. నీటి వెల్లువైంది. సమావేశమైన రాజులంతా ఆశ్చర్యచకితులై లేచి నిలబడ్డారు. అప్పుడిక కృష్ణుడు తన విశ్వరూపాన్ని ఉపసంహరించి, నిజరూపాన్ని ధరించాడు. సాత్యకి విదురులతో సభాభవనం నుంచి నిష్క్రమించాడు.

నారదునితోబాటు మహర్షులంతా వెళ్లిపోయారు. కృష్ణుడు తన రథాన్నెక్కి రాజభవనం నుంచి బయల్దేరాడు. దోవలో ఆగి, విదురుని ఇంట నున్న కుంతిని కలుసుకున్నాడు. సభలో జరిగిన కాండంతా కుంతికి వివరంగా చెప్పాడు. "నే బయల్దేరుతున్నాను, నీ దగ్గర సెలవు తీసుకునేందుకు వచ్చాను. పాండవులకు నువ్వు చెప్పాల్సిన సందేశమేదైనా ఉందా?' అనడిగాడు.

అప్పుడు కుంతి "మీరు సుక్షత్రియులు, మహావీరులు, కుంతీపుత్రులు అనే విషయం మరువకుమని, ద్రౌపదికి శుభాశీస్సులు" అన్ని తన మాటగా చెప్పమంది.

## 12
## కర్ణుడికి వాసుదేవుని ఉపదేశం

కృష్ణుడు కుంతి వద్ద సెలవు తీసుకుని ఉపప్లావ్యానికి వెళ్ళబోతూ, మధ్యలో కర్ణుని రథంపై కూర్చోబెట్టుకుని కొద్ది దూరం రథం పోనిచ్చి కర్ణుడితో "కర్ణా! నీవెంతో బుద్ధిమంతుడవు. వేదాలన్నీ నేర్చావు,



నీవొక అవివాహితయైన కన్యకు జన్మించావు. కన్యకు జన్మించినవాడు, ఆ కన్య తరువాత వివాహమాడిన ఏ పురుషుడినైనా తన తండ్రిగానే స్వీకరించవచ్చని వేదాలు ఘోషిస్తున్నాయి కదా! మీ తల్లి కుంతి, నీవు పాండుపుత్రుడవు. వారికి నీవు పెద్దకుమారుడవు, యుధిష్ఠిరుడి కంటే ముందు పుట్టినవాడవు. నేనీ విషయం కనుక పాండవులకు తెలియజేసినట్లయితే వారంతా అమాంతం నీ కాళ్లమీదపడతారు. నీకీయవలసిన మర్యాదలన్నీ ఇస్తారు" అని చెప్పాడు.

అంతా విని కర్ణుడు నవ్వి, కృష్ణుడితో "నేను న్యాయం ప్రకారం పాండుపుత్రుణ్ణి కావచ్చు, అయినా నా తండ్రి సూర్యుడు. నేను సూర్యనందనుణ్ణి అని నాకు తెలుసు. అయినప్పటికీ మా తల్లి నా యోగక్షేమాల గురించి ఆలోచించక నేను పుట్టగానే నన్ను వదిలిపెట్టేసింది. అందువల్ల అతిరథుడు, రాధ నన్ను చేరదీసి పెంచిపెద్దచేశారు. నాకు వారే తల్లిదండ్రులు వారే నాకట్టి అపేక్షను, ప్రేమను ఇచ్చారు. కాబట్టి వారితో బాంధవ్యాన్ని నేను వదులుకోలేను. నీవు నాకీ భూభాగమంతా ఇచ్చినా, బంగారు రాశులిచ్చినా, లౌకిక సుఖాలనిచ్చేవాటిని కట్టబెట్టినా నే పుచ్చుకోను, నాకు అక్కర్లేదు. నన్నింతవాణ్ణి చేసిన నా తల్లిదండ్రులకు నేనిప్పుడు ద్రోహం చెయ్యను..., చెయ్యలేను కృష్ణా! అంతేకాదు నేను దుర్యోధనుడికి మాట ఇచ్చాను. లోకం నన్ను సూతపుత్రుడని వెలివేసినా నేనీనాడు అంగదేశానికి అధిపతినై ఆనందంగా ఉన్నానంటే అందుకు దుర్యోధనుడే కారణం. ద్వంద్వ యుద్ధంలో అర్జునుని జయించగలను. కాని, నా చుట్టరికాన్ని ఎవ్వరికీ బహిరంగం చేసి చెప్పవద్దని నిన్ను ప్రార్థిస్తున్నాను. ఒకవేళ యుధిష్ఠిరుడికి నేను తనకి అన్నని తెలిస్తే, అతడు ఆ రాజ్యాన్నంతా తెచ్చి నాకే అప్పగించేస్తాడు కాని,



యుద్ధంచేయడు. పాండవుల్ని అనరానిమాటలన్నానని నాకు బాగా తెలుసు. అందుకు నేనెంతో విచారిస్తున్నాను. దుర్యోధనుడాదేశించింది చేయడమే నా కర్తవ్యం, అంతే" అన్నాడు.

కృష్ణుడు "కర్ణా! నీవు నా సలహా పాటించకపోతే లోకానికే ముప్పు సుమా..." అన్నాడు. కాని, కర్ణుడు "చూద్దాం... యుద్ధమయ్యాక ఉంటే భూమ్మీద, లేకపోతే స్వర్గంలో కలుసుకుందాం" అంటూ కర్ణుడు, కృష్ణుని గాఢంగా కౌగలించుకుని, రథం దిగి సెలవు తీసుకున్నాడు.

వెళ్ళిన పని సానుకూలం కాకుండానే కృష్ణుడు ఉపప్లావ్యానికి తిరిగివచ్చేశాడు. ఆ మధ్యలో విదురుడు కుంతితో, "నాకు నిద్రపట్టడం లేదు. ధృతరాష్ట్రుడికి పుత్రవ్యామోహం, దుర్యోధనుడాయన మాట వినడు. పాండవులు యుద్ధసన్నాహాలు జరుపుతున్నారు..." అని మొరపెట్టుకున్నాడు. "అయినవారంతా అంతరించాక ఐశ్వర్యం ఏం చేసుకోను" అంటూ కుంతి దీర్ఘంగా నిట్టూర్చింది.

## 13
## కుంతి - కర్ణుడు

కర్ణుడు నిత్యమూ గంగాతీరాన అనుష్ఠానం ఆచరించి సూర్యుడికి అర్ఘ్యమిచ్చుకుంటాడు. అది అతడి నిత్యవిధి. కుంతి తిన్నగా గంగాతీరానికి వెళ్ళింది. గంగ ఒడ్డున జపం చేసుకుంటున్న దయాస్వరూపుడు, సత్యసంధుడైన తన కుమారుణ్ణి చూసింది. నెమ్మదిగా వెళ్ళి, జపం అయ్యేవరకు ఎదురుచూస్తూ అతడి వెనకే నిలబడింది.

అతడు సర్వమూ మరచి ధ్యానంలో నిమగ్నుడై, సూర్య కిరణాలు వచ్చి వెన్నును స్పృశించేవరకు అలానే ఉంటాడు. అది అతడి నియమం. నాటి అనుష్ఠానం ముగిసింది. వెనుదిరిగేసరికి కుంతి నిలబడి ఉంది. ఆమె తన చీరె చెరగును అతడిపై ఎండ పడకుండా అడ్డుగా ఎత్తిపట్టుకునుంది.

శౌర్యాభిమానాలు గల కర్ణుడు, ఆశ్చర్యపడి, చిరునవ్వుతో "నేను కర్ణుణ్ణి. రాధ, అతిరథుల పుత్రుణ్ణి ప్రణామాలు, ఏం కావాలి?" అనడిగాడు.



అందుకు కుంతి, "నీ సాయం కావాలి నాయనా! నీవు రాధేయుడవు కావు. కౌంతేయుడవు, ఈ కుంతీ పుత్రుడవు. మీ తండ్రి అతిరథుడు కాడు, నీవు సూతనందనుడవూ కావు, సూర్యనందనుడవు... ఔను. అప్పటికి నేనవివాహితను కన్యగా ఉండగానే నీవు జన్మించావు. నీవే నా మొదటి సంతానం. నీవు కుంతిభోజుని భవనంలో జన్మించావు. ఓ కర్ణా! నీవు మహాయోధుడవు, నీవు పుట్టుకతోనే సహజ కవచ, కుండలాలతో పుట్టావు. ఆ విషయం నీకు తెలీదనుకో... నీ విక్కడ దుర్యోధనుడికి సహాయ సలహాదారుగా ఉంటున్నాకూడ నీవు ఫలానా అని నీ సోదరులెవ్వరికీ తెలీదు. తెలిసేందుకు కూడ అవకాశం కలుగలేదు. తనను, కన్నవారిని సంతోషపరచమనే గదా ధర్మం చెబుతూంది. దుర్యోధనుడు యుధిష్ఠిరుడి రాజ్యాన్ని అన్యాయంగా ఆక్రమించుకున్నాడు. ఆ రాజ్యాన్ని అతడి చేతుల్లోంచి వదిలించి హాయిగా అనుభవించు, ఆనందించు. కర్ణుడు అర్జునుడు సోదరులే అన్న సత్యం నేటికిక లోకం తెలుసుకుంటుందిలే. నీ సోదరులంతా నీ కనుగుణంగానే మసలుకుంటారు. కర్ణార్జునులు కూడ ఆ కృష్ణబలరాములల్లే కలిసి మెలసి సఖ్యతగా ఉంటే ఇక లోకంలో పొందలేనిదేముంది? నీవు నా పెద్దకుమారుడివి. సూతపుత్రుణ్ణనకు నాయనా! నీవు జగద్విఖ్యాతుడవైన కుంతీపుత్రుడవు" అన్నది.

అప్పుడు సూర్యబింబం నుంచి "కుంతి చెప్పిందంతా నిజమే. మీ తల్లి సలహాను పాటించు. దానివల్ల నీకెంతో మేలు జరుగుతుంది" అంటూ పితృవాత్సల్యంతో ఎంతో మన్ననగా ఒక కంఠం అనడం వినిపించింది. కాని కుంతి మాటలకు, తండ్రి వాక్కుకి కూడా కర్ణుడు చలించలేదు. తన నిశ్చయాన్ని మార్చుకోలేదు.



కర్ణుడు, కుంతితో ఇలా అన్నాడు: "అమ్మా! నేను నీ మాటను మన్నించను. నేను పసికందునైనపుడు నిర్దయతో కూడిన నీ ప్రవర్తనని, అదే కన్నబిడ్డను కనికరం లేకుండా నీట వదిలి వెళ్ళావే, అది ఏమాత్రం క్షమించరానట్టిది సుమా. నేను క్షత్రియుడిగా జన్మించినప్పటికీ, నేను నా క్షాత్రాన్ని కోల్పోవాల్సి వచ్చింది నీ వల్లనే గదా! క్షత్రియుడికుండే హక్కులు అర్హతలు లేనివాణ్ణి అయ్యానే.... ఒక శత్రువుకూడ ఇంత దారుణంగా ఉండడే! నన్ను అపేక్షగా చూడవలసిన సమయంలో నీకు రవంత ప్రేమైనా లేకపోయిందా? నన్ను కులవిహీనుణ్ణి, సంస్కారరహితుడిగా చేశావు. ఇంతకాలమైన తరువాత ఇప్పటికి వచ్చి ఎక్కడ లేని ప్రేమను ఒలకబోస్తున్నావు. ఔన్లే... ఇప్పుడు నాతో అవసరముంది కాబట్టి... ఇలా... కృష్ణార్జునులు ఒకటై వస్తున్నారంటే ఎవరుమాత్రం భయపడరు? నేనొకవేళ పాండవుల్ని రక్షించేందుకై ఇవాళ వచ్చి వారితో చేరినా లోకమేమనుకుంటుంది? నేను వారికి భయపడి వారితో చేరాననుకోదూ?

"ధృతరాష్ట్రుని కుమారులందరికి నేను కావాలి. వారంతా నా కోర్కెలు మన్నించారు. నన్ను గౌరవించారు, నేను సుఖంగా, ఆనందంగా ఉన్నానంటే వారివల్లనే. వారిప్పుడు యుద్ధాన్ని ప్రకటించారు. వారికి సాయం కావాలి. ఇంద్రుడంటే వసువులకి ఎంత గౌరవమో వారికి నా పట్ల అంత గౌరవం. తమ శత్రువుల్ని ఎదుర్కొనేందుకు వారు నన్ను సాయం కోరారు. వారు నన్నంత గౌరవంగా అపేక్షగా చూస్తున్నప్పుడు వారి కోరికను ఎలా కాదనగలను? నా ప్రాణాల మీద ఆశ వదులుకొనైనా నేను వారికి సాయపడతాను. నా గొంతులో ఊపిరి ఉన్నంతవరకు వారేది కోరినా చేస్తాను. నేను ఉన్నమాట చెబుతున్నాను. నేను దుర్యోధనుని పక్షాన ఉన్నాను. నీ కుమారులతో అతడి తరఫున నా శక్తినంతా ఉపయోగించి పోరాడతాను. ఏది యేమైనా నిన్ను నేను నిరాశ పెట్టాలనుకోవడం లేదు. నీ అభిప్రాయాన్ని మన్నిస్తాను. నీ కుమారుల్లో యుధిష్ఠిరుడు, భీముడు, నకుల సహదేవుల జోలికి నేను పోను. ఒక్క అర్జునుడితో తప్ప నే మిగతావారితో తేలిగ్గా రాలిపోయేవారితో యుద్ధం చెయ్యను. యుధిష్ఠిరుడి సేనలో నాకు సమఉజ్జీ అయినవాడు అర్జునుడొక్కడే. నేను అర్జునునైనా చంపాలి లేదా అర్జునుడు నన్ను చంపాలి. అదే కీర్తనీయమైన ముగింపు. అప్పటికీ ఏ విధంగా చూసినా నీ అయిదుగురు కుమారులు నీ కుంటారులే."

కుంతి కర్ణుడన్న ఆ మాటలు విన్నది. భయంతో గజగజలాడిపోయింది. ఆమె తన పుత్రుని కౌగలించుకుంది. "విధివిలాస మెట్లుందో! నీవన్న మాట నిజం కావాలి. కౌరవసంహారం జరిగి తీరుతుంది. కాని నీ విచ్చిన మాట మరువరాదు సుమా... నలుగురు పాండవుల్ని సంహరించనని (అర్జునుని తప్ప)" అంటూ కర్ణుని, "నీవు సకలసౌభాగ్యాలతో వర్ధిల్ల" మని దీవించి, వెళ్లిపోయింది.



# 14
# యుద్ధ సన్నాహాలు

కృష్ణపరమాత్మ ఉపప్లావ్యాన్ని చేరుకున్నాడు. హస్తినాపురంలో జరిగిన సంఘటనలన్నీ పాండవులకు వివరించాడు: "మంచేదో, చెడేదో చెప్పాను. వారేం చెయ్యాలో, ఏం చేస్తే వారికి క్షేమం కల్గుతుందో పదేపదే బోధించాను. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది. అంతా బూడిదలోపోసిన పన్నీరే అయింది. ఇప్పుడిక యుద్ధం తప్ప వేరే మార్గమేమీ లేదు. ఆ మూర్ఖుడు దుర్యోధనుడు ఎవరు చెప్పిన సలహాను చెవిని పెట్టందే! కాబట్టి మనమూ కాలాన్ని వృథాపుచ్చకుండా యుద్ధానికి కావాల్సిన సన్నాహాలు మొదలుపెట్టాలి" అన్నాడు.

పాండవులు కృష్ణునితో సంప్రదించి ధృష్టద్యుమ్నుణ్ణి తమ సైన్యాధిపతిగా ఎన్నుకున్నారు. సైన్యాన్ని కురుక్షేత్రం వైపు తరలించారు. ద్రౌపది మిగతా స్త్రీజనమంతా ఉపప్లావ్యంలోనే ఉన్నారు. పాండవులు కురుక్షేత్రపు సరిహద్దుల్లోనే శిబిరాల్ని ఏర్పాటు చేసుకున్నారు. ఆ ప్రదేశమైతే విశాలంగా, అనుకూలంగా, పసుగ్రాసానికి, వంటచెఱకుకి సదుపాయంగా ఉన్నందువల్ల అక్కడ విడిది చేశారు. ఒక రాత్రి విశ్రాంతి తీసుకుని సైన్యం ముందుకి కదిలింది.

ఆ విధంగా బయల్దేరి కురుక్షేత్రాన ప్రవహించే హిరణ్వతి అనే పవిత్ర నదీ తీరాన్ని చేరుకున్నారు. ఆ ప్రదేశం చుట్టూ కందకం త్రవ్వించవలసిందిగా కృష్ణుడు ఆదేశించాడు. ఎన్నో డేరాలు బిగించారు. వందలకొలది చేతివృత్తులవారు, వైద్యులు, శస్త్రవైద్యులు అక్కడికి వచ్చారు. ప్రతి గుడారానికి ఆనుకుని కొండలాగా ఒక ఆయుధశాల అందులో ధనుర్బాణాలు, రొమ్ము కవచాలు, గండ్రగొడ్డళ్లు, బల్లాలు, ఈటెలు, కత్తులు, కటారులు, అమ్ముల పొదులు, అమ్ముల కోలలు ఇంకా ఇతరమైన ఆయుధ సామగ్రులన్నీ కట్టిపెట్టుంచారు.

అటు కౌరవపక్షాన దుర్యోధనుడు భీష్ముణ్ణి సమీపించి, చేతులు జోడించి ఎదుట నిలచి, "సరైన నాయకుడు లేకపోతే యుద్ధంలో ఎంతటి సైనికబలమున్నప్పటికీ అది కుంటుపడుతుంది. కాబట్టి నీవు పూనుకోకపోతే మేము నిస్సహాయులమే" అని ప్రాధేయపడుతూ అడిగాడు.

అప్పుడు భీష్ముడు "నాయనా! నీవు ఏది కోరినా నేను చేసేందుకు సిద్ధమే, అయితే నాకు మీరంటే ఎంత ఇష్టమో, పాండవులన్నా అంత ఇష్టమే. కాని, నేను నీకిచ్చిన మాట ప్రకారం నీ సైన్యానికి నాయకత్వం వహిస్తాను. నా విధిని నిర్వహిస్తాను. ప్రతిదినమూ నేను పదివేలమంది యోధుల్ని కూలుస్తాను. కాని, పాండవుల జోలికి మాత్రం పోను. మరొక్క విషయం, యుద్ధంలో కర్ణుడు తలపడేట్లుంటే నేను తప్పుకుంటాను. ఎందుకంటే, పరస్పరం మా మధ్య సౌహార్దత లేదు" అన్నాడు.



అప్పుడిక దుర్యోధనుడు ఎటూతోచని సందిగ్ధస్థితిలో పడిపోయాడు. తక్షణమే కర్ణుడు మధ్యన కల్పించుకుని "అయితే భీష్ముడు సజీవంగా ఉన్నంతవరకూ నేను యుద్ధభూమికి దూరంగానే ఉంటాను, భీష్ముడు నేల కొరిగాకనే నేను యుద్ధరంగంలో ప్రవేశిస్తాను" అని చెప్పాడు.

అంతట దుర్యోధనుడు భీష్ముని కౌరవ సేనాధ్యక్షునిగా నియమించాడు. రణభేరీలు మ్రోగించి, శంఖాలు పూరించి యుద్ధాన్ని ప్రకటించాడు. పెద్ద వెల్లువలాగా కౌరవ సైన్యమంతా భీష్ముని నేతృత్వంలో కురుక్షేత్రం వైపు కదిలివెళ్ళింది. కౌరవులు భీష్ముని సేనాధ్యక్షునిగా నియోగించినట్లు పాండవులకి తెలిసింది.

యుధిష్ఠిరుడు తన ఏడుగురు సేనాధిపతుల్ని సిద్ధంగా ఉండమని హెచ్చరికలు చేశాడు. అర్జునుడు ప్రధానయోధుడై వచ్చాడు. కృష్ణుడు అర్జునుడి రథ పగ్గాలు పుచ్చుకున్నాడు. సైనికులు జయజయధ్వానాలు చేశారు. రణదుందుభులు ఘోషించాయి. శంఖారావాలతో యుద్ధరంగం మార్మోగిపోయింది.

కృష్ణుని అగ్రజుడు బలరాముడొచ్చాడు. యుధిష్ఠిరుడితో ఇంకా ఎంతోమంది వృష్ణివంశపు వారు ఉన్నారు. యుధిష్ఠిరుడు తన సోదరులతో కలిసి బలరాముడికి ఘనంగా స్వాగతం చెప్పాడు. అందరూ అతడికి తమ గౌరవాభివందనాలు తెల్పుతూ సాష్టాంగపడ్డారు.

అప్పుడు బలరాముడు "ఒక ఘోరయుద్ధం జరగబోతూందని, అందులో రాజులందర్నీ నిర్దాక్షిణ్యంగా సంహరిస్తారని విన్నాను. మీరంతా యుద్ధం నుంచి క్షేమంగా తిరిగి రావాలని కోరుతూ, ఎదురుచూస్తుంటాను. యుద్ధం జరిగి తీరాల్సిందే అనే నిర్ధారణకు రావడమైందిగదా! పక్షపాతం చూపించరాదని ఇరువుర్నీ సమదృష్టితో చూడమని కృష్ణుడికి కూడ నేను పదేపదే చెప్పాను. మీరంతా ఒకే కుటుంబం, రక్తసంబంధంతో మమ్మల్ని బంధించేశారు. ప్రత్యేకమైన ప్రేమాభిమానాల్ని చూపించవద్దని ఎంతగానో సలహా చెప్పిచూశాను. కాని, మీయందున్న ప్రీతితో నా మాటలు లక్ష్యపెట్టందే! కాబట్టి తప్పకుండా విజయం మీదే... అర్జునుడి రథం పగ్గాలు కృష్ణుడి చేతిలో ఉన్నాయిగదా... మరింకేమిటి?



కృష్ణుణ్ణి మీరి ఎవరైనా గెల్వగలరా? కలలోమాట. భీముడంటే మాత్రం నా కిష్టం. దుర్యోధనుడన్నా అంత ఇష్టమే. అందువల్ల నేనిక్కడ ఉండను. తీర్థయాత్రలకు వెళ్లాలనుకున్నాను. సరస్వతీ నదీ తీరాన ఉన్న పవిత్రక్షేత్రాలన్నీ సందర్శించాలనుకున్నాను. ఇక్కడుండి ఈ విభేదాలు, ఈ హోరాహోరీ పోరాటాలు, కౌరవుల మరణకాండ చూసి భరించలేను. అందుకే" అంటూ బలరాముడు, కృష్ణుడు మిగతావారందరి దగ్గర వీడ్కోలు తీసుకుని పుణ్యస్థలాల్ని సందర్శించేందుకై యాత్రలకు బయల్దేరాడు.

ఆ తరువాత కుండిన పురాధీశుడైన రుక్మి పాండవుల దగ్గరకు వచ్చాడు. అతడు కృష్ణుని సతి అయిన రుక్మిణి అగ్రజుడు. వచ్చేటప్పుడు తనతో ఒక అక్షౌహిణి సైనికబలాన్ని వెంటతెచ్చాడు. యుధిష్ఠిరుడు అతణ్ణి హృదయపూర్వకంగా ఆహ్వానించాడు.

అప్పుడు రుక్మి "అర్జునా! యుద్ధం ఆరంభం కానున్న ఈ తరుణంలో నీలో అధైర్యం కనబడుతూంది. కావాలంటే నేను నీకు సాయపడతాను. ఈ లోకంలో నన్ను మించి, నాతో సరిసమానులైన బలాఢ్యులెవరున్నారు? ఈ యుద్ధంలో మీ శత్రువులనందరినీ, ద్రోణ, కృప, భీష్మాదులు మొదలుగా అందర్ని చండాడగల సమర్థుణ్ణి" అంటూ అందరి వంక తేరిపార చూసి అక్కర్లేని ఒక చిరునవ్వు నవ్వి, లేనిపోని ఆత్మవిశ్వాసాన్ని ప్రదర్శించాడు. అది చూసి అర్జునుడు "ఏయ్ రుక్మీ! నా చేతిలో గాండీవం చూశావు గదా? నేను అధైర్యపడటమా! అది ఎన్నటికీ జరుగదు. నీ సాయం మేమెన్నడూ కోరలేదు. మాకూ అక్కర్లేదు, ఉంటే ఉండు పోతే పో...." అని మొహం వాచేటట్లు వాతపెట్టాడు.

దాంతో రుక్మికి ఎక్కడలేని రోషం వచ్చింది. బాగా తలవంపులై అక్కణ్ణుంచి ససైన్యంగా దుర్యోధనుడి శిబిరానికి వెళ్ళాడు. దుర్యోధనుడితో "ఆ పాండవులకి నా సాయం అక్కర్లేదట, కావాలంటే, నా సేనని నీవు వినియోగించుకో"మన్నాడు. కాని, దుర్యోధనుడు కూడా రుక్మి సాయాన్ని నిరాకరించాడు. ఈ విధంగా ఆ ఇరువురు బలరాముడు, రుక్మి కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొనలేదు.

## 15
## రాయబారిగా ఉలూకుడు

హిరణ్వతీ నది ఇరువైపులవారికి సరిహద్దుగా నిలిచింది. దుర్యోధనుడు తన సహచరులతో సంప్రదించి, శకుని కుమారుడైన ఉలూకుని రప్పించి అతడితో... "తక్షణమే పాండవ శిబిరానికి వెళ్ళు, వెళ్ళి, అందరి ముందు యుధిష్ఠిరుడితో 'మీ బడాయిలు, డాబుసరి మాటలు మా కందరికీ తెలుసు. పద్నాలుగేళ్ల క్రిందట కౌరవసభలో మీరు చేసిన శపథం గుర్తుచేసుకోండి. ఇప్పుడు మీ శపథాన్ని నెరవేర్చవలసిన తరుణం వచ్చేసింది. మీ అందరికి నీకు, నీ సోదరులకు, కృష్ణుడుకి విడి విడిగా సందేశాలు పంపుతున్నాను. వాటికి సమాధానాలివ్వాలని అడుగు" అని చెప్పాడు.

ఉలూకుడు పాండవుల శిబిరాలకి వెళ్ళాడు. దుర్యోధనుడు చెప్పమన్న మాటలు అక్కడవారితో చెప్పాడు. పాండవులంతా కోపంతో భగ్గుమన్నారు. వారికి కల్గిన కోపావేశంలో దుర్యోధనుడి తలపొగరు సందేశాలకి సమాధాన మేం చెప్పి పంపాలో తోచలేదు. అటువంటి సందేశాన్ని మోసుకొచ్చినవాణ్ణి చంపిపారెయ్యాలనుకున్నారు. కాని అది తప్పు. అప్పుడిక ఆ సందేశానికి సమాధానంగా మరో సందేశాన్ని పంపించారు. ఏమనంటే "శూరులెన్నడూ తమ శపథాల్ని మాటలతో కాదు చేతల్లో చూపిస్తారు" అని.

వారు సమాధానంగా ఇచ్చిన సందేశాన్నందుకుని ఉలూకుడు దుర్యోధనుడి దగ్గరకు వచ్చాడు. అప్పటికి దుర్యోధనుడు, రణభూమిలో సైన్యాన్ని సమావేశపరచి కురుక్షేత్రంలో జరగబోయే చారిత్రాత్మక యుద్ధానికి సిద్ధమవుతున్నాడు.

ఎదుటి వైపు ధృష్టద్యుమ్నుడు సేనాధిపత్యంలో యుధిష్ఠిరుడు తన సైన్యంతో ముందుకి కదిలివస్తున్నాడు. ఇరువైపులవారికి ఆ రాత్రంతా పూర్తిగా దిగులు, ఆందోళనే.

భీష్ముడు కౌరవసైన్యానికి ఆధిపత్యం వహించాడు. దుర్యోధనుడితో తన అభిప్రాయాన్ని ఆయన మొట్టమొదటే వెల్లడించాడు. సహజమైన ఆయన శౌర్యము, శక్తి, ప్రసన్నత, ఆత్మవిశ్వాసం దుర్యోధనుని ఎంతగానో ఆకట్టుకున్నాయి.

మాటల సందర్భంలో కర్ణుడి ప్రసక్తి వచ్చింది. అప్పుడు భీష్ముడు "కర్ణుడు నీకు మార్గదర్శి, మిత్రుడు, సలహాదారుడాయె, అతగాడు యుద్ధంలో రథుడు కాజాలడు, అతిరథుడు కాలేడు. అతడికి పరశురాముడి శాపముంది. యుద్ధంకూడ కర్ణార్జునుల మధ్యనే జరుగుతుంది. అర్జునుడి చేతిలోనే కర్ణుడికి మరణముంది. డాంబికంగా ఎన్నో చెబుతూంటాడు. మళ్ళీ అట్టే చూస్తూండగానే వెనక్కి తగ్గుతుంటాడు. నిరాశ, నిస్తబ్ధత ఆవరించుకుంటుంది" అన్నాడు. భీష్ముడితోబాటు ద్రోణుడు వకాల్తా పుచ్చుకుని కర్ణుణ్ణి మరింత న్యూనపరచాడు. వారి పరుషవాక్కులతో క్రుద్ధుడై కర్ణుడు భీష్ముని వంక తిరిగి ధైర్యంచేసి తీవ్రంగా ఎదిరించాడు: "ఓ తాతా! నీవు నన్నెప్పుడూ అవమానించాలనే చూస్తున్నావు, మాటలతో పోట్లు పొడుస్తున్నావు. నీకు నేనంటే అంతులేని ద్వేషం ఎందుకనో? దుర్యోధనుని చూసి ఊరుకుంటున్నాను, ఓర్చుకుంటున్నాను. జరగనున్న యుద్ధంలో నేనెందుకు పనికిరానని కదా మీ ఉద్దేశం, దానికి కారణమేమిటో నే చెప్పనా! మీకు కౌరవుల్ని గురించి కించిత్తయినా ఆసక్తిలేకపోవడమే అంటాను. మీ గురించి నాకున్న నిశ్చితాభిప్రాయాన్ని కూడ వినండి: మీ వల్ల కౌరవులకు ఏ ఉపయోగం ఉండదు. నాకు దుర్యోధనుడికి మధ్య మీరు జొరబడాలని చూస్తున్నారు. నన్ను ద్వేషిస్తున్నారు. దుర్యోధనుడికి నా మీద ద్వేషం కలిగించాలని ప్రయత్నిస్తున్నారు, కాదూ?" అంటూ దుర్యోధనుని వైపు చూసి, "ఓ రాజా! వయస్సునుబట్టి, వారి అనుభవాన్నిబట్టి పెద్దలను గౌరవించడం విధాయకమే. అది నిజంగా క్షేమమూ, లాభమే. అయితే ఆ పట్టున ఒక్క విషయం మాత్రం గమనించాల్సి ఉంది సుమా! అదే చాదస్తం ఒంటబట్టిన ముసలివాళ్ళు ఎందుకూ పనికిరారని శాస్త్రాలు మనకి చెబుతున్నాయి. అయినా నీవు భీష్ముణ్ణి సేనాధ్యక్షపదవిలో కూర్చోబెట్టావు గదా! ఆయన ఇతరుల నిమిత్తమై గొప్ప సాహసకృత్యాలు చేసి కీర్తి సంపాదించవచ్చు. నేను మాత్రం ఆ భీష్ముడు జీవించి ఉన్నంతవరకూ యుద్ధం చెయ్యను. ఆయన కూలిపోవాలి..., నేను రావాలి.... అంతే" అంటూ తన నిర్ణయాన్ని నిర్భయంగా చాటిచెప్పాడు.



అంతట భీష్ముడు కోపాన్ని తమాయించుకుని, "ఓ కర్ణా! ఇప్పుడీ ఉపద్రవం ఉండబట్టి నిన్ను ప్రాణాలతో వదిలిపెడుతున్నాగానీ, లేకపోతేనా నేను హతమార్చే మొట్టమొదటి వ్యక్తివి నీవే అయ్యుండేవాడివి జాగ్రత్త" అని హుంకరించాడు.

దుర్యోధనుడు ఎటూకాని సంకటంలో పడ్డాడు. భీష్ముణ్ణి శాంతింపజేసేందుకు ప్రయత్నించాడు. "ఓ

తాతా! నాకు మీ ఇద్దరి సాయం కావాలి. మీరిరువురు మహాయోధులని నాకు బాగా తెలుసు. సందేహమే లేదు. రేపు తెల్లవారగానే ఎలాగూ బ్రహ్మాండంగా యుద్ధం జరగబోతోంది. ఇంతలో ఈ జగడాలెందుకు చెప్పండి, వద్దు చాలించండి" అని సర్దిచెప్పి సమాధానపరిచాడు.

తరువాత పాండవుల బలాబలాలెట్టివో చెప్పమని దుర్యోధనుడు భీష్మణ్ణి అడిగాడు. అప్పుడిక భీష్ముడు పాండవుల్లో ఒకొక్క వీరుడి సాహస పరాక్రమాల్ని, బలాబలాల్ని వర్ణించి చెప్పాడు.

## 16
## భీష్ముని ఏకైక శత్రువు

భీష్ముడు మహాబలవంతులైన వీరయోధుల్ని గురించి చెబుతూ, "పాంచాల రాజకుమారుడైన 'శిఖండి' అగ్రేసరుడైన శౌర్యఖని పాండవుల వైపునున్నాడు. అతడు యుద్ధంలో అద్భుతమైన ఘనకార్యాలెన్నో చేయగలవాడు. అతడు యుద్ధంలో నా కెదురునిల్చి నన్ను ఎదుర్కొన్నా ,చంపాలనుకున్నా నేనతణ్ణి వధించను" అని వివరించాడు.

దుర్యోధనుడది విని నిర్ఘాంతపోయాడు "ఎందుకని? పాంచాలరాజుల్ని చంపదలచిన వాడివి, పాంచాల రాకుమారుణ్ణెందుకు చంపవు?" అనడిగాడు.

అందుకు భీష్ముడు "అదో పెద్దగాథ, అయితే నే చెప్పేదంతా విను, నీకే అర్థమవుతుంది" అంటూ, భీష్ముడు చెప్పడం మొదలుపెట్టాడు: "చిత్రాంగద, విచిత్రవీర్యులు నా సోదరులు. చిత్రాంగదుడు మరణించిన తరువాత విచిత్రవీర్యుడు రాజయ్యాడు. విచిత్రవీర్యుడు గుణవంతుడు, అన్ని విషయాలకి నా మీదనే ఆధారపడి ఉండేవాడు. తగిన సంబంధం చూసి వివాహం చెయ్యాలనుకుంటూండగా, అదేసమయంలో కాశీరాజు కుమార్తెలైన అంబ, అంబిక, అంబాలికల స్వయంవర మహోత్సవం జరుగనున్నట్లు తెలిసింది. విచిత్రవీర్యుని తరఫున నేను స్వయంవరంలో పాల్గొన్నాను.



ఆ కాలంలో ఒక సంప్రదాయం ఉండేది. దాని ప్రకారం ఆ ముగ్గురు కుమార్తెల్ని బలవంతాన నా రథం మీదెక్కించుకుని బయల్దేరుతూ, అక్కడికి వచ్చిన రాజులందరితో "నేను భీష్మణ్ణి, శంతనుని పుత్రుణ్ణి, మీ భూపాలురందరి ముందే వీరి ముగ్గుర్ని బలవంతాన తీసుకువెళుతున్నాను. చేతనైతే మీ శక్తిని ప్రదర్శించి వారిని విడిపించేందుకు యత్నించండి" అంటూ యుద్ధానికి కవ్వించాను.

దాంతో అప్పుడో పెద్దయుద్ధం జరిగింది. అంతా అన్ని వైపులనుంచి సైనికబలం తీసుకుని, రథాలపై వచ్చి నాపై దండెత్తి నన్ను చుట్టుముట్టారు. నేను మహాశక్తిమంతుణ్ణయి ఉన్నందువల్ల, బాణవర్షం కురిపించి వారి ఉద్ధృతిని అరికట్టాను. అవలీలగా అందరిని ఓడించేశాను. వారు నా శౌర్యం ముందు నిలవలేక యుద్ధాన్ని విరమించుకుని, వెనుదిరిగి చక్కాపోయారు.

దారిలో నన్ను సాల్వుడు వచ్చి మరోసారి ఎదుర్కొన్నాడు. అతడికీ బుద్ధిచెప్పి నేను తిన్నగా హస్తినాపురాన్ని చేరుకున్నాను. విచిత్రవీర్యుడి వివాహ సన్నాహాలన్నీ అయ్యాయి. వివాహ ముహూర్తం నిశ్చయమైపోయింది. అంతలో అంబ నాతో "ఓ మహావీరుడా! నీవు గొప్పపట్టుదల, శౌర్యం, సౌశీల్యం గలవాడవు. నేను సాల్వుని వరించాను. అతణ్ణే

వివాహమాడదలచాను. అందువల్ల నన్ను అతడి దగ్గరకు పంపించి పుణ్యంగట్టుకో" అని బ్రతిమాలింది.

ఆ సంగతి తెలియగానే సకలమర్యాదలతో ఆమెను సాల్వుని చెంతకు పంపేందుకు తగిన ఏర్పాట్లన్నీ తక్షణమే చేయించాను. కాని, సాల్వుడు ఆమెను స్వీకరించలేదు. కారణం తనని ఓడించి, ఆమెను మరొకరు తీసుకువెళ్ళారని నిరాకరించాడు, వెళ్లిపొమ్మన్నాడట. అప్పుడామె అతనితో "భీష్ముడు తాను వివాహమాడదలచి మమ్మల్ని తీసుకుపోలేదు. తన సోదరుడి కిచ్చి చెయ్యాలనే మమ్మల్ని తీసుకువెళ్లాడు. ఆయన చాలా యోగ్యుడు. ఎట్టి దుశ్చింత లేనివాడు. నేను నా విషయం చెప్పగానే సగౌరవంగా నన్ను నీ వద్దకు పంపించాడు, అటువంటప్పుడు నన్ను స్వీకరించేందుకు నీకేమిటి అభ్యంతరం?" అనడిగింది.

కాని, సాల్వుడు తన మొండిపట్టు విడువలేదు; ఆమెను పంపించేశాడు. అప్పుడు అంబ మిక్కిలి దుఃఖించింది. "ఎందుకు? ఎందుకని ఏ తప్పు చెయ్యని నాకు ఇంతటి శిక్ష? నన్ను నే నిందించుకోనా, లేక భీష్ముణ్ణా? శౌర్యమే శుల్కంగా చెల్లించగల వరుని ఎన్నుకునేందుకు ఇట్టి స్వయంవరం ఏర్పాటుచేసిన నా మూర్ఖపు తండ్రినే దూషించనా? నేను సాల్వుని వరించిన విషయం నా తండ్రికి తెలీదు కనుక, నన్నూ పెళ్లికుమార్తెలా అలంకరించి స్వయంవర మండపానికి రప్పించడం వల్లనే ఇంత ముప్పు వచ్చింది. ఎవరిని దూషించను? ఏ మొహంతో తిరిగి వెళ్లను ఎక్కడికని వెళ్ళను..." అని ఆలోచించింది.

అసలు దీనికి కారకుడు భీష్ముడు. భీష్ముడు నన్ను బలవంతాన తీసుకువెళ్ళ బట్టి గదా సాల్వుడు నన్ను నిరాకరించాడు. పరపురుషుడి చేజిక్కిన స్త్రీని స్వీకరించనన్నాడు. అందువల్ల ఆ భీష్ముడిపై పగసాధిస్తాను, ఊరుకోను. అతణ్ణి యుద్ధంచేసి గెల్వడం అసాధ్యం కనుక తపస్సుతో గెలుస్తాను అని నిర్ణయం తీసుకుని తిన్నగా తపోవనానికి వెళ్లింది. అక్కడున్న ఋషులను, తపస్వులను కలుసుకుంది. వారితో తన కథంతా ఏకరువు పెట్టి చెప్పింది. భీష్ముడు బలవంతంగా తీసుకువెళ్లడం, సాల్వుని దగ్గరకు సగౌరవంగా పంపడం, సాల్వుడు నిరాకరించడం వగైరా వగైరా అంతా విని ఆ ఋషులు "ఓ కుమారీ! మేము సాధువులం, తపోధ్యానాల్లో కాలం గడిపేవారం... రాజులు నీకు చేసిన ఈ అవమానాన్ని పోగొట్టడం మావంటి సాధువుల చేత ఏమవుతుంది?" అని అన్నారు.

అందుకామె, "నేను తపస్సు చేసి సాధిస్తాను. తపస్సుతో సాధించలేని దేముంది?" అన్నది. అప్పుడు తపస్వులు పరస్పరం సంప్రదించుకుని ఎలాగైనా ఆ ప్రయత్నం మాన్పించాలని ప్రయత్నించారు.

"అమ్మా! నీవు రాజకుమార్తెవు. తపస్వినిగా జీవించడం ఎంతో కష్టం. తపస్సు అంత తేలికైనది కాదు. తిరిగి నీ తండ్రి దగ్గరకు వెళ్లడం మంచిది. అంతటి రక్షణ నీకింకెక్కడా దొరకదు. అదే సరియైనచోటు, తప్పకుండా నీ మంచి కోరి చేసేవాడు నీ తండ్రే. స్త్రీకి తండ్రి లేదా భర్త రక్షణే రక్షణ. భర్తయితే పరిస్థితులన్నీ అనుకూలంగా ఉన్నప్పుడైతే కాపాడుతాడు. పరిస్థితులు తారుమారై



ప్రతికూలించినప్పుడు తండ్రి అండయై ఆదుకుంటాడు" అని నచ్చజెప్పారు. కాని, అంబ మాత్రం పట్టినపట్టు విడువలేదు. అదే సమయంలో అక్కడికి హోత్రవాహనుడనే మహర్షి ఒకరు వచ్చారు. ఆయన ఆమె కన్నీటి గాథనంతా మౌనంగా ఆలకించి, ఆమెతో... "ఓ అమ్మాయీ! నేను నీకు తాతగారిని (తల్లి తండ్రి). నీకో సలహా చెబుతాను అలాచేయి. నీవు తిన్నగా వెళ్లి పరశురాముని కలుసుకో, ఆయనో గొప్పఋషి. ఆయన తప్పక నీకు కల్గిన దుఃఖాన్ని నివారించగలడు. నీకు న్యాయం చేకూరుస్తాడు తల్చుకున్నాడంటే ఆ భీష్ముని సైతం చంపగలవాడు. నీకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం చేసి పగ సాధించగలవాడు..." అని చెపుతూండగానే అకృతవర్ణుడనే పరశురాముని శిష్యుడు అక్కడికి రావడం, పరశురాముడు ఆశ్రమానికి రానున్నాడని వర్తమానం తేవడం జరిగింది.

పరశురాముడు వచ్చాడు. ఆయన హోత్రవాహనునికి మిత్రుడు. చాలాకాలం తరువాత మిత్రుని చూసేందుకు ఆశ్రమానికి వచ్చాడు. హోత్రవాహనుడు అంబని పరిచయం చేశాడు. అంబ మళ్ళీ యథాప్రకారం తనకు జరిగిన అవమానం, తన వృత్తాంతమంతా దాచకుండా చెప్పింది. పరశురాముడంతా సావధానచిత్తుడై విన్నాడు. ఆమె స్థితికి చాలా జాలిపడ్డాడు. "యువతీ! అయితే భీష్ముడికి కబురు పంపుతాను" అన్నాడు.

అందుకు అంబ, "మహానుభావా! అన్యపురుషుని ప్రేమించిన స్త్రీని తన తమ్మునికిచ్చి వివాహం చేసేందుకు సమ్మతించనని ఆయన తన అభిప్రాయం అప్పుడే చెప్పేశాడు. అందుకనే, నే తిరిగి సాల్వుని దగ్గరకు వెళ్లడం అతడు నన్ను నిరాకరించడం జరిగింది. ఇన్నిటికీ కారకుడు ఆ భీష్ముడే. అతడిపైనే నాకు పగ" అన్నది.



అయితే "భీష్ముని హతమార్చమంటావా? సాల్వుని సమాధాన పర్చమంటావా? నీకేది అభీష్ట'మని పరశురాముడు ప్రశ్నించాడు."

భీష్ముడు ఇంకా ఇలా కొనసాగించాడు:

అంబ భీష్ముని వధించడమే తన ఇష్టమన్నది. తరువాత పరశురాముడు అంబను వెంటతీసుకుని హస్తినాపురం చేరి సరస్వతీ నదీతీరాన బసచేసి, తానక్కడికి వచ్చినట్లు నాకు కబురు పంపాడు. కబురందిన తోడనే నేను నదీతీరానికి వెళ్ళి మహర్షిని కలుసుకుని, నేను పాటించాల్సిన మర్యాదలు పాటించి విధిపూర్వకంగా ఆయనను సత్కరించాను.

అప్పుడు పరశురాముడు "ఓ భీష్మా! నీ వివాహం కోసం కానప్పుడు నీ వెందుకా కన్నెపడుచులను తీసుకువచ్చావు? తెచ్చినవాడివి అంబ నెందుకు పంపించేశావు? ఆమె జీవితాన్ని నీవు నాశనం చేసినవాడివయ్యావే? నీవామెను స్పృశించావు? ఇప్పుడిక ఆమె నెవరు వివాహమాడతారు? సాల్వుడు తిరస్కరించాడంటే ఎందుకు తిరస్కరించడు? కాబట్టి ఆమెను నీవే స్వీకరించి ఆమెకు న్యాయం చేకూర్చు" అన్నాడు.

అప్పుడాయనకి నేనెన్నో విధాల నచ్చజెప్పి సమాధానపరచాలని చూశాను. కాని, ప్రయోజనం లేకపోయింది. ఒప్పుకోకపోతే పోరుకు సిద్ధం కమ్మన్నాడు. ఇక వేరే గత్యంతరంలేక ఇష్టంలేకపోయినా యుద్ధానికి అంగీకరించాను.

ఆ సమయంలో పరమపవిత్రురాలైన మా తల్లి గంగ నాకు ప్రత్యక్షమై "ఏ మాలోచించావు? నేను పరశురాముని దగ్గరకు వెళ్ళి ఈ యుద్ధం వద్దని ఆయన్ని ప్రాధేయపడి అడగదలచాను" అంది.

అందుకు నేనామెతో పరశురాముడన్నదంతా చెప్పాను. కాని ఆమె ఆ యుద్ధాన్ని నివారించాలని శతవిధాల ప్రయత్నించింది, అయినా ఆమె కృతార్థురాలు కాలేకపోయింది. యుద్ధం తప్పలేదు. పరోపకారార్థమై గురు-శిష్యుల మధ్య సంభవించిన అపూర్వ పోరాటం అది, ఇద్దరు సమ ఉజ్జీల మధ్య జరిగిన ఘోరమైన సుదీర్ఘపోరాటం అది. చివరికి మా గురువు, తాను ఓడిపోయినట్లు అంగీకరించాడు. నేనిక అప్పుడాయన చెంతకు వెళ్ళి వందనం చేశాను. ఆయన నన్నునుగ్రహించాడు, మన్నించాడు.

పరశురాముడు అంబను పిలిచి... "నేను చేయగల్గినదంతా చేశాను. నా శక్తి ఇంతే... భీష్ముణ్ణే శరణువేడుకో అదొక్కటే నే చెప్పగలిగింది" అన్నాడు. అంబ సమ్మతించలేదు. ఆమె ఎంతోకాలం ఘోరతపం చేసింది. ఒకనాడు మా తల్లి గంగ ఆమెకు సాక్షాత్కరించి, "ఎందుకమ్మా! నీవింతటి కఠోర తపమాచరిస్తున్నావు" అని అడిగిందట. అప్పుడు అంబ "శివుని మెప్పించేందుకు, వరం పొందేందుకు... నేను భీష్ముని వధించాలి" అంది.

"భీష్ముని వధించడమా.... ఎందుకు"?

"నాకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకుందుకు, తనతో పోరాడిన పరశురాముని యుద్ధంలో ఓడించినందుకు."



"ఓసి దురాత్మురాలా! నీ మనస్సెంతటి దురాలోచనలతో నిండింది! దుశ్చింతతో చేస్తున్న తపం కాబట్టి నీ వెన్నటికీ అనుకున్నది సాధించలేవు. నీ వింతవరకూ చేసిన నీ తపమంతా కరిగి, నీరై ఏరై ప్రవహించిపోవుగాక! వర్షాకాలంలో ఏరై మిగతా ఎనిమిది మాసాలు ఎండి యేరింపులై పడి ఉందువు గాక! నీవో ఏరుగా, ఎవ్వరికీ తెలియకుందువు గాక! నీ నీరు ఏ ఒక్కరికీ ఉపయోగపడకుందుగాక! ఇది నీకు నా శాపం..." అంటూ అంబను శపించి గంగతల్లి అదృశ్యమైంది.

అంబ వత్స భూమిలో తపశ్చర్యలో ఉంటూండగా, ఒకనాడు గంగశాప ఫలితంగా ఆమె నీరుగా మారిపోయింది. కాని తన తపోమహిమ వల్ల సగమే ఏరుగా మారింది. మిగతా సగభాగంతో తపశ్చర్య కొనసాగించింది.

అక్కడున్న ఋషులు ఆమె తపస్సును మాన్పించాలని ఎంతో ప్రయత్నించారు. కాని, అంబ పట్టుదలతో తపం సాగించి, తన కఠిన తపస్సుతో పరమేశ్వరుని మెప్పించింది. చివరికి శివుడు ఆమె ఎదుట ప్రత్యక్షమయ్యాడు.

"అంబ! విచారించకు... నీవీ జన్మలో కాదు మరుజన్మలో భీష్ముని వధించగలదానవు" అన్నాడు. ఆమె అందుకు సంతృప్తి చెందలేదు.

"మరుజన్మలోనా? ఏం ప్రయోజనం? అప్పటికి నాలో ఈ ద్వేష స్ఫురణ ఉంటుందా? నేనతణ్ణి ఒకవేళ హతమార్చినా, పగతీర్చుకోగలిగానన్న ఆనందాన్ని పొందగలనో లేదో... ఇప్పుడే చంపి పగతీర్చుకుంటాను" అనగానే పరమేశ్వరుడు నవ్వి, "ఏమాత్రం విచారించకు.



నీ మరుజన్మలో నీకు నీ గతం గుర్తుంటుందిలే. నీవు ద్రుపదుని ఇంట దుహితగా జన్మిస్తావు. కాని, తరువాత పురుషుడుగా మారుతావు. భీష్ముని వధిస్తావు" అని చెప్పి అదృశ్యమయ్యాడు.

"ఇక అంబ ఓపికపట్టలేకపోయింది. ఆమె సహనం సన్నగిల్లింది. ఆమె ఒక చితిని రగిల్చి, అందులో దూకి దగ్ధమైపోయింది. ఆ తదనంతరం, ఆమె ద్రుపదుని ఇంట కుమార్తెయై జన్మించింది. తల్లికి ఆడ శిశువై

జన్మించినా మగబిడ్డని ప్రకటించడం జరిగింది. ఆ విషయాన్ని ద్రుపదుడు,అతని భార్య ఎవరికీ తెలియకుండా గుట్టుగా ఉంచారు. ఆమెను 'శిఖండి' అని పిల్చేవారు. ఆమె ద్రోణుని వద్దనే విద్య నేర్చింది. లోకంలో అందరు ఆమెను పురుషుడుగానే గుర్తించారు. సంవత్సరాలు గడిచాయి. ఒక యక్షుడి దయవల్ల అంబకు పురుషరూపం కల్గింది. ఆ విధంగా ఆమెకు పురుషాకృతి లభ్యమైంది. ఆమె ద్రుపదుని ఇంట పెరిగి పెద్దవుతున్నట్లే, ఆమె గుండెల్లో నా పట్ల ద్వేషం, పగ రగిలి రగిలి సెగలవుతున్నాయి.

"దుర్యోధనా! అదీ అంబ కథ. ద్రుపదుని కుమారుడనబడే స్త్రీ పురుషుడు కాని, ఆ శిఖండి స్త్రీగా ముందు పుట్టి తరువాత పురుషుడైంది. నన్ను తాను చంపాలని వచ్చినా నేను శిఖండితో పోరాడను అదీ నా శపథం. నేను స్త్రీతో యుద్ధం చెయ్యనన్నది నా శపథం కనుక శిఖండి తరువాత పురుషుడిగా మారినప్పటికీ, పుట్టుకతో స్త్రీ; స్త్రీ పేరున్నా, స్త్రీ కవళికలున్నా కూడా పోరాడనని నా ప్రతిజ్ఞ. అట్టివారిపై ఆయుధం ప్రయోగించను. శిఖండిని చంపననడంలో అదీ ఉద్దేశం.

"యుద్ధ ఘడియలు దగ్గరపడుతున్నాయి. సమయం పరుగులు తీస్తూంది... రేపటి ఉదయమే... యుద్ధం ప్రారంభం గదా! ఇవాల్టికి నిద్రపోదాం" అన్నాడు భీష్ముడు.

**ఉద్యోగపర్వం సమాప్తం**





# బాలల మహాభారతం

## నాలుగవ భాగము


ఆంగ్లమూలం : స్వామి రాఘవేశానంద

తెలుగు సేత : స్వామి జ్ఞానదానంద

చిత్రాలు : పద్మవాసన్





రామకృష్ణ మఠం

దోమలగూడ,

హైదరాబాద్ - 500 029.

# విషయ సూచిక

## భీష్మపర్వం


| | | |
|---|---|---|
| కురుక్షేత్ర రణరంగంలో | ... | 1 |
| ధర్మజుడి ఉదాత్త వర్తన | ... | 4 |
| గీతోపదేశం | ... | 6 |
| యుద్ధారంభం | ... | 12 |
| రెండోరోజు యుద్ధం | ... | 16 |
| సంకుల సమరం | ... | 18 |
| భగదత్తుడి పరాక్రమం | ... | 20 |
| దుర్యోధనుడి విషాదం | ... | 23 |
| భీమ – సుయోధనుల పోరాటం | ... | 24 |
| భీష్ముడు అజేయుడు | ... | 25 |
| భీష్ముడు వాగ్దానం | ... | 29 |
| భీష్ముడు – కార్చిచ్చు | ... | 32 |
| భీష్ముడి శిబిరంలో పాండవులు | ... | 34 |
| కారుమబ్బుల్లో కౌరవసేన | ... | 36 |
| భీష్ముడికి పాదాభివందనం | ... | 39 |


## ద్రోణపర్వం


| | | |
|---|---|---|
| కర్ణుడి రణరంగ ప్రవేశం | ... | 41 |
| ధర్మజుని వశపరచుకునేందుకు ద్రోణుడి యత్నం | ... | 43 |
| అభిమన్యు వధ | ... | 46 |
| కృష్ణ గారడి | ... | 48 |
| ఘటోత్కచుడి దుర్మరణం | ... | 53 |
| ప్రాణాలు హరించిన అబద్ధం | ... | 55 |
| నారాయణాస్త్రం | ... | 57 |




## ప్రస్తావన

పురాతనకాలంలో జరిగిన కుతూహలజనితమైన మహాయుద్ధ వృత్తాంతాన్ని ఈ సంపుటం తెలుపుతోంది. ఆ మహాయుద్ధం, ఆధునిక యుద్ధాలకు విభిన్నమైనది; ఆధునిక యుద్ధాలలో హింస, క్రూరత్వం, కుటిలత్వాలకు పరిధులే లేవు. కాని కురుక్షేత్రం ఒక ధర్మక్షేత్రం. ఈ పురాణకాల యుద్ధాలలో నీతి నియమాలు తు.చ తప్పక పాటింపబడేవి. ప్రతి ఉదయం శంఖనాదాల అనంతరం యుద్ధం ఆరంభమై, సూర్యాస్తమయానికి యుద్ధం నిలిపివేయబడేది. పాండవులు రాత్రివేళ కౌరవ శిబిరాలకు వెళ్ళి విషయాలు చర్చించుకోవటం మనం చూస్తాం. నేడు జరుగుతూన్న క్రికెట్ క్రీడల్లో పాల్గొనే ప్రత్యర్థి జట్లు విరామ సమయంలో కలిసి ఆహారం తీసుకోవటం లాంటిది ఇది.

మొదట పది రోజుల యుద్ధంలోను కౌరవ సైన్యానికి భీష్ముడు సర్వసైన్యాధిపత్యం వహించి, పాండవ బలాలకు అపారనష్టం కలిగించాడు. తదనంతరం ద్రోణుడు సర్వసేనాని అయ్యాడు. ద్రోణుడూ గొప్ప యుద్ధనైపుణ్యాన్ని ప్రదర్శించాడు. ఆ కారణంగానే ఈ సంపుటంలోని రెండు విభాగాలు, భీష్మపర్వం, ద్రోణపర్వంగా పేర్కొనబడ్డాయి.

యుద్ధారంభానికి కొద్దిసేపు ముందు, శ్రీకృష్ణుడు విశ్వవిఖ్యాత భగవద్గీతను అర్జునునికి బోధించటం జరిగింది. సనాతన ధర్మం, శాశ్వతసత్యాల మీది మహోన్నత వ్యాఖ్యాన వివరణే ఈ భగవద్గీత.



# భీష్మపర్వం

## 1

## కురుక్షేత్ర రణరంగంలో

రణభూమిలో కురు–పాండవ సేనాసమూహాలు తూర్పు–పడమరలుగా అనర్థదాయకమైన సమరానికి సంసిద్ధమై ఉండటాన్ని చూసిన పూజ్యపాదుడు వ్యాసమహర్షి ఏకాంతంగా ధృతరాష్ట్రుడితో "నాయనా! నీ పుత్రుల జీవితకథలో చివరి అధ్యాయం ఇది. వారు రాజ్యచ్యుతులు కానున్నారు. వారంతా యుద్ధానికై సన్నద్ధులై ఇక్కడ ఉన్నారు. వారిని గురించి ఇక దుఃఖించి ప్రయోజనం లేదు. నువ్వు కనుక ఆ పోరాటాన్ని చూడాలని కాంక్షిస్తే నీకు నేను ప్రత్యేక దృష్టిని ప్రసాదిస్తాను" అన్నాడు.



అప్పుడు ధృతరాష్ట్రుడు "ఓ మహాత్మా! నా వాళ్ళ, నా బంధుమిత్రుల వినాశనం చూడాలన్న కోరిక నా కేమాత్రమూ లేదు. కానీ, ఆ జరుగుతున్న యుద్ధకాండ గురించి ఉన్నది ఉన్నట్లు తూ.చ తప్పకుండా జరుగుతున్న వైనమంతా ఎవరైనా చెప్పగలవారుంటే వినాలని మాత్రం కుతూహలంగా ఉంది" అన్నాడు.

అందుకు స్పందించిన వ్యాసుడు, సంజయుడికి ప్రత్యేకమైన వరం ప్రసాదించి, ధృతరాష్ట్రుడితో "సంజయుడు నీకా ఘోర సంగ్రామాన్ని ప్రత్యక్షంగా వర్ణించి చెబుతాడు. అతడు నీ వద్ద కూర్చునే రణరంగంలో జరుగుతూండే పోరాటాన్ని దివ్యదృష్టితో చూడగలడు. విజయమంటావా ధర్మమున్నచోటే అనుకో. రానున్న ప్రళయాన్ని గురించి అయ్యో... అపశకునా లెన్నో కనబడుతున్నాయి" అంటూ వ్యాసమహర్షి, ధృతరాష్ట్రుడి వద్ద వీడ్కోలు పుచ్చుకుని అరణ్యాలకి వెళ్ళిపోయాడు.



యుద్ధం ప్రారంభమైంది. శిఖండి తనను ఎదుర్కొన్నందువల్ల, భీష్ముడు పదవనాడు యుద్ధం చేయడం మానుకున్నాడు. ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి, "యుద్ధారంభమైన మొదటి రోజు నుంచి ఇంతవరకు జరిగిన సంఘటనలన్నిటిని వివరించి చెప్పు" అని అడిగాడు.

అప్పుడిక యుద్ధాన్ని గురించిన వివరాలన్నిటిని సంజయుడు ఇలా వర్ణించి చెప్పసాగాడు: యుద్ధానికి కావాల్సిన సన్నాహాలన్నీ పూర్తయ్యాయి. దుర్యోధనుడు దుశ్శాసనుడితో "భీష్మపితామహుణ్ణి అన్నివైపులనుంచి, అన్ని విధాల కాపాడవలసిందిగా మన యోధులకి హెచ్చరికలు చెయ్యాలి. పితామహుడు శిఖండిని చంపనని ప్రతిజ్ఞ చేశాడు. కనుక రక్షణ లేకపోతే సింహం సైతం ఒక గుంటనక్క వాతబడాల్సి రావచ్చు. యుధామన్యు ఉత్తమౌజులు అర్జునుణ్ణి కుడి ఎడమలనుండి కాపాడుతున్నారు. అర్జునుడేమో శిఖండి రక్షణకై ఉన్నాడు. ఏమైనా, భీష్ముడి దెసకు శిఖండి రాకుండా చెయ్యడమే మన కర్తవ్యం. వెయ్యికళ్ళతో ఆయనకి రక్షణగా ఉండాలి సుమా!" అన్నాడు.

రాత్రి గడిచింది. నడుమ నడుమ వ్యూహరచనలు, పథకాలూ, సన్నాహాలూను. సూర్యోదయం కాగానే భయంకరమైన మారణాయుధాలూ, రక్షణ కోసమైన కవచాలూ ధరించి కౌరవులు పాండవులు స్పష్టంగా కనబడుతున్నారు. పదకొండు అక్షౌహిణీల కౌరవసేనాసమూహానికి భీష్మాచార్యుడు నాయకత్వం వహించాడు. ఆయన తెల్లనైన శిరస్త్రాణమూ, తెల్లని గొడుగు, తెల్లటి కవచాన్ని ధరించి ఉదయించే చంద్రుడిలా ఉన్నాడు.

సన్నాహాలన్నీ పూర్తయ్యాక భీష్ముడు సైనిక యోధులను సంబోధిస్తూ "విశాలమైన స్వర్గద్వారాలు మీ కోసం తెరువబడి ఉన్నాయి. మన పెద్దలు, పూర్వీకులు నిర్దేశించిన ధర్మమార్గాన్ననుసరించి మీరందరూ మిక్కిలి శౌర్యంతో పోరాడాలి. క్షత్రియుడిగా పుట్టినవాడు వ్యాధిగ్రస్తుడై మరణించడం మహాపాపం. యుద్ధంలో వీరగతినొందడం అంటే వీరమరణం పొందడం ఎంతో శ్లాఘనీయమైన విషయం" అంటూ విరోచిత వాక్యాలు పలికాడు.

భీష్ముని స్ఫూర్తిదాయక వచనాలతో సైనిక యోధులందరూ సమధికోత్సాహంతో తమకు నిర్దేశించిన స్థానాల్లో వెళ్ళి పోరుకి సంసిద్ధులై నిలబడ్డారు. ఒకే ఒక్క వ్యక్తిమాత్రం కొంతసేపు యుద్ధభూమినుంచి వెనక్కి తగ్గాడు. ఆ వ్యక్తి ఎవరో కాదు, కర్ణుడే. అశ్వత్థామ ముందు భాగాన అగ్రగామియై నిలబడ్డాడు. అతడికి శల్యుడు, భూరిశ్రవుడు ఇంకా మరికొందరి అండ నిండుగా ఉంది. శిఖండి నుంచి భీష్ముణ్ణి కాపాడేందుకు యోధాగ్రేసరులైన వారేడుగురు నియమింప బడ్డారు. దుర్యోధనుడు మధ్యలో, కేంద్రస్థానంలో ఉన్నాడు. అతడి ప్రసిద్ధ కేతనం, అదే సువర్ణవస్త్రంపై నాగచిహ్నమున్న ధ్వజం అన్ని వైపులకు చక్కగా కనబడుతోంది.

కురుసైన్యాన్ని చూసిన తరువాత ధర్మరాజు అర్జునుడితో "బ్రహ్మాండమైన ఈ కౌరవసైన్యం ముందు మనదేపాటి! మన సైన్యాన్ని ఎలా ఏ వ్యూహంగా మలిస్తే బావుంటుందో నీకే బాగా తెలుసు. కనుక ఎలా చేస్తే బావుంటుందో బాగా ఆలోచించి చెయ్యి" అన్నాడు.

అర్జునుడప్పుడు "ఓ మహానుభావా! మనం దీన్ని వజ్రవ్యూహంగా రూపొందిద్దాం. అదైతే ఎవ్వరికీ చొరశక్యం కాదు. దాన్ని ఇంద్రుడే స్వయంగా రూపొందించాడు. మహాశక్తిమంతుడైన భీష్ముడు శత్రువుల్ని ఎదిరించేందుకు అగ్రస్థానంలో ఉన్నాడు. మృగరాజు అల్పజీవాల్ని హడలెత్తించేసినట్లు, భీష్ముడు శత్రుసైన్యాన్ని చెల్లాచెదరు చేసెయ్యగలడు" అన్నాడు.

పొర్లి పొర్లి వడివడిగా వచ్చే గంగాతరంగాలలా పాండవసేన అంచెలంచెలుగా ముమ్ముందుకి చొచ్చుకువస్తోంది. శక్తిమంతమైన దుర్యోధనుడి సైన్యం

పడమటి దిక్కున నిల్చింది భయంకరమై... ఆ మహాసేనని నడిపిస్తున్నాడు భీష్ముడు.

ఆ భీష్మణ్ణి చూసిన ధర్మరాజుకి బెదురుపుట్టి అర్జునుడితో "భీష్ముడంతటి వీరుడు వారి సేనకి ఆధిపత్యం వహిస్తూంటే, ఎన్నటికైనా మనం వాళ్ళని ఓడించడం అయ్యేనేనా?" అని ప్రశ్నించాడు. అది విని అర్జునుడు "ఒకప్పుడీ భీష్ముడే ఇంద్రుడితో ఇంకా మరికొందరితోను 'విజయకాంక్షాపరులు కేవలం శౌర్యపరాక్రమాలతో విజయాన్ని సాధించలేరు, నిజాయితీ, కనికరమూ, జాలి, సత్ప్రవర్తనా కలిగి ఉంటేనే విజయం సాధ్యం' అన్నాడు. కనుక కృష్ణుడున్న చోటే జయం తథ్యం. నువ్విక దాన్ని గురించి బెంగపెట్టుకోకు" అని చెప్పి సమాధానపరిచాడు. అంత ధర్మరాజు ముందడుగు వెయ్యమని యోధులకు ఉత్తర్వులిస్తూ "సైనికయోధుల్లారా! ధర్మయుక్తంగా పోరాడండి" అంటూ ఆజ్ఞాపించాడు. సేనామధ్యంలో శిఖండికి, అర్జునుడు రక్షణగా ఉన్నాడు. దక్షిణ దిశనున్న సైనిక దళానికి యుయుధానుడు ఆధిపత్యం వహించగా, ధర్మరాజు గజబలాన్ని నడిపించాడు.

పురోహితులు, బ్రాహ్మణులు, ఇంకా ఋషులు వేదమంత్రాలు వల్లిస్తూ, ధర్మజుణ్ణి శ్లాఘించారు. వందలాది గంటలతో అలంకరించబడిన అర్జునుడి రథం బంగారు కిరణకాంతులతో వేయిసూర్యుల వెలుగులతో ప్రకాశిస్తోంది. ఆ రథానికి కృష్ణుడే స్వయంగా సారథ్యం వహిస్తున్నాడు. కపిధ్వజం ఎగురుతోంది. కృష్ణుడు అర్జునుణ్ణి దుర్గామాతని వేడుకొమ్మంటున్నాడు, స్తుతించమంటున్నాడు. ఆ జగన్మాత అతడి భక్తికి మెచ్చింది. ఆకాశంలో సాక్షాత్కరించింది. ఆ తల్లి,



పార్థుడితో "వత్సా! నువ్వు తప్పక నీ శత్రువుల్ని జయిస్తావు. సాక్షాత్తూ ఆ శ్రీమన్నారాయణుడే కృష్ణావతారుడై నీకు సాయమై వచ్చి నీ వెంట ఉన్నాడు. అందువల్ల నిన్ను ఓడించగల వారెవరూ లేరు" అని పలుకుతూ దుర్గామాత అదృశ్యమైంది. అర్జునుడు దుర్గామాత ప్రత్యక్షమవడం, దీవించడం చూసి, అంబ దీవెన వృథాకాదని దృఢంగా విశ్వసించాడు. కృష్ణార్జునులు తమ దివ్యశంఖాల్ని పూరించారు.



## 2
## ధర్మజుడి ఉదాత్త వర్తన

యుద్ధ సన్నాహాలన్నీ అయినాయి. ఇక యుద్ధారంభం కానున్నది. అట్టి ఉద్రిక్త సమయాన ఉన్నట్లుండి ఉఱుముతున్నట్లు పెద్ద పెట్టున కోలాహలం చెలరేగింది. అది మరేమీ కాదు, అర్జునుడు తన గాండీవ ధనుస్సును ఎత్తగానే పాండవసైన్యంలో పెల్లుబికిన ఉత్సాహ సంరంభం. ధర్మరాజేమో తటాలున కవచాన్ని తొలగించి, ఆయుధాల్ని అవలబెట్టి, రథం నుంచి దిగి పాదచారియై చేతులు జోడించి కౌరవ సేనానులకు అభిముఖుడై వెళుతూండటం అర్జునుడు చూశాడు. వారించాలని యత్నించాడు. "ఎక్కడికి పోతున్నావు? వారంతా మన శత్రువులు" అని ఎలుగెత్తి అడిగాడు. కానీ ధర్మరాజు మాత్రం వెనుతిరగలేదు, ఆగలేదు ముందుకి సాగిపోతున్నాడు.



కృష్ణుడు పరికించాడు. "ఓహో అదీ సంగతి. అర్థమైంది, అతడి ఉద్దేశం తెలిసింది. ఈ భీషణ సంగ్రామం ఆరంభించేందుకు ముందుగా భీష్మ ద్రోణ కృప శల్యుల దీవెనలు పొందేటందుకు అతడు వెళుతున్నాడు" అంటూ సందేహ నివృత్తి చేశాడు.

దుర్యోధన పక్షంలోని సైనికులు యుధిష్ఠిరుడటువైపు రావడం చూసి, "అతడు తమ బలాన్ని చూసి తమతో పోరాటానికి భయపడిపోయి, సంధి చేసుకొనేందుకు వస్తున్నాడు. వట్టి పిరికిపంద, తమ్ముళ్ళి వదిలేసి, పారిపోయి మనతో చేరాలని వస్తున్నట్లున్నా"డని అపోహపడ్డారు.

ధర్మరాజు తిన్నగా భీష్ముణ్ణి సమీపించాడు. వంగి, ఆయన పాదాలు తాకి ప్రణమిల్లాడు. "ఓ మహానుభావా! మీకివే నా వందనాలు. మీరు మమ్మల్ని యుద్ధానికి పురిగొల్పారు. పోరుకి అనుమతించండి, ఆశీర్వదించండి" అని వినమ్రుడై పలికాడు. అందుకు భీష్ముడు "ఆ వచ్చావే, నువ్వు కనుక యుద్ధారంభానికి ముందుగా నన్ను వచ్చి చూడకపోతే, నిజంగానే నిన్ను శపించి ఉండేవాణ్ణి. కానీ వచ్చావు కాబట్టి నాకిప్పుడెంతో సంతోషంగా ఉంది."



"పోరాడి విజయం సాధించండి. నీకేమైనా వరం కావాలంటే కోరుకో? చూడు మనిషి ఐశ్వర్యానికి దాసుడుగానీ, ఐశ్వర్యం మనిషికి దాసోహం కాదుసుమా. నేను కౌరవపక్షాన ఉండి పోరాడాలి. నేను వారికి బద్ధుణ్ణి నాయనా" అన్నాడు.

అందుకు ధర్మరాజు "పితామహా! మిమ్మల్ని మేమెలా ఓడించగలమో చెప్పండి. మీరు అజేయులు!" అన్నాడు. అందుకు భీష్ముడు "ఔను నాయనా! ఏ ఒక్కరూ, దేవుళ్ళే అయినా కూడ యుద్ధంలో నన్ను గెలువలేరు. నేను నా ఆయుధాల్ని వదలనంతవరకు నాకు మృత్యువు లేదు ఇప్పుడింకా మృత్యుకాలం రాలేదు. ఈ ప్రశ్నకు సమాధానం మరలా ఎప్పుడైనా వచ్చి అడుగు చెబుతాను" అన్నాడు.

ధర్మరాజుకి ఏం చెయ్యాలో తోచలేదు. మరోసారి ఆయనకు వందనంచేసి అక్కణ్ణుండి సెలవు తీసుకున్నాడు. తరువాత ద్రోణుడి వద్దకు వెళ్ళాడు. ఆయనకు నమస్కరించాడు. "జయింపనలవికాని ఆచార్యా! నాకు పాపం అంటకుండేట్లు మీతో యుద్ధం ఎలా చేయగలుగుతాను? నాకు దయచేసి చెప్పండి" అని ద్రోణుణ్ణి అర్థించాడు.

"నేను మీరు విజయులు కావాలని ప్రార్థిస్తాను. మీకు కృష్ణుడే సలహాదారుడై ఉన్నాడు. ధర్మాచరణ ఉన్నచోట కృష్ణుడుంటాడు. కృష్ణుడున్న చోట విజయముంటుంది. అయితే, నేను పోరాడుతున్నంతవరకు విజయం మీకు చేజిక్కదు. అందుకని మీ సోదరులతో ఉపాయం యోచించి నన్ను తుదముట్టించు" అన్నాడు ద్రోణుడు. అది ఎలా అని ధర్మరాజు మరలా అర్థించగా, ద్రోణుడు "ఓ ధర్మరాజా! అంటున్నానేగానీ నన్నెవ్వరూ అంతసులభంగా అంతం చేయలేరు సుమా! యుద్ధం చేస్తున్నప్పుడు నా శౌర్యం మరింత విజృంభిస్తుంది. అందుకని అజేయుణ్ణి కనుక నేను నా ఆయుధాల్ని వదిలేసి యోగంలో ఉన్నప్పుడు, అది సాధ్యం. లేకపోతే విశ్వసనీయుడైనవాడు నాకు అప్రియమైన మాట చెప్పినా నేను ఆయుధం ముట్టను. యుద్ధం చెయ్యను. అటువంటప్పుడైతే వీలవుతుంది" అని కిటుకు చెప్పేశాడు.



అంతటితో ధర్మరాజు కృపాచార్యుడు తక్కిన పెద్దలందరికి ప్రణమిల్లి తన సైనికబలంవైపు తిరుగుముఖం పట్టాడు. "కౌరవపక్షం నుంచి మాతో చేరదలచినట్లయితే వారిని మేము ఆహ్వానిస్తున్నా"మని యుధిష్ఠిరుడు ప్రకటించగానే, దుర్యోధనుడు తమ్ముళ్ళలో ఒకడైన యుయుత్సుడు పాండవసేనలో చేరాడు.

ధర్మరాజు సంతోషంగా అతణ్ణి ఆహ్వానించాడు.

## 3
## గీతోపదేశం

అర్జునుడు అసమాన పరాక్రమవంతుడు. గాండీవ ధనుస్సును చేతబట్టాడు. కురుక్షేత్ర యుద్ధానికి సంసిద్ధుడైనాడు. రణరంగమంతా భేరీ నినాదాలతో పిక్కటిల్లిపోతోంది.

"కృష్ణా! దుర్యోధన పక్షాన చేరి మనతో పోరాటానికై తహతహలాడిపోతున్న ఆ యోధానుయోధులందరిని చూడాలని ఉంది. ఇరుసైన్యాల నడుమ అనువైన చోటుచూసి రథం నిలుపు" అని, అర్జునుడు అడిగాడు.

కృష్ణుడు అర్జునుని కోరికను మన్నించాడు. రథం పోనిచ్చాడు. సరైన తావు కనిపెట్టి ఆపి, "అర్జునా! అదుగో చూడు భీష్మద్రోణులు, వారి అపార సైన్యాలు. రణరంగంలో నీ చేత నిహతులయ్యేందుకు సిద్ధంగా ఉన్న ఆ వీరాగ్రేసరులందరిని పరికించు" అన్నాడు.

అర్జునుడు విప్పారిన నేత్రాలతో తిలకించాడు. శత్రుపక్షంలోని శౌర్యధనులందరిని పరిశీలనగా పట్టిచూశాడు. వారంతా ఎవరు? తనకయిన వారే, తాత వరసైన వారు, గురువులు, పెదతండ్రిగారు, దాయాదులు, మేనమామలు మిత్రులు అంతా బంధుకోటిలో వారే. కానివారంటూ ఎవరూ లేరు. వారెవ్వరితోనూ తనకెట్టి శత్రుత్వమూ, ద్వేషమూ లేదే. వారిని పగవారిగా పరిగణించడమా? వధించడమా? ఇది సంభవమా? ఉహూ... దారుణం... ఘోరపాపం... అని తనలో మథనపడ్డాడు. వారిపట్ల గల ఆదరాభిమానాలు పెల్లుబికి వచ్చి అతణ్ణి ఉక్కిరిబిక్కిరి చేసేశాయి. అంతటితో దుఃఖం పొంగి పొర్లి వచ్చింది. గొంతు పూడుకుపోయింది. "కృష్ణా! నా తల గిర్రున తిరిగిపోతోంది. నాకు స్పృహతప్పిపోతోంది. నా చేతులు గడగడ వణికిపోతున్నాయి. ఈ గాండీవం పట్టుకోవడం ఇక నా వల్ల కాదు. తుచ్ఛమైన ఈ రాజ్యం నా కొద్దు. ఇంతమాత్రపు భాగ్యానికై నా బంధువర్గంతో నే తలపడలేను. వారిని హతమార్చలేను కృష్ణా! ఈ ఒక్క రాజ్యమే కాదు, ముల్లోకాలూ దక్కినా నా కక్కర్లేదు, ఆశలేదు, వద్దు. నేను యుద్ధం చెయ్యను. ఏ అడవుల్లోనో విశ్రాంతి తీసుకుంటాను. కానీ," అంటూ ఆ రథంలోనే కూలబడిపోయాడు. చేతనున్న వింటిని, బాణాల్ని విసిరి పడేశాడు. విచారంతో ఊగిపోయాడు, హృదయం ద్రవించింది. కళ్ళవెంట కన్నీటిధార...

అర్జునుడి మానసిక బలహీనతను కృష్ణుడు ఇట్టే పసిగట్టాడు. అతడికి మనోబలాన్ని చేకూర్చాలి, ఆధ్యాత్మిక బోధ ద్వారానే అది సమకూరుతుందని, సుదీర్ఘమైన జ్ఞానబోధ ప్రారంభించాడు. అదే 18 అధ్యాయాల గీత, భగవద్గీత. అది హైందవ ధర్మశాస్త్రాలన్నిటికి ప్రాథమికమైనది.

భగవద్గీత అంటే దైవవాక్కు (సాంగ్ ఆఫ్ సెలిస్టియల్). ఇప్పుడు మనం ఆ గీతాసారాన్ని కొంత తెలుసుకుందాం.

కృష్ణుడు అర్జునుడితో ఇలా అన్నాడు: "అర్జునా! అనిత్యమైన వాటిని గురించి ఆందోళన పడటం అనవసరం, అవివేకమూను. నువ్వు వివేకవంతుడివే, వివేకమున్న మనిషి ఎన్నడూ జనన-మరణాల గురించి విలపించడు. చూడు, నీలో ఉన్నట్టి ఆత్మకు నాశనమన్నది లేదు. నశించేది దేహమే. శరీరం వివిధ దశల్ని దాటి అంటే, బాల్యం, యౌవనం, వృద్ధాప్యం మొదలుగాగల దశలన్నిటిని దాటిన తర్వాత కడపటి దశను చేరుతుంది. అదే మరణం.

మనిషిలో దేహం, ఆత్మ అనే రెండు వేర్వేరు పదార్థాలున్నాయి. ఆత్మ అనే దానికి మరణమే లేదు. అది నశించేది కాదు అర్జునా!

అర్జునా, నువ్వు చంపుతున్నాననుకోవటం, నీ శత్రువు తను చంపబడుతున్నాననుకోవటం రెండూ తప్పే. ఇరువురిదీ పొరబాటే. నువ్వు చంపగల్గింది శరీరాన్నేగానీ ఆత్మని కాదు. ఎంతటి ఆయుధాలైనా సరే ఆత్మని వధించలేవు అన్నది పరమ సత్యం. గుర్తుంచుకో.

పైగా నువ్వు జన్మతః వీరుడవు. పుట్టిన ప్రతిమనిషి సంఘంలో తన కర్తవ్యాన్ని విధిగా నిర్వర్తించాలి, దాన్నే 'ధర్మ'మంటారు.

'పోరాటం' వీరుడి ధర్మం. అవినీతిని అణచడమూ, ధర్మాన్ని కాపాడటమూ వీరోచిత లక్షణం. ధర్మరక్షణకై పోరాడి మరణించిన వీరుడు వీరస్వర్గం అలంకరిస్తాడు. యుద్ధంలో గెల్చావనుకో రాజ్యం దక్కుతుంది లేక మరణిస్తే వీరస్వర్గం లభిస్తుంది. కనుక విజయమో వీరస్వర్గమో తేల్చుకో... యుద్ధానికి సిద్ధపడు, విధిని నిర్వర్తించు. పనిచేయడమే నీ వంతు, ఫలితాన్ని ఆశించకు. జయాపజయాల్ని గురించి కలవరపడకు.

భగవంతుణ్ణి తెలుసుకునేందుకు రెండు మార్గాలున్నాయి. ఒకటి జ్ఞాన మార్గం, అది ధ్యానం ద్వారా సాధ్యం. రెండోది ఫలాపేక్ష లేని కర్మాచరణ చేయడం.

ఏ మనిషీ క్షణం ఊరకే ఉండలేదు. అధిక సంఖ్యాకులకు కర్మమార్గం సబబు. కర్మ మనిషిని



బంధిస్తుంది లేదా భగవత్సాక్షాత్కారానికి దోహదం చేస్తుంది.

ఫలితం ఆశించని నిస్వార్థ కర్మాచరణ భగవత్సాక్షాత్కారానికి దారితీస్తుంది. ఫలితాన్ని ఆశించకుండా పనిచేయడమంటే? చేసే ప్రతి పనియొక్క ఫలితాన్ని భగవత్ కైంకర్యంగా భావించి చేయడం. అందుకని నీ మనస్సును భగవంతునిపై లగ్నం చెయ్యి. నీ విధులను నిర్వర్తించు" అని బోధిస్తూండగా, అర్జునుడు మధ్యలో మాటకు అడ్డుతగిలి కృష్ణుడితో, "కృష్ణా! మనిషి అసలు పాపమెందుకు చేస్తాడు?" అనడిగాడు. కృష్ణుడు "ఎందుకా? 'కోరిక-కోపం' అనే ఈ రెండూ మనిషిని పాపం చేసేందుకు పురిగొల్పుతాయి, అవి మనిషికి బద్ధశత్రువులు సుమా!" అన్నాడు.

భగవంతుని సాక్షాత్కారానికి ధ్యానమే ఉత్తమ మార్గమని తలచిన అర్జునునికి కృష్ణుడు... కొత్తతరహా పరమార్థ తత్త్వాన్ని చెబుతున్నట్లు అనిపించింది. అయితే



కృష్ణుడు అతని సందేహ నివృత్తి చేశాడు. "అది మరింత స్పష్టంగా వివరించి చెప్పు" అని అడిగాడు అర్జునుడు.

"అర్జునా! ఈనాడు నీకు బోధిస్తున్న విషయమేమి సరికొత్త తత్త్వం కాదు. అనాదిగా, సృష్ట్యాదిగా ఉన్నదే. ఇది నేను మొట్టమొదట వైవస్వతుడికి బోధించాను. తరువాత అతడు దానిని మనువుకి, అలా పరంపరగా ఒకరి తరువాత మరొకరు బోధించడమూ, ఆచరించడమూ జరిగింది. కానీ మధ్యలో ఎక్కడో ఆ గొలుసు తెగిపోయి, మానవులు సులభ సాధ్యమైన పారమార్థిక జ్ఞానాన్ని మరచారు. దానిని పునరుద్ధరించాలనే మళ్ళీ నీకు బోధిస్తున్నాను" అన్నాడు.

కానీ అర్జునుడికి ఆ మాటల్లో నమ్మకం కలుగలేదు. "కృష్ణా! నీ మాటలు నాకేమీ అర్థం కావడం లేదు. ఆ వైవస్వతుడు ఎప్పటివాడు? నిన్న మొన్న పుట్టిన నువ్వు ఆయనకు బోధించడమేమిటి? అని అడిగాడు.

కృష్ణుడందుకు చిరునవ్వు నవ్వి "అర్జునా! నువ్వూ నేనూ అనేకానేక జన్మల్ని పొందాము. నీ గతజన్మల వృత్తాంతం నీకు తెలీదు. కానీ నా గత జన్మలన్నిటి గురించి నాకు గుర్తే. అంతేకాదు నీకు మరో పరమరహస్యం



చెబుతా, సావధానంగా విను. నేను నీవనుకొంటున్నట్లు ప్రాణిమాత్రుణ్ణి కాను, నేను పరదైవాన్ని. లోకంలో ధర్మం అడుగంటుతున్నప్పుడు, ధర్మోద్ధరణకు, మంచిని కాపాడేందుకూ అవతరిస్తూంటాను. దైవశక్తిని గుర్తించటం అందరికీ సాధ్యం కాదు. నన్ను తెలుసుకొన్న వారికి మరుజన్మ ఉండదు. వారు నాలో లీనమవుతారు. నాలోనే ఉంటారు" అన్నాడు. "అర్జునా! మరొక్కమాట మానవులు నన్ను నానా రూపాల్లో ఆరాధించవచ్చు. ఏ రూపాన కొల్చారన్నది ముఖ్యం కాదు. ఏ దారిన వచ్చినా నన్ను వారు చేరుకోగలరు. అందరికీ ఆదరణ ఉంటుంది, అభయముంటుంది. ఇది జగమెరిగిన సత్యం.

అందరి ఆరాధనాధ్యానాలకు ఆధారం నేనే. 'చిత్తశుద్ధితో నన్నారాధించే వారికెప్పుడూ నే చేరువనే ఉంటాను.' నన్ను పూజించే వారన్నా, నన్నే ధ్యానించే వారన్నా నాకెంతో ఇష్టం. నా అనుగ్రహాన్ని పొందడం అతిసులభం. నువ్వు ఏం చేసినా, ఏం తిన్నా, ఏమిచ్చినా, ఏ పూజాదికాలొనర్చినా భగవత్‌సేవగా బ్రహ్మార్పణగా భావించు, చాలు. అప్పుడిక నీకు మంచిచెడులు, పాపపుణ్యాలు, సమస్త కర్మ బంధాలనుండి విడుదల కలిగినట్లే" అని హితవు చెప్పాడు.

అర్జునుడికి ఇంత కాలం తన మిత్రుడుగా చూస్తున్న కృష్ణుడి నిజతత్త్వంపై సందేహం తలెత్తింది. దీనితో అతడి శక్తి సామర్థ్యాలెట్టివో తెలుసుకోవాలని కుతూహలంతో ప్రాధేయపూర్వకంగా అడిగాడు.

అందుకు కృష్ణుడు "అందరి హృదయాలూ నా నివాసస్థానాలే. సూర్యుడిలోని తేజస్సును నేనే. చుక్కల్లో చంద్రుణ్ణి నేనే. వేదాల్లో సామవేదమూ నేనే. ఇంకా ఇంకా ఎన్నో" అన్నాడు.





"కృష్ణా! అయితే నీ దివ్యరూపాన్ని చూడాలని ఉంది. అందుకు నేను అర్హుడినైతే నాకు దివ్య దృష్టిని ప్రసాదించి, నీ విశ్వరూపాన్ని చూడగల భాగ్యాన్ని కల్గించవా!" అనడిగాడు అర్జునుడు.

కృష్ణుడతడికి దివ్యదృష్టిని ప్రసాదించాడు. నిజరూపంలో సాక్షాత్కరించాడు. ఆ రూపాన్ని చూసి అర్జునుడు నివ్వెరపోయాడు. మరి అర్జునుడు చూసిన విశ్వరూపం ఎలా ఉందంటే:

వేయి సూర్యులొక్కసారి ఉదయించినంతటి వెలుగట. ప్రపంచమంతా ఆ రూపంలో పొదగట్టిందట. కృష్ణుడి ఆ దివ్య మంగళ రూపానికి అర్జునుడు పదే పదే ప్రణమిల్లాడు. చేతులు జోడించి "హే పరంధామా! నీ దేహంలో సకల దేవీదేవతామూర్తుల్ని చూస్తున్నాను. అదుగో బ్రహ్మ, అదుగో ఋషిగణం. నీవో వెలుగుల వెల్లువై కనబడుతున్నావే స్వామీ! కౌరవులరుగో, తక్కిన యుద్ధవీరులూ, భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు మొదలైన వారంతా ఉన్నారు. ఆ? అదేమిటి! అంతా భయంకరంగా ఉన్న నీ నోట్ల ప్రవేశిస్తున్నారే? నీ నోట్లో భగభగ ఆ మంటలేమిటి? అయ్యో, వారంతా ఆ మంటల్లోపడి మాడిపోయేట్లున్నారే! ఏమిటీ వైపరీత్యం. నాకేం బోధపడటం లేదు. నన్నను(గహించవా" అంటూ మొరబెట్టుకున్నాడు.

అందుకు కృష్ణుడు "నువ్వింకా నన్ను గుర్తించలేదా? కాలాన్ని నేను, ప్రళయాన్నీ నేనే, ఈ వీరులందరిని నేను సంహరించడం ప్రారంభించాను. వీరందరూ మరణిస్తారు. ఊ, ఇక లే, అర్జునా! ఈ వీరులు ఇప్పటికే నాచేత నిహతులయ్యారు. ఈ మారణహోమంలో నువ్వు నా పరికర మాత్రానివి. నువ్వు వారిని సంహరించి కీర్తిని గడించు." అర్జునుడికి గొంతు పెగల్లేదు. మాట తడబడింది.

"ఓ పరమాత్మా! సర్వేశ్వరా! సర్వాంతర్యామీ! ప్రభో, జగద్గురూ! నీకివే నా సాష్టాంగవందనాలు స్వామీ! నన్ను కరుణించు. ఇంతకాలం నా మిత్రుడిగా భావించాను. ఎన్నోమార్లు వేళాకోళాలు చేశాను. నీ దివ్వత్వాన్ని తెలియనివాడనై మిత్రుడివి గదా అని చనువు తీసుకునేవాణ్ణి. ఎన్నో కొంటెవేషాలు వేశాను. నా అజ్ఞానాన్ని మన్నించు ప్రభూ. నేనిక నీ దివ్యరూపం ముందు నిలబడలేను. దయచేసి నీ ఎప్పటి రూపాన్నే పొందవా" అంటూ అర్థించాడు.

అప్పుడు కృష్ణుడు తన విశ్వరూపాన్ని ఉపసంహరించుకున్నాడు. ఎప్పటిలాగే అర్జునుడి మిత్రుడుగా రథసారథ్యం చేసే పార్థసారథియైన కృష్ణుడిగా దర్శనమిచ్చాడు.

అప్పటికి అర్జునుడు తెప్పరిల్లుకున్నాడు. "కృష్ణా! నిన్ను నేనెలా పూజించాలో ఆ విధానం చెప్పు" అని అడిగాడు.



అందుకు కృష్ణుడు "భక్తి అనేది అన్నిటికన్నా మిన్న. అది ఉంటే చాలు. నన్ను చేరడం సులభం. భగవంతుడే తమ సర్వస్వమని భావించిన వారికి నా అనుగ్రహం తథ్యం. ఏకాగ్రచిత్తుడవై నీ మనస్సును నాపై నిల్పినపుడు నువ్వు నిస్సందేహంగా నా రక్షణలోనే ఉంటావు. నీ వెన్నంటి నేనుంటాను. అర్జునా! నువ్వు నాకిష్టుడివి కనుకనే నీ కింతగా బోధిస్తున్నాను. నీ విధులన్నిటినీ నా కర్పించి నా శరణు వేడు. దేనికీ పరితపించకు. నీ పాపాల నుండి కాపాడే భారం నాది, కనుకనే నీకీ మహత్తరమైన రహస్యాన్ని వెల్లడించాను" అంటూ హామీ ఇచ్చాడు.

అంతటితో అర్జునుడు ఉబ్బితబ్బిబ్బయి, "ఇక నా భ్రాంతి తొలగిపోయింది. నీ ఆజ్ఞానుసారం పోరాడుతాను" అంటూ గాండీవాన్ని చేతబట్టి యుద్ధసన్నద్ధుడై నిల్చాడు.

## 4
## యుద్ధారంభం

పెద్దలందరూ ఎంతగానో ప్రయత్నించినప్పటికి యుద్ధాన్ని నివారించలేకపోయారు. కురుక్షేత్ర మహాసంగ్రామం ఆరంభమైంది. సింహనాదాలు, శంఖారావాలు, కొమ్మువాద్యాలు, భేరీనినాదాలు, అరుపులు, రణగొణ ధ్వనులు ఇరువైపుల సైన్యంలోంచి పెల్లుబికాయి. మహాబలవంతుడైన భీమసేనుడు సింహగర్జన చేశాడు. అతడి గర్జన అన్నిరకాల ధ్వనుల్ని మించిపోయింది.

మొదట కౌరవసైన్యం కదిలి వచ్చింది. దుర్యోధనుడు శత్రువుపై దండెత్తమని ఆజ్ఞాపించాడు.



అతిబీభత్సంగా ఉన్న పోరాటం... రథం మీద భీష్ముడు, దుశ్శాసనుడు పాండవుల వైపు దూసుకు వస్తున్నారు. ధృష్టద్యుమ్నుడు ముందు నిలువగా పాండవులు విజృంభించి రంగంలోకి ఉరికారు. భీష్ముడు అర్జునుణ్ణి ఎదుర్కొన్నాడు. అర్జునుడుకూడ తన గాండీవ ధనుస్సు నెత్తి భీష్ముణ్ణి ఢీకొన్నాడు. వర్షపాతాన్ని మించి పోయేటట్లు శరపరంపరలు కురిపించారు. సాత్యకి కృతవర్మతోను, అభిమన్యుడు బృహద్బలుడితోను తలపడ్డారు.

బృహద్బలుడు అభిమన్యుడి కవచాన్ని చీరేశాడు. అతడి రథసారథిని పడగొట్టేశాడు. అయినా అభిమన్యుడేమాత్రం గాబరాపడలేదు. బృహద్బలుణ్ణి 9 బాణాలతో గాయపరిచాడు. భీష్ముడు తదితర యోధులంతా అభిమన్యుడి విలువిద్యా ప్రావీణ్యానికి దిగ్భ్రాంతులయ్యారు. 'ఆ తండ్రికి తగిన తనయుడే' అని భీష్ముడు అబ్బురపడుతూండగానే, అభిమన్యుడు మిగుల రోషావేశంతో భీష్ముణ్ణి, ఆయన అనుయాయుల్ని ఒంటరిగా ఎదుర్కొన్నాడు. శల్య, కృతవర్మ, భీష్ములపై విరివిగా బాణాలు గుప్పించి గాయపరిచాడు. అప్పుడు భీష్ముడు తన యావచ్ఛక్తితో ఆ చిన్నవాణ్ణి ఎదిరించాడు.

అభిమన్యుడివల్ల ప్రేరణ కలిగి ఉత్తరుడు తక్షణమే గొప్ప యోధుడిలా విజృంభించాడు. ఏనుగుపై స్వారీ చేస్తూ వచ్చి శల్యుడిపై భయంకరంగా దాడి చేశాడు. ఆ ఏనుగు గుఱ్ఱాన్ని కాళ్ళతో నలిచేస్తూ మృత్యువువాత పడేసింది. శల్యుడు క్రోధావేశుడై చిన్నవాడైన ఆ ఉత్తరుడి గుండెలను గురిపెట్టి బల్లెం విసిరాడు. అది సూటిగా వెళ్ళి గురిపెట్టిన గుండెల్ని చీరేసింది. ఉత్తరుడు నేలకొరిగి మరణించాడు.



విరాటుని మరో కుమారుడు శ్వేతుడు, ఉత్తరుడు మరణించడం చూశాడు. కోపంతో భగ్గుమంటూ రథాన్ని శల్యుడి వైపు పోనిచ్చాడు. అతిరథులైన ఏడుగురు యోధులు శల్యుడికి రక్షణగా ఉన్నప్పటికీ, శ్వేతుడు నిరుత్సాహపడి వెనక్కి తగ్గలేదు. బాణాలు ఆయుధాలు మబ్బుల్లోని మెరపుల్లా శ్వేతుడి మీద కురిశాయి. అయినా వాటినన్నిటినీ అద్భుతమైన చాకచక్యంతో తప్పించుకున్నాడు.

ఇరుపక్షాల్లోని సైనికయోధులు శ్వేతుడి రణకౌశలం చూసి నివ్వెరపోయారు. అది చూస్తూంటే శల్యుడిక మృత్యుకోరల్లో చిక్కుకున్నట్లేనని తోచింది. దుర్యోధనుడు భీష్ముడూ అపాయంలో చిక్కుకున్న శల్యుణ్ణి కాపాడాలని తక్షణం తరలి వచ్చారు. శ్వేతుడు భీష్ముడి ధ్వజాన్ని త్రుంచి అవతల పారేశాడు. ఆయన రథంపైకి ఒక గద విసిరాడు. అది రథాన్ని తుత్తునియలు చేసింది. అప్పుడిక కసితో భీష్ముడు శ్వేతుడి మీదికి ఒక



శరాన్ని వదిలాడు. అది శ్వేతుడి దేహాన్ని చీల్చడంతో మొదటి రోజు యుద్ధంలోనే అతడు నేలకూలి మరణించాడు.

అంతట దుశ్శాసనుడు సంతోషం పట్టలేక కొమ్ముూదుతూ నృత్యం చేశాడు. పాండవుల పక్షానున్న మహాయోధుల్లో శ్వేతుడొకడు. అతడి మరణానికి పాండవులంతా ఎంతో దుఃఖించారు.

భీష్ముడు మళ్ళీ పాండవసేనపై దాడిచేశాడు. అప్పుడు అర్జునుడు ఎదురు నిలిచి పాండవసైన్యం భీష్ముడి వల్ల హతమవకుండా ఆదుకున్నాడు. అప్పటికిక సూర్యాస్తమయమయింది. ఇరుపక్షాలువారు యుద్ధం నిలుపుదల చేశారు. ఆ తీరుగా మొదటి రోజు పోరాటం ముగిసింది. ఆనాటి పోరాటంలో పాండవసేన చాలా నష్టపడింది. ధర్మరాజుకి ఏపాటి సంతృప్తి కలుగలేదు. దుర్యోధనుడు మాత్రం సంతోషంతో పొంగిపోయాడు.

ధర్మరాజు కృష్ణుడితో "వాసుదేవా! భీష్ముడి శక్తి ఎంతటిదో చూశావా? తన బాణ ప్రయోగంతో మన సైన్యాన్ని ఎండుగడ్డిని అగ్ని మసిచేసినట్లు చేసిపారేశాడు గదా! ఈ సంగ్రామ యజ్ఞంలో నా బంధుమిత్ర పరివారాన్ని భీష్ముడి చేతబెట్టి ఇలా బలిచేయడం కంటే అరణ్యానికి పోవడమే మేలనిపిస్తూంది కృష్ణా!" అంటూ వాపోయాడు.

అంతట కృష్ణుడు ధర్మజుణ్ణి ఓదారుస్తూ, "విచారించకు శాంతించు. శిఖండి మీ పక్షాన ఉన్నట్లు నీకు తెలుసుగదా? ఆ శిఖండి భీష్ముణ్ణి వధించునన్న భవిష్యద్వాణి ఉండనే ఉంది గదా! ధృష్టద్యుమ్నుడు మీ పక్షమే. అతడేమో ద్రోణుణ్ణి అంతం చేస్తాడు" అంటూ సమాధానపరిచాడు. మిగిలిన వారంతాకూడ యుధిష్ఠిరుణ్ణి ఉత్సాహపరుస్తూ మాట్లాడి సంతోషం కల్గించారు.

ఆనాటి యుద్ధం గురించి మాట్లాడుకున్నాక అంతా తమ తమ గుడారాలకు వెళ్ళి, మర్నాడు మళ్ళీ ఆ భయంకరమైన పోరు ఆరంభమయ్యేవరకు విశ్రాంతి తీసుకున్నారు.



# 5
# రెండోరోజు యుద్ధం

మొదటిరోజు యుద్ధం ముగిసింది. మర్నాటి యుద్ధానికై పాండవబలం కొత్త వ్యూహ పూనింది.

తరగని ఉత్సాహంతో ధృష్టద్యుమ్నుడు తమ సైన్యానికేవిధంగానూ నష్టం వాటిల్లకుండేటట్లు క్రౌంచపక్షి ఆకారంలో కొత్తరకమైన వ్యూహం మలచాడు. ద్రుపదుడు సేనాసహితుడై తలాపు దిక్కున నిలిచాడు. కుంతిభోజుడు, ఛేది మహారాజు కళ్ళుగాను, మెడభాగంగా సాత్యకి సేన, ధర్మజుడు చంచువుగాను, భీమార్జున అభిమన్యులు శిరోభాగాన నిల్చారు.

దుర్యోధనుడు పాండవుల సైనిక వ్యూహం చూసి, తక్షణమే ద్రోణ కృపాచార్యుల్ని సమీపించి, “పాండవ బలాన్ని పటిష్టంగా అమర్చారు. కాని మన సేన దాన్ని నాశనం చేయటం తథ్యం. మనకి వ్యూహం పన్ని అగ్రభాగాన పురోగామియై నిల్చినవాడు భీష్మాచార్యుడు సామాన్యుడా!” అంటూ తృప్తిపడ్డాడు.

సేనాసహితుడై దేవేంద్ర వైభవంగా తరలివస్తున్న భీష్ముణ్ణి చూసి అర్జునుడి క్రోధం పెల్లుబికింది. కృష్ణుడితో రథాన్ని భీష్ముడి వైపు పోనీమన్నాడు. తాను ఆయన్ని



రణక్షేత్రంలో కలుసుకోవాలన్నాడు. తమ జోలికి వచ్చే లోపల ఆ కురువృద్ధుణ్ణి నేలకూలుస్తానన్నాడు. కృష్ణుడా మాటలన్నీ విని, అలాగేనని అంగీకారాన్ని సూచిస్తూ, “రథం అటు మళ్ళించడం తేలికే, కానీ జాగ్రత్త సుమా” అన్నాడు.

సైనికులు రథపరిరక్షకులై వెంటరాగా అర్జునుడు భీష్ముడి వైపు పయనించాడు. యుద్ధం ప్రారంభమైంది. కురువృద్ధుడైన భీష్ముడు వింటి నెక్కుపెట్టి పాండవులపై కురికాడు. భీమార్జున అభిమన్యులపై బాణవర్షం కురిపించాడు. అప్పుడు అర్జునుడో పది బాణాలు వరుసగా వదిలాడు. ఆ పిదప ఒక్కుమ్మడిగా వెయ్యిబాణాలు గుప్పించి ఆయనపై దట్టంగా వాటితో ఏకంగా వల అల్లేశాడు. కానీ భీష్ముడు తన అమ్ములతో వాటన్నిటినీ చెదరగొట్టేశాడు. ఆ మహావీరులమధ్య హోరాహోరి పోరాటం... ఒకరిని మించి మరొకరు... వెనుకంజే లేదు.

భీష్ముడికి సాయంగా ద్రోణుడు, ఆ పిదప దుర్యోధన జయద్రథులు కూడ తోడై నిల్చారు.

అర్జునుడు మాత్రం ఏమాత్రం చలించకుండా ఒంటరిగానే వారందరినీ ఎదుర్కొంటున్నాడు. బాణాలు రువ్వుతున్నాడు. భీష్మద్రోణుల్ని గాయపరిచాడు.

అర్జునుడొక్కడే ఎవరి సాయం లేకుండా పోరాడటం సాత్యకి పసిగట్టాడు. వెంటనే అతడికి సాయపడేందుకై అభిమన్యుడు, మిగిలిన ఉపపాండవుల్ని వెంటతీసుకు వచ్చాడు. అంతట ద్రోణుడి దృష్టంతా వారిపై కేంద్రీకృతమైంది. ఆ లోపల భీష్ముడు అర్జునుణ్ణి గాయపరిచాడు. అర్జునుడి వింటిని వలయాకారంగా గుండ్రంగా వంచేశాడు. అయినా అర్జునుడు మొక్కవోని సాహసంతో, విషవాయువులు బుసకొడుతూ పడగ విప్పిన తాచుపాములా విరుచుకుపడ్డాడు. కౌరవసైన్యంలోని యోధానయోధులంతాకూడ ఆ ధాటికి హడలెత్తిపోయి గుడ్లు తేలేశారు.



అప్పటికిక సూర్యాస్తమయమైంది. భీష్ముడు చిరునవ్వు నవ్వుతూ ద్రోణుడితో "ఇవాల్టికి పోరు చాలిద్దాం. మన సైనిక దళమంతా అలసి సొలసి, భయభ్రాంతుల చిక్కి ఉంది. అర్జునుడీ వేళ అపర మృత్యుదేవతలా ఉన్నాడు" అన్నాడు. ద్రోణుడు 'నాటికి యుద్ధవిరామం' ప్రకటించాడు. ఇరుపక్షాల సైన్యం యుద్ధం చాలించింది. పాండవుల సైనిక శిబిరంలో ఆనందోత్సాహాలు పెల్లుబికాయి.

## 6
## సంకుల సమరం

మూడవనాడు భీష్ముడు తమ సైన్యాన్ని గరుడ వ్యూహంలో అమర్చాడు. ద్రోణ, కృతవర్మలను నేత్రాలుగాను, భీష్ముడు వెన్నుభాగంగాను, అశ్వత్థామ, కృపుడు పక్షిరాజు శిరోభాగంగాను, జయద్రథుడు అతడి సైన్యం చంచుపుటముగాను ఏర్పడ్డారు. దుర్యోధనుడు అతడి అనుచర బృందంతో వెనుక భాగాన నిలబడ్డాడు.

అర్జునుడు పాండవసేనని అర్ధచంద్రాకారంలో ఆయత్తం చేశాడు. కుడి వైపు భీముడు మిగిలిన వారంతా వేర్వేరు తావుల్లో అర్జునుడి రక్షణలో నిలబడ్డారు.

కొద్దిక్షణాల్లో పోరు ప్రారంభమైంది. రక్తపుటేర్లు ప్రవహించాయి. రథాలు, గుఱ్ఱాలు, ఏనుగులు ఆకాశమంత ఎత్తున దుమ్ములేపుతూ పరుగెడుతున్నాయి. అర్జునుడు భయంకరంగా దండెత్తాడు కానీ భీష్ముడు మడమ త్రిప్పక దృఢంగా నిల్చాడు. కాలయముడల్లే ప్రాణాలు తీసేస్తున్నాడు. అర్జునుడు అమిత క్రోధావేశంతో భీష్ముడిపై కురికాడు. అభిమన్యుడు, సాత్యకి శకునితో కలియబడ్డారు. కౌరవ-పాండవుల మధ్య పోరు క్రమేణా పొగలై రాజుకుని సెగలై పెల్లుబికింది. ఇరువురు ఎవరికివారు ఎదుటి వారిని ఓడించాలనే బింకానున్నారు. రాజులెందరో ఒక్కుమ్మడిగా వచ్చి అర్జునుణ్ణి ఢీకొన్నారు. వారి చేతనున్న ఆయుధాల్ని ఏది ఉంటే దాన్నే క్రోధంతో అర్జునుడి మీదికి విసిరారు.

కానీ అర్జునుణ్ణి అవేం చెయ్యగలవు! ఆకాశంలోంచి, దేవగణమంతా ఆ మహాసంగ్రామాన్ని తిలకిస్తున్నారు. ఆహా ఓహో అని బ్రహ్మాండమని మురిసిపోతున్నారు. భీముడు దుర్యోధనుణ్ణి ఎదుర్కొని ఒక వాడియైన బాణాన్ని దుర్యోధనుడిపై ప్రయోగించాడు. దాంతో అతడు తన రథం మీదే మూర్ఛిల్లాడు. తక్షణమే అతడి రథసారథి రారాజుని యుద్ధరంగం నుంచి అవతలికి తీసుకువెళ్లాడు. అప్పుడిక అతడి వెనకే సైనిక బలాలన్నీ వికలమై పలాయనం సాగించాయి.

తరువాత కొద్దిసేపటికి దుర్యోధనుడు తేరుకుని యుద్ధభూమికి తిరిగివచ్చాడు. కానీ తమ సేనలన్నీ రణరంగం నుంచి పలాయనమైనందుకు నిర్ఘాంతపోయాడు. పాండవుల ధాటికి, విధ్వంసానికి తట్టుకోలేక ఎక్కడలేని రోషావేశాలు ఉప్పొంగగా భీష్మద్రోణుల వద్దకు హటాహుటిని వెళ్లాడు.

"మీరు ఇక్కడుండగా ఇలా జరగటం భావ్యంగా ఉందా? మన సేన పోరాడలేక పారిపోవడం అవమానంగా లేదూ? మీరసలు పాండవ పక్షపాతులేమోనని నా భయం. యుద్ధారంభానికి పూర్వమే మేము పాండవులపై చేయిచేసుకోమని, పోరాడమని చెప్పి ఉండాల్సింది. మీకు, ద్రోణాచార్యుల వారికీ నా పట్ల అనురాగం ఉంటే, మీరిద్దరూ శత్రువులను అంతం చేయండి. శౌర్య సాహసాల్లో మీకు దీటైన వారెవరూ శత్రుపక్షంలో లేరని నే గట్టిగా చెప్పగలను" అన్నాడు.

దుర్యోధనుడి అవాకులు చెవాకులన్నీ విన్న తరువాత భీష్ముడు నవ్వి, అతడితో "నువ్వు శాంతి మార్గాన్ని విడిచిపెట్టి యుద్ధాన్ని చేపట్టేవు. వారికక్కడ కృష్ణుడి ఆధిపత్యం ఉంది. అటువంటప్పుడు పాండవుల్ని దేవతలు దిగివచ్చినా ఓడించలేరన్నది ఖాయం. నువ్వేమో

మమ్మల్ని అర్థంచేసుకోక, మాట్లాడుతున్నావు. నేను నా యావచ్ఛక్తిని వినియోగించి, నా కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూనే ఉన్నాను. నేనా వృద్ధుణ్ణి, అయినా శక్తినంతా ధారపోసి, శాయశక్తులా పోరాడుతున్నాను. నీ సైనికుల్ని వాళ్ళేం చేస్తున్నారో, నేనూ అలాగే వారి సేనని గాయపరచి చెదరగొడుతున్నాను” అన్నాడు.

నాటి యుద్ధంలో పాండవులు మొదటి భాగం పోరుగెల్చారు. భీష్ముడు మాత్రం నూతనోత్తేజంతో మదించిన ఏనుగులా పాండవసేనపై కురికాడు. అది మధ్యాహ్న సమయం. ఇంకా అరపూట భీష్ముడితో తలపడాలి. అంతలో రక్తపుటేరు ప్రవహించసాగింది. రణభూమిలో ఎక్కడ చూసినా భీష్ముడే, సుడిగాలల్లే వీరవిహారం సాగిస్తున్నాడు.

భీష్ముడి స్వైరవిహారాన్ని చూసి కృష్ణుడు అర్జునుడితో “ధనంజయా! ఇదుగో చూడు నీకిది పరీక్షాసమయం ఆసన్నమైంది. భీష్ముడు, ద్రోణుడు మొదలైన పెద్దల్నికూడ సమయం వస్తే చంపక మాననని శపథం చేశావు. ఇప్పుడిక నీవన్న ఆ మాట నిలబెట్టుకోవాల్సిన తరుణం వచ్చేసింది. లేకపోతే మన సైన్యం నిబ్బరం కోల్పోయే ప్రమాదముంది. వారు అధైర్యపడిపోతారు. వెనకా ముందూ చూడక భీష్ముణ్ణి ఎదిరించాలి” అంటూ హెచ్చరించాడు.

అర్జునుడు తమ రథాన్ని భీష్ముడి వైపు పోనీమన్నాడు. అర్జునుడి రథం భీష్ముడి వైపు మళ్ళడమే తరువాయన్నట్లు భీష్ముడు బాణాలు గుప్పించి యుద్ధవిధానంగా స్వాగతం చెప్పాడు. అర్జునుడు మాత్రం మూడేమూడు బాణాలు ప్రయోగించి భీష్ముడి ధనుస్సును ముక్కలు చేశాడు. అంతట గాంగేయుడు మరో విల్లు నందుకుని ఎక్కుపెట్టాడుగానీ అదీ తుంపులైపోయింది. అర్జునుడి ధనుర్విద్యా నైపుణ్యాన్ని భీష్ముడెంతో మెచ్చుకొంటూ ‘వీరయోధుడా రా’ అంటూ మరో విల్లందుకుని అర్జునుడి రథం మీద గురితప్పకుండా బాణ వర్షం కురిపించాడు.

భీష్ముడంటే అర్జునుడికి వల్లమాలిన గౌరవం కావడంతో కావాలనే దెబ్బకు దెబ్బతీయకుండా వెనక్కు తగ్గుతున్నట్లు కృష్ణుడు పసిగట్టాడు. ‘ఇక ఈ పద్ధతే కొనసాగించాడంటే, పాండవసేన క్రమశిక్షణ కోల్పోతుంది. ఇక ఉన్నది కాస్తకూడ దక్కకుండా పోతుంది’ అని అతడు మనసులో పర్యాలోచిస్తూ ఉండగా, భీష్ముడు మరికొన్ని బాణాలు వదిలాడు. అవి కృష్ణార్జునులిరువుర్ని గాయపరచాయి.

భీష్ముడు ఆవేశంతో ఎడతెరిపి లేకుండా బాణవర్షం కురిపిస్తూండటం, అర్జునుడు వాటికి బదులుగా సాధారణమైన బాణాలు వదిలి ప్రతిఘటిస్తూండటం కృష్ణుడు కనిపెట్టాడు. పాండవ సేనకు ముప్పు తప్పదు, చిక్కుల్లో పడుతుంది అనుకుంటూండగా పాండవసైన్యం చెల్లాచెదరైపో సాగింది. కృష్ణుడు అతిచాకచక్యంగా రథాన్ని నడిపిస్తున్నా భీష్ముడి బాణాలు ఇరువుర్ని మాటిమాటికి గాయపరుస్తున్నాయి. అతడికి పట్టరానికోపం వచ్చింది. అర్జునుడితో “అర్జునా! నేనిక ఎక్కువసేపు ఓపికపట్టదల్చుకోలేదు. నువ్వు చెయ్యకపోతే నేనే భీష్ముణ్ణి తుదముట్టిస్తా” నంటూ చేతిలోని పగ్గాల్ని వదలిపెట్టి, చక్రాయుధం చేతబట్టి రథం మీదనుంచి కిందికురికాడు. భీష్ముడి వైపుకి దూసుకు వెళ్ళాడు. కానీ భీష్ముడు కంగారు పడలేదు, సరికదా ఆనందంలో మునిగిపోయాడు. వింటిని ఆవలకు విసిరేసి, చేతులు జోడించి “రా... రావయ్యా దేవాధిదేవా! నీకు వంగి నమస్కరిస్తున్నాను. ఓ మాధవా! నా కోసం రథం దిగి ఇక్కడికి వచ్చావా? నీ చేతుల్లో నాకు మరణంప్రాప్తిస్తే అది నా మహద్భాగ్యమనుకుంటా స్వామీ! అది అత్యున్నత పదవినందుకున్నట్లే. ముల్లోకాలలోను నాకు ఖ్యాతి దక్కుతుంది. ఆ వరం ప్రసాదించు”అని వేడుకున్నాడు. అర్జునుడదంతా చూశాడు. అతడి మనస్సెంతో కలతపడింది. రథంనుంచి దూకి పరుగున పోయి కృష్ణుడి చేయిపట్టుకుని బలవంతాన అతణ్ణి

వెనక్కిలాక్కునివచ్చాడు. అర్జునుడు తల వంచి నమస్కరించి "జనార్దనా! నీ కోపం చల్లారాలి. నా శపథాన్ని నెరవేరుస్తానని ఇదుగో ప్రమాణం చేసి చెబుతున్నా కౌరవుల్ని తప్పక నాశనంచేసి తీరుతాను"అని దృఢంగా చెప్పాడు. అంతటితో కృష్ణుడు తృప్తిపడి రథమెక్కాడు. పగ్గాలు చేతపుచ్చుకున్నాడు. తన పాంచజన్యమనే శంఖాన్ని పూరించాడు. ఆ ధ్వనికి నాలుగు దిక్కులు మార్మోగాయి. భీష్ముడు భూరిశ్రవసుణ్ణి వెంటదీసుకుని, బాణాలు చేతబట్టి, నక్షత్రకూటాన్ని నాశనంచేసే తోకచుక్కలా, అర్జునుడిపైకి ఉరికి ఈటెనొకదాన్ని పార్థుడి మీదికి విసిరాడు. ఆ విధంగా సమరం ఎంతోసేపు కొనసాగింది. అర్జునుడు ఇంద్రాస్త్రాన్ని ప్రయోగించి కౌరవ సేనలో ఎక్కువ భాగాన్ని నాశనం చేశాడు.

సూర్యాస్తమయం అయ్యే వేళయింది. భీష్మద్రోణులు సైనికులకు యుద్ధం విరమించవలసిందిగా ఉత్తర్వులిచ్చారు. మూడవనాటి పోరు ముగిసింది. దుర్యోధనుడు నిరాశాపూరితుడైనాడు. అర్జునుడి భయంకర రూపాన్నతడానాడే చూశాడు. ఈనాటి పోరాటంలో అర్జునుడు పదివేలమంది యుద్ధవీరుల్ని, ఏడువేల ఏనుగుల్ని హతమార్చాడు. అసాధారణమైన సాహసకార్యం. అంతటి ఘనకార్యం ఎవ్వరివల్ల కాదు సుమా, అంటూ కౌరవవీరులు చెప్పుకోసాగారు.

## 7
## భగదత్తుడి పరాక్రమం

నాల్గవనాడు క్రుద్ధుడైన భీష్ముడు పెద్దసంఖ్యలో సైనికబలాన్ని వెంట దీసుకుని శత్రుసేనల్ని ఎదుర్కొనడానికి వెళ్ళాడు. ద్రోణుడు, దుర్యోధనుడు ఇంకా మరికొందరు ఆయనతోబాటు బయల్దేరారు. భీష్ముడు మొదట అర్జునుడి వైపు నడిచాడు. యుద్ధం ఆరంభమైంది. అశ్వత్థామ, భూరిశ్రవసుడు, శల్యుడు అభిమన్యుని చుట్టుముట్టి అతణ్ణి ఎదుర్కొన్నారు.

అంతటి వీరులు ఒక్కుమ్మడిగా వచ్చి ఆ చిన్నవాడిపై ఆక్రమణ చేయడం, అతడు శౌర్యంతో వారి నెదిరించడమూ అర్జునుడు తిలకించాడు. యుద్ధ రంగంలో ప్రవేశించాక తండ్రి కుమారుడనే తారతమ్యం



ఉండదు. అంతలో త్రిగర్తులొచ్చి అర్జునుణ్ణి ఎదుర్కొన్నారు. వెంటనే ధృష్టద్యుమ్నుడు అర్జునుడికి చేదోడై వచ్చాడు. యుద్ధం కొనసాగుతూనే ఉంది. శల్యుడు ధృష్టద్యుమ్నుడి వింటిని త్రుంచేశాడు. అభిమన్యుడది చూసి వెంటనే శల్యుడిపై బాణవర్షం కురిపించి, ఎంతటి అపాయంలో పెట్టాడంటే, దుర్యోధనుడు అతడి సోదరులంతా పరుగునవచ్చి శల్యుడికి సాయపడాల్సి వచ్చింది. దుర్యోధనుణ్ణి, అతడి తమ్ముల్నందరిని ఒకచోట చూడగానే భీముడు ఉప్పొంగిపోయాడు.

దుర్యోధనుని చూస్తున్నప్పుడు భీముడికి అతణ్ణి అంతం చేసెయ్యాలనిపించి గద ఎత్తాడు. రారాజు సోదరులు అది చూసి హడలెత్తిపోయారు. అదే సమయాన మగధరాజు సేనాసమేతుడై భీముడిపై కురికాడు. అభిమన్యుడు మగధరాజు ఏనుగును చంపి, అతణ్ణి ముందంజ వేయకుండా ఆపాడు. దానితో అభిమన్యుడు మగధరాజుల మధ్య అతిభయంకరమైన పోరాటం చెలరేగింది. అభిమన్యుడు ఒక వాడి బాణాన్ని వదిలి మగధరాజు తలను తెగేశాడు. దాంతో కౌరవసైన్యంలో పెద్ద కలకలం బయల్దేరింది. అదను చూసి అర్జునుడు మహోద్రేకంతో కౌరవసైన్యంతో కలియబడి వేలాది సైనికులను చీల్చి చెండాడాడు.

భీముడు చేత గద పుచ్చుకుని యుద్ధరంగం చుట్టూ మృత్యుదేవతలా స్వైరవిహారం చేయసాగాడు. గజ బలమంతా చెల్లాచెదరై దిక్కుతోచక వడివడిగా పరుగుదీసింది. కురుసైన్యమంతా భీముడికి జడిసి పిక్కబలం చూపింది. భీముడేమో యుద్ధం చెయ్యాలనే దూకుడులో ఉన్నాడు. ఏనుగుల గుంపులో సింహంలాగా, అతడు యుద్ధరంగంలో వీరాంగలువేస్తూ తాండవం చేస్తున్నాడు.

గజబలంతో భీముడి పోరాటం చూస్తూంటే ఇంద్రుడు, ఎగిరే పర్వతాలతో పోరాడుతున్నట్లుంది. హతమైన ఏనుగులన్నీ రణభూమిలో ఆయెత్తు కొండలల్లే పడిపోయాయి. భీతాత్ములై పలాయితులైనవారంతా ఎక్కడికక్కడ సేనాసమేతంగా మృత్యువాతపడ్డారు. భీముడు తన రథసారథితో "విశోకా! చూస్తూండు ఇదే.. మనకు అపూర్వావకాశం. ఇక ధృతరాష్ట్ర సుతులంతా వరుసపెట్టి చెట్టున పండినపళ్ళు రాలినట్లు నా ముందు రాలిపడతారు చూడు. పగ్గాలు గట్టిగా పట్టుకో రథాన్ని పోనియ్యి, నేనిప్పుడు ఆ దుష్టులందరిని తుదముట్టించాలి" అంటూ వారిపై దారుణంగా ఆక్రమణ చేశాడు. ఎనిమిది మంది దుర్యోధనుని సోదరుల్ని హతమార్చాడు. భీముడు చేస్తున్న విధ్వంసకాండని భీష్ముడు చూశాడు. ద్రోణుడితో "రగులుతున్న క్రోధాగ్నితో భీముడు శక్తిమంతులైన ధార్తరాష్ట్రుల్ని చిత్రహింస చేస్తున్నాడు. అందరిని అంతం చేసేలోపల ఎలాగైనా అడ్డుకోవాలి" అని అంటూండగానే భగదత్తుడు తన మదగజాన్నధిరోహించి వచ్చి భీముణ్ణి ఎదుర్కొన్నాడు.

ఆ ఏనుగు నిజంగా పాండవుల్లో యముణ్ణి చూసినంత భీతిని కలిగించింది. వారి కాళ్ళకింది భూమి కదిలి పోయినట్లనిపించింది. పాండవ పక్షాన ఉన్న యోధాగ్రేసరులంతాకూడ ఆ పెద్ద జంతువు చేస్తున్న అల్లకల్లోలాన్ని తట్టుకోలేక, గెలవడం అసాధ్యమే ననుకున్నారు. వారి గుండె గుభేలుమంది. అటువంటి మదపుటేనుగు మీద ఆసీనుడై భగదత్తుడు భీముడిపై ఒక ఈటె గురిపెట్టి విసిరాడు. అది వచ్చి అతడి వక్షస్థలాన్ని తాకింది. ఆ బాధ భరించలేక అతడు మూర్ఛిల్లాడు. అంతా చెప్పలేనంత ఆనందం పొందారు. భగవత్తుడు సింహంలా గర్జించాడు.



తన తండ్రి పరిస్థితిని గమనించి ఘటోత్కచుడు తక్షణమే ఆ ప్రదేశానికి పరుగిడి భగదత్తుడిపై విరుచుకుపడ్డాడు. మాయాజాలాలు, యుక్తులు పన్నాడు, ప్రయోగించాడు. అతడు చూస్తూ చూస్తుండగానే ఆకాశంలోకి మాయమయ్యాడు. కొంతసేపటికి తిరిగి వచ్చాడు. ఆ పిదప ఒక మదగజంపై అధిరోహించి, తన మాయాశక్తుల్ని ప్రయోగించాడు. మరోమూడు మదగజాలు అతని వెంట రాసాగాయి. అవన్నీ భగదత్తుడి ఏనుగుని ఢీకొన్నాయి. ఘటోత్కచుడి మదగజాల ధాటికి భగదత్తుడికి తట్టుకోవడం సాధ్యంకాలేదు. ఘటోత్కచుడి బాణాల ధాటికి, మదపుటేనుగులు కుమ్మడం తాకిడిని అతడు భరించలేకపోతున్నాడు. అంతలో గాయపడ్డ ఏనుగు ఘీంకారాన్ని విని భీష్ముడు, ద్రోణ దుర్యోధనులతో "మహాశక్తిమంతుడైన భగదత్తుడు అపాయంలో చిక్కుకున్నట్లు తోస్తూంది. ఘటోత్కచుడికి పట్టు చిక్కాదేమో" అంటూన్న భీష్ముడి మాటలు విన్న యోధులూ, మహారాజులంతా కూడా ద్రోణుడి ఆధిపత్యంలో భగదత్తుడికి సాయపడేందుకై సత్వరం బయల్దేరారు.

ధర్మజుడు తన బలాన్ని తోడ్కొని ఘటోత్కచుణ్ణి కాపాడేందుకై తరలి వెళ్ళాడు. కొద్ది క్షణాల్లోనే భీముడు తెప్పరిల్లుకున్నాడు. భీముడు ఘటోత్కచునికి ఊతగా నిలిచాడు. ఆ ఇరువురు చేదోడువాదోడై ఉండటాన్ని చూసిన భీష్ముడు మళ్ళీ ద్రోణుడితో



"ఈ తండ్రీ కొడుకులిద్దరూ ఒకచోట చేరి పోరితే మనకి క్షేమం లేదనిపిస్తోంది. ఈ స్థితిలో వారి ఎదుట ఇంద్రుడైనా సరే నిలబడి ఎదుర్కోలేడు. అందుకని మన సైన్యాన్ని ఈ తరుణంలో వారి క్రోధాగ్నికి ఆహుతి కాకుండా రక్షించుకోవడం ఉత్తమం. సూర్యాస్తమయం కానున్నదదిగో ఆ వంకన నేటికి యుద్ధం ఆపడం క్షేమం" అని సలహా ఇచ్చాడు.

దుర్యోధనుడు తన సోదరుల మరణంతో శోకాకులచిత్తుడై గతాన్ని నెమరువేసుకుంటూ, భీష్ముడి దగ్గరికి వెళ్ళి, ప్రక్కనే చతికిలబడి, ఆయనతో "పితామహా! నువ్వు మహాయోధుడవన్న సంగతి ఈ లోకానికంతా తెలుసు. నీవంటి యోధాగ్రేసరులే ద్రోణ, కృప, అశ్వత్థామ మొదలైనవారూను. మీలో ఏ ఒక్కరు తలపడినా పాండవ సైన్యమంతా ఏకమై ఎదిరించినా నిలువలేదు. అటువంటప్పుడు నిత్యమూ పాండవుల చేతుల్లో మన సైన్యానికే ఓటమి కలుగుతూందంటే దీని వెనకేదో మాయాజాలమున్నట్లుంది" అని అన్నాడు. భీష్ముడందుకుని "నా మాటలు సావధానంగా విను. నీ మంచి కోరి ఇంతకుపూర్వం అనేకమార్లు నీతో చెప్పడమైంది. అయితే నువ్వు పెడచెవినబెట్టావు. పాండవులు గుణవంతులు. వారిని జయించగలవారెవ్వరూ లేరు. వారికి స్వయంగా కృష్ణుడే అండగా నిలిచాడు. అటువంటప్పుడు 'గెలుపు' గురించి నీవాశించేందుకేముంది? శాంతికై ఆశించు. ఇప్పటికీ మించిపోలేదు. కృష్ణార్జునులిద్దరు నర-నారాయణులే గానీ వేరుకారని నీకిప్పటికే తెలుసుగదా! కృష్ణుడికి పాండవులపై వల్లమాలిన అపేక్ష. ఇకమీదటైనా శాంతికాముకుడవైతే, పాండవుల సాయంతో నీవీ జగత్తునంతా ఏలగలవు" అంటూ హితవు పలికాడు.

కానీ దుర్యోధనుడు మాత్రం ఆ కురువృద్ధుడి సలహాను వినే స్థితిలో లేడు. అంతటితో ఆయన దగ్గర సెలవు పుచ్చుకుని తన గుడారానికి తిరిగి వెళ్ళిపోయాడు.

## 8
## దుర్యోధనుడి విషాదం

మరునాడు యుద్ధం ఆరంభం కానుంది. భీష్ముడు కౌరవబలాన్ని మకరవ్యూహంగా మలిచాడు. అర్జునుడు, ధృష్టద్యుమ్నుడు, ధర్మరాజు తమ సైన్యాన్ని పక్షి ఆకారంలో అమర్చారు. భీముడు చంచువుగా పక్షి ముక్కువద్ద నిల్చాడు. శిఖండి ధృష్టద్యుమ్నుడు కళ్ళుగాను, సాత్యకి పక్షి తలగాను, అర్జునుడు దాని మెడభాగం గాను, అభిమన్యుడు మూపుగాను, ధర్మరాజు మరి నకుల సహదేవులు రెక్కలుగాను ఏర్పడ్డారు.

భీష్ముడు యుద్ధారంభం చేశాడు. వింటి నెక్కుపెట్టాడు. వరుసగా వాడియైన బాణాలు గుప్పిస్తున్నాడు. పాండవసేనని భీష్ముడి బాణాల తాకిడి ఉక్కిరి బిక్కిరి చేస్తూంది. తక్షణం భీముడు భీష్ముడి ఎదురొచ్చి నిలవాలని నిర్ధారించుకున్నాడు. అర్జునుడు భీముడికి సాయపడేందుకై ఆతురుడై నిల్చాడు. భీష్ముడు అపరిమితమైన బలంతో మిక్కిలి శక్తిమంతమైన ఆయుధాల్ని ప్రయోగించి పాండవసైన్యాన్ని కలవరపరిచాడు. అర్జునుడు అందుకు తగువిధంగా భీష్ముడికి బదులివ్వడమూ జరిగింది.

కౌరవసైన్యంలో ఎక్కువ భాగాన్ని అర్జునుడు హతమార్చాడు. దుర్యోధనుడికి ఎక్కడలేని దిగులు అలుముకుంది. క్రితం రోజు జరిగిన సోదరుల మరణం గుర్తుచేసుకుని మరింత విషాదపూరితుడయ్యాడు. ద్రోణుణ్ణి సమీపించి, "ఆచార్యా! మీరెన్నటికీ మా శ్రేయోభిలాషులు. మిమ్మల్ని, భీష్మపితామహుణ్ణి నమ్ముకునే మేమీ యుద్ధంలో తప్పక గెలుస్తామనే ఆశతో ఉన్నాం. అతిరథ మహారథులందరు వచ్చినా విజయం మనదేనని దృఢవిశ్వాసంతో ఉన్నాం. అందువల్ల దయచేసి పాండుపుత్రుల్ని హతమార్చే విధానం దృష్టిలో ఉంచుకుని పోరాడవలసిందిగా కోరుతున్నాను" అన్నాడు. అందుకు ద్రోణుడు గట్టిగా గద్దిస్తూ, చీవాట్లుపెడుతూ "మూర్ఖంగా

మాట్లాడకు దుర్యోధనా! మా సమస్యేమిటో తెలీకుండా మాట్లాడుతున్నావు. పాండవులతో శక్తి వంచనలేకుండా పోరాడుతూనే ఉన్నాం. వారు అజేయులు" అంటూనే ద్రోణుడు పాండవ సైన్యం వైపు అమాంతం ఉరికాడు. అతణ్ణి ఎదుర్కొనేందుకు సాత్యకి అక్కడ సంసిద్ధుడై ఉన్నాడు. వారి మధ్య భయంకరమైన పోరాటం జరిగింది. భీముడు సాత్యకికి సహాయమై వచ్చాడు. పోరాటం మరింత తీవ్రరూపం దాల్చింది. ద్రోణుడు, భీష్ముడు మరియు శల్యుడు ముగ్గురు ఏకమై భీముడిపై దండెత్తారు. అప్పుడు మహాబలవంతుడైన విలుకాడు శిఖండి భీష్మద్రోణులపై కలియబడ్డాడు.

భీష్ముడు శిఖండిని తప్పించుకున్నాడు. ద్రోణుడు భీష్ముణ్ణి శిఖండి బారినుంచి రక్షించాడు. ద్రోణుడి తాకిడికి శిఖండి తట్టుకోలేక వెనక్కు తగ్గాడు. కౌరవ పాండవుల మధ్య జరిగిన పోరాటంలో నెత్తుటేర్లు ప్రవహించాయి.

మధ్యాహ్న సమయాన దుర్యోధనుడు బ్రహ్మాండమైన సైన్యాన్ని సాత్యకిపై దాడికి పంపాడు. కాని సాత్యకి తనతో తలపడిన సైన్యాన్నంతా పూర్తిగా నేలకూల్చాడు. పైగా భూరిశ్రవసుని ఎదుర్కొన్నాడు. సాత్యకి భూరిశ్రవసుల నడుమ భీషణ సంగ్రామం జరిగింది. భూరిశ్రవసుడు సాత్యకి పదిమంది తనయుల్ని నిర్దాక్షిణ్యంగా వధించాడు. దానితో, సాత్యకిలో క్రోధం, విషాదం ఉవ్వెత్తున లేచాయి. భూరిశ్రవసుని కడతేర్చాలనే ఆవేశంతో రథాన్ని తీవ్రవేగంతో ముందుకురికించాడు. ఆ ఇరువురి మహాయోధుల రథాలు ఒకదాన్నొకటి ఢీకొన్నాయి, తునాతునకలై పోయాయి. ఆ తరుణాన భీముడు వడివడిగావచ్చి సాత్యకిని బలవంతాన తన రథంపై ఎక్కించుకు తీసుకుపోయాడు.

ఆ రోజు అర్జునుడు వేలాది శత్రు సైన్యాన్ని తుదముట్టించాడు. సూర్యాస్తమయం కాగానే యుద్ధవిరమణ జరిగింది. పాండవ పక్షాన వచ్చిన మహారాజులంతా అర్జునుడికి ఘనస్వాగతం పలికారు. ఇరుపక్షాల సైనికులు తమతమ శిబిరాలకు చేరి విశ్రమించి అలసట తీర్చుకున్నారు.

## 9
## భీమ - సుయోధనుల పోరాటం

ప్రొద్దు గూకింది. చీకటి పడింది. యథాప్రకారం కౌరవ పాండవులు విశ్రాంతి తీసుకుని మర్నాడు మళ్ళీ యుద్ధభూమికి తరలి వచ్చారు. అవే మకర క్రౌంచ వ్యూహాలు అమర్చారు. క్రితంరోజు లాగానే హోరాహోరీ పోరాటం ప్రారంభమైంది. భీముడు అగ్రగామియై వచ్చి ద్రోణుడి రథ సారథిని వధించాడు. అంతట ద్రోణుడు స్వయంగా ఒకచేతితో పగ్గాలుపట్టి మరోచేత విల్లందుకుని బ్రహ్మాండంగా పోరు సాగించి విధ్వంసం చేస్తున్నాడు. భీముడు, సుయోధనుడు అతడి సోదరులకోసం గాలిస్తున్నాడు. కానీ, ఎక్కువ శ్రమపడకుండా వారే త్వరపడి వచ్చి అతణ్ణి చుట్టుముట్టారు. కౌరవసోదరులు పెద్ద సంఖ్యలోనే ఒక్కుమ్మడిగా భీముణ్ణి ఎదుర్కొన్నారు. భయమనేది ఎరుగని భీముడు ఒంటరిగా వారి నెదుర్కొనేందుకు సంసిద్ధుడై నిలిచాడు. కురువీరులు అతణ్ణి బందీచేయాలని శతవిధాల యత్నిస్తున్నారు. భీముడు వారందర్నీ ఒకేసారి తుదముట్టించాలనే ఆలోచనలో ఉన్నాడు. యుద్ధం భయంకర రూపం దాల్చింది. భీముడికి తన రథ వేగం చాలినంత తృప్తిగా లేకపోవడంతో ఇక ఉండబట్టలేక, చేత గద పుచ్చుకుని రథం నుంచి కిందికి ఒక్కదూకు దూకాడు. తన రథసారథితో "ఓ విశోకా! నే వచ్చేవరకూ ఇక్కడే ఆగు. నేపోయి వారందర్నీ హతమార్చి వస్తాను" అంటూ కౌరవుల వైపు ఉరికాడు. దారి పొడుగునా గుఱ్ఱాల్ని రథసారథుల్ని రథాల్ని నేలకూలుస్తూ ధార్తరాష్ట్రులున్న చోటికి దారితీశాడు. వారి వినాశాన్ని వెంటబెట్టుకు మరీ వెళ్ళాడు.

భీముడి రథం కదలకుండా ఒకచోట నిల్చి ఉండటాన్ని దూరంనుంచి ధృష్టద్యుమ్నుడు పసిగట్టాడు. భీముడికి సాయపడేందుకై వెంటనే ముందుకు ఉరికాడు. కానీ అక్కడతడు లేకపోవడం చూసి నిశ్చేష్టుడయ్యాడు. కన్నీరుకారుస్తూ రథసారథిని "ఓ విశోకా! నా

ప్రాణాధికుడైన భీముడేమయ్యా"డని ప్రశ్నించాడు. నిజంగా భీముడికేదో హాని జరిగిపోయిందనే ధృష్టద్యుమ్నుడు ఊహించాడు. అప్పుడు విశోకుడు "భీముడు శత్రువుల్ని చెండాడేందుకై చేత గదపూని మరీ వెళ్ళా"డని విషయం వెల్లడించాడు. ధృష్టద్యుమ్నుడు తక్షణమే రథాన్ని శత్రుసైన్యం వైపు మళ్ళించి, భీమసేనుడి జాడ కనుక్కునేందుకు వెంబడించి వెళ్ళాడు. అదే భీముడు వెళ్ళిన దారి అని తెలుసుకుందుకు గుర్తుగా ఎటుచూసినా మృతుల కళేబరాలు, అవయవాలన్నీ చెల్లాచెదరై పడి ఉన్న ఏనుగులూను. భీముణ్ణి శత్రువులంతా చుట్టుముట్టి రథంపైనుండి పోరాడటం చూడగానే ధృష్టద్యుమ్నుడు అతణ్ణి వాటేసుకుని తీసుకుపోయి రథమెక్కించి పోనిస్తూ అతడి శరీరంలో దిగిన బాణాలన్నిటిని తీయసాగాడు. అంతట దుర్యోధనుడు భీమ-ధృష్టద్యుమ్ను లిరువురిని ఎదుర్కోమని యోధుల నాజ్ఞాపించాడు. ఆ సమయాన ద్రోణ-ద్రుపదుల నడుమ పోరాటం సాగుతూంది. ద్రోణుడు ద్రుపదుణ్ణి తీవ్రంగా గాయపరిచాడు.

ధృష్టద్యుమ్నుడికి, భీముడికి కూడ అంతటి అపార శత్రుసైన్యంతో తలపడేందుకు ఆత్మవిశ్వాసం రవంత సడలినట్లు తోచింది. అప్పుడిక ధృష్టద్యుమ్నుడు 'ప్రమోహన'మనే ఒక శక్తిమంతమైన అస్త్రాన్ని ప్రయోగించి శత్రువుల్ని మూర్ఛిల్లజేశాడు. ద్రోణుడది చూసి తక్షణం మరింత శక్తిమంతమైన అస్త్రంతో వారిని మూర్ఛనుంచి తేర్చాడు. అదే తరుణాన అభిమన్యుడు భీముడికి సాయమై తమ పక్షాన్ని బలపరచేందుకై వచ్చి చేరాడు. దాంతో భీముడికి నిబ్బరం చేకూరింది. మళ్లీ నూతన శక్తి పుంజుకుని శత్రువులతో తలపడేందుకు సంసిద్ధుడయ్యాడు. ఏమైనప్పటికి ఆనాడు ద్రోణుడు మాత్రం మహా ఉద్ధతంగా ఉన్నాడు. ధృష్టద్యుమ్నుడి రథసారథిని, గుఱ్ఱాల్ని కూల్చేశాడు. అప్పుడిక ధృష్టద్యుమ్నుడికి అభిమన్యుడి రథమే శరణ్యమైంది.

భీమ-దుర్యోధను లిరువురూ ముఖాముఖి ఎదురయ్యారు. మామూలు ధోరణిలో పరస్పరం దుర్భాషలాడుకున్నారు. బ్రహ్మాండంగా బాణయుద్ధం ప్రారంభమైంది. ఆఖరికి దుర్యోధనుడు మూర్ఛిల్లి రథం మీదే ఒరిగిపోయాడు. జయద్రథుడతణ్ణి రణక్షేత్రంనుంచి తప్పించి తీసుకువెళ్లాడు. అంతటితో నాటి యుద్ధానికి విరామం. యుధిష్ఠిరుడు ఆనాడు తమ పక్షం ప్రదర్శించిన బలపరాక్రమాలకి ముగ్ధుడైనాడు.

దుర్యోధనుడి శరీరమంతా గాయపడింది. విపరీతంగా బాధపడుతూనే భీష్ముణ్ణి సమీపించి, వినయంగా ప్రణమిల్లి ఆనాడు జరిగినదంతా ఏకరువు పెట్టసాగాడు. వ్యక్తిగతమైన ముఖ్యంగా అతడి ఓటమి అతణ్ణి అమితంగా వేధించింది. దాంతో "నువ్వు ఆ పాండవులందరిని తక్షణం హతమార్చాలి. వాళ్ళు పోతేగానీ నాకు శాంతి లేదు" అని ఎంతో అక్కసుపడ్డాడు.

భీష్ముడతణ్ణి ఓదారుస్తూ "ఓ దుర్యోధనా! ఎందుకంత త్వరగా అధైర్యపడిపోతావు? మేమంతా లేమా.. ద్రోణుడు, శల్యుడు, శకుని, కృప, అశ్వత్థామ ఇంకా ఎంతోమంది హేమాహేమీలున్నారే వారంతా తమ ప్రాణాలొడ్డి పోరాడేందుకు సంసిద్ధులై ఉండగా అనవసరంగా నీవెందుకంతగా కలవరపడతావు చెప్పు. మేమంతా శక్తివంచన లేకుండా తోడ్పడుతున్నాం గదా. కాబట్టి అధైర్యం వీడు, యుద్ధంలో జయాపజయాలు సహజం. ఏవో ఎగుడుదిగుళ్ళు క్రిందు మీదు లైనంత మాత్రాన మన ధైర్యాన్ని సడలనీయరాదు సుమా" అంటూ అనునయించాడు.

## 10
## భీష్ముడు అజేయుడు

మరుసటి రోజున కౌరవసైన్యం మండల వ్యూహంగా వలయాకారంలో అమర్చబడింది. బ్రహ్మాండమైన ఆ సేన నడుమ దుర్యోధనుడు ఇంద్రుడంతటి ఠీవిగా నిలబడ్డాడు.

యుధిష్ఠిరుడు అర్జునుణ్ణి తమ సైన్యాన్ని బలమైన వజ్ర వ్యూహంలో నిలపమన్నాడు. యుద్ధం ప్రారంభమైంది. చాలాచోట్ల యోధానుయోధులంతా పోరాడుతున్నారు. ద్రోణుడు, విరాటుడు ఒకచోట, భీష్ముడు అర్జునుడు మరోచోట, మరో రంగంలో శిఖండి అశ్వత్థామ భయంకరంగా పోరుసల్పుతున్నారు. దుర్యోధన ధృష్టద్యుమ్నులు ఢీకొంటున్నారు. ఏడవనాటి సమరంలో విరాటుడి మూడో కొడుకు సంగుడుకూడ ద్రోణుడి చేతిలో హతుడయ్యాడు. అశ్వత్థామ శిఖండిని ఓడించాడు.

అశ్వత్థామ తన రథాన్ని తునాతునకలు చేయగా శిఖండి తన రథం నుంచి దూకి విచ్చుకత్తి డాలు చేతపట్టి నిలవగా, అంతట అశ్వత్థామ ఆ కత్తికో బాణాన్ని గురిపెట్టివేసి ఖండించి పారేశాడు. అంతట శిఖండి విరిగిపోయిన మొండికత్తిని గిరుగిర్రున త్రిప్పుతూ విపరీతమైన దూకుడుగా దాన్ని అశ్వత్థామ పైకి విసిరేశాడు. అయినా అశ్వత్థామ మాత్రం ఆ కత్తి ధాటిని తప్పించుకున్నాడు. శిఖండి చావుదెబ్బలు తిని, సాత్యకి రథమెక్కి వెనుదిరిగిపోయాడు.

కృతవర్మ భీముడితో తలపడ్డాడు. భీముడతడి రథ సారథిని, గుఱ్ఱాల్ని యమపురికి సాగనంపాడు. అప్పుడు కృతవర్మ యుద్ధం విరమించుకుని శకుని రథంలో వచ్చిన దోవ పట్టాడు. భీముడంతట శత్రువుల దండుల్ని నరుక్కురావడం ప్రారంభించాడు. కురుసేన మాత్రం పాండవుల్ని శాయశక్తులా ఢీకొంటూనే ఉంది. కానీ ప్రయోజనం లేకపోయింది. పాండవపక్షం మహాబలవత్తరంగా ఉంది. నాటి సమరంలో భగదత్త, ఘటోత్కచుల పోరాటం చెప్పుకోదగింది. భగదత్తుడు ఘటోత్కచుణ్ణి ఎదుర్కొన్నాడు. అతడి సహాయకదళాన్ని చెదరగొట్టి పారేశాడు. కానీ ఘటోత్కచుడు మాత్రం ఒంటరియైనప్పటికీ నిబ్బరంగా నిలబడి పోరాడాడు. భగదత్తుడు తన కొండంత ఏనుగెక్కి బయల్దేరాడు. ఇరువురు సమఉజ్జీలై తలపడ్డారు. ఘటోత్కచుడు భగదత్తుడి మీదికి ఒక ఈటె విసిరాడు. కాని భగదత్తుడు దాన్ని ఆపి ముక్కలు చేశాడు. చివరికి ఘటోత్కచుడు తనను తాను రక్షించుకుందుకు యుద్ధరంగం విడిచిపెట్టాల్సివచ్చింది. కురుసేన కిది ఎంతో ఆనందదాయకమైంది. ఆ తరువాత భగదత్తుడి మదపుటేనుగు పాండవసైన్యాన్ని నాశనం చేయసాగింది.

నకుల సహదేవులు తమ మేనమామ శల్యుణ్ణి ఎదుర్కొన్నారు. నకులుడి గుఱ్ఱాలు హతమైనాయి. దాంతో అతడు సహదేవుడి రథమెక్కాడు. ఇరువురూ ఏకమై శల్యుడితో పోరాటం సాగించారు. సహదేవుడు క్రోధావేశంలో శల్యుడి మీదికి ఒక ఈటెను రువ్వాడు. ఆ దెబ్బకి శల్యుడు మూర్ఛిల్లాడు. అంతట శల్యుడి సారథి ఎంతో చాకచక్యంగా రథాన్ని రణరంగంనుంచి తప్పించి తీసుకుపోయి అతణ్ణి కాపాడాడు.

ఇక మధ్యాహ్నంవేళ యుధిష్ఠిరుడు శ్రుతాయువు మీద దండెత్తాడు. అతడి మీద బాణవర్షం కురిపించాడు. శ్రుతాయువు ధర్మరాజు వేసిన బాణాల్ని ఖండించాడు. మరింత వాడి బాణాల్ని ప్రయోగించి ధర్మజుడి కవచాన్ని ఛేదించాడు. అంతటితో ధర్మరాజు కోపోద్రిక్తుడై శ్రుతాయువు గుండెను గురిపెట్టి ఇంకా మిక్కుటమైన వాడి బాణాన్ని వదిలాడు. ఆనాడు ధర్మరాజు కోపంతో బుసకొడుతున్న కొండనాగల్లే ఉన్నాడు. అతడు శ్రుతాయువు రథసారథిని, గుఱ్ఱాల్ని కూల్చేశాడు. రథాన్ని నుగ్గునుగ్గు గావించాడు. ఆ దెబ్బతో శ్రుతాయువు రణభూమి నుంచీ పలాయనం చిత్తగించేశాడు. ధర్మరాజు ఇక వీరవిహారం చేస్తూ కురుసైన్యాన్ని కబళింప నారంభించాడు.

కృపాచార్యుడు చేకితానుడిపై విరుచుకుపడ్డాడు. కానీ చేకితానుడు అతడి సారథిని, గుఱ్ఱాల్ని హతమార్చి అతణ్ణి విరథుణ్ణి చేశాడు. శకుని వచ్చి కృపాచార్యుణ్ణి తన రథంపై ఎక్కించుకుని ఎలాగో అవతలికి తీసుకుపోయాడు.

ధృష్టకేతువు భూరిశ్రవసుపై దెబ్బకొట్టాడు. అతడి గుండెకి గురిపెట్టి ఎన్నో బాణాలు ప్రయోగించి గాయపరిచాడు. అప్పటికికూడ భూరిశ్రవసు శౌర్యంతో ఎదిరించి ధృష్టకేతువు బలహీనుడై వెనుదిరిగిపోయేటట్లు తరిమిగొట్టాడు.

దుర్యోధనుడి సోదరులు ముగ్గురు అభిమన్యుణ్ణి ముట్టడించారు. కానీ వారెవ్వరూ అభిమన్యుడి సమఉజ్జీలు కారు. అందుకని, అదీగాక భీముడు వారిని తుదముట్టిస్తానని శపథం చేసి ఉన్నందువల్ల తాను వారిని ప్రాణాలతో విడిచిపెట్టాడు. ఆ నడుమనున్న వ్యవధిలో భీష్ముడు దుర్యోధనుడికి సాయంగా, అభిమన్యుణ్ణి ఎదుర్కొనాలని వచ్చి ఢీకొన్నాడు. అర్జునుడు దూరంనుంచే ఇది గమనించాడు. కృష్ణుడితో "కేశవా! మా తాతగారికి నా పుత్రుడివల్ల కష్టకాలం దాపురించేనేమో... రథాన్ని భీష్ముడివైపు నడిపించు" అన్నాడు. ఆ సమయానికి మిగిలిన పాండవులుకూడ అర్జునుని చేరవచ్చారు. దుర్యోధన- జయద్రథులు అర్జునుడు భీష్ముడి వైపు చొచ్చుకు రావడం కనిపెట్టారు.

అప్పుడిక భీష్మ-అభిమన్యుల నడుమ ద్వంద్వ యుద్ధం జరిగింది. అర్జునుణ్ణి సుశర్మ అడ్డుకున్నాడు. అంతట అర్జునుడు అతడితో "నువ్వు యుద్ధంలో అగ్రేసరుడవై ఉన్నావని నాకు తెలుసులే. అంతేకాదు, నీకింకా నాపట్ల ద్వేషభావం ఉందనీ నేనెరుగుదును. నాడు రాజసూయంలో నిన్ను ఓడించానన్న ఉక్రోషం నీలో రాజుకుంటూనే ఉందనుకో.. కానీ, ఈనాడు నిన్ను నేను ప్రాణాలతో విడిచిపెట్టనని మాత్రం తెలుసుకో" అన్నాడు.

వీరిరువురి మధ్య భయంకర సంగ్రామం చెలరేగింది. అంతట త్రిగర్తులు నాలుగు వైపులనుంచి మూకుమ్మడిగా అర్జునుడిపై దాడి చేశారు. మహాబీభత్సమైన సుదీర్ఘపోరాటమది. మొట్టమొదట అర్జునుడు శత్రుసైన్యం చేతనున్న ధనుస్సుల్ని రాల్చేశాడు. అర్జునుడి బాణాలకు గురై వారంతా కళ్ళు కాళ్ళుపోయి అంగవికలులై చాపచుట్టలల్లే నేలకూలారు. ఆ పిమ్మట అర్జునుడతివేగంగా భీష్ముడి రథం వైపు దూసుకుపోయాడు.

భీష్ముడప్పుడు చిరునవ్వు ముఖంతో వారి నెదుర్కొన్నాడు. వారి సైన్యంతో కలియబడ్డాడు. వారిపై బాణవర్షం కురిపించి హతమార్చసాగాడు. క్షణంలో ప్రతి ఒక్కణ్ణి చీల్చి చండాడు.

యుధిష్ఠిరుడు మాత్రం భీష్ముడి బాణం తన మీదికి దూసుకు వస్తూంటే కదలక మెదలక నిబ్బరంగా నిలబడ్డాడు. భీష్ముడి ఔద్ధత్యం రెచ్చిపోయింది.



పాండవులాయన్ని ఎదిరించలేని స్థితిలో ఉన్నారు. ధర్మరాజు భీష్మణ్ణి చూస్తే భగ్గుమంటున్నాడు. అంతట శిఖండితో "శిఖండీ, భీష్మణ్ణి హతమారుస్తానన్న వాగ్దానం నీవెందుకు నిలుపుకోలేదు? ఆయన్ని చూసి భయపడ్డావెందుకు?" అనడిగాడు. వెంటనే శిఖండి తన రథాన్ని గంగాపుత్రుడి వైపు మళ్ళించాడుగానీ మధ్యలో శల్యుడు జొరబడ్డాడు. అతడు శిఖండిని భీష్మునివైపు పోనీయకుండా ఆటంక పరిచాడు. అంతలో శాంతనవుడు ధర్మరాజు రథాన్ని తునాతునకలుచేసి పారేశాడు. వెంటనే ధర్మరాజు నకులుడి రథం అధిరోహించాడు. పాండవులకి సాయంగా ఆ తరుణంలో ఎంతోమంది రాజులు పరుగుపరుగున యుధిష్ఠిరుడి దగ్గరకు వచ్చి వాలారు. భీష్ముడు చేస్తున్న విధ్వంసకాండని ఏ ఒక్కరూ ఆపలేకపోయారు. అవతల, త్రిగర్తులు ఎంతో జాగరూకులై అర్జునుడితో తలపడుతున్నారు. ఏ వైపునుంచీకూడ అతడు భీష్మణ్ణి ముట్టడించేందుకు వీలుకాకుండా అడ్డగిస్తున్నారు.

భీష్ముడి మీదికి క్రోధావేశుడై ఉరుకుతున్న భీముణ్ణి జయద్రథుడొక్కపోటు పొడిచాడు. భీముడు ఆ పోటుకి రవంత చలించలేదు సరిగదా ఆ గుఱ్ఱాల మీదికి గిర్రున గద తిప్పాడు. చిత్రసేనుడు, అంటే దుర్యోధనుడి తమ్ముళ్ళలో ఒకడు భీముణ్ణి అంతమొందించాలని ఉరికాడు. భీముడేం తక్కువ.. అతడూ చేతిలో గద పుచ్చుకుని ఆ చిత్రసేనుడి మీదికి దూకాడు. అప్పుడిక



భీముడి భీకరాకారాన్ని చూసి కౌరవ యోధులంతా దారీతెన్నూ తోచక ప్రాణాల్ని గుప్పెట పెట్టుకుని, పలాయనం సాగించారు. చిత్రసేనుడు ఏమాత్రం జంకూగొంకూ లేకుండా కత్తి చేతబట్టి భీముణ్ణి ఎదిరించాడు. భీముడు చిత్రసేనుడి రథాన్ని నుగ్గుచేసేశాడు. తక్షణమే వికర్ణుడు చిత్రసేనుణ్ణి తన రథంలో ఎక్కించుకున్నాడు. అప్పుడిక వారి మధ్య ఘోరసంగ్రామం తటస్థించింది.

సూర్యాస్తమయమైంది. నాటి యుద్ధం అంతటితో ముగిసింది. ద్వంద్వ యుద్ధాల్లో పాండవులు సఫలీకృతులయ్యారు. కానీ నాటి పోరాటంలో భీష్ముడి వల్ల పాండవులు చెప్పుకోతగ్గ సైన్యాన్ని కోల్పోవడం జరిగింది. అలసి సొలసిన మిగతా యోధులు విశ్రమించారు.

## 11
## భీష్ముడి వాగ్దానం

యుద్ధం ఎనిమిదో రోజు, తెల్లవారింది. భీష్ముడు కౌరవ సైన్యాన్ని 'ఊర్మి'గా వ్యూహం పన్నాడు. ఊర్మి అంటే కెరటం లేక అల. సైన్యం ఆటూపోటూవున్న మహాసముద్రంలా ఉంది. పాండవులు తమ సైనిక బలాన్ని 'శృంగాటకం' కొమ్ముల రూపంలో తీర్చిదిద్దారు. పెద్ద పెట్టున అరుపులు, శంఖనాదాలు, భేరీ భాంకారాలు, యోధుల ఘోషలు, జబ్బ చరుపులతో, వాతావరణం రణగొణధ్వనులతో హోరెత్తిపోతోంది.

భీష్ముడు పాండవసేన మీదికి దండెత్తాడు. గుర్రపుడెక్కల చప్పుళ్ళు, నారి సారింపులు మిన్నంటుతున్నాయి. శత్రువులు కలవరపడిపోసాగారు. ధర్మజుడు భీష్ముణ్ణి ముట్టడించమని తన సైనికబలమంతటిని ఆదేశించాడు. కానీ మహాశక్తిమంతుడైన భీష్ముడు తన వాడి బాణాలతో ఎదురొడ్డిన అసమాన ధనుర్విద్యాపారీణులైన పాంచాలాది యోధానయోధులందరిని నిర్దయగా భుజాలు తలలు తెగ్గొట్టి పడేస్తున్నాడు. అంతట భీముడు రంగంలోకి దూకి ఓ రంకె వేశాడు. భీష్మ-భీముల మధ్య అదో భయంకర ద్వంద్వయుద్ధం. భీముడు ముందు ఆయనపై బాణవర్షం కురిపించి కప్పేశాడు. ఆయన గుఱ్ఱాల్ని రథసారథిని చంపేశాడు. దుర్యోధనుడు అది చూసి "ఆ భీముణ్ణి నరికెయ్యం" డంటూ తన సైన్యాన్ని ఆజ్ఞాపించాడు. దాంతో దుర్యోధనుడి తమ్ముళ్ళు భీముడిపై విరుచుకుపడ్డారు. కానీ భీముడావేళ అతి భీకరుడైనాడు. వారిలో ఎనమండుగురిని వరుసగా హతమార్చాడు. జరుగుతూన్న హత్యాకాండంతా దుర్యోధనుడు చూస్తూనే ఉన్నాడు. ఏం చేయాలో తోచని నిస్సహాయస్థితిలో పడున్నాడు.



ఆ కోపోద్రేకంతోనే భీష్ముడి దగ్గరకు వెళ్ళాడు. భోరున దుఃఖిస్తూ "ఆ భీముడు నా వీర సోదరులను పొట్టన బెట్టుకున్నాడు. మీ ఉదాసీనత, పక్షపాత బుద్ధే దీనికంతటికీ కారణం. ఏం చేయాలో తోచడం లేదు" అంటూ వాపోయాడు. అందుకు భీష్ముడు "సుయోధనా! ఏమిటి నీ ధోరణి? నీ పలుకులు ములుకుల్లా దారుణంగా ఉన్నాయి సుమా. చెబుతున్నా విను, మనమందరమూకూడ ఒకానొకనాడు ఆ పాండవుల చేతుల్లో హతమవాల్సిన వాళ్ళమే. నీ దృష్టిలో పాండవుల్ని తక్కువగా అంచనావేశావు. ఇంద్రుడి నాయకత్వంలో దేవతలు దిగివచ్చినా వారి నెదిరించ తరంగాదన్నది సత్యం, తెలుసుకో" అన్నాడు.

అది మధ్యాహ్న సమయం, పాండవులు భీష్ముని జోలికే పోలేదు. భీష్ముడు మాత్రం పాండవసేనని దయాదాక్షిణ్యాలు లేకుండా నాశమొందిస్తున్నాడు. ద్రోణ-భీష్మ లిరువురూ కంటపడిన వాడినల్లా చంపిపారేస్తున్నారు. ఉలూపి అనే నాగకన్య అర్జునుల కుమారుడైన ఇరావంతుడు శకునిని ఎదిరించాడు. ఇరావంతుడూ అర్జునుడికి సమవీరుడే. శకునిని తీవ్రంగా గాయపరిచాడు. దుర్యోధనుడు అలంబసుడనే రాక్షసుణ్ణి సమీపించి, అతడితో "ఇరావంతుడు శకునిని బాధిస్తున్నాడు. పో... పోయి అతడితో పోరాడు" అన్నాడు. అతగాడు మాయలు మంత్రాలు ప్రయోగిస్తూ ఇరావంతుడితో చాలసేపు పోరు సాగించాడు. చివరికి ఆ రాక్షసుడు ఇరావంతుడి తలకొట్టేసి శరీరం నుంచి వేరుచేసి పడేశాడు.

ఇరావంతుణ్ణి వధించడం చూసి ఘటోత్కచుడు ఎలుగెత్తి రణఘోష చేసేప్పటికి కౌరవసైన్యం భయంతో గజగజలాడి పోయింది. పిల్లికి చెలగాటం ఎలుకకి ప్రాణ సంకటమన్నట్లుగా, అతడు కురుసేనతో చెలగాటమాడాడు. దుర్యోధనుడు స్వయంగా ఘటోత్కచుని మీద దాడి చేశాడు. అపరిమితమైన సాహసంతో పోరాడాడు. ఘటోత్కచుని సైన్యాన్నెంతో హతమార్చాడు. దుర్యోధనుడికి బాసటగా భీష్ముడు, ద్రోణుణ్ణి పంపించాడు. ద్రోణుడు అనేకమంది యోధుల్ని వెంటదీసుకుని అక్కడికి చేరుకున్నాడు. వారంతా ఏకకాలంలో ఘటోత్కచుణ్ణి ముట్టడించారు. కానీ అతడు ఏమాత్రం తొణకలేదు బెణకలేదు. తన దుందుభి నాదంతో గంభీరంగా గొంతెత్తి వారంతా హడలెత్తి పోయేటట్లుగా కేకలు పెడుతూ వారికి స్వాగతం పలికాడు.

ధర్మరాజు ఘటోత్కచుడు చేసిన యుద్ధఘోష విని భీముడితో "ఘటోత్కచుడు ఇంతవరకు ఒంటరిగానే పోరాడుతున్నాడు. అతడి రక్షణ గురించే నాకు దిగులుగా ఉంది. అర్జునుడక్కడ భీష్ముడితో తలపడుతుండటంవల్ల సాయమై అటువెళ్ళడం కుదరదు గదా. అందుకని నీ వక్కడికి వెళ్ళి నీ కొడుక్కి సాయపడటం మంచిదంటాను" అని చెప్పగానే భీముడు ఘటోత్కచుడికి అండగా వెళ్ళాడు. యుద్ధం మరింత భయంకర రూపం దాల్చింది. అశ్వత్థామ దుర్యోధనుడికి చేయూతనిచ్చాడు. కొంతసేపటివరకు పోరాటం సాగింది. అంతలో భీముడిక దుర్యోధనుణ్ణి కూల్చాలని గద చేపట్టాడు. అంతే, వారు తోకముడిచి అదే పరుగు. ఒకవైపు భీష్ముడు పాండవసైన్యాన్ని అణగద్రొక్కుతుండగా, మరోవైపున భీముడు కురుసైన్యాన్ని యమపురికి సాగనంపుతున్నాడు.

దుర్యోధనుడు భీష్ముడి వద్దకు వెళ్ళి ఆయనతో "ముందు ఆ ఘటోత్కచుణ్ణి సంహరించండి. లేకపోతే అతగాడు మన సైన్యాన్ని సమూలంగా నాశనం చేస్తాడు" అంటూ మొరపెట్టుకున్నాడు. భీష్ముడు సమాధానంగా "నాకిప్పుడు కుదరదు అతణ్ణి ఎదుర్కొనేందుకు భగదత్తుణ్ణి పంపుతాను" అని చెప్పాడు. భీష్ముడి అనుమతి ప్రకారం భగదత్తుడు తన మహోన్నతమైన సుప్రతీక మనే ఏనుగునెక్కి ఘటోత్కచుడి పైకి దాడిచేశాడు. అప్పుడిక పాండవసేనకి భగదత్తుడి సైనిక దళానికి మధ్య భయంకర సంగ్రామం చెలరేగింది. భగదత్తుడి మదగజం పిచ్చిపట్టినట్లు పాండవసేన మీదికి కలియబడుతూంటే దాని సంగతి తేల్చేయాలనుకుని వారు యత్నించారు.

సైన్యం యావత్తు ఆ మదగజాన్ని వెంబడించడంతో చిక్కుకొని ఉండగా మరో గజరాజు ప్రవేశించి భగదత్తుడి ఏనుగు విధ్వంసచర్యకు అడ్డునిల్చింది. ఆ మదగజాలు రెండూ కొండల్లా నిల్చాయి. ఒకదాన్నొకటి పోనీయకుండా దారి అడ్డగించాయి. అదో అద్భుతమైన సన్నివేశం. అప్పుడు భగదత్తుడు వరుసగా బాణాలు రువ్వాడు. అంతటితో ఆ మరో గజరాజు రణరంగం నుంచి వైదొలగిపోయింది. కౌరవసేన ఆనందానికి పట్టపగ్గాల్లేవు.

ఆ మధ్య వ్యవధిలో అర్జునుడు ఘటోత్కచుణ్ణి కలుసుకున్నాడు. అంతకు కొద్ది క్షణాలకి మునుపే ఇరావంతుడు మరణించాడని వార్త విని ఎంతో శోకించాడు. కృష్ణుడితో "చాలా కాలం క్రితం పినతండ్రి విదురుడు చెప్పనే చెప్పాడు. రాజ్యకాంక్షతో అయిన వారిని బలిపెట్టటంకంటె భిక్షగాడిగా చావటం మేలని. ధర్మరాజు ఐదు ఊళ్ళు ఇచ్చినా అంగీకరిస్తాననడం పరమార్థం నాకిప్పుడు తెలిసింది. కానీ, ఇప్పుడిక పశ్చాత్తాపపడి ఏం లాభం? రథాన్ని కౌరవుల వైపు నడుపు" అన్నాడు.

మధ్యలో భీష్ముడు అర్జునుణ్ణి మరోమారు కలుసుకున్నాడు. ఘటోత్కచుడు మాత్రం కౌరవసేనని ఆపకుండా హతమారుస్తూనే ఉన్నాడు. భీముడు మరోమాటు ధార్తరాష్ట్రుల్ని ఎదుర్కొన్నాడు. వారినొకరి తరువాత ఒకరి చొప్పున నేల కూలుస్తున్నాడు. మరో ఎనమండుగురిని యమలోకానికి చేర్చాడు. సైన్యం వెనుకడుగు వేయసాగింది. చీకటిపడే వేళయింది.



అంతటితో నాటి యుద్ధానికి విరామ సమయం చేకూరింది. దుర్యోధనుడికి అదో గడ్డురోజు. నాడు దుర్యోధనుడి ఇరవై నలుగురు సోదరులు నేలకొరిగారు.

ఇంత జరిగాక కూడా దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునులు సమావేశమై పాండవుల్ని గెలిచే విధాన మేమిటని చర్చలు జరిపారు. "ద్రోణుడు, భీష్ముడు, కృపుడు మొదలైన వారే పాండవుల్ని గెలవజాలరంటే, కారణమేమిటో నాకర్థం కావడం లేదు. ఓ కర్ణా! ఈ పాండవులు రోజురోజుకి కౌరవసైన్యాన్ని క్షీణింపజేస్తున్నారు. రానురాను మనకీ యుద్ధంలో విజయం దక్కదేమోనని నాకు అపనమ్మకం కల్గుతోంది సుమా" అన్నాడు దుర్యోధనుడు.

ఆ మాటకు కర్ణుడు నవ్వి, "దుర్యోధనా! విచారించకు మీ తాతగారికి పాండవులంటే పంచప్రాణాలు. అందుకని ఆయన్ని ముందు యుద్ధంనుంచి అడ్డు తొలగమను, ఆ పైన పాండవుల మారణహోమానికి నే పూనుకుంటానని నీకు మాటయిస్తున్నాను" అన్నాడు. తరువాత దుర్యోధనుడు భీష్ముడి వద్దకెళ్ళి, "పితామహా! నువ్వు గొప్పవాడివే, అజేయుడవే అందుకు సందేహమేలేదు కానీ, పాండవుల మీద నీ ప్రతాపమేమీ పనిజేయడంలేదే! అందుకని దయచేసి కర్ణుడు కూడ యుద్ధంలో పాల్గొనేందుకు అనుమతించు. నా అభీష్టాన్ని అతడు నెరవేరుస్తాడు" అనడిగాడు.

ఆ మాటలకు భీష్ముడిలో క్రోధం పెల్లుబికివస్తున్నా లోలోన అణచుకుంటూ, "నాయనా! శూలాలవంటి మాటలని నా హృదయాన్నెందుకు పోట్లు పొడుస్తావు చెప్పు. నా శక్తి వంచన లేకుండా యుద్ధం చేస్తున్నాగదా! పాండవులజేయులన్న విషయం నీకు చెప్పనే చెప్పాను. వారు లోకరక్షకుడు కృష్ణుని అండనున్నారు. అందువల్ల వారిని హతమార్చడం నావల్ల, ద్రోణుడివల్ల కాదన్నప్పుడు ఈ కర్ణుడి సంగతి చెప్పాలా? నువ్వు మూర్ఖుడవు. నేను ప్రతిరోజు పాండవసేనని పడగొడుతున్నాను గమనించావా? రేపటి రోజున ప్రళయమే సృష్టించనున్నా.. లోకమే సాక్షి. భూమ్మీద కలకాలం ఆ మాట నిల్చిపోయేటట్లు చేసి చూపిస్తా. ఇక పోయి విశ్రమించు" అని బదులు చెప్పాడు.

## 12
## భీష్ముడు - కార్చిచ్చు

తొమ్మిదోరోజు ఉదయాన భీష్ముడు సైనిక వ్యూహాలకు యుద్ధసంబంధంగా ఇవ్వవలసిన హెచ్చరికలన్నీ ఇచ్చాడు. దుర్యోధనుడు సంతృప్తిగా ఉన్నాడు. అతడు దుశ్శాసనుడితో "తమ్ముడూ ఇవాళ ఎలాగైతేనే తాతగార్ని మన పక్షాన మనస్ఫూర్తిగా పోరాడేందుకు ఒప్పించాను. కానీ, శిఖండి ఉంటే మాత్రం ఆయుధం చేపట్టను, పోరాడనంటాడు. కనుక శిఖండి తాతగారి ఎదుటపడకుండా చూడటం నీ వంతు. నీకు తెలుసుగదా! సింహమైనప్పటికి రవంత ఏమరుపాటునుందో కేవలం అడవి కుక్కచేత హతమైపోతుంది సుమా" అన్నాడు.

భీష్ముడు తమ సైనికదళాన్ని 'సర్వతోభద్ర' మనే వ్యూహంగా అమర్చాడు. అన్ని విధాలా భద్రమైనదని అర్థం. కృప కృతవర్మ శకుని ఇంకా ఇతర యోధానయోధులంతా భీష్ముణ్ణి పరిరక్షిస్తూ ఉన్నారు. పాండవులుకూడ తమ సైన్యాన్ని వారికే మాత్రం తీసిపోని విధంగా వ్యూహం అల్లిపెట్టుకున్నారు. ధర్మరాజు, భీముడు నకుల సహదేవులు అగ్రభాగాన ఉండేటట్లు ఏర్పాటు జరిగింది. యుద్ధారంభమైంది. అభిమన్యుడు దుర్యోధన సైన్యాన్ని ఎదుర్కొని వీరహారం చేస్తున్నాడు. అభిమన్యు-ఆలంబసుల మధ్య బ్రహ్మాండమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో ఆలంబసుడు తనని కాపాడుకునేందుకు పిక్కబలం చూపాల్సి వచ్చింది.

అవతల సాత్యకి-అశ్వత్థామ, ద్రోణ-అర్జునుల నడుమ మహోగ్రమైన పోరాటం ప్రారంభమైంది. భీష్ముడు అభిమన్యుడితో తలపడ్డాడు. అప్పుడు అర్జునుడు కొడుకు పక్షాన చేరాడు. దుర్యోధనుడి తమ్ముళ్ళంతా భీష్ముడికి సాయమై నిల్చారు. మిగిలిన పాండవులంతా అభిమన్యుడికి చేదోడై వచ్చారు. అదో సంకుల సమరం. కృపాచార్యుని సాత్యకి పోరుకి కవ్వించాడు. ద్వంద్వయుద్ధం ప్రారంభమైంది. సాత్యకి వేసిన బాణాలకి కృపుడు మూర్ఛిల్లి నేలబడ్డాడు. అంతట అశ్వత్థామ వచ్చి అపాయాన్ని అడ్డుకున్నాడు. సాత్యకి అశ్వత్థామ వింటిని రెండు తుంపులు చేసిపారేశాడు. మరో వింటినందుకుని అశ్వత్థామ క్రోధావేశంతో వరుసపెట్టి బాణాలు గుప్పించాడు. సాత్యకిని మూర్ఛిల్ల జేశాడు. కానీ, సాత్యకి మరుక్షణానే తెప్పరిల్లుకుని ఇనుమడించిన శక్తితో అశ్వత్థామని ఎదుర్కొన్నాడు. ద్రోణుడు అపాయస్థితిలో ఉన్న కుమారుని ఆదుకునేందుకు వచ్చాడు. అప్పుడిక సాత్యకి ద్రోణుల ఇరువురిమధ్య పోరు చెలరేగింది. అంతటితో అర్జునుడు తక్షణం సాత్యకిని రక్షించేందుకు వచ్చి నిల్చాడు. దానితో అర్జున ద్రోణుల మధ్య భయంకర పోరాటం చెలరేగింది.

పాండవసేనని చీల్చి చెండాడుతున్న భీష్ముణ్ణి పాండవులు మరోసారి ఎదుర్కొన్నారు. అర్జునుడు మాత్రం పెద్దలపట్లగల పూజ్యభావం వల్ల మనస్ఫూర్తిగా పోరాడలేకపోతున్నాడు. కృష్ణుడు అర్జునుడి మనోభావాన్ని గ్రహించి రథం ఆపాడు. "పార్థా! నువ్వు, నీ సోదరులు పదమూడు సంవత్సరాలు ఈ సుదినం కోసమే నిరీక్షిస్తూ వచ్చారు. నీవిప్పుడు భీష్ముణ్ణి దయాదాక్షిణ్యం చూపక హతమార్చటమే కర్తవ్యంగా గుర్తించు" అని హెచ్చరించాడు. అర్జునుడు కృష్ణుడి మాట తలదాల్చి, "ఔను, కృష్ణా! రాజ్యకాంక్షతో గురువులను, పెద్దలను, బంధుమిత్ర బలగాన్ని హతమార్చటమా, రాజ్యహీనుణ్ణయి దారిద్ర్యాన్ని, దుఃఖాన్ని భరించడమా అని ఆలోచిస్తున్నా. గుర్రాల్ని పోనీ నీ ఆజ్ఞ నాకు శిరోధార్యమే కృష్ణా" అన్నాడు. అన్నాడేగానీ, అన్యమనస్కంగా యుద్ధానికి సంసిద్ధుడయ్యాడు. అంతలోనే భీష్ముడి బాణపరంపర అతివేగంగా వచ్చి రథాన్ని ముంచెత్తింది. కృష్ణుడు రథాన్ని ఏమాత్రం ముందుకి పోనీయలేకపోయాడు. అంతట అర్జునుడు మొట్టమొదట వదిలిన బాణంతో భీష్ముడి రథటెక్కాన్ని పడగొట్టాడు. తరువాత మరికొన్ని బాణాలు వదిలి ఆయన వింటిని తునాతునకలు చేసి పారేశాడు. అప్పుడు భీష్ముడు మరో వింటిని అందుకుని పోరు సాగించాడు. కానీ, అర్జునుడు ఆ విల్లుకూడ ధ్వంసం చేశాడు. చేపట్టిన ధనుస్సునెల్లా తుంపులు చేశాడు. భీష్ముడు అర్జునుడి ధనుర్విద్యాకౌశలాన్ని, ఆ వేగాన్ని చూసి పొంగిపోయాడు. "భేష్, అర్జునా భేష్ నీవంటి వీరుడితో పోరాడటం ఆనందదాయకం సుమా" అంటూనే మధ్యలో భీష్ముడు తన రథాన్ని గుండ్రంగా సుడితిప్పుతూ బ్రహ్మాండమైన ప్రావీణ్యాన్ని ప్రదర్శించాడు. అర్జునుడు మాత్రం ఆపకుండా కురువృద్ధుడైన భీష్ముడిపై బాణాలు కురిపిస్తూనే ఉన్నాడు. కానీ, అతడి మనసులో భీష్ముణ్ణి వశపరచుకోవాలనో, వధించాలనో భావనే రావడం లేదు.

భీష్ముడు మాత్రం పాండవసేనని అదేపనిగా కూల్చి పారేయడం కృష్ణుడు గమనిస్తూనే ఉన్నాడు.



తటాలున కృష్ణుడు చేతనున్న పగ్గాల్ని విసిరిపారేసి రథం నుంచి కింది కురికాడు. తన సుదర్శన చక్రాన్ని చేత ధరించాడు. కృష్ణపరమాత్మ తన వైపు రావడాన్ని భీష్ముడు గమనించాడు. మౌనంగా, మనస్సును తొట్రుపడనీకుండా కూడదీసుకుంటూ, చిరునవ్వు ముఖంతో కృష్ణుణ్ణి ఉద్దేశించి "ఓ దేవాదిదేవా! రావయ్యా వందనమయ్యా స్వామీ! నీ చేతుల్లో మరణించాలనే నా కోరిక తండ్రీ. నేను నీ దాసుణ్ణి" అని విన్నవించుకున్నాడు.

అనడమే తరువాయి కన్నుమూసి కన్ను తెరిచేలోపల అర్జునుడు రథం నుంచి ఒక్క దూకు దూకి కృష్ణా ఆగు.. చక్రం ప్రయోగించకు అని కృష్ణుణ్ణి వారించి, తన శపథాన్ని భంగం చేసుకోవద్దని ప్రాధేయపడటం, నీవానాడు యుద్ధంలో ఆయుధం ముట్టనని ప్రతిజ్ఞ చేశావు గుర్తుంది గదా. నీవేం చేయమన్నా చేస్తా అంటూ కృష్ణుణ్ణి మరల్చి తీసుకువెళ్ళటం జరిగిపోయింది. యుద్ధం తిరిగి ప్రారంభమైంది. నాటి యుద్ధంలో పాండవసైన్యం ఎక్కువ భాగం నష్టమైంది. సూర్యాస్తమయం అయింది. ఆ నాటికి యుద్ధం చాలించారు.

## 13
## భీష్ముడి శిబిరంలో పాండవులు

ధర్మజుడు శోక సంతప్తహృదయుడైనాడు. కృష్ణుడి వైపు చూసి, "కృష్ణా! భీష్ముణ్ణి వధించడం అసాధ్యం సుమా. భీష్ముడు మన సైన్యాన్ని ఊచకోత కోస్తూంటే మనమంతా నిస్సహాయులమై చూస్తూ ఊరుకోవడంగా ఉంది. మళ్ళీ యథాప్రకారం అడవులకి తిరిగి పోవడమే మంచిదేమో"



అన్నాడు. అది విని కృష్ణుడు ధర్మరాజును సమాధానపరుస్తూ, "ఓ ధర్మజా! విచారించకు. అర్జునుడు, భీముడు ఎంతో శక్తిమంతులు. నా అండ వారికి ఉండనే ఉంది. భీష్ముడు హతుడయ్యాడో విజయం మనదే అన్నది తథ్యం. ఆయన ఏ ఆయుధాన్నయినా ప్రయోగించగల నైపుణ్యం ఉన్నవాడు. క్షణాల్లో సైన్యాన్ని భస్మీభూతం చేయగలవాడు. అంతటి వాడైనా నీవంటే వల్లమాలిన అపేక్ష గలవాడు. కాబట్టి ఆయన్ని చంపటమెలాగో ఆయన్నే అడగటం సబబు" అన్నాడు.

అనగానే పాండవులైదుగురు కృష్ణుడు రాత్రి బాగా పొద్దు పోయాక భీష్ముడి శిబిరానికి వెళ్ళారు. వారిని ఆ సమయంలో చూసి భీష్ముడు ఆశ్చర్యపోయాడు. వారంతా ఆయన పాదాలు తాకి ప్రణమిల్లారు. భీష్ముడు వారితో "రావయ్యా కృష్ణా! నిన్ను చూశాను, చాలా సంతోషంగా ఉంది. నీకు, పాండవులకు స్వాగతం" అనేసరికి, భీష్ముడి స్వాగత వచనం విన్న ధర్మజుడు ఆనందంతో పొంగిపోయాడు. భీష్ముడితో "పితామహా! యుద్ధం గెలవడమెలా, రాజ్యాన్ని పొందడమెలా? నువ్వు యుద్ధంలో మా సైన్యాన్నంతా హతమారుస్తున్నావు! మేము నిన్నెలా ఎదిరించగలమో తెలియడంలేదు. మేం ఎలా గెలవగలుగుతామో దయచేసి నువ్వే చెప్పవలసింది" అనడిగాడు.

అందుకు భీష్ముడు "ఓ కుంతీపుత్రా! నేను జీవించి ఉన్నంతవరకు మీకు విజయం దక్కదు" అన్నాడు. అప్పుడు యుధిష్ఠిరుడు "మరైతే నిన్ను వధించడమెలా?.. మేము ఇంద్రవరుణుల్నయినా జయించగలం గానీ నువ్వు మా పాలిటి యముడవై మా మీదే దండం విసురుతున్నావు గదా" అన్నాడు.



భీష్ముడామాట విని "నువ్వన్నది సత్యమే, నన్నెవరూ యుద్ధంలో వధించలేరు. స్త్రీ ఎదురు నిలిస్తే పోరాడనని, చేపట్టిన ఆయుధాన్ని వదిలేస్తానని శపథం చేశాను. శిఖండికూడ ఒకానొకనాడు స్త్రీయే. అందువల్ల అతణ్ణి నా ఎదుటికి తెచ్చి నిలపండి. అప్పుడిక నేనాయుధం ప్రయోగించను. ఆ సదవకాశాన్ని ఉపయోగించుకుని అర్జునుడు మాత్రం నన్ను హతమార్చగలడు" అని చెప్పగానే మీనమేషాలెంచకుండా పాండవులు ఆ పద్ధతినే నిర్ణయించుకుని తమ గుడారాలకు చేరుకున్నారు. అర్జునుణ్ణి బాగా వత్తిడి చేశారు. అర్జునుడు శోకించాడు. సిగ్గుతో కుంగిపోతూ తలవంచి కృష్ణుడితో "హే కృష్ణా! నేనీ పని ఎలా చెయ్యను? ఆ వయోవృద్ధుడు, పూజ్యుడు, కురువంశ రక్షకుడు, పితామహుడు అంతటివాణ్ణి గాయపరచడమా? ఎంతటి వీరుడు! వివేకసంపన్నుడు!. నా చిన్ననాటి ముచ్చట్లు జ్ఞాపకం వస్తున్నాయి. నేను మట్టికాళ్ళతో సరసర ఆయన ఒడినెక్కి కూర్చునేవాణ్ణి.. ఆయన దుస్తులన్నీ పాడుచేసేవాణ్ణి. ఒక్కొక్కప్పుడు ఆయన్ని నాన్నగారూ! అని పిల్చేవాణ్ణి. అప్పుడాయనో చిరునవ్వు నవ్వి, మీ నాన్నకి నాన్నని బాబూ అనేవాడు. అటువంటి మహానుభావుణ్ణి... ఉహు నా వల్ల కాదు. కావాలంటే ఆయన నన్నూ నా సైనికదళాల్ని చీల్చి చెండాడినా ఫర్వాలేదు గానీ, ఆయన్ని చంపడం నా వల్ల కానే కాదు" అంటూ వాపోయాడు.

అంతట కృష్ణుడు గంభీరంగా ఇలా అన్నాడు: "అర్జునా! భీష్మణ్ణి హతమారుస్తానని ప్రతిజ్ఞ చేసి ఇప్పుడు మాట తప్పదలచావా? ఒకసారి చంపాలనే ఉద్దేశం కలిగాక, అవతలవాడు వృద్ధుడైనా మహానుభావుడైనా శత్రువుకిందే జమ. ఆ విధి నిర్వహణ క్షత్రియుల ధర్మం." ఎట్టకేలకు అర్జునుడు కృష్ణుని సలహా తలదాల్చి దృఢనిశ్చయుడయ్యాడు.



## 14
## కారుమబ్బుల్లో కౌరవసేన

అది పదవ రోజు యుద్ధం. శిఖండిని ముందుంచుకుని అర్జునుడు భీష్ముడితో పోరాడుతున్నాడు. అజేయుడైన భీష్ముడికి దుర్యోధనాదులు రక్షణగా ఉన్నారు. ద్రోణ, అశ్వత్థామలు ఆయన వెన్నంటి ఉన్నారు. పాండవులు కురుసేనని నేలమట్టం చేస్తున్నారు. ముమ్ముందుకు దూసుకువస్తున్నారు. పాండవులు తమ సేనల్ని రంపపుకోత కొస్తూంటే భీష్ముడు సహించలేక పోయాడు. మిక్కిలి వాడియైన బాణాల్ని మంత్రపూరితంచేసి పాండవుల మీద ఎడతెరిపి లేకుండా గుప్పించాడు. వారి ఆటకట్టేటట్లు ఎదిరిస్తున్నాడు. దుర్యోధనుడు సంతోషంతో పొంగిపోయాడు.

శిఖండిని ముందు నిల్పుకుని అర్జునుడు, భీష్మణ్ణి ఢీ కొంటున్నాడు. 'వేగం వేగం' అంటూ కృష్ణుణ్ణి తొందరపరిచాడు. శిఖండి వడివడిగా వేసిన పది బాణాలు భీష్ముడి గుండెను చీరేశాయి. భీష్ముడు నమిలి మింగేద్దామన్నంత కోపంతో కొరకొర చూశాడు. శిఖండి ఎదుర్కొనడాన్ని లక్ష్యపెట్టలేదు. తన దృష్టి యావత్తు అర్జునుడిపై కేంద్రీకృతం చేశాడు. తనకు దేవదత్తమైన ఆయుధాన్ని చేతబట్టి భీష్ముడు అర్జునుడిపై దండెత్తాడు. కానీ కవచధారి అయిన శిఖండి అడ్డుకునే సరికి భీష్ముడు ఆయుధాల్ని ప్రయోగించడం మానుకున్నాడు. కౌరవులు భీష్ముడికి రాబోయే అపాయం గ్రహించారు. భీష్ముడు శక్తికొద్దీ పోరాడుతూండగా పాండవులు శిఖండిని వెయ్యికళ్ళతో కాపాడుతూండటం చూశారు. దుర్యోధనుడు భీష్ముని సమీపించి, "అదుగో అర్జునుడు అతడి వెన్నంటి కృష్ణుడూను. అతడు మన సైనిక బలాల్ని కబళించేస్తున్నాడు. మాకు నువ్వే దిక్కు. వేరెవ్వరూ లేరు. అందుకని అర్జునుణ్ణి మిగతా వారిని ప్రతిఘటించి, మన బలాన్ని రక్షించమని కోరుతున్నాను" అన్నాడు. అది విని భీష్ముడు క్షణకాలమాలోచించి, "ఓ సుయోధనా! నే చెప్పే మాటలు జాగ్రత్తగా విను. ప్రతిరోజు పదివేలమంది

సైనికుల్ని హతమారుస్తానని మాట ఇచ్చాను. అన్నమాట ప్రకారం ఆచరిస్తూనే ఉన్నాను. ఇవాళ నేనొక అపూర్వమైన బలప్రయోగం చేయబోతున్నాను. అదే పాండవులందర్ని ఒక్కుమ్మడిగా నేను చంపడమో లేదా నేను చావడమో జరుగుతుంది" అన్నాడు నిశ్చయంతో.

తక్షణం గాంగేయుడు వెళ్ళి పాండవసేనతో తలబడ్డాడు. పాండవులెవ్వరికీ ఆయన్ని ఆపడం తరంకాలేదు. అప్పుడర్జునుడు మళ్ళీ భీష్ముణ్ణెదుర్కొనేందుకు శిఖండిని ప్రేరేపించాడు. శిఖండి భీష్ముడి వైపు జొరబడుతూండగా, మిగిలిన పాండవులు వేర్వేరు తావుల్లో కౌరవయోధులతో కలియబడుతున్నారు.

అశ్వత్థామ తన తండ్రి ద్రోణుడికి అండగా ఉన్నాడు. చూస్తూండగానే సమరం భయంకర రూపం దాల్చింది. అంతట ద్రోణుడు "నా కేవేవో ఆలోచనలు, అపశకునాలు తోస్తున్నాయి. అందుకే నేనదేపనిగా అర్జునుణ్ణి గమనిస్తున్నాను. అతడీనాడు భీష్ముణ్ణి అంతం చెయ్యాలని నిర్ణయించుకున్నట్లు కనబడుతూంది. ఆ శిఖండిని తెచ్చి ముందు పెట్టుకుని భీష్ముణ్ణి నిస్సహాయుణ్ణిగా చేసేస్తున్నాడు. నా మాట విని తక్షణమే వెళ్లి ఆ అర్జునుడి బాణాలకు గురికాకుండా భీష్ముణ్ణి ఏ విధంగానైనా కాపాడాలి" అన్నాడు.

భీష్ముడు కౌరవుల ప్రధాన నాయకుడై బలంగా అర్జునుణ్ణి ఎదుర్కొంటున్నాడు. గెలుపెవరిదో తేల్చి చెప్పడం కష్టం. నానాటికి వేలాదిసంఖ్యలో సైనికులు మరణిస్తున్నారు. భీష్ముడిక అలసి విసిగి వేసారాడు. అప్పుడు దగ్గర్లో ఉన్న ధర్మజుణ్ణి పిల్చాడు. "ఓ యుధిష్ఠిరా! చూడు నేనిక విసిగిపోయాను. యుద్ధమంటే వెగటు పుట్టింది. నేను అసంఖ్యాక యోధుల్ని హతమార్చాను. నాకు మంచి చేయాలనుకుంటే నాతో పోరి, నన్ను అంతం చెయ్యి" అన్నాడు.

అందుకు ధర్మరాజు తన బలగంతో "సరే ముందుకు ఉరకండి. యుద్ధం చేసి భీష్ముణ్ణి జయించండి" అనగానే, శిఖండిని ముందు పెట్టుకుని వారి నాయకుడు అర్జునుడు, పాండవసేనలు భీష్ముణ్ణి కూల్చేందుకెంతో ప్రయాసపడ్డారు.

శిఖండి–అర్జునుల మీద కౌరవసేన విరుచుకుపడింది. వారిని తుదముట్టించాలనుకుంది. అర్జునుడు కౌరవసేన భీష్ముడి రథం దరిదాపులకిగూడ రానీయకుండా నిర్బంధించాడు. అయినా అంతకు మునుపెన్నడూ లేనంత తీవ్రంగా భీష్ముడు పోరాటం సాగించాడు. కాని 'పోరాడి ప్రయోజనం లేదు' అనిపించింది. అర్జునుడికి సాయమై ఉన్నవాడు కృష్ణుడు. తాను శిఖండితో యుద్ధం చెయ్యనని శపథం పట్టినవాడాయె. సత్యవతీదేవిని తన తండ్రి వివాహమాడే తరుణంలో తాను పొందిన వరాన్ని – అదే, 'తాను కోరుకున్నప్పుడు తనకు మరణం సంభవించాలని', అది ఇక ఉపయోగించు కోవాలనుకున్నాడు.

శిఖండి వేసిన బాణాలు భీష్ముడి గుండెని చీరేసినా, చలించలేదు. భూకంపం వచ్చినా కదలని కొండలా నిలబడ్డాడు. అర్జునుడు వరుసగా ఇరవై అయిదు అమ్ములు నాటాడు. ఇంకా వందలాది మంది యోధులు వివిధరకాలుగా శరీరమంతా గాయపరిచారు. అప్పుడిక భీష్ముడు దుశ్శాసనుడితో "చూడు ఇవి శిఖండి బాణాలనుకుంటున్నావేమో, కావు. అర్జునుడు వేసినవే, అవి నిర్విరామంగా శరీరంలోకి దూసుకుపోతున్నాయి. చలికాలపు ఈదురుగాలి చర్మాన్ని కోసేట్లు ఆ బాణాలు నా దళసరి కవచాన్నే చీరేసి దేహంలోకి చొచ్చుకుపోతున్నాయి" అన్నాడు బాధగా.

భీష్ముడి దేహం మీద గాయం లేని చోటు లేదు. ఎక్కడా రెండు వేళ్ళ సందు లేకుండా బాణాలు దిగాయి. శిఖండి భీష్ముడి వింటిని ముక్కలు చేసి, ఆయన రథ సారథిని పది బాణాలతో అంతం చేశాడు. భీష్ముడు మరో వింటిని అందుకున్నాడు. కానీ అర్జునుడు వాటన్నిటిని ఖండించేశాడు.

భీష్ముడప్పుడిక ఈటె తీశాడు. అది కొండల్ని సైతం పిండి పిండి చేసి పారెయ్యగలదు. విపరీతమైన కోపంతో భీష్ముడు ఈటెను అర్జునుడి రథం మీదికి విసిరాడు. అంత అర్జునుడు తక్షణమే అయిదు బాణాలు ప్రయోగించి రయ్ మని వస్తున్న ఈటెను అయిదు ముక్కలు చేశాడు. ఆ దృశ్యాని చూసి భీష్ముడు, "నేను ఒకే ఒక్క ధనుస్సు సహాయంతో మొత్తం పాండవుల్ని కూల్చి పారేయగలను. కానీ వారు కృష్ణుని రక్షణలో ఉండగా. నేను పాండవులతో పోరాడను, వారిని వధించలేను" అని అన్నాడు.

స్త్రీగా జన్మించిన శిఖండిని ఆసరాగా చేసుకుని తనను ఎదిరిస్తున్నారు కనుక ఈ యుద్ధంతో తనకు ప్రమేయం లేదని భావించి, కోపాన్ని చల్లార్చుకొన్నాడు. తనకు శంతనుడు ప్రసాదించిన ఇచ్ఛామరణ వరాన్నిక ఉపయోగించే సమయం సమీపించిందని అంతరాత్మ ఉద్బోధించింది. ఆకాశం నుండి పోరు తిలకిస్తున్న దేవతా సమూహం భీష్ముడు యుద్ధం చెయ్యకుండా నిలబడిపోవడం చూసి విస్మయాశ్చర్యాలకు లోనైంది.

ఆ దేవతలు భీష్ముణ్ణి సంబోధించి "నీ నిర్ణయం సరైందే. మేమంతా ఆమోదిస్తున్నాం. నియమం తప్పకుండా ధర్మాన్ని నిర్వర్తించిన ధర్మవీరుడవు నువ్వు" అంటూండగా దేవదుందుభులు మోగాయి. ఆయన మీద పుష్పవృష్టి కురిసింది. ఆ దేవవాణి భీష్ముడికి మాత్రమే వినపడింది.



కృష్ణుడు భీష్ముడి ముఖకవళికల్ని గమనిస్తున్నాడు. అతడి సలహా పాటించి శిఖండి భీష్ముడిపై శరపరంపర గుప్పిస్తున్నాడు. కానీ శాంతనవుడు వాటన్నిటినీ భరిస్తూ శాంతంగా నిలబడ్డాడు.

దుర్యోధనాదులంతా ఆ సంఘటనను నిస్సహాయులై పరికిస్తూ ఉండిపోయారు. ఇక అప్పటికి సూర్యుడు పడమటి దిశను చేరుకుంటున్నప్పటికీ, అర్జునుడు గుప్పించిన వేలబాణాలతో శరీరం తూట్లు పడిపోయినా తేజోమూర్తియై వెలుగొందే భీష్ముడిలాగా ఆకాశంలో అస్తమించే సూర్యుడుకూడ దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు.

ఆయన దేహమంతా అర్జునుని బాణపు దెబ్బలతో నిండినా ముఖాన మాత్రం చిరునవ్వే తాండవించింది. కళ్ళు కృష్ణుని వంక ఆశ్రయ భావంతో చూస్తున్నాయి. మహాభారతానికి మూలస్తంభమైనట్టి కురువృద్ధుడు భీష్మపితామహుడు యోధానుయోధుడు రథం నుంచి ఒరిగిపోయాడు. భూమి కంపించింది. అంపశయ్య మీద పడుకున్నట్లు ఉన్నాడు. ఆయన దేహం నేలను తాకలేదు. అప్పటికింకా సూర్యుడు దక్షిణాభిముఖంగా ప్రయాణిస్తున్నాడు (దక్షిణాయనం). అంపశయ్యపై పడివుండగా "ఈ సమయం మంచిది కాదే ఇప్పుడే ఎందుకు పడిపోవాలి" అని ఆయనకు దేవవాణి వినిపించిందట. అందుకు భీష్ముడు నవ్వి "భీష్ముడు పడిపోయాడుగానీ మరణించలేదు. ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చాకగానీ, ఈ దేహాన్ని విడిచిపెట్టను" అన్నాడు.

భీష్మజనని గంగామాత ఋషీవరుల్ని ఆయన వద్దకు అది దక్షిణాయన కాలం అని తెలపడానికి పంపింది. వారు హంసలరూపాలలో మానససరోవరం నుంచి లేచివచ్చి ఆయన చుట్టూ చేరారు. భీష్ముడువారితో ఆ విషయం తనకు ముందే తెలుసునని 'ఉత్తరాయణం

రాగానే నేనీ దేహాన్ని విడిచిపెడతాను అని' అనగానే వారు వెళ్ళిపోయారు. కృపుడు, దుర్యోధనుడు మిగతావారు భోరున విలపించసాగారు.

ఇరుపక్షాల సేన యుద్ధం నిలిపివేశారు. ఆయుధాల్ని వదిలేసి అంతా వెళ్ళి భీష్ముడి చుట్టూ చేరారు. కౌరవ పాండవులిరువురూ ఆ మహావీరుడి పట్ల తమ మర్యాదల్ని పాటించారు. ఏడ్చి పెడబొబ్బలు పెట్టేవారు కొందరైతే, మరికొందరు మూర్ఛపోయారు. ఇంకొందరు క్షత్రియ సంస్కృతిని హింసాత్మకంగా, పదవీ వ్యామోహితంగా నిందించారు.

## 15
## భీష్ముడికి పాదాభివందనం

ప్రతి ఒక్కరూ భీష్ముణ్ణి పూజ్యభావంతో చూస్తూ నిశ్చేష్టులై నిలబడ్డారు. గంగాపుత్రుడు ఎంతో ఆప్యాయంగా అందరిని కలయజూశాడు. "మీ అందరికి నాపైనున్న అభిమానానికి నేనెంతగానో మురిసిపోతున్నాను. నా తల నేలను వాలిపోతోంది. తల ఆనిచ్చేందుకు కాస్త ఆధారమేదైనా పెట్టం"డని అనడగడమే తరువాయిగా ఎన్నో తలగడలు మెత్తనివి, పట్టువి ఎన్నో పట్టుకొచ్చారు. అవన్నీ చూసి భీష్ముడు "వీరుడు తలానించేందుకు ఇవి పనికి రావు" అంటూ అర్జునుని వైపు చూసి, "నాకు తగిన ఉపధానం అమర్చు నాయనా" అనడిగాడు. అర్జునుడాయన ఉద్దేశాన్ని గ్రహించాడు. తక్షణమే వింటినారి సారించి మూడు బాణాలు గుప్పించాడు. ఆ మూడింటిని నేలను నాటి, భీష్ముడు తల ఆనించేందుకు వీలైన ఉపధానంగా అమర్చాడు. "అర్జునా! నేనడిగింది, నాక్కావాల్సింది ఈ ఉపధానమే. ఇదే క్షాత్ర ధర్మం. యుద్ధభూమిని చిరనిద్ర పోబోయే ఈ క్షత్రియుడి తల తప్ప దేహమంతా నేల తాకకుండా శరశయ్య ఉంది. ఇప్పుడు తలకికూడ అమరింది చాలు. ఈ దేహం చాలించేందుకు ఇది మంచివేళ కాదు. ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేవరకు ఆ కర్మసాక్షిని ఉపాసిస్తూ ఈ అంపశయ్య మీదనే నిరీక్షిస్తూ ఉంటాను" అన్నాడు.



దుర్యోధనుడి ఆదేశానుసారం ఎందరో ఘనవైద్యులు వైద్యం చేసేందుకు అక్కడికి వచ్చారు. కానీ భీష్ముడు ససేమిరా ఒప్పుకోలేదు, చిరాకుపడ్డాడు. "క్షత్రియవీరుడిగా ఆనందంలో పరాకాష్ఠనందుకున్నాను. అసువులు పోగానే ఈ బాణాలతోనే చితిపేర్చి దహనం చేయాలి" అంటూ హెచ్చరించాడు.

చీకటి పడింది. దుర్యోధనాదులు ఆయన చుట్టూ చేరి కూర్చున్నారు. అంతట కృష్ణుడు ధర్మజుడితో "మీ అదృష్టం, విజయం.. ఇక మీదే" అన్నాడు.

అందుకు ధర్మరాజు "ఔను కృష్ణా నీ అనుగ్రహమే మాకు జయం. నీ ఆగ్రహం, అపజయం. మాకు నువ్వే శరణ్యం. మా రక్షకుడవు నువ్వే. ఇందులో మా నిర్ణయంగానీ, మా ప్రయోజకత్వం గానీ లేశమైనా లేదు" అంటూ వినయంగా చెప్పాడు.

భీష్ముడికి దాహమైంది. అర్జునుడి వంకచూసి "అర్జునా దాహం తండ్రీ!" అనడిగాడు. అంతట అర్జునుడు వెంటనే గాండీవ ధనుస్సునెత్తి వాడి బాణాలు వేశాడు. నేల నెరియలిచ్చింది. భూగర్భంలోంచి తియ్యని జలధార పైకి చిమ్మింది. భీష్ముడు తృప్తిగా ఆ నీటిని తాగాడు. ఆ తరువాత దుర్యోధనుణ్ణి ఉద్దేశించి, "చూడు సుయోధనా! ఈ లోకం మొత్తంలో ఈ నైపుణ్యం మరెవ్వరికీ లేదు. కృష్ణార్జునులంటే ఎవరనుకున్నావు నర నారాయణులు. ఇక నీ పగను వీడి అర్థంలేని ఈ యుద్ధానికి స్వస్తి చెప్పు. ఈ భీష్మ మరణానంతరం మీ జీవితాల్లో శాంతి సౌహార్ద్రాలు నెలకొనాలని ఆశిస్తున్నాను. రాజ్యంలో సగపాలు ధర్మరాజుకి ఇచ్చేసి, అంతా శాంతియుతంగా జీవించండి" అని హితవు చెప్పాడు. దుర్యోధనుడు మౌనం వహించాడు.

భీష్ముడు పడిపోయాడన్న వార్త విన్న కర్ణుడు నిశ్చేష్టుడయ్యాడు. మెదలకుండా ఆయనున్న చోటికి వెళ్ళాడు. ఆయనకి పాదాభివందనం చేశాడు. "నేను రాధేయుణ్ణి, మీరు నన్నెప్పుడూ కానివాడికింద జమకట్టి చూసేవారే అతణ్ణి" అనేసరికి, ఆ మాటలు విని భీష్ముడు ఒంటి చేతితో చేరబిలిచి, దగ్గరకు తీసుకుని, "రా... రా బాబూ నువ్వూ, కౌంతేయుడవే గానీ, రాధేయుడవు కావు. నాకు నీ మీద ద్వేషమేమీ లేదు కర్ణా! నువ్వొక గొప్ప యోధుడవని నాకు తెలుసు. నిన్ను నేను పరుషంగా మాట్లాడేవాడనంటే, నువ్వు మహాగర్వివని, పాండవుల్ని నిష్కారణంగా దూషించేవాడివనీను. బ్రాహ్మణులంటే నీకున్న భక్తి శ్రద్ధల్ని, నీ శౌర్యసాహసాల్ని నేనెంతో మెచ్చుకుంటాను. నువ్వు అర్జునుడికి సమఉజ్జీవి, కృష్ణుడంత ఘనుడివి. నా సలహా పాటించి పాండవులతో సమాధానపడి సఖ్యంగా ఉండు. నా మరణానంతరం పగ, విరోధం మానుకో"మని బ్రతిమాలాడు.

అందుకు కర్ణుడు "నేను కుంతీపుత్రుడనన్న విషయం నాకు తెలుసు. కానీ నేను దుర్యోధనుడిచ్చిన సంపదని అనుభవిస్తూన్నందున నేనతడి పతనానికో కష్టాలకో కారకుణ్ణి కాలేను. కృష్ణుడు పాండవపక్షాన ఉన్నట్లే నేను దుర్యోధనుడి పక్షాన ఉన్నానంతే. పాండవులకి ఓటమి లేదు; అయినా దుర్యోధనుడి పక్షాన పాండవులతో పోరాడతానని నా శపథం. నా శపథానికి భంగం వాటిల్లనీయను. మీ మాట పాటించనందుకు నన్ను మన్నించమని వేడుకుంటున్నాను. ఒకవేళ నేనెన్నడైనా మిమ్మల్ని నా మాటలతోగానీ చేతలవల్లగానీ, నొప్పించినట్లయితే క్షమాపణ కోరుతూ, నన్ను పోరాడేందుకు అనుమతించమని ప్రాధేయపూర్వకంగా అడుగుతున్నాను" అన్నాడు.

అప్పుడిక భీష్ముడు "నీకు పోరాడేందుకు అనుమతి నిచ్చాను, పోరాడు. ఆవేశానికి లోనుగారాదు, ఎట్టి ఘనతను ఆశించరాదు సుమా. ఎందుకు చెబుతున్నానంటే, కురుపాండవుల మధ్య శాంతిని నెలకొల్పాలని చూశాను కానీ విఫలుడనయ్యాను" అన్నాడు. కర్ణుడు భీష్ముడి వద్ద సెలవు పుచ్చుకుని బయల్దేరాడు.



# ద్రోణపర్వం

## 1
## కర్ణుడి రణరంగ ప్రవేశం

మహాసంగ్రామం పదకొండోరోజు ఆరంభమైంది. కురువృద్ధుడు మహావీరుడైన భీష్ముడు కూలిపోయాడు. కౌరవుల ఆశలన్నీ అడియాసలైనాయి. నాయకుడు లేకపోవడంతో కాపరిలేని గొఱ్ఱెలమంద సామెతయింది వారి స్థితి.

భీష్ముడు గాయపడి పడిపోగానే వారి సైనిక పరివారం "ఓ కర్ణా! నువ్వే మమ్ము ముందుకు నడిపించాలి. నువ్వే మాకిక అండ కావాలి" అని గోలపెట్టారు. గడచిన పది రోజులుగా భీష్ముడి సైన్యాధిపత్యంలో సూర్యనందనుడైన కర్ణుడు యుద్ధం నుంచి వైదొలగి నిల్చాడు. భీష్ముడు పరాభవించడంవల్ల నొచ్చుకున్న కర్ణుడు "రణభూమిలో నువ్వున్నంతవరకు నేనక్కడ అడుగు పెట్టను. మీరే పాండవుల్ని హతమార్చి దుర్యోధనుడికి విజయాన్ని కట్టబెట్టండి" అని శపథంపట్టి పది రోజులు జరిగిన యుద్ధానికి దూరంగానే ఉండిపోయాడు.

అప్పటికి సజీవులై ఉన్న ధార్తరాష్ట్రులు కర్ణుడి గుడారానికి వచ్చి, భీష్ముణ్ణి గురించి విచారపడుతున్న కర్ణుణ్ణి చూశారు. అప్పుడు రాధేయుడు వారితో "భీష్ముడంతటివాడికే ఓటమి కల్గిందంటే, ఈ మిగులు తగులు ఉన్న యోధుల్ని తుదముట్టించడం అట్టేసేపు పట్టదని నాకు తోస్తోంది. అకాశాన్నుంచి సూర్యుడు నేలను పడిపోయాడన్నా నమ్మవచ్చునేమో గానీ, భీష్ముడు నేలకూలడం నమ్మశక్యంకాని మాట. ఏది ఏమైనా నేను కురుసైన్యాన్ని ఈ మహాసంగ్రామంలో కాపాడేందుకు శాయశక్తులా ప్రయత్నిస్తాను" అని చెబుతూ భీష్ముడున్న వైపు నడిచి వెళ్ళాడు. ఆయన ఎదురుగా నిలబడ్డాడు. చేతులు జోడించి, "కుల స్వామీ! నేను కర్ణుణ్ణి. కళ్ళు తెరిచి నా వంక చూడండి. ఋజువర్తనంలో మహోన్నతులు పవిత్రతా స్వరూపులైన మీ వంటివారే ఈ విధంగా గాయపరచబడి పడి ఉన్నారంటే, ఇక ఈ లోకంలో కేవలం యోగ్యతతో సాధించగల దేదీ లేదని స్పష్టమవుతూంది. మీరు పడిపోయిన తరువాత కౌరవులు ఆశవదులుకున్నారు. ఈ నాటికి ఆ కౌరవులకి అర్జునుడి తెల్లటి గుఱ్ఱాల పగ్గాలు స్వయంగా చేతబట్టిన కృష్ణుడి శక్తి సామర్థ్యాలెంతటివో, అర్థమవుతోంది. సరే ఏదెలా జరిగినా, మీరు కనుక అనుమతిస్తే నేను యుద్ధరంగానికి వెళ్ళి అర్జునుణ్ణి హతమార్చి నా బాధ్యత తీర్చుకుంటా" నన్నాడు. కర్ణుని ఆ మాటలు విన్న భీష్ముడు సంతోషించి, అతణ్ణి సంబోధిస్తూ "నాయనా! నదులన్నిటికి సముద్రం దిక్కయినట్లు, ఇక నీ మిత్రులకి నువ్వే అండగా ఉండాలని మనసారా నిన్ను ఆశీర్వదిస్తున్నాను. నమ్మకద్రోహం చెయ్యక దుర్యోధనుణ్ణి నువ్వు అన్నివిధాలా వెన్నంటి ఉండాలి సుమా. నీ అదృష్టం పండాలి. వెళ్ళు, వెళ్ళి శత్రువుల్ని చెండాడు" అని మనస్ఫూర్తిగా దీవించాడు.

భీష్ముడి దీవెనలందుకొని కర్ణుడు రథమెక్కి యుద్ధక్షేత్రానికి బయల్దేరాడు. అప్పుడిక కర్ణ–దుర్యోధనులు కౌరవసైన్యాధిపత్యం విషయమై మంతనాలు జరిపారు. నడిపించే నాయకుడు లేకపోతే సేనకు క్షేమంలేదు. నావికుడులేని నావలా, సారథిలేని రథంగా తయారవుతుంది. కనుక నాయకుడెవరుంటే బావుంటుందో చెప్పవలసిందిగా కోరారు. అందుకు కర్ణుడు "మనమంతా సాహసులమే, మేధావులమే, అభిజాత్యం ఉన్నవారమే. అంతా సమర్థులే కాబట్టి ఎవరు ఆధిపత్యం వహించినా మంచిదే. అయితే, ద్రోణాచార్యులు ఆ బాధ్యతను వహిస్తే సబబుగా ఉంటుంది. ఆయన మన కందరికి గురువు గదా! అప్పుడైతే ఇక స్పర్థకిగానీ, అసూయకిగానీ తావుండదు. ద్రోణుడు ఆధిపత్యం వహించేందుకు ఒప్పుకోవాలి మరి" అని సలహా చెప్పాడు. దుర్యోధనుడు కర్ణుడిచ్చిన సలహాకెంతో సంతోషించాడు. ద్రోణుణ్ణి కలుసుకుని "ఆచార్యా! మీరొక్కరే మాకు మా పితామహులంతటి సన్నిహితులు.



అందుకే మిమ్మల్ని మన సేనలకి ఆధిపత్యం వహించాల్సిందిగా కోరుతున్నాను" అని ప్రాధేయపడ్డాడు. అక్కడ సమావేశమైన రాజులందరూకూడ తమ ఆమోదాన్ని వెల్లడించారు.

ద్రోణుడు "నాకు వేదాలు, తక్కిన శాస్త్రాలు తెలుసు. ఏదో కొంత మానవుడి నడత, మనస్తత్వాల్ని గురించి తెలుసు. ఇంకా ప్రత్యేకమైన కొన్ని ఆయుధాల ప్రయోగం తెలుసు. అంతవరకే..., అయితే మీకు నాపై గల విశ్వాసానికి, పాండవుల్ని ఎదుర్కొనేందుకు ఈ సర్వసేనాధిపత్యాన్ని అంగీకరిస్తున్నాను" అన్నాడు. ఆయన లాంఛనయుతంగా కౌరవసేనకు సర్వసేనాధిపతిగా నియమింపబడ్డాడు.

ద్రోణుడు సైనిక బలాన్ని గుండ్రంగా శకటవ్యూహంగా ఆయత్తపరిచాడు. పాండవులు తమ సైన్యాన్ని క్రౌంచవ్యూహంగా మలిచారు. కౌరవసేన అగ్రభాగాన కర్ణుడు నిలిచి ప్రత్యక్షమయ్యాడు. రణభూమిలో కర్ణుడు ప్రవేశించడం అదే మొట్టమొదటిసారి. అది అందర్నీ ఆశ్చర్యంలో ముంచివేసింది. అతడు సేనలోకి వచ్చే ముందే ద్రోణుడు దుర్యోధనుణ్ణి "నావల్ల నువ్వు కోరుకునేదేమిటి? నే చెయ్యాల్సిన దేమి"టని అడిగాడు. దుర్యోధనుడంతట కర్ణుణ్ణి సంప్రదించి "మీరు యుధిష్ఠిరుని ప్రాణాలతోపట్టి తెచ్చి నా కప్పగించాలి. అదే మీరు చెయ్యవలసిన కార్యం, అదే నాకు మహదానందం," అని బదులు చెప్పాడు.

"హతమార్చి తేరాదా?" అని ఎదురు ప్రశ్న వేశాడు ద్రోణుడు. "ఏం? మీ కాతడంటే పైకి చెప్పుకోలేనంత అపేక్షమైనా ఉందా? ఆయన అజాతశత్రువు. శత్రువనేవాడే లేనివాడని గదా ...అదంతా నా కనవసరం. అతణ్ణి ప్రాణాలతోనే వశపరచుకోవాలి" అన్నాడు.

యుధిష్ఠిరుణ్ణి ప్రాణాలతోనే పట్టి తెచ్చి అప్పగిస్తానని ద్రోణుడు తన నిశ్చితాభిప్రాయాన్ని తెలుపగానే, గూఢచారులు కొందరు ఈ వార్త మోసుకుపోయి పాండవసేనలో వెల్లడి చేశారు.

దుర్యోధనుడి నీచప్రవృత్తిని ఆమోదించి అతడికి ప్రాపైనిల్చిన ద్రోణుడంటే అర్జునుడు మండిపడ్డాడు. తన అగ్రజుడికి ఏమరుపాటన్నదిలేక సదా అన్నివిధాలా కనిపెట్టి కాపలాగా కూడానే ఉండాలని నిర్ణయించుకున్నాడు.

ఆనాటి సమరంలో ఆచార్యుడు తన శౌర్య ప్రతాపాలను ఎంతో చాకచక్యంతో ప్రదర్శించాడు. స్వైరవిహారంచేస్తూ నిర్దాక్షిణ్యంగా పాండవసేనని నాశనం చేశాడు.

ఆ తీవ్రమైన గమన వేగాన్ని చూసి పాండవసేన ద్రోణుడు ఒక్కడు కాదు, అనేక ద్రోణులు అనుకొంది. బాణవర్షంతో రణరంగమంతా నింపడంతో అది మృత్యుదేవత నాట్యరంగంగా తయారైంది.

ఆయన యుధిష్ఠిరుడి వైపు చొచ్చుకురావడానికి ప్రయత్నిస్తున్నాడు. యుధిష్ఠిరుడు మంచి వాడియైన బాణాలతో బదులు చెబుతున్నాడు. కానీ ద్రోణుడు వాటిని లెక్కచెయ్యకుండా మహావేగంతో మున్ముందుకు చొచ్చుకు వస్తూనే ఉన్నాడు. అప్పటికీ ధర్మరాజు ధైర్యంగా ఎదుర్కొంటున్నాడు. ద్రోణుడు చేసే చిత్రవధకు ధర్మజుడు తట్టుకోలేకపోతున్నాడు. అతడి

వింటిని రెండు తుంపులు చేసి పారేయడంతో ధర్మరాజు నిస్సహాయుడై పోయాడు. అప్పుడిక శిఖండి, ఉత్తమౌజుడు, ద్రౌపదిపుత్రులు, సాత్యకి, విరాటుడు ఆ విధంగా ఒకరి తరువాత ఒకరు వరుసగా వచ్చేశారు. కానీ వారందర్నీ ద్రోణుడు ఒక్క దెబ్బను ఓడించి పారేశాడు. ఆనాడు ఆయన కేవలం మృత్యుదేవతలా ఉన్నాడు. యుధిష్ఠిరు నెలాగైనా ప్రాణాలతో పట్టుకోవాలనే గట్టియత్నంలో ఉన్నాడు.

"ఇవాళిక ధర్మరాజు ద్రోణుడి చేజిక్కిపోతాడు, తప్పదు" అని చుట్టూ ఉన్నవారు గుసగుసలాడుతున్నారు. అప్పుడు కనీ వినీ ఎరగని అపూర్వదృశ్యం గోచరించింది, అదే కృష్ణసారథ్యంలో రథం మీద వస్తున్న అర్జునుడు హఠాత్తుగా ప్రత్యక్షమవటం. అతడు ద్రోణుడి మీదికి వడివడిగా దూసుకువెళ్ళాడు. తన గాండీవాన్ని ఎక్కుపెట్టి శరపరంపర కురిపించి ముంచెత్తాడు. అర్జునుడి ఆగడాన్ని ద్రోణుడు తమాయించుకోలేకపోయాడు. అదృష్టవశాత్తు సూర్యాస్తమయం కావడంతో నాటి యుద్ధానికి అంతటితో ముగింపు జరిగింది.

## 2
## ధర్మజుని వశపరచుకునేందుకు ద్రోణుడి యత్నం

ధర్మజుణ్ణి ప్రాణాలతో పట్టి తేవాలనుకున్న ద్రోణుని యత్నం విఫలం కావడంతో ఆయనకు కల్గిన నిరుత్సాహం అంతా ఇంతా కాదు. దుర్యోధనుడితో "అర్జునుడు యుద్ధరంగంలో ఉన్నంతవరకు ధర్మజుణ్ణి పట్టడం సాధ్యంకాదు. కనుక ఏదో ఉపాయం పన్ని ధనంజయుణ్ణి వేరు దిశకు మళ్ళించాలి, ధర్మరాజుని ఒంటరివాణ్ణి చెయ్యాలి. అట్టి తరుణంలోనైతేనే ఆ యుధిష్ఠిరుణ్ణి ప్రాణాలతో పట్టుకోవచ్చు" అన్నాడు.

మర్నాటి యుద్ధంలో దుర్యోధనుడు ద్రోణుడు చెప్పిన ప్రకారం త్రిగర్తాధీశుడికి అర్జునుణ్ణి కయ్యానికి కవ్వించవలసిందిగా హెచ్చరికలు చేశాడు. త్రిగర్తాధీశుడు దుర్యోధనుడు చెప్పినట్లే అర్జునుని యుద్ధానికి ఉసిగొల్పాడు. అంతట అర్జునుడు ధర్మజుడితో "ఈ త్రిగర్తులు నన్ను తమతో యుద్ధం చెయ్యమని



కవ్విస్తున్నారు. మీకు అండగా మీ వెంట ఉండాలనే ఉన్నప్పటికీ వారు సంశప్తక (సంశప్తక వ్రతమంటే ఒక పెద్ద సేనను సిద్ధం చేసి అంతా అగ్నిహోత్రం ముందు వెళ్ళి పని సాధించిగానీ, రణరంగం నుంచి పారిపోయిరామని శపథం చేసి దీక్షబూనడం) వ్రతం పట్టినవారు నా పేరుపెట్టి పిలుస్తున్నారు.

"నేనూ రణరంగంలో ఒకసారి ప్రవేశిస్తే అనుకున్న కార్యం సాధిస్తేగానీ తిరిగి రాననే దీక్ష తీసుకున్నవాడినే గదా. అందువల్ల వారితో పోరాడి వచ్చేందుకు అనుజ్ఞ ఇప్పించ"మని అడిగాడు. అర్జునుడి తెల్లటి గుఱ్ఱాలు ధర్మరాజున్న తావునుంచి బయల్దేరడం దుర్యోధనుడు గమనించాడు.

అర్జునుడు కృష్ణుడితో "కృష్ణా! ఈ త్రిగర్తులు నన్ను తమతో పోరుకు రమ్మని కవ్వించడం చూస్తుంటే, వీరు కోరి తమ పాలిటి మృత్యువును ఆహ్వానిస్తున్నారేమో అనిపిస్తుంది సుమా!" అన్నాడు. ఇటు అర్జునుడు త్రిగర్తుల నడుమ సంకుల సమరం ప్రారంభమైంది. పార్థుడు రణభూమిలో వీరవిహారం సాగిస్తూ శత్రువుల్ని ఊచకోత కోసేస్తున్నాడు.

అటువైపు ద్రోణుడు ధర్మజుని లోబరచుకోవాలనే కాంక్షతో పాండవసైన్యం వైపు పురోగమిస్తున్నాడు. కానీ, అప్పటికే ధృష్టద్యుమ్నుడు తన మీదికి తరలి వస్తున్న జాడ కనిపెట్టి గజగజలాడిపోతున్నాడు. ఆ ధృష్టద్యుమ్నుడు తన ప్రాణాలు హరించేందుకే పుట్టాడన్న సంగతి ఆయనకు తెలుసు. అందుకని తన రథాన్ని ద్రుపదుడి సైన్యం ఉన్న దిశకు మళ్ళించాడు. ద్రోణుడి చేతుల్లో ద్రుపదుడి సైన్యం చాలవరకు దెబ్బతింది. మరికొంతసేపటికి తిరిగి తన దృష్టిని ధర్మజునిపైకి సారించాడు కానీ, పాండవులు దృఢంగా నిలబడ్డారు. సత్యజిత్తు–ద్రోణుల మధ్య భయంకర పోరాటం చెలరేగింది. అందులో సత్యజిత్తు ఇంకా పాంచాల రాజకుమారుడైన వృకుడు మృతులయ్యారు.

ద్రోణుడప్పుడు ధర్మరాజుకి మరింత చేరువయ్యాడు. ఇక దుర్యోధనుడి సంతోషం అంతా ఇంతా కాదు. కర్ణుడితో "రాధేయా! చూడు మన నాయకుని శౌర్య పరాక్రమాలు. ఈ దెబ్బతో ఇక పాండవులు యుద్ధంజోలికి రారని నా కనిపిస్తుంది. ద్రోణుడి బాణాలకు వారి సైన్యం ఎలా చెల్లాచెదరై పోతుందో చూడు" అన్నాడు. కానీ కర్ణుడికి రారాజు మాటలేమాత్రం నచ్చలేదు. "మిత్రమా! పాండవుల్ని అంత తక్కువగా అంచనా వేయకు. వారెన్నటికీ లొంగరు సుమా. నువ్వు వారికి చేసిన అన్యాయాల్ని వారిట్టే మర్చిపోయి ఉంటారనుకున్నావా? అదుకో చూడు భీముడు చేదోడై రానే వచ్చాడు. అతడు మన యోధాగ్రేసరుల్ని చాలవరకు నరికి పారేస్తాడు. అప్పుడిక బరువు బాధ్యతంతా ద్రోణుడి మీదనే పడుతుంది. కనుక త్వరగావెళ్ళి ఆయనకు సాయపడదాం పద" అన్నాడు.



అన్నదే తడవుగా సుయోధనుడు ఒక పెద్ద గజబలాన్ని సిద్ధంచేసి భీముడి మీదికి నడిపించాడు. కానీ భీముడు క్రోధావేశంతో ఏనుగుల దండుని చెండాడుతున్నాడు. తన ఏనుగుల్ని కూల్చేస్తున్న భీముడిపై దుర్యోధనుడు వాడియైన బాణాల్ని ప్రయోగించాడు.

అయినా భీముడు దుర్యోధనుడి వింటిని అతడి సైనిక బలాన్ని ధ్వంసం చేసేశాడు. భగదత్తుడు సుప్రతీకమనే ప్రసిద్ధమైన తన ఏనుగునెక్కి దుర్యోధనుడికి సాయమై వచ్చాడు. అది కళ్ళు తిప్పి తేరిపారజూస్తూ క్రోధంతో ఘీంకరిస్తూ భీముణ్ణి రథం మీదనుంచి ఎత్తి నేల కుదేసింది. నేలమీదనుండే భీముడు ఆయుధం లేకుండా వట్టి చేతుల్తోనే ఏనుగుతో కలియబడ్డాడు.

భగదత్తుడి ఏనుగు పాండవసైన్యంలోకి జొరపడి నుగ్గునుగ్గు చేస్తోంది. ఆ ఏనుగు చేస్తున్న బీభత్సం ఫలితంగా సైనికుల్లో అల్లకల్లోలం చెలరేగింది. పాండవసేనలో ఆర్తనాదం వినబడేసరికి తక్షణమే అర్జునుడు ఆ దిశకు పరుగున వెళ్ళాడు. కానీ భగదత్తుడు అదే యుద్ధగజం మీద వచ్చి అర్జునుణ్ణి ఢీకొన్నాడు. భయంకర పోరాటం చెలరేగింది. చివరికి అర్జునుడో తీవ్రమైన బాణాన్ని ఆ ఏనుగు నొసట గురిపెట్టి కొట్టాడు. అది కొండమీద పిడుగు పడినట్టయి, ఆ జంతువు శరీరాన్ని నిలువునా చీరేసింది. అది అరుస్తూ నేలకూలింది. అర్జునుడు మరో అమ్ము వదలి భగదత్తుణ్ణి హతమార్చాడు. ఈ విధంగా ధర్మజుని ప్రాణాలతో పట్టుకోవాలనుకున్న ద్రోణుని పన్నాగం మళ్ళీ విఫలమవడంతో నాటి యుద్ధం ముగిసింది.



# 3
# అభిమన్యు వధ

మర్నాటి ఉదయానే దుర్యోధనుడు అమిత కోపంతో ద్రోణుడి దగ్గరకు వెళ్ళి, "మీరు నా కిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోనందుకుగల కారణం నాకు అర్థంకావడం లేదు. రణభూమిలో మీకు అందుబాటులో ఉన్నప్పటికీ ధర్మజుణ్ణి పట్టుకోకుండా విడిచిపెట్టారు. మీ చేతలు చిత్రంగా ఉన్నాయి" అంటూ అక్కసు వెళ్ళబోశాడు. ఆ మాటలకు ద్రోణుడు ఎంతో నొచ్చుకున్నాడు. "దుర్యోధనా! నేను నాకున్న శక్తినంతా ప్రయోగించి యుద్ధం చేస్తున్నాను. ధర్మరాజు పక్కన కృష్ణార్జునులున్నంత కాలం మన కార్యం నెరవేరదు. కనుక ఏ విధంగానైనా అర్జునుణ్ణి రణరంగం నుంచి వైదొలగించు. అప్పుడైతే దేవతలకి సైతం అంతుచిక్కని ఎత్తు వేస్తాను. నీ కోరిక తీరే"నని సమాధానం చెప్పాడు.

దుర్యోధనుడు సంశప్తకుల్ని అర్జునుణ్ణి కవ్వించమని సలహా ఇచ్చాడు. అంతట ద్రోణుడు సైన్యాన్ని పద్మవ్యూహంగా అమర్చి సంసిద్ధం చేశాడు. అర్జునుడు సంశప్తకుల్ని ఎదుర్కోనడానికి రణభూమి దక్షిణదిశకు వెళ్ళాడు.

ద్రోణుడు ధర్మరాజుపై భయంకరంగా దండెత్తాడు. భీమసేనాదులు ద్రోణుని ఎదిరించి ఆయన ధాటికి తట్టుకోలేకపోయారు. ధర్మరాజుకి ఏం చేయాలో పాలుపోలేదు. ద్రోణుడు పన్నిన పద్మవ్యూహాన్ని భేదించడం పాండవుల పక్షంలో ఎవ్వరికీ తెలీదు, ఒక్క అభిమన్యుడికి తప్ప. ఆ వ్యూహాన్ని భేదించే కిటుకు అతడు తన తండ్రి అర్జునుడి ద్వారా నేర్చాడు. ఆ సంగతి ధర్మజుడికి తెలుసు. తక్షణం అభిమన్యుణ్ణి పిలిపించి "నాయనా! ద్రోణుడు పన్నిన ఈ వ్యూహాన్ని భేదించడం మన వారెవ్వరికి సాధ్యం కావడంలేదు. ఈ వ్యూహం భేదించగలవారు నలుగురే, కృష్ణుడు, అతడి కుమారుడు ప్రద్యుమ్నుడు తరువాత అర్జునుడు, నీవూను. ఇప్పుడర్జునుడు సంశప్తకులతో పోరాటంలో చిక్కుకున్నాడు. కనుక నీ మీదనే ఆశపెట్టుకున్నాం. ద్రోణుడు పన్నిన ఈ వ్యూహాన్ని భేదించి



మమ్మల్ని కాపాడు తండ్రీ!" అన్నాడు. అందుకు, అభిమన్యుడో క్షణం ఆలోచించి "మా తండ్రిగారు నాకు వ్యూహంలో ప్రవేశించడం నేర్పారుగాని, అందులోంచి బయటపడే విధానం చెప్పలేదే! ఒకవేళ ఏదైనా ఆపదమూడితే తిరిగి బయటపడే దారి నేనెరుగనే" అని బదులు పలికాడు.

"వ్యూహాన్ని భేదించి లోపలికి నువ్వు ప్రవేశించగానే మేమంతా నీ వెనకనే నిన్ననుసరించి వస్తాం. ఆపదేమైనా వస్తే నీతోటే ఉండి ఎదుర్కొంటాం సరేనా?.. పద" అన్నాడు.

అభిమన్యుడు సారథిని వ్యూహంలోకి చొరబడమని హెచ్చరించాడు. అప్పుడు సారథి "చిరంజీవీ! నిన్ను దేవుడే రక్షించాలి. నీ లేత భుజాల మీద మహాభారాన్ని వేశారు. వ్యూహంలోకి దిగే ముందు ఓ క్షణం ఆలోచించి మరీ అడుగుపెట్టు" అని సూచనలిచ్చాడు.

కానీ అభిమన్యుడో చిరునవ్వు నవ్వి "నేను అర్జునుడి పుత్రుణ్ణి, కృష్ణుడికి మేనల్లుడిని. అటువంటప్పుడు నాకేమిటి భయం? సారథీ త్వరగా పోనీ, వేగంగా.. ద్రోణుడున్న చోటు గుర్తుపట్టి రథాన్ని అటు తరలించు" అన్నాడు.

అభిమన్యుడు ద్రోణుడితో తలపడేందుకై మున్ముందుకు చొచ్చుకురావడం గమనించిన కౌరవులు అతణ్ణి ఎదుర్కొనేందుకు సంసిద్ధులైనారు. ఏనుగుల సమూహం మీదికి ఉరికే సింహప్పిల్లలా అభిమన్యుడు నిర్భయంగా కౌరవులపై విరుచుకుపడ్డాడు. ద్రోణుడు చూస్తూండగానే, ఆయన పన్నిన పద్మవ్యూహాన్ని భేదించి అభిమన్యుడు లోనికి ప్రవేశించాడు.

అభిమన్యుడు చేరువవుతూంటే మృత్యువు సమీపిస్తున్నట్లు కౌరవవీరులంతా నోళ్ళు పిడచకట్టుకుపోయి, గుడ్లుతేలేసి ఒళ్ళంతా ముచ్చెమటలుపోసి నిస్సహాయులై నిలబడ్డారు. అభిమన్యుడి విధ్వంస చర్యను అడ్డుకునేందుకు దుర్యోధనుడు ఉరికాడు. అంతట ద్రోణుడు అనుభవజ్ఞులైన యోధాగ్రేసరుల్ని దుర్యోధనుడికి అండగా పంపించాడు.

అభిమన్యుడు వ్యూహంలో ప్రవేశించేందుకు వెళ్ళినప్పుడు తోడ్తోడ పాండవపక్షానున్న వీరాధివీరులంతా అతడి రథాన్ని అనుసరించారు. కానీ వ్యూహాన్ని భేదించిందీ, లోపల ప్రవేశించిందీ అభిమన్యుడు మాత్రమే. భీముడితోసహా అందరిని జయద్రథుడు అక్కడే ఆపేశాడు. ఒంటరిగా అభిమన్యుడే వెళ్ళాడు. నాటి విధ్వంసకాండలో కురుసైన్యం ఆశ వదిలేసుకుంది.

కర్ణుడికి ఏంచేసేందుకు పాలుబోక తిన్నగా ద్రోణుడి దగ్గరకు వెళ్ళి "ఈ అభిమన్యుడు బీభత్సం చేసేస్తున్నాడు. దుర్యోధనుని, దుశ్శాసనుని, నన్ను గాయపరిచాడు. అతడి శస్త్రాస్త్రాలు మా మనోబలాన్ని కుంగదీస్తున్నాయి ఆచార్యా" అని వాపోయాడు.

అంతా విని ద్రోణుడు "అభిమన్యుడు యువకుడు, వీరుడు, సాహసోపేతుడు. వాళ్ళ తండ్రికి కవచమెలా తొడుక్కోవాలో నేర్పింది నేను. అతడి కబ్బిన విద్యంతా తు.చ తప్పక సకలమూ నేర్చినట్లు నాకు కనబడుతూనే ఉంది. అందుకని అతడి వింటిని తుంచెయ్యాలి. తరువాత రథానికి కట్టిన గుఱ్ఱాల్ని కూల్చేయాలి. ఆపైన ఆ రథసారథులిద్దర్ని హతమార్చాలి. అదంతా అయ్యాక అతడు రణరంగం నుంచి వెనుదిరిగి పిక్కబలం చూపుతున్నప్పుడు నేల రాల్చేయడమే" అన్నాడు.

ద్రోణుడి సలహా మేరకు కర్ణుడు వాడి బాణాల్ని వదలాడు. అభిమన్యుడి వింటిని విరిచాడు. కృతవర్మ అతడి గుఱ్ఱాల మీదికి గురిపెట్టాడు. వాటిని వధించాడు. కృపాచార్యుడు సారథులిరువుర్ని మట్టుపెట్టాడు. ఈ తీరుగా అతణ్ణి బలహీనుణ్ణి చేశారు. అభిమన్యుడు రథం మీదనుంచి కిందికి ఉరికి, ఖడ్గం

చేతబట్టి శత్రువుల నెదుర్కొన్నాడు. కత్తి గిరగిరా తిప్పుతూ చుట్టుముట్టిన వీరయోధులందర్నీ తెగటార్చాడు. నేల కాలు మోపినట్టు లేదు. ఆకాశంలో విహరిస్తూ యుద్ధం చేస్తున్నట్లనిపించింది. పక్షిరాజైన గరుడుడు ఆకాశంలో ఎగురుతున్నట్లే తోచింది. కౌరవసేన పైకి పారజూచి ఆకాశంలోకి బాణాలు గురిపెట్టి వదులుతోంది. అంతలో ద్రోణుడు వదిలిన వాడిబాణం వచ్చి అభిమన్యుడి కత్తిని ముక్కలు చేసింది. కర్ణుడి శరం అతడి డాలును తుంపులు చేసింది. అతడికి రక్షణనేది లేకుండాపోయింది. తక్షణమే గద అందుకున్నాడు. అశ్వత్థామ మీదికి విసిరాడు. అభిమన్యుడు తన పైకి ఉరకడం కనిపెట్టి అశ్వత్థామ వడివడిగా రథం మీదనుంచి కిందికి ఉరికి మూడంగలు వెనక్కివేసి ఆ గద వ్రేటుపడకుండా తప్పించుకున్నాడు.

ఆ వెనువెంటనే దుశ్శాసనుడి కుమారుడు, ఆగు అంటూ కేకలు పెట్టుకుంటూ వచ్చి అభిమన్యుణ్ణి గదతో మోదాడు. ఇద్దరూ రెండు మహావృక్షాల్లా నేలబడ్డారు. దుశ్శాసన పుత్రుడు మొదట లేచి, లేవాలని



పెనగులాడుతున్న అభిమన్యుడి తలపై బలంగా కొట్టాడు. ఆ దెబ్బకి అభిమన్యుడు నేలకొరిగాడు.

కౌరవసేనకి పట్టలేనంత సంబరమైంది. ధృతరాష్ట్రతనయుడైన యుయుత్సుడు మాత్రం అందుకు సమ్మతించలేదు. కృష్ణార్జునులు సంశప్తకుల్ని ఓడించి, హతమార్చి తిరిగి వస్తూ, దోవలో సందె పడగానే ఆగి, సంధ్యావందనం గావించుకున్నారు. అర్జునుడు ఎంతగానో తోచితోచని ఉద్విగ్న స్థితిలో ఉన్నాడు. పాండవ శిబిరంలో ఏదో జరగరానిది జరిగినట్లు మనసులో చెప్పలేనంత భయాందోళనగా ఉంది. నిత్యమూ ఆనవాయితీగా వినవచ్చే మంగళవాద్యం అవాళ వినబడలేదు. తీరా శిబిరం చేరుకున్నాక చూస్తే ఏముందీ పాండవులంతా విషాదంలో మునిగి కూలబడి ఉన్న దృశ్యం ఎదురైంది.

"మీరంతా అంత విచారంగా ఉన్నారే? అభిమన్యుడేడీ? ప్రతిరోజు నేను రణభూమినుండి తిరిగి రాగానే ఎదురొచ్చి నన్ను అభినందించే వాడేమయ్యాడు? యుద్ధరంగంలో నేలకూలాడా? నా కర్థమైంది లెండి... ఆ ద్రోణుడు పన్నిన పద్మవ్యూహాన్ని మీలో ఏ ఒక్కరూ భేదించలేరు. ఒకవేళ అభిమన్యుని వ్యూహంలో ప్రవేశించమని బలవంతపెట్టారా? నేనా చిన్నవాడికి వ్యూహంలోంచి బయటపడే విధానం నేర్పలేదే. అయ్యో! అందులో చిక్కుకుని నిహతుడయ్యాడాయేం?" అంటూ అర్జునుడందరిని అడిగాడు. కానీ ఏ ఒక్కరూ బదులు చెప్పలేదు.

## 4
## కృష్ణ గారడి

వారి మౌనాన్నిబట్టి అర్జునుడు వెంటనే గ్రహించుకున్నాడు. భోరున విలపించాడు. "ఎంతటి వీరులకైనా మరణం తప్పదు. అభిమన్యుడు చిన్నవాడైనా ఆనందంగా వీరస్వర్గాన్నలంకరించాడు. వీరులెప్పుడూ యుద్ధంలో మరణించాలనే కోరుకుంటారు. శోకించకు..

నీవింతగా శోకిస్తూంటే, నీ సోదరులు, మిగిలిన రాజులందరూ కూడ దిగులుతో కుంగిపోతారు సుమా!" అంటూ కృష్ణుడు అర్జునుణ్ణి ఎన్నోవిధాల ఓదార్చాడు. శోకసంతప్త హృదయుడైన ధర్మరాజు అప్పుడు జరిగిన వృత్తాంతమంతా ఏకరువుపెట్టాడు. అది విన్న అర్జునుడికి మళ్లీ దుఃఖం పెల్లుబికిరాగా కిందపడి మూర్ఛిల్లాడు. మూర్ఛనుండి తేరుకున్న తరువాత అర్జునుడు, ఎత్తువేసి తన పుత్రుని వ్యూహంలో ఇరికించి అతడి మరణానికి కారకుడైన జయద్రథుణ్ణి మర్నాడు సూర్యాస్తమయమయ్యే లోపున హతమారుస్తానని లేనియెడల దేహత్యాగం చేస్తానని కఠోరమైన ప్రతిజ్ఞ చేశాడు. తన గాండీవం ఎత్తి నారి సారించాడు. ఆ నాదంతో ఆకాశమంతా మార్మోగింది. కృష్ణుడుకూడ తన పాంచజన్య మనే శంఖాన్ని గట్టిగా పూరించాడు.

దుర్యోధనుడి చారులప్పుడే అర్జునుడు జయద్రథుని గురించి చేసిన శపథాన్ని వారికి చేరవేశారు. జయద్రథుడు లజ్జితుడయ్యాడు, దిగులుపడ్డాడు. దుర్యోధనుడితో "అర్జునుడు నన్ను చంపాలని ప్రతిజ్ఞ పట్టాడట. నేను తిరిగి నా రాజ్యానికి వెళ్ళిపోతాను నేనిక పోరాడను" అన్నాడు.

దుర్యోధనుడప్పుడు "భయపడకు జయద్రథా! మేము నిన్ను కాపాడతాం. నేను, కర్ణుడు, చిత్రసేనుడు, శల్యుడు, ద్రోణుడు, అశ్వత్థామ ఇంకా తదితరులు నీవెక్కడున్నా నిన్ను రక్షిస్తాం. నా పదకొండు అక్షౌహిణీల



బలాన్ని నీకు రక్షణగా ఉండమని ఆజ్ఞాపిస్తాను" అని అతణ్ణి ఓదార్చి, నచ్చజెప్పాడు.

మర్నాటి ఉదయం ద్రోణుడు జయద్రథుడితో "కర్ణుడు ఆధిపత్యం వహించి బ్రహ్మాండమైన సేనతో బయల్దేరుతాడు. అశ్వత్థామ మిగతా యోధులు చతురంగ బలసమేతులై పన్నెండుమైళ్ళ దూరంలో నా వెనుక భాగాన ఉన్న చోట నిన్ను ఉంచుతాం" అని చెప్పగా, అందుకు సూచన ప్రకారం జయద్రథుడు నిలిచాడు. ద్రోణుడు తమ సేనను మూడు భయంకర వ్యూహాలుగా అమర్చాడు. అవి శకట, పద్మ, సూచీముఖ వ్యూహాలు. వాటిని అర్జునుడు ఎన్నటికి భేదించలేడని కౌరవుల నమ్మకం.

అర్జునుడు కౌరవసేనల్ని దారుణంగా తాకాడు. వరుసల వారీగా కూల్చేస్తున్నాడు. రథాలు, కాల్బలం ఎక్కడి కక్కడే దుమ్మయిపోతున్నాయి. తిన్నగాపోయి ద్రోణుని రక్షణలో ఉన్న పద్మవ్యూహ పరిసరాన్ని చేరుకున్నాడు. చేతులు జోడించి నమస్కరిస్తూ గురువైన ద్రోణాచార్యులతో "గురుదేవా! పుత్రశోక భారంతో ఆ జయద్రథుడితో పగ తీర్చుకునేందుకు వచ్చాను. మీ ఆశీస్సులు కోరుతున్నా" నన్నాడు. ద్రోణుడు ఫకాలున నవ్వి,



"అర్జునా! జయద్రథుణ్ణి చేరుకునే ముందు నువ్వు నాతో పోరాడి మరీ వెళ్ళాలి" అంటూ ఆచార్యుడు శరపరంపరలు పార్థుని రథంపై కురిపించాడు. ఇరువురూ వెనుకాడలేదు. క్రోధావేశాలతో పోరాడారు. అలా పోరు ఎంతోసేపు జరిగింది. ఇరువురిలో ఓటమి అనేదే కనబడలేదు.

సమయం గడుస్తూంది. యుద్ధం తెగేటట్లు లేదు. అలా కొనసాగుతూ పోవడంలో అర్జునుడికి క్షేమం లేదని కృష్ణుడు గుర్తించాడు. అర్జునుడితో "ధనంజయా మనం ముందుకు పోదాం. ద్రోణుడు విసుగు లేకుండా సంగ్రామం సాగిస్తూ నిన్నడ్డుకుంటున్నట్లు తోస్తూంది" అంటూ కృష్ణుడు రథాన్ని అక్కణ్ణుంచి తప్పించి ముందుకి నడిపాడు. "అర్జునా! మాతో పోరాడకుండా ముందుకి దూసుకుపోవడం నీకు ఉచితం కాదు" అంటూ ద్రోణుడు బిగ్గరగా కేక వేశాడు. వెంటనే అర్జునుడు, "నేను నా గురువుతో బహిరంగంగా యుద్ధం చెయ్యకూడదనే పోతున్నాను. గానీ.., దయచేసి నన్ను దీవించండి" అంటూ జయద్రథుణ్ణి అన్వేషిస్తూ మున్ముందుకి చొచ్చుకుపోయాడు.

అప్పటికిక సూర్యుడు పడమటి దిశను చేరుకోబోతున్నాడు. అర్జునుడాత్రంగా కృష్ణుడితో "నన్ను జయద్రథుడి చెంతకు చేర్చు. వ్యవధి ఇక ఎంతో లేదు" అంటూ కౌరవసేనకి భీతి కల్గించాడు. అర్జునుడి రథం తిన్నగా జయద్రథుడున్న వైపు దారి తీసింది. దుర్యోధనుడది గమనించి విపరీతంగా కలవరపడిపోయాడు. వడివడిగా ద్రోణుడి దగ్గరకు వెళ్ళి, విషయం చెప్పి, ఆయన్ని నానాదుర్భాషలాడాడు. అయినా ద్రోణుడు మాత్రం శాంతంగా, "చూడు నీ దుర్భాషలకి నేనేమీ నొచ్చుకోవడంలేదులే. వెళ్ళి ముందు అర్జునుణ్ణి రానీకుండా ఆపాలి. నేనిప్పుడీ చోటు వదలను. పాండవసేనలు మనల్ని పెద్దఎత్తున ముట్టడించేందుకు రానున్నాయి. ఏ మొచ్చినా రానీ, ఇప్పుడు ధర్మరాజుకూడ సోదరులెవ్వరూ లేకుండా ఒంటరిగా ఉన్నాడు. అతణ్ణి ప్రాణాలతో పట్టుకునేందుకు ఇదే సరైన తరుణం" అన్నాడు.

ఆచార్యులు చెప్పిన ప్రకారం దుర్యోధనుడు అర్జునుని ఎదుర్కొనేందుకు అసంఖ్యాకమైన సైనికబలంతో వెళ్ళాడు. అప్పటికే అర్జునుడు చాలాదూరం ముందుకి వెళ్లాడు. అర్జునుడు కృష్ణుడితో "కృష్ణా! ఆలస్యమవుతున్నట్లుంది. మనం ఇంకా త్వరపడాలి" అన్నాడు.

కృష్ణుడు రథాన్ని జయద్రథుడున్న వైపు పరుగులు పెట్టిస్తున్నాడు. అతడు కౌరవసేనల నడుమ అన్నివైపులా యోధానయోధుల పరిరక్షణలో ఉన్నాడు. దుర్యోధనుడు, కర్ణుడు, వృషసేనుడు, అశ్వత్థామ, కృపుడు ఇంకా తదితరులెందరో ఉన్నారు. వారంతా అర్జునుడు ముందుకి జొరబడి రాకుండా అడ్డుకోవాలనే ప్రయత్నంలోనే ఉన్నారు. అప్పటికిక సూర్యకిరణాల వేడిమి తగ్గి మసకచీకటి కాబోతూంది. అర్జునుడు వ్యూహం వైపు మరికొంత ముందుకు వెళ్ళాడు. అర్జునుడంతకు మునుపెన్నడూ లేనంత తీవ్రంగా పోరాడసాగాడు.

వ్యవధి ఎంతో లేదని కృష్ణుడు గమనించాడు. అర్జునుడితో "పార్థా! సూర్యాస్తమయానికి ముందుగా నీవనుకున్నట్లు జయద్రథుణ్ణి చంపడం వీలుకాదేమోననిపిస్తూంది. అందుకని నేను నా ఐంద్రజాలికమైన శక్తిని ప్రయోగిస్తాను. నా మాట విను. చెప్పింది విధిగా ఆచరించు.. ఇదే తరుణం" అంటూ "వెంటనే నీ మహాస్త్రాన్ని జయద్రథుడి మీద ప్రయోగించాలి" అని చెప్పి కృష్ణుడు సూర్యబింబానికి తన చక్రాయుధం అడ్డం పెట్టాడు. హఠాత్తుగా అంతటా చీకటి పడింది. దాంతో కౌరవ శిబిరంలో కలకలం బయల్దేరింది. అంతా తలెత్తి ఆకాశంలో సూర్యుడి వంక చూస్తున్నారు, అంత అకస్మాత్తుగా మరుగైపోయాడేమిటా అని.. జయద్రథుణ్ణి కాపాడేందుకేనేమోనని.. జయద్రథుడు 'బ్రతుకు జీవుడా' అనుకున్నాడు. తదేకంగా సూర్యబింబం వైపే చూస్తున్నాడు. కృష్ణుడు

అర్జునుడితో "గమనించు జయద్రథుడు తలపంకించి ఆకాశం వంక చూస్తున్నాడు. ఇదే సమయం" అనడంతోనే అర్జునుడు తన పాశుపతమహాస్త్రాన్ని ప్రయోగించాడు. అది తలను మొండెంనుండి వేరు చేసింది. ఆ తల నేలను పడేలోపున కృష్ణుడు "అర్జునా! నీ అస్త్రం అతడి శిరస్సును తీసుకుపోయి అతడి తండ్రి ఒడిలో వేసేటట్లు చూడు. అందుకు గల కారణమేమిటో తరువాత చెబుతా" అన్నాడు. అర్జునుడికి కృష్ణుడి మాటల్లో ఎంతో నమ్మకముండటం వల్ల అతడు చెప్పిన ప్రకారం ఆచరించాడు. ఆ బాణం జయద్రథుడి శిరస్సును తీసుకుపోయి అతడి తండ్రి ఒడిని చేర్చింది.

ఆ సమయంలో అతడు శమంతపంచక మనే తీర్థంలో తన సాయంకాలపు పూజావిధుల్ని నిర్వర్తించుకొంటున్నాడు. సంధ్యావందనాదుల కార్యక్రమం ముగించి లేచాడు. అంతలో జయద్రథుడి శిరస్సు ఆయన ఒడిలో పడి, అంతలోనే దొర్లుతూ నేలపై పడింది. తక్షణమే వృద్ధుడి తలపగిలి వెయ్యి తునకలై పోయింది.

ఈ లోపల కృష్ణుడు చక్రాయుధాన్ని సూర్యబింబం నుంచి తప్పించాడు. దినకరుడు మళ్ళీ యథాప్రకారం తేజోమూర్తియై ప్రకాశించసాగాడు. జయద్రథుణ్ణి రక్షించలేనందుకు కౌరవులెంతో వ్యథ చెందారు. కృష్ణార్జునులు తమ శంఖాల్ని పూరించారు. ధర్మరాజు ఆ శంఖ నాదాల్ని విని అర్జునుడి చేతిలో జయద్రథుడు మృతిజెందాడని గ్రహించాడు. అప్పుడు కృష్ణార్జునులు ధర్మరాజును కలుసుకునేందుకు వెళ్ళారు.

దోవలో అర్జునుడితో కృష్ణుడు, జయద్రథుడి తల తండ్రి ఒడిలో ఉంచడానికి గల కారణం వివరించాడు. జయద్రథుడి తండ్రి ఎంతో తపస్సు చేశాక కలిగిన సంతానమతడు. అతడు సామాన్యుడి చేతిలో మరణించడని అతడి శిరస్సు నేల మీద పడటానికి



కారకుడైన వాని శిరస్సు వెయ్యి ముక్కలయ్యేనని వరాన్ని పొందినవాడు. అందువల్లే అర్జునుడు అతడి మరణానికి కారకుడై అతడి శిరస్సును దేహంనుంచి వేరుచేసినా, అది నేలబడింది జయద్రథుడి తండ్రి ఒడినుంచే. అందువల్ల ఆ వృద్ధ క్షత్రియుడికి ఆ క్షణానే మరణం తటస్థించింది. కృష్ణుడు ఆ విధాన అర్జునుని కాపాడటం జరిగింది. నాటి యుద్ధంలో కౌరవసేనలో ఏడు అక్షౌహిణులు నశించాయి. ఆ గందరగోళంలో కర్ణుడు, తన రథం మీద దాగి ఉన్నట్లు భీముడు పసిగట్టి తటాలున కిందికురికి కర్ణుడి కేతనాన్ని చేజిక్కించుకున్నాడు.

అంతట కర్ణుడు నేలను దిగి పోరాడసాగాడు. పరస్పరం రంకెలు వేశారు. భీముడు చేతికందినదల్లా కర్ణుడిపై విసిరాడు. ఆఖరికి రథచక్రాలు ఏనుగు దంతాలు పీకి, పెల్లగించి గిరాటు వేశాడు. విపరీతమైన కోపోద్రేకంతో గట్టిగా పిడికిళ్ళు బిగించి కర్ణుడి తల మీద బలంకొద్దీ మోదుతూ, అర్జునుడు కర్ణుని చంపుతానని చేసిన శపథం గుర్తొచ్చి ఆపేశాడు. కర్ణుడు కుంతికి తాను చేసిన వాగ్దానం ప్రకారం భీముణ్ణి వధించకుండా వెనక్కు తగ్గాడు. అతడి ఎదుటనుంచి తప్పుకు వెళ్ళిపోయాడు.

## 5
## ఘటోత్కచుడి దుర్మరణం

యుద్ధ నిబంధనల్ని ఉల్లంఘించడం మొదలుపెట్టారు. సూర్యాస్తమయం అయినాకకూడ యుద్ధం కొనసాగుతూనే ఉంది. ఘటోత్కచుడు రాక్షసుడవడంతో అతడికి సమయమెంతో ప్రయోజనకరంగా ఉంది. రాక్షసుల బలం రాత్రివేళల్లో హెచ్చుతుందిగదా! కౌరవ సైన్యాల్ని భయంకరంగా ఢీకొన్నాడు. అతడి ఔద్ధత్యంవల్ల వేలల్లో కురుసేన నేలకొరిగిపోతూండడం చూసి దుర్యోధనుడికి గుండె జారిపోయి కర్ణుడితో "కర్ణా! వీణ్ణి తక్షణమే హతమార్చాల్సిందే లేకపోతే మన యావత్తు సైన్యమూ స్వాహా అయిపోతుంది" అన్నాడు.

కర్ణ-ఘటోత్కచుల మధ్య భయంకర పోరాటం చెలరేగింది. భీమపుత్రుడైన ఘటోత్కచుడు ఎన్ని మాయలు తంత్రాలు చేస్తున్నాడో చూసి కర్ణుడు విస్తుపోతున్నాడు. పంపించే అస్త్రాలన్నీ మరో అస్త్రాన్ని తాకి శక్తిహీనమై నశించిపోతున్నాయి. ఘటోత్కచుడు అదేపనిగా రాళ్ళు రువ్వటం మొదలెట్టాడు. కర్ణుడు విపరీతమైన క్రోధావేశంలో ఉన్నాడు. ఆ అసురుడు వేసిన ఒక బాణం అతణ్ణి గాయపరిచింది. అప్పుడిక ఆలోచించాడు. కర్ణుడి దగ్గర ఇంద్రుడిచ్చిన శక్తి అనే ఆయుధం ఉంది. అది గురిపెట్టి ప్రయోగిస్తే తప్పడమంటూ ఉండదు. ఘటోత్కచుణ్ణి తుదముట్టించాలనే తీవ్రమైన కాంక్షతో, మహాశక్తిమంతమైన ఆ శక్తి అనే ఆయుధాన్ని తీసుకున్నాడు. ఎన్నటికైనా అర్జునుడిపై ప్రయోగించాలనే ఉద్దేశంతో కర్ణుడు దాన్ని దాచి ఏళ్ళ తరబడిగా పూజిస్తూ వస్తున్నాడు.

ఈటెవంటి ఆ ఆయుధం రక్తాదాహంతో మృత్యుదేవత నాలుకల్లే ఉంటుంది. దాన్ని ఘటోత్కచుడి పైకి ప్రయోగించాడు. ఆ సమయాన అతడు గాల్లోంచి దూసుకువస్తున్నట్లు కురుసేనపై ప్రాణాపాయకరమైన బాణవర్షం కురిపిస్తున్నాడు.

కర్ణుడు చటుక్కున వేసిన ఆ శక్తి ఆయుధం వచ్చి ఘటోత్కచుణ్ణి తీవ్రంగా గాయపరచి ప్రాణాలు హరించేసింది. పాండవులంతా శోకసంతప్తులైనారు. భీముడు తన కుమారుడు మరణించడం చూసి నిర్ఘాంతపోయాడు.

ధర్మరాజుని సమీపించి భోరున విలపించాడు. భీముణ్ణి ఎలా ఓదార్చాలో ధర్మజుడికి బోధపడలేదు. కృష్ణుడు మాత్రం ఘటోత్కచుడు మరణించగానే, అర్జునుడు బ్రతికిపోయాడనే ఆనందంతో ఉక్కిరిబిక్కిరైపోయి అర్జునుణ్ణి పదేపదే కౌగలించుకున్నాడు. ఎందుకో అర్జునుడి కేమీ అర్థంకాలేదు.

ఘటోత్కచుడి మరణం తీరని నష్టం. భరించరాని దుఃఖమే అది. కానీ కృష్ణుడు, "అర్జునా! కర్ణుడి దగ్గరున్న ఆ మహాశక్తిమంతమైన ఆయుధం ఇప్పుడిక తిరిగి ఇంద్రుణ్ణి చేరుకుంది. నీకు దాన్నుంచి అపాయం తప్పింది. లేకపోతే కర్ణుడి చేతిలో నీకు మరణం తప్పేది కాదు సుమా!" అని చెబుతూ భీముణ్ణి, ధర్మరాజుని ఓదార్చాడు. ఈ విధంగా అర్జునుడి ప్రాణాలైతే దక్కాయి. కాకపోతే బోలెడంత మూల్యం ధారపోసి...!

ధర్మరాజు ఆగ్రహోదగ్రుడైయ్యాడు. ఆ కోపంలోనే కర్ణుణ్ణి ఎదుర్కోవాలనుకున్నాడు. అతడికి అభిముఖుడై ఉరికాడు. అంతట దారిలో వ్యాసుడు ప్రత్యక్షమై అతడితో "యుధిష్ఠిరా! ఘటోత్కచుడి మరణాన్ని గురించి విచారించకు. ఘటోత్కచుడు ఆ తీరుగా మరణించాలని విధి నిర్ణయం. అదృష్టవశాత్తు నీ కోసమే, అర్జునుడి నిమిత్తమే కర్ణుడు ఇంతకాలంగా దాచి ఉంచిన శక్తి ఆయుధాన్ని ప్రయోగించేశాడు. కనుక ఇకమీదట అర్జునుణ్ణి హతమార్చగల వాడెవ్వడూ లేడని తేలిపోయింది. నేను నీకు భవిష్యద్వాణి చెబుతున్నాను విను. ఇవాళనుండి అయిదు రోజులకి నీవీ పృథివికి అధిపతివవుతావు. వెళ్ళు తిరిగి వెళ్ళి నీ పరివారాన్ని కల్సుకో పద" అని హితవు చెబుతూ వ్యాస భగవానుడు అదృశ్యుడయ్యాడు.



# 6
# ప్రాణాలు హరించిన అబద్ధం

అర్ధరాత్రి కావచ్చింది. పోరాటం సాగుతూనే ఉంది. సైనికులంతా విపరీతంగా అలసిపోయారు. వారిని చూస్తే అర్జునుడికి చెప్పలేనంత జాలి కలిగింది. అంతట అతడు గొంతెత్తి అందరికీ వినవచ్చేటట్లు బిగ్గరగా "శత్రుపక్షంవారు సమ్మతిస్తే మన బలాలు, పరివారమూ కొద్దిసేపు విశ్రమిస్తారు. సూర్యోదయానే తిరిగి యుద్ధం ఆరంభిద్దాం" అని గొంతెత్తి బిగ్గరగా అన్నాడు. దానికి అంతా అంగీకరించారు.

అందరూ కొద్దిసేపు విశ్రమించారు. ఆ నడుమ వ్యవధిలో దుర్యోధనుడు ద్రోణుణ్ణి సమీపించి తన ఎప్పటి ధోరణిలో "మీకు అర్జునుడంటే పక్షపాతం" అదీ ఇదీ అంటూ నిందించటం మొదలుపెట్టాడు. ద్రోణుడు దుర్యోధనుణ్ణి మరోసారి బుజ్జగించి, సేనని రెండు భాగాలుగా విభజించి పోరాటానికై యుద్ధరంగానికి పంపించాడు. తాను రణక్షేత్రంలో ఉత్తర దిశకు వెళ్ళాడు. పాంచాలురు, మత్స్యవీరుల్ని ఎదుర్కొన్నాడు. ద్రోణుడు అచ్చంగా అగ్నిహోత్రుడిలా భగభగలాడిపోతున్నాడు. పదిహేనవరోజు యుద్ధం అది. అందరికీ అతి భీతావహంగా ఉంది. పాండవపక్షానున్న అతిరథ మహారథులంతా నేలకొరిగిపోతున్నారు. దాంతో తమకు విజయం దక్కదనే నిరాశలో కూరుకుపోతున్నారు. అర్జునుడు ద్రోణుడితో యుద్ధానికి తలపడ్డాడు.

ఇరువురూకూడ తాము పొందిన దివ్యాస్త్రాలన్నిటిని ప్రయోగించారు. అదొక లోకోత్తరమైన ద్వంద్వయుద్ధం. చిట్టచివరిసారిగా ద్రోణుడు బ్రహ్మాస్త్ర ప్రయోగానికి పూనుకోగా సైన్యమంతా భయభ్రాంతులకు లోనైపోయింది. భూమి కంపించిపోయింది. ఆకాశమంతా చీకట్లలముకున్నాయి. అర్జునుడి మీద ద్రోణుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. అందుకు సమాధానంగా అర్జునుడు మరో బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. ఒకదానొకటి కొట్టేసింది.

ద్రోణుడంతట అర్జునుడితో పోరు కట్టిపెట్టి పాంచాల సేన మీదికి దూకాడు. ద్రోణుడు యథాప్రకారం వాళ్ళ ప్రాణాలకి మృత్యువైనాడు. వేలాదిసంఖ్యలో పాండవసేనని తుడిచి పెట్టేస్తున్నాడు. దివ్యాస్త్రాలెన్నిటినో వారిపై ప్రయోగించి అస్త్ర పరిజ్ఞానంలేని ఆ అమాయకుల్ని ఉక్కిరి బిక్కిరి చేయసాగాడు.

ద్రోణుడు చేస్తున్నది అధర్మకార్యమని కృష్ణుడు గ్రహించాడు. కృష్ణుడు అర్జునుడితో "పార్థా! ద్రోణుడు శస్త్రసన్యాసం చేస్తేగానీ, అతణ్ణి హతమార్చడం ఎవ్వరికీ సాధ్యం కాదు. అతణ్ణి హతమార్చాలంటే ధర్మాన్ని విడిచిపెడితేగానీ గత్యంతరం లేదు. ఔనంతే వేరే మార్గమే లేదు. అతడి పుత్రుడు అశ్వత్థామ కనుక మరణిస్తే అతడిక శస్త్రం చేతపట్టడు. అందుకని, ఆయన కొడుకు అశ్వత్థామ యుద్ధంలో చంపబడ్డట్లు ఎవరైనా సరే ఒక అబద్ధం చెప్పాలి" అని సలహా చెప్పాడు. ఆ సలహా విని అర్జునుడు హడలెత్తిపోయాడు. అటువంటి అసత్యమాడేందుకతడెంతమాత్రమూ అంగీకరించలేదు. అధర్మ మార్గాన అడుగిడదల్చుకోలేదు.

కృష్ణుడేదైనా చెప్పాడంటే, దానికేదో అర్థం, ప్రయోజనం లేకపోదు అని ధర్మరాజు గాఢంగా తర్కించుకుని, పరిపరి విధాల తర్జన భర్జనపడి చివరికి ఎలాగైతేనేం అతడి సలహా పాటించి అబద్ధమాడేందుకు ముందుకువచ్చాడు.

భీముడు సేనామధ్యంలో ప్రవేశించి గద విసిరి దెబ్బకొట్టి 'అశ్వత్థామ' అనే పేరుగల ఏనుగును కూల్చాడు. వడివడిగా ద్రోణుణ్ణి సమీపించి అశ్వత్థామను చంపేశానని గొంతుచించుకుని అరచి చెప్పాడు.

భీముడన్న మాట విని ద్రోణుడు మొదట నిశ్చేష్టుడయ్యాడు కానీ, తన పుత్రుడు పరాక్రమవంతుడు, ఇదేదో కపటనాటకం అని భావించాడు. విషాదపూరితుడై, ధర్మజుని వైపు తిరిగాడు.. ఎందుకంటే ధర్మరాజు ముల్లోకాల ఆధిపత్యం కట్టబెడతామన్నా అబద్ధమాడేందు

కంగీకరించడని ఆయన దృఢవిశ్వాసం. అందుకని "నా పుత్రుడు మరణించాడన్న వార్త నిజమేనా?" ఆ విధంగా ద్రోణుడు తిన్నగా ధర్మజుని ప్రశ్నిస్తూంటే, ధర్మరాజు తడబడతాడేమోనని కృష్ణుడు కలవరపడిపోయాడు. వెంటనే యుధిష్ఠిరుడితో కృష్ణుడు "ద్రోణుడు కనుక మరొక్క అరపూట జీవించాడో, పాండవులకు సర్వనాశనమే" అని హెచ్చరిక చేశాడు. ఆపళంగా ధర్మరాజు తన గుండె రాయి చేసుకుని బొంకేందుకు సిద్ధపడ్డాడు. "ఔను ఆచార్యా చనిపోయింది అశ్వత్థామే" అని గొంతెత్తి చెబుతూ, కూడా "అనబడే ఏనుగు" అంటూ సన్నగా గొణిగాడు. ఆ చివరన్న మాటలు లోలోపలే అనడంవల్ల ద్రోణుడికి వినబడలేదు. కానీ, ధర్మరాజంతటివాడి నోట అబద్ధం బయటికి రావడమేమిటి, ఆయన రథచక్రాలు ఎప్పుడూ భూమిని తాకకుండా నాలుగంగుళాలు పైకి ఉండేవల్లా హఠాత్తుగా నేలను దిగి, తాకాయట.

"అధర్మమే వాడుకైన ఈ భూమికి ధర్మజుడి సత్యం, నిజాయితీ అల్లంత ఎత్తునే ఉండేది.. కానీ జయించాలనే కోరికతో ధర్మం విడిచి అధర్మాన్ని చేపట్టిన కారణంగా ధర్మజుని రథం కూడ పాపభూయిష్ఠమైన నేలకి దిగిపోయింది."

తన పుత్రుని మరణవార్తను విన్నాక ఇక ద్రోణుడికి పోరాడాలనే కాంక్ష అడుగంటిపోయింది. ఆ రథం మీదనే 'అశ్వత్థామ' అని గొణుగుతూ యోగసమాధి స్థితిలోకి వెళ్ళిపోయాడు. తల కొంచెం వాలింది. ఛాతీ ముందుకు పొడుచుకు వచ్చింది. సత్యపదార్థాన్ని ధ్యానిస్తూ 'ఓం'కార జపంలో మునిగిపోయాడు. ఆయనలోంచి కాంతికిరణం బయల్దేరి ఆకాశమార్గాన పయనించడం అయిదుగురు వ్యక్తులు సంజయుడు, అర్జునుడు, అశ్వత్థామ, కృష్ణుడు, యుధిష్ఠిరుడు చూశారు. మిగిలిన వారికంతటి జ్ఞానశక్తి లేదు. ద్రోణుడు ఈ మర్త్యాలోకాన్ని వదిలిపెట్టి బ్రహ్మైక్యమైనాడు.

ధృష్టద్యుమ్నుడు కత్తి దూసి చేతబట్టి ఆయనమీది కురికాడు. 'అయ్యో అవమానం అవమానం' అని వారి మధ్యలోంచి అరుపులు కేకలు వినవచ్చాయి. కానీ ధృష్టద్యుమ్నుడు ఒకే వ్రేటుతో ద్రోణుడి తల వేరుగా మొండెం వేరుగా చేసి జీవంలేని ఆ మొండాన్ని లాగి అవతల పారేశాడు.



ధృష్టద్యుమ్నుడసలు కత్తి దూయగానే అర్జునుడు "ఆగు ఆయన్ని వధించకు, వద్దు ఆయన మన గురువు" అని పెడబొబ్బలు పెట్టాడు.

# 7
# నారాయణాస్త్రం

ఆ విధంగా ద్రోణాచార్యుడు అంతమొందాడు. ద్రోణుడు మరణించాడనే యథార్థం దుర్యోధనుణ్ణి అంత తేలికగా నమ్మించలేకపోయింది. ఆయనంతటి వాణ్ణి వధించగల ధీమా ఎవరికుందనుకున్నాడు. కౌరవ సేనకిక చెప్పలేనంత అదురు పుట్టింది. ధృష్టద్యుమ్నుడి అకార్యంవల్ల తన తండ్రి ఆహుతయినందుకు అశ్వత్థామ విలపించాడు. కానీ మరుక్షణానే ఆగ్రహావేశుడైపోయాడు. అతడికి భయంకరమైన కోపం ముంచుకొచ్చింది. "మా తండ్రిని వధించినందుకు నే ప్రతీకారం తీర్చుకుంటా" నన్నాడు. "పరమదుర్మార్గుడైన ఆ ధృష్టద్యుమ్నుణ్ణి చంపి తీరుతా" నన్నాడు. "ఈ భూమ్మీద అతగాణ్ణి రక్షించగల వాడెవ్వడూ లేడూ. నా దగ్గర నారాయణాస్త్రమనే మహాస్త్రముంది. ఆ దేవదేవుడే మా తండ్రికి ఇచ్చిన అస్త్రమది. ధృష్టద్యుమ్నుణ్ణి అంతం చేసేందుకు ఆ ఒక్కటి నాకు చాలు. ఆ అస్త్రం ప్రయోగించేందుకు తరుణం వచ్చేసింది. దాంతో ఈ లోకాన్ని తుడిచి పారేస్తా" నంటూ పెడబొబ్బలు పెట్టాడు. అశ్వత్థామ అన్న ఆ మాటలు కౌరవుల్లో నూతనోత్తేజాన్ని కల్గించాయి.

పాండవులు భేరీనాదాల, శంఖధ్వనుల కోలాహలంతో ఆత్మానందభరితులైనారు. అంతలో అశ్వత్థామ తమ మీదికి దండెత్తి వస్తున్నజాడ కనిపెట్టారు. తక్షణమే రానున్న సరికొత్త ముప్పు ఎదుర్కొనేందుకు సంసిద్ధులయ్యారు. అశ్వత్థామ పాండవసేనని చిత్రవధచేయ నారంభించాడు. నారాయణ మహాస్త్రాన్ని మంత్రించి విడిచాడు. మరుక్షణంలోనే ఆకాశమంతా వేలాది బాణాలతో కప్పేసింది. జనం ఊరకే మసైపోతున్నారు. ఆ మహాస్త్రం కోపంనుంచి తప్పించుకోవడం ఎవ్వరికీ తరంకాదు.

ధర్మరాజు జరుగుతున్న కాండంతా చూస్తూనే ఉన్నాడు. నారాయణాస్త్రానికిగల శక్తి అతడెరుగనిది కాదు. ఇక ఎవ్వరూ మిగలరనే నిర్ధారణకి వచ్చేశాడు. రాబోయే ప్రమాదాన్ని కృష్ణుడూ గుర్తించాడు. కానీ అతడికి మార్గం తెలుసు. అందుకే ధర్మరాజుతో "యుధిష్ఠిరా! అనవసరంగా దాన్ని గురించి ఆందోళన పడవద్దు. ఆ అస్త్ర శక్తి నా కెరుకే. నువ్వు కనుక దానికి లొంగిపోయావనుకో అది ఎవ్వరికీ హానిచెయ్యదు. కానీ దాన్ని నీ వెదిరించదల్చావో దాని శక్తి ఇనుమడిస్తుంది. కాబట్టి నా మాట విను. నా సలహా పాటించు. దయచేసి మీరందరూ రథాలనుండి నేల మీదకి దిగి మీమీ ఆయుధాల్ని విసిరి అవతల పారేయండి. ఆ నారాయణ మహాస్త్రానికి సాగిలబడి మొక్కండి" అన్నాడు. అనడమే తరువాయిగా యోధులందరూ కృష్ణుని మాటను తలదాల్చి అస్త్రశక్తికి నేలపై సాగిలబడి ప్రణమిల్లారు.

భీముడు మాత్రం తలవొగ్గలేదు. "నేనంత పిరికివాణ్ణి కాను. పోరాడటమేగానీ లొంగడం ప్రసక్తే లేదు" అన్నాడు. ఆకాశానికి దూసుకుపోయిన బాణాలన్నీ క్రమంగా నేలపైకి జారుతూ కనిపించి, భీముణ్ణి పూర్తిగా కప్పివేశాయి. భయంకరమైన వేడి సెగలు అలుముకున్నాయి. భీముడు కాలిబూడిదై పోయుంటాడని అందరూ అనుకున్నారు.

అర్జునుడు తక్షణం వారుణాస్త్రాన్ని ప్రయోగించాడు. అది కొంతవరకా మంటల్ని ఆర్పింది. కృష్ణార్జునులిరువురూ అతడి దగ్గరకు పరుగునపోయి తమ శక్తినంతా వినియోగించి భీముడి శరీరంలోకి చొచ్చుకుపోయిన ఆయుధాల్ని పెల్లగించి లాగి పడేశారు. బలవంతాన అతణ్ణి నేల మీదికి లాక్కొచ్చారు. ఆ అస్త్రం భీముడికేమీ చెరుపు చేయలేదు. ఎలాగైతేనేమి బతికి బయటపడ్డాడు. చివరికి నారాయణాస్త్రం ఉపశమించినది.

**ద్రోణపర్వం సమాప్తం**

# బాలల మహాభారతం

## ఐదవ భాగము

ఆంగ్లమూలం : స్వామి రాఘవేశానంద

తెలుగు సేత : స్వామి జ్ఞానదానంద

చిత్రాలు : రవి



**రామకృష్ణ మఠం**

దోమలగూడ,

హైదరాబాద్ - 500 029.








# విషయ సూచిక


ప్రస్తావన

**కర్ణ పర్వం**

సర్వసేనాధిపతిగా కర్ణుడు ... 1

కర్ణుడు ధర్మరాజు ఎదుర్కొనడం ... 2

భీముడి పగ – దుశ్శాసన వధ ... 4

కర్ణుడి దుర్మరణం ... 4

**శల్య పర్వం**

నిహతులైన శల్య – శకునులు ... 8

దుర్యోధన వధ ... 11

అశ్వత్థామ సైన్యాధిపత్యం ... 13

**సౌప్తిక పర్వం**

అశ్వత్థామ ప్రతీకారం ... 13

కృష్ణుడు అశ్వత్థామను శపించడం ... 14

**స్త్రీ పర్వం**

భీముని కృష్ణుడు రక్షించడం ... 16

**శాంతి పర్వం**

ధర్మజుని పశ్చాత్తాపం ... 18

ధర్మజుని పట్టాభిషేకం ... 19

ధర్మరాజుకు భీష్ముని ఉపదేశం ... 20

**అనుశాసన పర్వం**

భీష్మ నిర్యాణం ... 22

**అశ్వమేధ పర్వం**

మరణించిన శిశువుకు ప్రాణభిక్ష ... 24

**ఆశ్రమవాసిక పర్వం**

ధృతరాష్ట్రుని వానప్రస్థం ... 26

విదుర నిర్యాణం ... 28

మృతవీరుల సాక్షాత్కారం ... 28

ధృతరాష్ట్రుని అంతిమ గడియలు ... 29

**మౌసల పర్వం**

కృష్ణుని అవతార సమాప్తి ... 29

**మహాప్రస్థానిక పర్వం**

పాండవుల స్వర్గారోహణం ... 32

**స్వర్గారోహణ పర్వం**

స్వర్గంలో యుధిష్ఠిరుడు ... 34

## ప్రస్తావన

ఈ ఐదవ భాగంతో మహాభరత వీరగాథ సమాప్తమౌతుంది. దీనిలో పదకొండు పర్వాలూ చకచకా సాగిపోవడం మనం గమనించవచ్చు. మహాయోధులు సత్వరం నేలకొరిగిపోయారు. కర్ణుడు, శల్యుడు అంతమయ్యారు. భీముడు తన రెండు భీకర ప్రతిజ్ఞలను ఈ భాగంలో నెరవేర్చడం మనం చూడవచ్చు. అంపశయ్య మీద పరుండివున్న భీష్ముడు ధర్మసూక్ష్మాలను యుధిష్ఠిరునికి ఉపదేశించడం ఈ భాగంలోనే చోటుచేసుకుంది. అయిష్టంగానే యుధిష్ఠిరుడు పట్టాభి షిక్తుడవడం, కురుక్షేత్ర సంగ్రామ పరిహారార్థం అశ్వమేధయాగం నిర్వర్తించడం కూడ ఇందులోనే చోటుచేసుకొన్నాయి. ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి, విదురుడు శాశ్వతంగా వానప్రస్థాశ్రమం స్వీకరించారు. విగతజీవుడై జన్మించిన పరీక్షిత్తును కృష్ణుడు పునర్జీవితుణ్ణి చేశాడు. తన యాదవకుల వినాశానికి ఏర్పాటు చేసి, వైకుంఠం చేరుకొన్నాడు. ప్రజారంజకంగా రాజ్యాన్ని కొన్ని ఏళ్లు పరిపాలించి పాండవులు కూడ స్వర్గారోహణ చేశారు. ఈ భాగంలోని ముఖ్య సంఘటనలు ఇవి.

చిత్ర విచిత్రంగా మలుపులతో, మెలికలతో సాగిన ఈ ఇతిహాసం చివరికి ధర్మమే జయిస్తుందని ఋజువుచేస్తూ ముగిసింది.



# కర్ణ పర్వం

## 1
## సర్వ సేనాధిపతిగా కర్ణుడు

కౌరవులకు పదిహేనవ రోజు యుద్ధం ఘోరంగా పరిణమించింది. కురుసేనలో విషాదం పెల్లుబికింది. ఏం చేయాలో తోచని స్థితిలో పడిపోయింది. దుర్యోధనుడు సైనికుల్ని ఎంతగానో ఉత్తేజపరిచాడు. విధి నిర్వహణ గుర్తు చేస్తూ సర్వవిధాలా ప్రయత్నించాడు. "మీలోని శౌర్య సాహసాలపట్ల నాకెంతో నమ్మకముండటం వలనే నేను యుద్ధం ప్రకటించాను. ఇప్పుడు మీరు నా ఆశని వమ్ము చేసేటట్లు కనిపిస్తున్నారు. యోధులందరూ నేడు కాకపోయినా మరోనాడు పోవాల్సినవారే. మనం విజయానికై పాటుపడాలి లేక వీరమరణం పొందాలి. కర్ణుడింకా మనతోనే ఉన్నాడు. మనకు విజయం చేకూర్చేందుకు సన్నద్ధుడై ఉన్నాడు. అర్జునుడికి కర్ణుడంటే సింహస్వప్నం. సింహాన్ని చూసి పారిపోయే లేడి వంటివాడు" అంటూ వారికి హితబోధ చేసి ఉత్సాహపరిచాడు.

దుర్యోధనుడి ఉత్సాహపూరితమైన మాటలు విన్న రాజులు మళ్ళీ యుద్ధంలో పాల్గొని పోరాడాలనే పట్టుదలను వ్యక్తంచేశారు. కర్ణుణ్ణి లాంఛనంగా కురుసేనాధిపతిగా అభిషిక్తుణ్ణి చేయమని అశ్వత్థామ సలహా ఇచ్చాడు. అందరూ ఆయన సలహాను ప్రశంసించారు.

కర్ణుడు తన శోభాయమానమైన రథంపై నిలబడినప్పుడు తేజస్సుతో నిండిన వదనం కౌరవులకెంతో ప్రోత్సాహాన్నిచ్చింది. యుద్ధం మళ్ళీ ప్రారంభమైంది. ధర్మరాజు, సేనాధిపత్యం వహించిన కర్ణుణ్ణి చూసి అర్జునుడితో "కర్ణుడొక్కడు తప్ప కౌరవపక్షాన ఉన్న వీరాధివీరులందరూ హతులయ్యారు. నువ్విక ఆ కర్ణుణ్ణి సంహరిస్తే మనకు జయం తథ్యం" అన్నాడు.

అంతట కర్ణుడు పాండవుల సేనలోనికి చొచ్చుకుపోతూ వారి సైన్యంలో పెద్దమొత్తాన్ని నిర్దాక్షిణ్యంగా చీల్చి చండాడాడు. నకులుడు ముందుకు వచ్చి కర్ణుడితో కొంతసేపు తలపడ్డాడు. భీముడు అశ్వత్థామని ఎదుర్కొని, ఓడించి నప్పుడు, ఆయన సారథి రణభూమినుంచి తప్పించి తీసుకువెళ్ళిపోయాడు. కొంతసేపు గడిచింది. కర్ణుడి ధాటికి నకులుడు నిలబడలేక యుద్ధభూమినుంచి మరలిపోయాడు. అత్యుగ్రమైన కర్ణుడి క్రోధం ముందు పాండవ సేనకు పోరాటం సాగించడం అసాధ్యమైంది. వారు దీపం వద్ద పురుగుల్లా రాలిపోతున్నారు. అక్కడ ద్వంద్వయుద్ధాలు చాలా జరిగాయి. కర్ణుడు పాండవ సైన్యాన్ని కూల్చేస్తూనట్లుగా మరోవైపు అర్జునుడు కురుసైన్యాల్ని దహించివేస్తున్నాడు. మిగిలిన సంశప్తకుల్ని ఎదుర్కొని, వారిలో అనేకులను సంహరించాడు. కొంతమంది పారిపోయారు. అర్జునునిలా భీముడు కూడా కౌరవసేనలో వేలాదిమందిని తుదముట్టించాడు. దుర్యోధనుడు ధర్మరాజుతో తలపడ్డాడు. వారి పోరాటం చాలాసేపు కొనసాగింది. చివరికి ధర్మరాజు దుర్యోధనుడిపై ఈటె విసిరాడు. అది వక్షాన్ని గాయపరచటంతో సుయోధనుడు మూర్ఛిల్లాడు. అప్పుడతణ్ణి కృతవర్మ రణరంగంనుంచి బయటకు తీసుకువెళ్ళాడు. సంధ్య పడేవరకు ఆ భయంకర పోరాటం కొనసాగింది. ఇరువైపుల అధిక సంఖ్యలో సైనికులు చనిపోయారు.

యోధులంతా నాటి రేయి విశ్రమించాక కర్ణుడు దుర్యోధనునితో ఆ రోజు యుద్ధం గురించి చర్చిస్తూ, ఇలా అన్నాడు: "రేపు రణరంగంలో అర్జునుని ఎదుర్కొంటాను. నేనతణ్ణి చంపటమో లేక అతడి చేతిలో నేను చావటమో జరుగుతుంది. అర్జునుని గురించి నాకు బాగా తెలుసు. మామా శక్తుల గురించి నీకు చెబుతాను. మా ఇరువురి వద్ద దివ్యాస్త్రాలు ఉన్నాయి. నా గురువు పరశురాముడు నాకు ఒసగిన 'విజయ' అనే విల్లు అర్జునుని గాండీవం కంటే శ్రేష్ఠమైనది. కాని అర్జునుడిది

దివ్యరథం. అర్జునుడి ధ్వజంపై సాక్షాత్తు ఆంజనేయుడు ఉండి కాపాడుతున్నాడు. కృష్ణుడు రథ సారథియై పగ్గాలుపట్టి గుఱ్ఱాల్ని నడిపిస్తున్నాడు. ఇవన్నీ అతడికి ఆధిక్యత ఇస్తున్నాయి. కృష్ణుడంతటి సారథి శల్యుడొక్కడే ఉన్నాడు. అతణ్ణి కనుక ఒప్పించి నాకు రథసారథ్యం చేయించ గలిగితే విజయం మనదే, సందేహమే లేదు." అనగానే, దుర్యోధనుడు తిన్నగా శల్యుడి దగ్గరకు వెళ్ళి, "శల్యా! ఈ కురుక్షేత్ర సంగ్రామంలో కర్ణుడికి రథసారథ్యం వహించమని కోరుతున్నాను. నీ ఈ సహాయంతో కర్ణుడు అజేయుడవుతాడు" అన్నాడు.

ఆ మాటలు విన్న శల్యుడు కోపంతో మండిపడి, "నన్నవమానిస్తున్నావు. కర్ణుడికి ఎందులోనూ తీసిపోని నేను ఎందుకు అతగాడికి రథసారథ్యం వహించాలి?" ఇలా అంటూ శల్యుడు లేచివెళ్ళిపోబోయాడు. కాని దుర్యోధనుడు పరిపరి విధాల బ్రతిమాలుకొని ఎట్టకేలకు కర్ణుడికి రథసారథిగా ఉండేందుకు అతణ్ణి ఒప్పించాడు.

## 2
## కర్ణుడు ధర్మరాజును ఎదుర్కొనటం

నాటి ఉదయం కర్ణుడు తనను రణభూమిలో పాండవులు యుద్ధంచేస్తున్న ప్రదేశానికి తీసుకువెళ్లవలసిందని, తాను వారిని హతమారుస్తానని శల్యుడితో చెప్పాడు. తన సేనను అందుకు తగ్గట్టు చాకచక్యంగా అమర్చుకున్నాడు. అక్కడ ధర్మరాజు – అర్జునులుకూడా తమ బలాల్ని ప్రతివ్యూహంలో సన్నద్ధంచేశారు. శల్యసారథ్యంలో రణభూమిలో కర్ణుని తిలకించిన కౌరవసేన పట్టలేని ఆనందంతో బ్రహ్మాండంగా హర్షనాదం చేసింది. కర్ణుడు నాడు శాయశక్తులా పోరాడాలని నిశ్చయించుకున్నాడు. వింటినుండి బాణాలు సర్రున ప్రవాహంలా దూసుకు వచ్చిపడుతున్నాయి. వాటిని అడ్డుకునే శక్తి ఏ ఒక్కరికీ లేకపోయింది.

ధర్మరాజు కర్ణుడి వైపుకి వెళ్ళి కయ్యానికి కవ్వించాడు. ఆ ఇద్దరూ తలపడటం – అది ఒక అపురూపమైన ద్వంద్వయుద్ధం. మొట్టమొదట ధర్మరాజు ప్రయోగించిన బాణపరంపరతో కర్ణుడు గాయపడ్డాడు. అయినా చలించలేదు. అదే సమయంలో సాత్యకి మరికొందరు యోధులు ధర్మరాజుకి సాయమై వచ్చారు. కాని కర్ణుడు వారందర్ని పరాజితుల్ని చేశాడు. అంతేకాదు ధర్మరాజు వింటిని విరిచాడు. చిన్నగా నవ్వుతూ తళతళమెరిసిపోతున్న అతడి కవచాన్ని ఛేదించాడు. అతడి ధ్వజాన్ని క్రిందపడగొట్టాడు. అతణ్ణి అన్ని విధాలా నిస్సహాయుణ్ణి చేశాడు. ఆ తరువాత ధర్మరాజుని తన వింటికొనతో తాకుతూ, "ఓ యుధిష్ఠిరా! ఇంటికి వెనుదిరిగి పో, లేకపోతే నీ తమ్ముడు అర్జునుడు యుద్ధంచేస్తున్న చోటికి వెళ్ళు! నువ్వు ఈ కర్ణుడితో ఎన్నటికీ పోరాడలేవు" అంటూ ఎద్దేవా చేశాడు.

కర్ణుడు యుద్ధభూమిలో యుధిష్ఠిరుడున్న చోటు నుండి కదిలాడు. కర్ణుడు ధర్మరాజుని అలా హేళనచేస్తూ మాట్లాడిన మాటలు విన్న భీముడు కోపాన్ని తమాయించుకోలేకపోయాడు. కర్ణుడి కోసం గాలించాడు. అప్పుడు కర్ణ–భీముల మధ్య భయంకర యుద్ధం ఆరంభమైంది. ఆ సంగ్రామం చాలసేపు కొనసాగింది. క్రోధావేశంలో ఉన్న భీముడు కర్ణుణ్ణి మూర్ఛిల్ల చేశాడు. రథం మీదనే కర్ణుడు స్పృహతప్పి పడిపోయాడు. సారథి రథాన్ని యుద్ధరంగం నుండి తప్పించి తీసుకుపోయాడు. మహాభయంకరమైన ఆ మారణకాండ చూసి కౌరవసైన్యం విపరీతమైన భయాందోళనలకు గురైంది. ఆ పిదప కొంతసేపటికి కర్ణుడు తెప్పరిల్లి లేచి పోరు కొనసాగించాడు.

కర్ణుడు సృంజయులను ఎదుర్కొన్నాడు. భీతిల్లి వారు అర్జునుణ్ణీ, కృష్ణుణ్ణీ సహాయంగా పిలిచారు. అప్పుడు కృష్ణుడు అర్జునునితో, "ధర్మనందనుడు కర్ణుడి చేతిలో తీవ్రంగా గాయపడి ఉన్నాడు. అతణ్ణి కలుసుకొని అనునయిద్దాం. ఆ తరువాత నువ్వు కర్ణుణ్ణి ఎదుర్కొని

తుదముట్టిద్దువుగాని" అని అన్నాడు. ఇలా అంటూ కృష్ణుడు రథాన్ని యుధిష్ఠిరుడున్న చోటుకు పోనిచ్చాడు. కాని కర్ణుడితో పోరాడి అతణ్ణి హతమార్చవలసిందిపోయి అర్జునుడక్కడికి రావటం ధర్మరాజుకి ససేమిరా నచ్చలేదు. తక్షణమే రణరంగానికి వెళ్ళి కర్ణుణ్ణి ఎదుర్కోమని ఆదేశించాడు.

## 3
## భీముడి పగ - దుశ్శాసన వధ

అర్జునుడు, కృష్ణుణ్ణి కర్ణుడున్న ప్రదేశానికి తీసుకువెళ్లమన్నాడు. కృష్ణ సారథ్యంలో అర్జునుని రథం తమకేసి రావడం శల్యుడు చూశాడు. దుర్యోధనుడి దృష్టి అంతా కర్ణుడి మీదనే ఉంది. అక్కరవస్తే సాయపడేందుకు తన సోదరుల్లో కొందరిని కర్ణుడికి తోడుగా పంపాడు. కౌరవసేనలో అధిక సంఖ్యాకుల్ని హతమార్చిన అర్జునుడు, కర్ణుణ్ణి ముఖాముఖీ ఎదుర్కోవడానికి సంసిద్ధుడై ఆరాటపడుతున్నాడు.

దుర్యోధనుడు, అతడి అనుజులు చాలామంది యుద్ధంలో పాల్గొనడం జరిగింది. వారందరిలోనూ దుశ్శాసనుడు అగ్రభాగంలో నిలబడ్డాడు. అతణ్ణి చూసి భీముడు వెటకారంగా నవ్వుతూ 'ఊ, రా! దుశ్శాసనా నీ కోసమే నిరీక్షిస్తున్నాను. ఈ ద్వంద్వయుద్ధం కోసమే ఏళ్ళతరబడిగా ఎదురుచూస్తున్నా' అని భీముడు తనలో అనుకొంటున్నప్పుడే దుశ్శాసనుడు భీముడిపై బాణాలు వదలడం మొదలుపెట్టాడు. సూర్యతేజస్సుతో వెలిగిపోతున్న ఒక బాణం రివ్వున దూసుకువచ్చి భీముడికి తగిలింది. రథం మీదనే మూర్ఛిల్లి పడిపోయాడు. కొద్దిసేపట్లోనే తేరుకుని, "నాకు బాణంతో వ్రేటైతే నీకు గదతో ఆఘాతం, కాచుకో" అని గర్జిస్తూ భీముడు ముందుకురికి దుశ్శాసనుడి మీదికి గద విసిరాడు. గద తాకిడికి తునాతునకలైన రథంనుండి దుశ్శాసనుడు పది క్రోసుల దూరాన నేలకూలి బాధతో గిలగిలా కొట్టుకోసాగాడు.

అప్పుడు భీముడు తాము దుర్యోధనుడి వల్ల అనుభవించిన బాధలన్నింటిని నెమరు వేసుకున్నాడు. దుశ్శాసనుణ్ణి చూస్తున్నప్పుడు నిండుసభలో అలనాడు కులస్త్రీ అయిన ద్రౌపదిని పరాభవించడం గుర్తొచ్చింది. భీముడు, కర్ణ దుర్యోధనాదు లందర్ని సంబోధిస్తూ , "నేడు ఈ దుర్మార్గుడైన దుశ్శాసనుణ్ణి నేను హతమార్చుతాను . అతగాణ్ణి కాపాడుకోగల ధీరులెవరైనా మీలో ఉంటే ముందుకు వచ్చేందుకు సాహసించండి" అంటూనే, తటాలున దుశ్శాసనుడి మీదికి దూకాడు. కర్ణ దుర్యోధనాదులు ఎదుటే అతడిపై కలియబడ్డాడు. చూపులతోనే కబళించేస్తూ నేలకూలిన తన శత్రువుని కొంతసేపు భీముడు తదేకంగా చూసి తన పాదంతో అతడి పీకను అదిమిపెట్టాడు. కత్తితో అతడి రొమ్మును చీల్చి ఆ వేడినెత్తురు త్రాగాడు.

దుశ్శాసనుడి కళేబరాన్ని చూస్తూ భీముడు ఫకాలున నవ్వి, "ఓ వీరాధివీరుల్లారా! అలనాడు దుశ్శాసనుడి విషయంగా నేను చేసిన శపథం ఇంత కాలానికి నేడు నెరవేర్చుకున్నాను. ఇకపోతే నా మరో శపథానికి ఈ సమరయజ్ఞంలో బలికావాల్సిన జీవం మరొక్కటుంది. అది దుర్యోధనుడనబడే నరపశువు. అదికూడ నెరవేరుస్తాను అన్నాడు".

భీముడి శౌర్యం చూసి కర్ణుడికి వణుకు పుట్టింది. క్షణకాలం మనస్సు కలవరపెట్టినా, చివరికి ముఖాముఖిని ఎదుర్కోక తప్పదనే నిర్ణయానికొచ్చాడు కర్ణుడు.

## 4
## కర్ణుడి దుర్మరణం

అర్జునుడు కనబడగానే కర్ణుడు మళ్ళీ యుద్ధభూమికి కదిలాడు. రథం వచ్చి ముందు ఆగింది. వెళ్ళి సరిగ్గా అర్జునుడి ఎట్టయెదుట నిలిచాడు.

లోకంలోనే సాటిలేని మేటివీరులు, ధనుర్విద్యావిశారదులైన ఆ ఇరువురు యోధులు ముఖాముఖి ఎదురొడ్డి నిలబడ్డారు. కర్ణార్జునులిరువురూ

కవచాలు ధరించారు. కత్తులు చేతబూనారు. వారి రథాలకు తెల్లని గుర్రాలు పూన్చివున్నాయి. ఇరువురి కళ్ళు ఎర్రగా ఉన్నాయి. శంఖంవంటి కంఠం, సింహం నడుములాంటి నడుము, మెడలో బంగారు ఆభరణాలు ధరించి ఉన్నారు. రెండు ఎనుబోతులో, రెండు మదపుటేనుగులో, రెండు విషనాగులో తలపడబోతున్నట్లుగా ఉంది. అసమాన బలపరాక్రమవంతులు, రణకౌశలం గల వారిద్దరు యుద్ధభూమిలో సూర్యచంద్రుల్లా ప్రకాశించారు. అంతలో కర్ణుడి పుత్రుడు వృషసేనుడు అవేశంతో భీముడి పైకి ఉరికాడు. ఆ భయంకర పోరాటంలో వృషసేనుడు అపూర్వ ధైర్యసాహస నైపుణ్యాలతో భీమసేనుణ్ణి, అర్జునుణ్ణి మరికొందరిని గాయపరిచాడు.

ఎర్రబారిన కళ్ళతో అర్జునుడు దుర్యోధన అశ్వత్థామల నాయకత్వంలోని కురువీరులను, కర్ణుని ఉద్దేశించి, “ఓ కర్ణా! నీ సమక్షంలోనే నీ కుమారుని చంపుతాను. నేను లేనప్పుడు మీరంతా ద్రోహబుద్ధితో ఒంటరిగా ఉన్న నా తనయుణ్ణి హతమార్చారు గదా! అందుకే ఇప్పుడు నీ కొడుకు నీ కళ్ళముందే గిలగిల కొట్టుకు నేలకూలడం కళ్ళారా చూడనున్నావు. నీ నాయకత్వంలో ఉన్న కౌరవసైన్యం వచ్చి అతగాణ్ణి ఎలా రక్షిస్తుందో నేను చూస్తా…ఊ, కాచుకో. అటుపిమ్మట దుర్యోధనుడికి చెడు సలహాలిచ్చి ఈ కలహానికి మూలకారకుడవైన నిన్ను తుదముట్టిస్తాను” అని హెచ్చరిస్తూనే అర్జునుడు, వృషసేనుడి మీద శరపరంపర గుప్పించాడు.

మిక్కిలి వాడియైన నాల్గు బాణాలు వదిలాడు. అవి అతడి భుజాల్ని తలను ఖండించేశాయి. దానితో కర్ణసుతుడు రథం మీదనుంచి దొర్లి నేలకొరిగిపోయాడు. తన కళ్ళ ఎదుటే అర్జునుడి బాణాలకు గురై అసువులుబాసిన కుమారుణ్ణి చేతుల్లోకి తీసుకుని కర్ణుడు ఎంత దుఃఖించాడో చెప్పతరం కాదు. తక్షణం అపరిమితమైన క్రోధంతో అర్జునుడి మీదికి ఉరికాడు.

అశ్వత్థామ వారి యుద్ధసన్నాహాలన్నీ చూసి, ‘యుద్ధ విరమణే’ మంచిదనే నిర్ణయానికి వచ్చి, దుర్యోధనుణ్ణి సంబోధిస్తూ, “నిష్ప్రయోజనమైన ఈ పోరాటం చాలించి, పాండవులతో సంధి చేసుకోవడం క్షేమం” అంటూ మనస్ఫూర్తిగా సలహా ఇచ్చాడు. “ఏమిటి సంధి చేసుకోవడమా? అది ఎన్నటికి జరగదు. సమరం సాగించాలి. విజయమో వీరస్వర్గమో తేలిపోవాలి” అంటూ దుర్యోధనుడు గర్జించాడు.

అంతలో కర్ణార్జునుల మధ్య యుద్ధం తీవ్రరూపం దాల్చింది. హఠాత్తుగా అప్పుడు అర్జునుడు దివ్యాస్త్రాలను ప్రయోగింప నిశ్చయించి, ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. కర్ణుడు అందుకు ప్రతిగా వారుణాస్త్రాన్ని ప్రయోగించాడు. అప్పుడర్జునుడు ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. అది యావత్తు కౌరవసైన్యంపై బాణవర్షం కురిపించడం మొదలెట్టింది. కర్ణుడు అర్జునుడిపై కోపంతో మండిపడుతూ భార్గవాస్త్రాన్ని ప్రయోగించాడు. అది అర్జునుడు వేసిన బాణాలన్నిటిని వమ్ముచేసివేసింది. ఈ అస్త్రప్రయోగంవల్ల ఇరుపక్షాల సైన్యం అమితంగా బాధింపబడ్డారు. భీముడి ఆవేశానికి పట్టపగ్గాల్లేవు. అతడు అర్జునుడితో, “అర్జునా! కర్ణుడు నిన్ను బాణాలతో ముంచివేస్తున్నాడు. నువ్వు అతణ్ణి అదుపు చేయలేకుంటె ఆ పని నా కప్పగించు. ఈ గద తిప్పి ఒకే ఒక్క దెబ్బతో కర్ణుణ్ణి మట్టి కరిపిస్తాను” అన్నాడు.

కృష్ణుడు భీముడంటున్న మాటలు విని అర్జునుడితో, “ఔను పార్థా! భీముడన్న మాట నిజం. నువ్వు నీ యావత్ శక్తిని కూడగట్టి కర్ణుణ్ణి అంతం చెయ్యి” అని పురిగొల్పాడు.

కర్ణుడు వేసిన బాణం అర్జునుడి వింటి నారిని తెంపేసింది. అప్పుడర్జునుడు మరో ధనుస్సు అందుకున్నాడు. చిరునవ్వుతో కర్ణుడు ఆ ధనుస్సునుకూడ ఖండించాడు. ఆ విధంగా పదకొండుసార్లు జరిగింది.

అర్జునుడు ఆగ్రహోదగ్రుడై కర్ణుడిపై ఎడతెరిపి లేకుండా బాణాలు కురిపించి ముంచేశాడు. అర్జునుణ్ణి ఓడించడం అనుకున్నంత తేలిక కాదని కర్ణుడు గ్రహించి, నాగాస్త్రం ప్రయోగించాలని నిశ్చయించాడు. అది విషజ్వాలలు చిమ్ముతుంది. అర్జునుణ్ణి అంతం చేయడం కోసమే దాన్నింతకాలం ఉపయోగించకుండా భద్రంగా ఉంచాడు. ఆ దివ్యాస్త్రాన్ని ప్రయోగించేందుకు వింట బాణం సంధించి ఎక్కుపెట్టాడు.

ఇక విజయం తనదేననే నిశ్చయంతో కర్ణుడు, "ఓ అర్జునా! కన్నుమూసే ముందు లోకాన్నంతా ఒక్కసారి కలయజూసుకో. భూమ్మీద ఇక ఇదే నీ తుది ఘడియ" అని అస్త్రాన్ని సంధించాడు. వాయువుకంటె వేగంగా మెరుపు తీగలా సర్రున నిప్పులు కక్కుతూ అది అర్జునుణ్ణి సమీపించింది. అంతా ఊపిరిబిగబట్టి చూస్తూ నిల్చుండిపోయారు.

ఆ అస్త్రం అర్జునుణ్ణి చంపివేయడం ఖాయం అని పాండవులు కూడా భావించారు. కాని కర్ణుని పథకాన్ని వమ్ముచేస్తూ మరొక విధంగా జరిగింది. కృష్ణుడు తటాలున రథాన్ని కాలితో అదమడంతో అది భూమిలో మూరెడు లోతుకి క్రుంగిపోవడంతో ఆ అస్త్రం అర్జునుడి శిరస్సును ఛేదించలేకపోయింది. అతడి అందమైన కిరీటాన్ని మాత్రం పడగొట్టింది. అది ఒకప్పుడు పార్థుడి శిరస్సున ఇంద్రుడు పెట్టిన కిరీటం. ఆ తరువాత ఆ నాగబాణం తిరిగి కర్ణుణ్ణి చేరుకుని, "నన్ను మరోసారి



విజయం నీదే..." అని ప్రోత్సహించింది. కాని, కర్ణుడు ఆ బాణాన్ని రెండుసార్లు ప్రయోగించరాదు; అది వందమంది అర్జునుల్ని ఒక్కపెట్టున చంపగల్గినప్పటికీ రెండోసారి ప్రయోగించడం నిషేధం. "ఈ కర్ణుడు ఇతరుల సాయం అర్థించడు. నా వద్ద ఇతర



తిన్నగా ప్రయోగించు. అర్జునుడి అంతం చూడగలవు" అంది. "ఎవరు నువ్వు?" అని నిప్పులు చెరుగుతున్న ఆ అస్త్రాన్ని ప్రశ్నించాడు కర్ణుడు.

"అర్జునుని శత్రువుని" అని ఆ సర్పం సమాధానమిస్తూ, "అతడు నా తల్లిని చంపినవాడు కనుక అతడి మీద పగ తీర్చుకోవాలి. ఊ, నన్ను ప్రయోగించు...

అస్త్రాలున్నాయి. అవి ప్రయోగిస్తాను. నాగమా! సంతోషంగా మరోచోటికి వెళ్ళిపో" అంటూ నాగాస్త్రానికి ఉద్వాసన పలికాడు.

ఆ సర్పం తిరుగుముఖంపట్టి అర్జునుడి, వైపు దూసుకు వచ్చింది. దాని రాక పసిగట్టిన కృష్ణుడు అర్జునుడితో "ఖాండవవనం దహించినప్పుడు ఈ సర్పం

తల్లినే నువ్వు చంపింది" అని తెలిపాడు. వెంటనే ఆ ఎగిరివస్తున్న నాగం మీద అర్జునుడు ఆరు బాణాలను వరుసగా గురిపెట్టి ప్రయోగించాడు. అంతటితో ఆ పాము తునాతునకలై నేల రాలిపడింది. కృష్ణుడు అంతాముగిసిన తరువాత నేలలో దిగబడిన రథాన్ని పైకిలేవనెత్తి దాన్ని యథాస్థితికి తెచ్చాడు.

రోషావేశాలతో కందిపోయిన అర్జునుడు కర్ణుణ్ణి అంతం చేయాలని బాణం ఎక్కుపెట్టాడు. సరిగ్గా అదే సమయంలో కర్ణుడి రథచక్రం హఠాత్తుగా బురదలో దిగబడింది. ఆ బురదలోంచి దాన్ని తీసేందుకు తక్షణం అతడు రథం నుండి దిగాడు. "ఆగు, ఆగు" అని అతడు ఎలుగెత్తి అరుస్తూ, "నా రథం నేలలో దిగబడింది. నువ్వు యుద్ధ నిబంధనలు తెలిసినవాడివే గదా! మొదట దీన్ని లేవనెత్తి సరిజేయనీ, తరువాత నీ ఇష్టమొచ్చినట్లు పోరాటం సాగించవచ్చు" అన్నాడు. అర్జునుడు తటపటాయించాడు.

అప్పుడు కృష్ణుడు కర్ణుడితో, "ఔను ఇతరులకు నియమనిబంధనలు సూచించేందుకిది మంచి తరుణం కదూ? ఆనాడు ఏకవస్త్రయైన ద్రౌపదిని రాజులందరి ముందుకు ఈడ్చుకు వస్తున్నప్పుడు ఈ నియమాలన్నీ ఏమయ్యాయి? పాచికలాటలో శకుని మోసం చేయడం, అరణ్యవాసానంతరం పాండవులకు ఇస్తామని వాగ్దానం చేసిన రాజ్యాన్ని ఇవ్వకపోవడం జ్ఞాపకం చేసుకో. అలనాడు నిండుసభలో పరాభవింపబడి ఒంటరిగా నిలబడి ఉన్న ద్రౌపదిని చూసి నువ్వు నవ్వడమూ, ఆపైన మరొకరిని వరుడిగా ఎన్నుకోమంటూ ఆక్షేపించడమూ జ్ఞప్తికి తెచ్చుకో. అభిమన్యుణ్ణి మోసగించి, హతమార్చారే... మరిచారా? ఈనాడు నువ్వు ఏకరువు పెడుతున్న నిబంధనలన్నీ అప్పుడేమయ్యాయి? చెప్పు" అని గర్జించాడు. అందుకు కర్ణుడు నిరుత్తరుడై నిలబడ్డాడు. రథచక్రాన్ని భూమిలోంచి పెల్లగించేందుకు రెండు చేతులా పెనగులాడాడు.

"అర్జునా! ఇక ఆలస్యం చేయకు, అతణ్ణి వధించు. రథచక్రం ఎత్తే లోపల తుదముట్టించు" అంటూ బిగ్గరగా కేకపెట్టాడు. తక్షణమే అర్జునుడొక మహాతీవ్రమైన బాణాన్ని ఎన్నుకుని వింట ఎక్కుపెట్టి "ఈ కర్ణుణ్ణి యమలోకానికి చేర్చి మృత్యుదేవత కర్పింతువుగాక!" అంటూ ప్రయోగించాడు.

కర్ణుడి శిరస్సు తెగి నేలబడింది. కాని మొండెం మాత్రం రణభూమిలో నిటారుగా నిలబడి ఉండిపోయింది. కొండ మీద నుంచి జాలువారే సెలయేరులా కర్ణుడి శరీరంలోని గాయాలనుండి నెత్తుటి జల్లులు విరజిమ్ముతూ ఏరులై ప్రవహించాయి. కౌరవసైన్యం భయంతో చెల్లాచెదరైపోయింది. ఇక ఆ దెబ్బనుండి తెప్పరిల్లుకోలేదు. పాండవులు విజయానికి మరో అడుగు చేరువయ్యారు.

# శల్య పర్వం

## 1
## నిహతులైన శల్య - శకునులు

కర్ణుడు మరణించడంతో దుర్యోధనుడు దుఃఖ సాగరంలో మునిగిపోయాడు. ఈ విషాదవార్తను స్వయంగా వెళ్ళి భీష్ముడికి అందజేశాడు. భీష్ముడు దుర్యోధనుని ఓదార్చి పంపించాడు. మర్నాటి ఉదయం కౌరవసైన్యానికి నాయకుడిగా శల్యుడు ఎన్నుకోబడ్డాడు.

అది పద్దెనిమిదోనాటి బ్రహ్మాండమైన పోరు. యుధిష్ఠిరుడు పాండవ సైన్యాన్ని నడుపుతున్నాడు. శల్య - యుధిష్ఠిరుల పోరాటం ప్రారంభమైంది. శల్యుడు యుధిష్ఠిరునిపై అతివేగంగా బాణాలు గుప్పిస్తున్నాడు. యుధిష్ఠిరుడు ఏమాత్రం చలించకుండా వీరోచితంగా పోరాడుతున్నాడు. శాంతమే మూర్తీభవించినట్లుండే ధర్మజుడు ఇంతటి క్రోధావేశంతో పోరాడటం చూసిన ప్రతివారూ ఆశ్చర్యచకితులయ్యారు.

ఇరువైపుల సమఉజ్జీలై – సరిసమానంగా పోరాడటం ఎంతోసేపు సాగింది. చివరికి యుధిష్ఠిరుడు తన వజ్రబల్లెం తీసి, శల్యుడివంక కోపంగా చూస్తూ మంత్ర ప్రయోక్తంగా తన బలమంతా ఉపయోగించి విసిరాడు. శల్యుడు దాన్ని పట్టుకోవడానికి దూకాడు కాని అది అతడి వక్షస్థలాన్ని ఛేదించివేసింది, నెత్తురు ధారగా పైకి చిమ్మింది. అంతే అతడు చేతులు జాపి యుధిష్ఠిరుని వైపు చూస్తూ నేలకొరిగిపోయాడు. కౌరవసేనకు నాయకత్వం వహించిన మహాయోధుడు శల్యుడుకూడ నిహతుడైనాడు. అప్పుడిక కురుసైనికులు భయంతో పిక్కబలం చూపసాగారు.

దుర్యోధనుడు వారిని అధైర్యపడి పారిపోవద్దని ప్రోత్సహించి యుద్ధానికి పురిగొల్పాడు. రారాజు పాండవసేన నడుమచిక్కి పోరాటం సాగించడం శకుని చూశాడు. ఇక అప్పటికి దుర్యోధనుని తమ్ముళ్ళలో సుదర్శనుడనే ఒక్కడుమాత్రం మిగిలాడు. భీముడు వాడియైన ఒక బాణం అతడిపై ప్రయోగించాడు. దానితో సుదర్శనుడి తల తెగిపోయింది. ఆ విధంగా ధృతరాష్ట్రుడి సంతతిలో దుర్యోధనుడు తప్ప అందరూ హతులైనారు.

శకుని సహదేవుడున్న సైనికదళాన్ని ముట్టడించాడు. సహదేవుడిపై ఒక బల్లెం విసిరాడు. అది పోయి అతడి ఫాలభాగాన్ని రాచుకుపోయింది. వారు హోరాహోరి పోరాడారు. కొంతసేపైన తరువాత సహదేవుడు పదునైన బాణాన్ని వదిలాడు. అది తిన్నగాపోయి శకుని మెడను తెగనరికింది, కౌరవుల దుష్కార్యాలన్నిటికీ మూలమైన శకుని తల నేలమీద పడి దొర్లింది. దుర్యోధనుడు చుట్టూ ఒక్కసారి కలయజూశాడు. అతడి పక్షాన కృతవర్మ, కృపుడు, అశ్వత్థామ తప్ప ఎవ్వరూ మిగల్లేదు. పదకొండు అక్షౌహిణుల సైన్యంలో ఒక్క సైనికుడుకూడ జీవించిలేడు.

సుయోధనుడి దుఃఖానికి అంతులేదు. ఏం చేయాలో తోచడంలేదు. శరీరమంతా అగ్నిగోళంలా భగభగ మండిపోతోంది. రణరంగంనుంచి బయటకు నడక సాగించాడు. త్రోవలో వెళుతూండగా సంజయుడు కనిపించి పాండవులు అతని కోసం గాలిస్తున్నట్లు చెప్పాడు. ఆ మాట విని దుర్యోధనుడు, "సంజయా! నాకిక జీవించాలని ఆశ లేదన్నానని మా తండ్రిగారితో చెప్పవయ్యా; నా దేహాన్ని చల్లబర్చుకోవాలి. ఏదైనా మడుగులోకిపోయి కూర్చుంటాను. మా తల్లిదండ్రులకు నా వందనాలు అందచెయి" అని చెబుతూ చేత గదను ధరించి 'ద్వైపాయన హ్రదం'లో (అదో సరస్సు) ప్రవేశించాడు. అతడికి జలస్తంభన విద్య తెలుసు కనుక మడుగు లోపలే చాలాసేపు ఉండిపోయాడు.

దుర్యోధనుడు ద్వైపాయనహ్రదమనే మడుగులో దాగినట్లు సంజయుడి నుండి కృతవర్మ, కృపాచార్యుడు, అశ్వత్థామ తెలుసుకొని అక్కడికి వెళ్ళి అతణ్ణి పిలిచారు: "ఓ రాజా! మన మిత్రులంతా మరణించారు. మనం ఇప్పుడు యుధిష్ఠిరునితో యుద్ధం చేద్దాం. అతణ్ణి చంపనన్నా చంపాలి, లేదా మనమైనా చావాలి" అంటూ పౌరుషవాక్కులు పలికారు.

దుర్యోధనుడు "మీరిక్కడికి రావడం మంచిదైంది" అని మడుగు లోపలినుండే బిగ్గరగా కేకపెట్టాడు. "మనకిప్పుడు విశ్రాంతి కావాలి. ఈ రాత్రికి విశ్రాంతి తీసుకుందాం. రేపు పోరాటం సాగిద్దాం" అన్నాడు. ఆ మాట విని అశ్వత్థామ, "లేవండి – ఇదే యుద్ధానికి సమయం. 'జయం మనదే' అని ప్రమాణం చేసి చెబుతున్నా. ఈ రాత్రి నేను నా ఒంటి మీద నుండి కవచాన్ని తీయను" అన్నాడు.

ఇలా జరుగుతున్న వీరి సంభాషణను ఆ సరస్సు దగ్గర తచ్చాడుతున్న కొందరు వేటగాళ్ళు వినడం జరిగింది. ఏదో బహుమానం ఇస్తారనే ఆశపడి వారా సంగతి మోసుకుపోయి పాండవులతో చెప్పారు. వెంటనే

యుధిష్ఠిరుడు, అతడి సోదరులు, వారివెంట కృష్ణుడు బయల్దేరి మడుగుచెంతకు వచ్చారు. ఎవరో వస్తున్నట్లు అలికిడి విని అశ్వత్థామాదులు అక్కణ్ణుండి తప్పుకున్నారు.

దుర్యోధనుడా మడుగులోనే దాగి ఉంటాడని యుధిష్ఠిరుడు గ్రహించాడు. దుర్యోధనుణ్ణి సంబోధిస్తూ, "కౌరవులంతా నాశనమైతే మాత్రం నువ్వు పోయి ఆ నీటిలో దాక్కోవాలా? రా, వచ్చి మాతో యుద్ధం చెయ్యి. నీ గౌరవాభిమానాలు ఏమైయ్యాయి? నువ్వు క్షత్రియుడవు. క్షత్రియుడు యుద్ధం చెయ్యాలి. మమ్మల్ని చంపి రాజ్యమంతా ఏలుకో, లేదా మరణించి శాశ్వతంగా నిద్రపో" అన్నాడు.

దుర్యోధనుడికి మాటలతో పోట్లు పొడిచినట్లయింది. ఆ నీళ్ళల్లో నుండి ఇలా జవాబిచ్చాడు. "యుధిష్ఠిరా! నేనీ మడుగులోకి నా ప్రాణాల్ని కాపాడుకోడానికి రాలేదు. నా లోపల



మండుతున్న అగ్ని జ్వాలల్ని చల్లార్చుకునేందుకు వచ్చి కూర్చున్నాను. నా మనస్సు యుద్ధం వైపు మొగ్గటం లేదు. నా బలగమంతా నశించిపోయింది. నాకిప్పుడిక రాజ్యం ఏలాలనే కోరిక నశించిపోయింది. ఇప్పుడీ శత్రురహితమైన ప్రపంచమంతా మీదే, ఆనందంగా అనుభవించండి.”

“పిచ్చివానిలా మాట్లాడకు” అంటూ యుధిష్ఠిరుడు గర్జించాడు. “నీ మాటలతో నా హృదయమేమీ కరగడం లేదులే. నీది కాని వస్తువును మాకు ధారాదత్తం చేస్తున్నట్లు మాట్లాడవద్దు. నువ్వే మా రాజ్యాన్ని మాకు దక్కకుండా చేయాలని అనేక పన్నాగాలు పన్నావు. ద్రౌపదిని అవమానించావు. ఈ కారణాలన్నింటి వల్లా నీవు చావక తప్పదు.”

దుర్యోధనుడు ఇంతకు మునుపెన్నడూ అంతటి అవమానకరమైన మాటలు పడి ఎరుగడు. ఒళ్ళుతెలీని క్రోధావేశంతో నీటిలోంచి బయటికి వస్తూ, “రండి ఒకరి తరువాత ఒకరుగా రండి... ఎందుకంటే నేనిప్పుడొంటరివాణ్ణి గదా! ఒంటిమీద కవచంలేని, అలసిన నన్ను మీ ఐదుగురు కలసి ఎదుర్కొనరని భావిస్తాను” అన్నాడు.



అప్పుడు యుధిష్ఠిరుడు, “అభిమన్యుడు ఒంటరివాడై ఉన్నప్పుడు అతణ్ణి ధర్మయుద్ధంలోనే చంపారా? క్షత్రియ విధులేవో తెలిసినవారే కదా మీరంతా? అలాంటప్పుడు మీరు కట్టకట్టుకుని ఆ చిన్నవాడిని పొట్టనబెట్టుకోలేదా? అప్పుడది ధర్మమని తోచిందా? మీ అవసరాన్ని బట్టి ధర్మాన్ని మరిచిపోవడం సులువైంది కదూ! మాలో ఎవరినో ఒకరిని ఎన్నుకొని ద్వంద్వ యుద్ధం చెయ్యి. గెల్చినట్లయితే రాజ్యాన్ని నువ్వే ఏలుకోవచ్చు” అంటూ తీక్షణంగా సమాధానమిచ్చాడు.

సూర్యునిలా ప్రకాశిస్తున్న దుర్యోధనుడు, “నేను యుద్ధానికి సిద్ధమే. రండి మీలో ఎవరైనా సరే. నేను గదాయుద్ధం చేస్తాను. మీలో ఒకరి తరువాత ఒకర్ని నేను చంపడం ఖాయం” అన్నాడు.

భీముడు ముందుకువచ్చి అతణ్ణి సవాలు చేశాడు. “దుర్యోధనా! నీతో నేను యుద్ధం చేస్తాను. నువ్వు మాపట్ల చేసిన పాపకార్యాలన్నిటినీ నీకు గుర్తుచెయ్యాలని ఉంది. వారణావర్త సంఘటన, ద్రౌపదిని దుశ్శాసనుడు నిండుసభకు శిరోజాలుబట్టి ఈడ్చుకు రావడం, పాచికల పందెం తల్చుకో. నీ పాపాలకు నేడు ఫలితం అనుభవించబోతున్నావు” అన్నాడు భీముడు కటువుగా, ఉద్వేగపూరితంగా.

## 2
## దుర్యోధన వధ

దుర్యోధనుడు పెద్దపెట్టున రంకెవేస్తూ భీముడిపై కలియబడ్డాడు. వారి గదలు పరస్పరం తాకినప్పుడు నిప్పురవ్వలు చెదరిపడుతున్నాయి. బలపరాక్రమాల్లో గాని, యుద్ధనైపుణ్యంలోగాని భీమ దుర్యోధనులు సమ ఉజ్జీలే. అందుకే వారి గదాయుద్ధం

ఎంతోసేపు కొనసాగింది. బలరాముడు కనులవిందుగా ఆ పోరు చూస్తున్నాడు. కృష్ణుడు మాత్రం చాటుగా చూస్తున్నాడు. దుర్యోధనుడు భీముడి గదను కొట్టినప్పుడు, అది క్రిందపడుతుంది. అప్పుడు భీమసేనుడు క్రోధంతో రౌద్రంగా అరుస్తూ, దాన్ని చేతబట్టి మళ్ళీ యుద్ధానికి దిగుతాడు. దుర్యోధనుడు చేసినట్లే త్రిప్పికొట్టాడు. దుర్యోధనుడు ఆ దెబ్బను కాచుకొని గద పుచ్చుకుని తన శక్తినంతటిని కూడగట్టుకుని భీముడిపై మరో వ్రేటు వేశాడు.

ఆ విసురుకు భీముడదరిపోయాడు. అంతట భీముడు సుయోధనుడిపై తన గదని విసిరాడు. ఎంతో సమయస్ఫూర్తితో ఒడుపుగా దుర్యోధనుడు తప్పించుకున్నాడు. మరోసారి భీముడు గద నందుకుని ధార్తరాష్ట్రుని మోదాడు. అప్పుడా రారాజు క్రిందపడినా వెంటనే లేచాడు. భీముడి మీదికి ఎగిరిదూకాడు. అతడి నుదుటి మీద బలంగా మొదాడు. భీముడొక్క అంగుళంకూడ కదల్లేదుగాని, అతడి నుదుటి నుంచి రక్తం కణతల మీదుగా కారుతుండగా దుర్యోధనుని రొమ్మున కొట్టాడు. ఇలా ఆ సమరం సాగుతూనే ఉంది.

వారలా పరస్పరం పోరాడుతుండగా, అర్జునుడు ఉత్కంఠతో కృష్ణుణ్ణి, "కృష్ణా వారిలో గెలుపు ఎవరిదంటావు?" అనడిగాడు. అందుకు కృష్ణుడు చిరునవ్వు నవ్వి, "దుర్యోధనుడు ఆధిక్యం సంతరించుకొనడం చూస్తూనే ఉన్నావు గదా. ఇలా ధర్మయుద్ధం కొనసాగినంత వరకు దుర్యోధనుడు మృతుడు కాడు. భీముడు యుద్ధనీతికి విరుద్ధంగా దెబ్బకొట్టినప్పుడే దుర్యోధనుణ్ణి చంపగలడన్నది నిశ్చయం. ఆనాడు పాచికలాటలో భీముడు యుద్ధంలో దుర్యోధనుడి తొడలు విరుస్తానని శపథం చేశాడు గదా! దాన్నిప్పుడు నెరవేర్చుకుంటే సరిపోతుంది" అన్నాడు.

కృష్ణుని మాటలు విని అర్జునుడు తన ఎడమతొడను చరిచి సూచిస్తూ గుర్తు చేయగా భీముడు గ్రహించాడు. క్రోధావేశంతో అమాంతం దుర్యోధనుడి మీదికి ఉరికాడు. ఆ ఉరకడం కనిపెట్టి తప్పించుకునేందుకు దుర్యోధనుడు పైకి ఎగిరాడు. అతడలా ఎగిరి గంతేసినప్పుడు భీముడు దుర్యోధనుడి తొడల మీద గదతో కొట్టాడు. ఒకే దెబ్బకు సుయోధనుడి తొడలు విరిగిపోయాయి. నేలపై కుప్పకూలిపోయాడు. భీముడు ఉత్తేజంతో వివశుడైనాడు. తన ప్రతిజ్ఞమేరకు దుర్యోధనుడి తొడలు విరగగొట్టాడు. నేలకూలిన సుయోధనుడి దగ్గరికి పరుగున వెళ్ళి తన పాదం అతడి తలపైమోపి, "ఓరీ, నువ్వు నీ తమ్ముళ్ళు ఆనాడు నన్ను చూసి ఇకిలించారుగదూ? 'ఓరీ పశువా' అని సంబోధించారు కదా! నేనూ మర్చిపోలేదులే. నీ నెత్తిన నా కాలుపెడతానని నేను అప్పుడే శపథంచేశా. అన్నమాట నిలబెట్టుకున్నాలే" అని కసిదీరా కాలితో తన్నుతూ ఉంటే, యుధిష్ఠిరుడు భీముణ్ణి ఆపి, "వద్దు భీమా, నేలకూలిన వాణ్ణి తన్నవద్దు. అతడొక మహారాజు, మనకు దాయాది. అతడికిప్పుడు మిత్రులు గాని, సైన్యంగాని లేరు. అతడి పని అయిపోయింది" అని బలవంతాన ఆపాడు.

ఆ గదాయుద్ధాన్ని తిలకిస్తున్న బలరాముడు కోపోద్రేకంతో, "నాభి (బొడ్డు) దిగువన కొట్టడం సిగ్గుపడాల్సిన విషయం భీమా! అందుకు శాస్తి చేస్తాను" అంటూ భీముణ్ణి ఆపళంగా చంపిపారేద్దామన్నంత దూకుడుగా అతడిపై కురికాడు.

అంతట కృష్ణుడు అతణ్ణి శాంతపరుస్తూ, "అన్నా! ఇవాళ భీముడు చేసినదాంట్లో తప్పేమీ లేదు. అతడు కొట్టిన దెబ్బ యుద్ధనీతిరీత్యా అధర్మం కావచ్చు. కాని ఇన్నేళ్ళుగా దుర్యోధనుడు పాండవులకు చేసిన అన్యాయాలకు ఒక్కసారికూడ నువ్వు అతగాడిపట్ల ఆగ్రహం వహించలేదే? దుర్యోధనుడు సదా అధర్మంగానే వర్తిస్తూ వచ్చాడు. అతడు వంచకుడు. భీముడు తన ప్రతిజ్ఞను నిలుపుకున్నాడంతే" అన్నాడు. బలరాముడు మాత్రం ససేమిరా సమ్మతించలేదు. రథమెక్కి అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

దుర్యోధనుణ్ణి అనాథగా ఆ మడుగుచెంతనే విడిచి విజయోత్సాహంతో అంతా హస్తినాపురంకేసి బయల్దేరారు. తన సంతానాన్నంతటినీ యుద్ధంలో పోగొట్టుకున్న దురదృష్టవంతురాలైన తల్లి గాంధారిని ఓదార్చమని పాండవులు, కృష్ణుణ్ణి ముందుగానే ధృతరాష్ట్రుడున్న చోటికి పంపారు. కృష్ణుడు వారున్న చోటికి చేరుకున్నాడు. గాంధారీ ధృతరాష్ట్రులు దుఃఖంలో మునిగి ఉన్నారు. ఆ ముదుసలి తల్లిదండ్రుల పుత్రశోకం చూసినప్పుడు కృష్ణుడికే దుఃఖం ఆగలేదు. వారికి ఓదార్పు మాటలు చెప్పాడు. వారిని చూసి ఎంతో జాలిపడ్డాడు. వారిపట్ల అపేక్ష, సానుభూతిని వెల్లడించాడు. మృతికి బాధ్యుడు ఆ దుర్యోధనుడేనని వారికెంతగానో మనసులో నాటేటట్లు వివరించి చెప్పాడు.

## 3
## అశ్వత్థామ సైన్యాధిపత్యం

దుర్యోధనుడికి కలిగిన దుర్గతి గురించి సంజయుని ద్వారా విన్న అశ్వత్థామ తదితర ముఖ్యులు తక్షణమే బయల్దేరి అతడు తొడలు విరిగిపడి ఉన్న మడుగు దగ్గరకు చేరుకున్నారు. పడగత్రొక్కిన పాములా కోపంతో బుసలుకొడుతున్న దుర్యోధనుని చూశారు. తమ ప్రభువుకి పట్టిన దుర్గతిని చూసి అశ్వత్థామ ఎంతగానో శోకించాడు.

రారాజు చేతులు పుచ్చుకొని, "మిమ్మల్నీస్థితిలో చూడాల్సి వచ్చినందుకు ఎంతో చింతిస్తున్నాను. ప్రభూ! ఆ పాండవులు ధర్మం పరదా వెనుక దాగుకొని, కాపట్యంతో మా తండ్రి ప్రాణాలు హరించారు. ఇప్పుడు మిమ్మల్ని ఈ దుస్థితికి దిగజార్చారు. ఆ పాండవులైదుగుర్ని, కృష్ణుణ్ణి కళ్ళ యెదుటే నేలకూలుస్తాను. అనుమతి ఇవ్వండి మహారాజా! వాళ్ళని అంతం చేసేవరకు నాకు శాంతి లేదు" అన్నాడు.

అశ్వత్థామ పౌరుషవాక్కులు విని దుర్యోధనుడు సంతోషంతో పొంగిపోయాడు. అంతట కృపాచార్యుని కొద్దిగా నీళ్ళిమ్మని అడిగాడు. ఆ నీటిని అశ్వత్థామ తలపై చిలకరించి, దుర్యోధనుడు అశ్వత్థామను నూతన సేనాధిపతిగా నియోగించాడు. అశ్వత్థామ దుర్యోధనుని ఆలింగనం చేసుకొని తక్షణమే బయల్దేరాడు. మిగిలిన వారూ అతణ్ణి అనుసరించారు. దుర్యోధనుడు ఏకాకియై మడుగు దగ్గరే ఆ కాళరాత్రిని గడిపాడు.

# సౌప్తిక పర్వం

## 1
## అశ్వత్థామ ప్రతీకారం

ఆ రాత్రి అశ్వత్థామకు కంట కునుకుపట్టలేదు. ఒక చెట్టుకింద శయనించాడు, కాని రెప్పవాల్చలేదు. తన తండ్రి మరణానికి పగ తీర్చుకోవడానికి, దుర్యోధనుని పరిమార్చిన భీమునిపై సైతం పగ తీర్చుకోవడానికి పథకాలు వేయడంలో అతడి మనస్సు తీవ్రంగా నిమగ్నమై ఉంది.

ఆ చెట్టు కాకులు కట్టిన గూళ్ళతో నిండి ఉంది. కాకులన్నీ ఆదమరచి నిద్రపోతున్నాయి. ఆ సమయంలో హఠాత్తుగా ఒక గుడ్లగూబ అక్కడికి వచ్చింది. దాని చూపులు భయంకరంగా ఉరిమి చూస్తున్నట్లున్నాయి. చడీచప్పుడూ లేకుండా నిద్రలో ఉన్న కాకులన్నిటిని చంపి పొట్టనబెట్టుకుంది. అదో బ్రహ్మాండమైన కాకుల మారణకాండ. మొత్తం కాకుల్ని సర్వనాశనం చేసి ఆనందంగా అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

అది చూసిన అశ్వత్థామ ఆలోచించి ఆ రాత్రే నిద్రిస్తున్న పాండవుల వద్దకెళ్ళి వారిని హతం చేయడమే సరైన పద్ధతి అని అనుకున్నాడు. తన సహచరుల్ని లేపి వారికి తన పన్నాగాన్ని వివరించాడు. అది విని వారంతా హడలెత్తిపోయారు. అంతటి రాక్షసం - పాపభూయిష్ఠమైన కృత్యానికి పాల్పడవద్దని నచ్చజెప్పారు. కాని ఒళ్ళు తెలియని కసితో ప్రతికార

వాంఛతో ఉన్మత్తుడైపోయిన అశ్వత్థామ పట్టినపట్టు వీడలేదు. శంకరుడు తనకు ప్రసాదించిన ఖడ్గాన్ని చేతబట్టి రథమెక్కి బయల్దేరాడు. కృపాచార్యుడు, కృతవర్మ అతణ్ణి అనుసరించారు.

అశ్వత్థామ, కృప–కృతవర్మల్ని పాండవుల డేరాలకు బయట నిలబడమన్నాడు. ఎవ్వరూ తప్పించుకు పారిపోకుండా చూస్తూండమన్నాడు. తాను మాత్రం ధృష్టద్యుమ్నుడి గుడారంలో ప్రవేశించాడు. అప్పుడతడు గాఢనిద్రలో ఉన్నాడు. అతడి గొంతుకి వింటినారి కట్టి నులిమి చంపాడు. ఆ అరుపులకు చుట్టూ ఉన్న వారికి మెలకువ వచ్చింది. పాంచాలురు, పాండవుల పుత్రులు లేచి అశ్వత్థామను ఎదుర్కొనేందుకు ప్రయత్నించారు. కాని అతడు వారందర్నీ నిర్దాక్షిణ్యంగా హతమార్చాడు. కురుక్షేత్రంలో వీరోచితంగా పోరాడి, సజీవులై ఉన్న ఉత్తమౌజుడు, యుధామన్యు, శిఖండులను నిర్దాక్షిణ్యంగా నరికివేశాడు అశ్వత్థామ. కృపాచార్యుడు గుడారాలకు నిప్పుపెట్టాడు. ఈ విధంగా ఇంతకు మునుపు క్షత్రియులెవ్వరూకూడ కనీవినీ ఎరుగనంత క్రూరాతిక్రూర కృత్యం నెరపి, తదనంతరం కృప – కృతవర్మ – అశ్వత్థామలు దుర్యోధనుడు పడి ఉన్న ప్రదేశానికి వడివడిగా వెళ్ళారు. కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతూ పడివున్న రారాజును సమీపించారు. అప్పటికే అడవి జంతువులన్నీ దుర్యోధనుడి చుట్టూ తారట్లాడుతున్నాయి.

అశ్వత్థామ కౌరవనాథుడితో, "దుర్యోధనా! ఈ శుభవార్త విని నీ హృదయం ఆనందంతో పొంగిపోతుంది. పాండవ సైన్యాన్ని సమూలంగా నాశనం చేశాం అని తెలుపడానికి సంతోషిస్తున్నాను. ఇక ఆ పాండవుల పక్షాన మిగిలింది ఏడుగురు, వారు పాండవులైదుగురు, కృష్ణుడు, సాత్యకి మాత్రమే. మన తరపున మేం ముగ్గురమూ" అన్నాడు. ఆ మాటలు విన్న దుర్యోధనుడి సంతోషం అంతా ఇంతా కాదు. అప్పుడాతడు, "అశ్వత్థామా! నాకోసం భీష్ముడు, కర్ణుడుకూడ చేయలేని కార్యంతో నా హృదయానికి అంతులేని సంతృప్తిని చేకూర్చావు. ఇక నేను నిశ్చింతగా కన్ను మూస్తా..." అంటూ అతడు ప్రాణాలు విడిచాడు.

## 2
## కృష్ణుడు అశ్వత్థామను శపించడం

అతిదారుణమైన ఆ కిరాతక చర్య గురించి విన్న ధర్మరాజు నిర్ఘాంతపోయాడు. తక్షణమే ఆ ఘోరకృత్యం జరిగిన ప్రదేశానికి వెళ్ళాడు. అక్కడ తన కుమారుల, మిత్రుల, శ్రేయోభిలాషుల మృతదేహాలు పడి ఉండటాన్ని చూశాడు. అక్కడికి ద్రౌపది వచ్చింది. చుట్టూ కలియజూసి మూర్ఛిల్లింది. తన దురదృష్టానికి ఎంతగానో వగచింది. ఒక్క రాత్రిలో ఆమె తన జీవనసర్వస్వాన్ని కోల్పోయింది. కళ్ళలో నిప్పులు కురిపిస్తూ, "వాళ్ళపై పగతీర్చుకుతీరాల్సిందే. అశ్వత్థామ, అతడి అనుచరుల్ని హతమార్చేవరకు నేనీ ప్రదేశం నుంచి కదలను. నేనూ చనిపోతా" నంటూ విలపించింది. అశ్వత్థామ అప్పటికే సుదూరారణ్యాల కెక్కడికో పారిపోయాడని వారు చెప్పారు. "పుట్టుకతోనే అతడి తలలో మణి ఉందని విన్నా... ముందు అతణ్ణి చంపి ఆ మణిని తెచ్చి ఇవ్వాల్సిందే"నని ద్రౌపది పట్టుబట్టింది.

భీముడు ఆమె బాధను చూడలేకపోయాడు. నకులుణ్ణి రథసారథ్యం చేయమని తాను అశ్వత్థామని వెదకడానికి బయల్దేరాడు.

భీముడి విషయం తెలియగానే కృష్ణుడు, "అశ్వత్థామ కనికరమన్నదిలేని వట్టి కసాయి. అతడి దగ్గర బ్రహ్మశీర్షాస్త్రమనే శక్తిమంతమైన అస్త్రముంది. దాన్ని భీముడిపై ప్రయోగించాడో... భీముడి మరణం తప్పదు. కాబట్టి ముందు వెళ్ళి భీముణ్ణి రక్షించాలి" అన్నాడు. కృష్ణార్జునులు భీముణ్ణి పట్టుకునేందుకు తక్షణం బయల్దేరి వెళ్ళారు.

చివరకు గంగాతీరాన వ్యాసుడి చాటున దాగివున్న అశ్వత్థామని వారు కనుగొన్నారు. అతడు

ఋషికుమారుడి వేషం ధరించి ఉన్నాడు. భీముడప్పటికే క్రోధంతో అతడిపై విరుచుకుపడ్డాడు. అశ్వత్థామ తానిక పారిపోలేననుకున్నాడు. ఆఖరి ప్రయత్నంగా తన బ్రహ్మశీర్షాస్త్రాన్ని ప్రయోగించాలనుకొన్నాడు. ఒక గడ్డిపరకను చేతిలోకి తీసుకుని మహోత్కృష్టమైన బ్రహ్మశీర్షాస్త్రంగా మంత్రించి, "వెళ్ళు... పాండవులందర్నీ హతమార్చు" అంటూ ప్రయోగించాడు. అనడమే తడవుగా ఆ మహాస్త్రం అగ్నిజ్వాలలు కురిపిస్తూ భీమార్జునుల వైపు దూసుకు రాసాగింది. కాని, అశ్వత్థామ ఎత్తు కనిపెట్టిన భీముడు అర్జునుడితో, "అర్జునా! నీకు ద్రోణుడిచ్చిన ప్రత్యస్త్రాన్ని ప్రయోగించు" అని హెచ్చరించాడు. అర్జునుడు తక్షణం రథం మీదనుండి ఉరికి ఆయుధాన్ని మంత్రించి, "ఈ ఆయుధం అశ్వత్థామ అస్త్రాన్ని ప్రతిఘటించుగాక!" అంటూ ప్రయోగించాడు.

ప్రయోగించగానే అది పెద్దగా పేలి భగ్గున మంటలు చిమ్ముతూ అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రాన్ని మించి పోయింది. ఆ ధ్వనికి భూనభోంతరాలు దద్దరిల్లిపోయాయి. వేలాది మైళ్ళ పొడవు భూమి కంపించిపోయింది. చెట్టుచేమలు, కొండలు పర్వతాలు, నదీనదాలు కంపించిపోయాయి. ఆ తరుణంలో శాంతి నెలకొల్పడానికి నారద వ్యాస మహర్షులు అక్కడ ప్రత్యక్షమయ్యారు.

ఆ అస్త్రాల శక్తిపై తమ దృష్టిని కేంద్రీకరించి, వాటి వినాశకర ప్రకృతిని నిరోధించారు.

వ్యాసుడు "మీరు ఏం చేస్తున్నారు? యుద్ధంలో ప్రాణాలొడ్డిన మహావీరుల వద్ద కూడ ఇలాంటి అస్త్రాలు ఉన్నాయి. కాని వారెవ్వరూ వాటిని మానవులపై ప్రయోగించలేదే! ఓ శౌర్యధనులారా! ఏమిటీ తొందరపాటు చర్య?" అన్నాడు .

అర్జునుడు అస్త్రాన్ని ఉపసంహరించుకోవాలని వెంటనే నిర్ణయించుకొన్నాడు. ఆ మహర్షులిరువురికీ ప్రణమిల్లుతూ, "నేను అస్త్రాన్ని ఉపసంహరించినా, అతడి మహాస్త్రం మమ్మల్ని మింగేస్తుందిగదా! ఏం చేయాలో మీరే నిర్ణయించి సెలవియ్య"మని కోరుతూ అర్జునుడు తన అస్త్రాన్ని ఉపసంహరించాడు. కాని అశ్వత్థామ అపవిత్రుడు, పాపి కావడంతో అతడికి అస్త్రాన్ని ఉపసంహారం చేసే శక్తి లేకపోయింది. అందువల్ల అతడు మహర్షుల పాదాలపైబడి, "నేను చేసిన ఘాతుకచర్యకు భయపడి నన్ను నేను కాపాడుకోవడానికి ఈ అస్త్రాన్ని ప్రయోగించాను. నేనిప్పుడు నిస్సహాయుణ్ణి, అస్త్రాన్ని ఉపసంహరించలేను. నేనేం చెయ్యాలి?" అని ప్రాధేయపడ్డాడు.

అందుకు వ్యాసుడు అశ్వత్థామతో, "నువ్వు చేసిన పాపకార్యానికి పరిహారంగా నీ తలలో ఉన్న మణిని తీసి పాండవులకిచ్చెయ్" అన్నాడు. అశ్వత్థామకు వ్యాసుడిచ్చిన సలహా నచ్చలేదు. "ఈ మణి ఎంతో విశిష్టమైన ప్రభావం గలది. దానిని ధరించినవాణ్ణి ఆకలి, అనారోగ్యం, అస్త్రశస్త్రాల బారినుండి రక్షిస్తుంది. అందువల్ల దానిని నేను వదులుకోలేను. కానీ, ఇప్పుడు మీరు అడిగినందున ఇచ్చేస్తున్నాను. ఇదిగో, తీసుకోండి. నేనీ అస్త్రాన్ని ఉపసంహరించలేను కనుక అది పాండవ వంశ రాణుల గర్భాలను దహిస్తుంది" అని అన్నాడు అశ్వత్థామ.

"చూడు... అటువంటి నికృష్టమైన ఆలోచనలకి చోటివ్వకు" – అంటూ వ్యాసుడు కోపగించుకున్నాడు. అంతట కృష్ణుడు నవ్వుతూ అశ్వత్థామతో, "విరాటుని కుమార్తె ఉత్తర అభిమన్యుణ్ణి వివాహం చేసుకుని అర్జునుని కోడలైననాడే ఒక బ్రాహ్మణుడు 'కురువంశం నశించినప్పుడు ఉత్తర గర్భాన ఒక మగ శిశువు జన్మిస్తాడనీ, ఆ కారణంగానే అతడు పరీక్షిత్తు అని పిలువబడతా'డని భవిష్యద్వాణిగా ఆనాడే పలికాడు" అన్నాడు.

అప్పుడు అశ్వత్థామ, "మంత్రప్రయోక్తమైన ఈ గడ్డిపరక ఆ ఉత్తర గర్భస్థ శిశువుని అంతం చేస్తుంది

చూడండి" అన్నాడు రోషంగా. "నీ అస్త్రం గర్భంలోని పిండాన్ని నాశనం చేయగలదని నాకు తెలుసులే. కాని నీవా శిశువు ప్రాణం తీసినా, నేనా శిశువుకు ప్రాణం పోసి మళ్ళీ బ్రతికిస్తాను, చూడు. నువ్వు ప్రాణికోటిలో అతి నీచప్రాణివి. మూడు వేల సంవత్సరాలు భూమ్మీద తిరుగుతూ, నిన్ను దయదల్చేవారు, పలకరించే వారులేక ఆకలి బాధతో దిక్కులేకుండా కుళ్ళుకంపుకొడుతూండే శరీరంతో పడుంటావు" అని కృష్ణుడు శపించాడు.

తరువాత అశ్వత్థామ తలలో ఉన్న మణిని తీసిచ్చి అరణ్యాలకు వెళ్ళిపోయాడు. భీమార్జునులు మహిమోపేతమైన ఆ మణిని పుచ్చుకుని తిరిగివచ్చారు. ద్రౌపది ఆ మణిని ధర్మరాజుకి ఇవ్వగా, అతడు దానిని ధరించాడు.

# స్త్రీ పర్వం

## భీముని కృష్ణుడు రక్షించడం

పాండవులు హస్తినాపురానికి బయల్దేరారు. నగరమంతటా విషాదచ్ఛాయలు అలుముకుని ఉన్నాయి. ఎటుచూసినా స్త్రీల రోదనం, పిల్లల ఏడ్పులు పెడబొబ్బలూను. శోకార్తులైన వేలాది స్త్రీలతో ధృతరాష్ట్రుడు యుద్ధభూమిని చేరుకున్నాడు. అప్పుడే ధర్మరాజాదులు ధృతరాష్ట్రుని కలుసుకోవడానికి అక్కడికి వచ్చారు. వారు రాగానే శోకిస్తున్న స్త్రీమూర్తులందరూ కూడ వారిని పలుకరించారు. ధర్మరాజు ధృతరాష్ట్రుడి దగ్గరకు వెళ్ళాడు. ఆయన పాదాలపై వాలాడు. తాను, తనతోబాటు తన తమ్ముళ్ళు వచ్చినట్లు తెలియజేశాడు.

ధృతరాష్ట్రునికి ఏమంత సంతోషమనిపించలేదు. కాని, మహారాజు కనుక ఇతరుల ముందు తాను మర్యాదలు పాటించాల్సిన ధర్మముంది కనుక ధర్మజుని కుశల ప్రశ్నలడిగాడు. పిదప ఆలింగనం చేసుకొన్నాడు. ఆ ఆలింగనంలో అనురాగం లుప్తం. తరువాత భీముని వంతు. భీముని పట్ల ధృతరాష్ట్రునికి ఉన్న ద్వేషం అంతా ఇంతా కాదు. ఆయనకే కనుక కంటిచూపు ఉంటే ఒక్క చూపుతోనే భీముణ్ణి కాల్చి బూడిద చేసేవాడు. భీముణ్ణి ఆలింగనం చేసుకోవడానికి చేతులు చాచాడు. కృష్ణుడు మహారాజు దురాలోచన పసిగట్టి తక్షణం భీముణ్ణి ప్రక్కకులాగి సిద్ధపరచి ఉంచిన భీముడి లోహమూర్తిని అతడికి బదులుగా ముందుకు నెట్టాడు.

దానిని కౌగలించుకున్నప్పుడు వీడే తన పుత్రుల్ని వధించిన వ్యక్తి అని జ్ఞాపకం రావడంతో తన పట్టును మరింతగా బిగించాడు. ఆ లోహప్రతిమ తునాతునకలై



పోయింది. ఆ రాక్షస చర్యవల్ల అతడి రొమ్ము చీరుకుపోయింది. నోట నెత్తురు కక్కుకున్నాడు, మూర్ఛిల్లాడు. సంజయుని సాయంతో తిరిగి తెప్పరిల్లుకున్నాడు. ఇక అప్పటికి కోపం చల్లారి, "అయ్యో భీమా... అయ్యయ్యో భీమా!" అంటూ భోరున విలపించాడు. అప్పుడు కృష్ణుడు ధృతరాష్ట్రుడితో, "దుః ఖించాల్సిన అవసరంలేదు. నువ్వు భీముణ్ణి చంపలేదు. తునాతునకలైంది భీముడి లోహప్రతిమే. నువ్వు వేదశాస్త్రాలన్నీ చదివావు గదా! ఎంతో వివేకవంతుడవి. అటువంటప్పుడు పాండవులంటే నీకంతటి ద్వేషమెందుకు? ఇన్ని అనర్థాలకు కారణం 'పుత్రప్రేమ' అనే నీ మానసిక బలహీనత" అంటూ చురకలు తగిలించాడు.

ఆ మాటలు విన్న ధృతరాష్ట్రుడు, "కృష్ణా! నువ్వన్నది సత్యం. నేనిక వారి నెప్పుడూ ద్వేషించను. వారిని ఆశీర్వదిస్తాను" అని చెబుతూనే, "వెళ్ళి గాంధారిని కూడ ఓదార్చండి" అని వారిని ప్రార్థించాడు. అంతట పాండవులు కృష్ణునితో గాంధారిని పరామర్శించేందుకు వెళ్ళారు. ఆమెతోబాటు వ్యాసుడక్కడున్నాడు. ఆమె ధర్మరాజాదుల్ని శపించాలనుకుంది. కాని వ్యాసుడామెకు అంతకుమునుపే "ఎవ్వరినీ శపించడం నీకు భావ్యం కాదు; చేతనైతే క్షమించు"అని హితవు చెప్పాడు. ధర్మరాజు



చేతులు జోడించి భయంతో వణుకుతూ ఆమెను సమీపించాడు. "అమ్మా! నీ తనయుల మృతికి బాధ్యుణ్ణి నేనేనమ్మా! నన్ను శిక్షించు. ఏ శిక్ష వేసినా సరే" అన్నాడు ఎంతో వినయంగా.

గాంధారి నిట్టూరుస్తూ మౌనం దాల్చింది. ధర్మరాజు వంగి ఆమె పాదాలకు నమస్కరించబోతున్నప్పుడు ఆమె నేత్రాలు అతడి కాలిబొటన వ్రేలుపై కేంద్రీకృతమైనాయి. ఆమె కళ్ళ గంతల నుండి ఒక వెలుగు కిరణం ప్రసరించి అతడి అందమైన బొటనవ్రేలును బొబ్బలెక్కేట్లు చేసింది, అంతే. ఆమె పాండవులను క్షమించింది. వారిని మృదువుగా పలకరించింది.

ఆమె పాండవులు, మిగతావారందరితో కలిసి దుర్యోధనుడు పడున్నచోటికి వెళ్ళింది. హఠాత్తుగా ఆమెలోని కోపం పెల్లుబికింది. కృష్ణుడి వంక తిరిగి, "కృష్ణా! ఇంతటికీ నీవే బాధ్యుడవని అంటాను. యుద్ధం జరుగకుండా ఆపి ఉండేవాడివే గదా! నాకు తపశ్శక్తే ఉంటే, దాన్ని నిన్ను శపించడానికి ఉపయోగిస్తున్నాను. ఒక్క మీ కుటుంబమే కాదు. మీ వృష్ణి కులమంతా నశించిపోతారు. మీ దాయాదులంతా పరస్పరం కలహించి, ఒకరి నొకరు చంపుకొంటారు. మీ స్త్రీజనం అంతా శోకంతో తల్లడిల్లిపోతారు. ఈ స్త్రీలంతా ఎలా విలపిస్తున్నారో చూస్తున్నారుగా, మీకు కూడా అంతే కావాలి. ఇది గాంధారి శాపం" అన్నది పట్టరాని కోపంతో.

ఆ మాటలకు కృష్ణుడెంత మాత్రం చలించలేదు. చిన్నగా నవ్వి ఆమెతో "లోకంలో వృష్ణికులాన్ని నాశనం చేయగలవారు నేను తప్ప ఎవ్వరూ లేరు. ఔను, అది నా వల్లే జరగాలి, జరుగుతుంది. నీ శాపం నా నిర్ణయానికి కేవలం సాయం అవుతుంది అంతే" అన్నాడు ప్రశాంతంగా.

ధర్మరాజు పురోహితుల్ని రావించి మృతదేహాల కన్నిటికి శాస్త్రోక్తంగా అంత్యక్రియలకు కావలసిన ఏర్పాట్లు చేయించాడు. ఆ తతంగమంతా అయిన తరువాత ధృతరాష్ట్రుడు ముందు నడవగా ధర్మరాజాదులు తదితరులంతా గంగానదికి వెళ్ళి మృతుల కొరకైన శ్రాద్ధక్రియలు నిర్వర్తించారు.

కుంతి ఆ తరుణంలోనే కర్ణుడెవరన్నది ధర్మరాజుకు ఎరుకపరచింది. తరువాత ధర్మరాజు మిగతావారు తమ బంధుమిత్రుల మృతి పట్ల నెలరోజులు శోకదినాలుగా పాటించారు.

# శాంతి పర్వం

## 1
## ధర్మజుని పశ్చాత్తాపం

అట్టి విషాద సమయంలో ఎందరో ఋషులు, వేలాదిమంది బ్రాహ్మణులు వచ్చి శోకపరితప్తుడైన ధర్మరాజుని ఊరడింపు మాటలతో ఓదార్చారు.

నారదుడు "కృష్ణుడి అనుగ్రహం మీకుంది. భుజబల పరాక్రమముంది. ధర్మాచరణ ఉంది కనుకనే న్యాయసమ్మతంగా భూభాగం యావత్తు మీదైంది. ఇక ఆనందంగా రాజ్య సంపదల్ని అనుభవించండి" అంటూ దీవించాడు.

అందుకు ధర్మజుడు, "మునివర్యా! కృష్ణుడి కృపవల్ల మహాసామ్రాజ్యమంతా నాకు దక్కినా కొండంత దుఃఖంకూడ నా గుండెల్ని పిండేస్తూంది. తుచ్ఛమైన రాజ్యాధికార వాంఛయే ఇంతటి దారుణమైన మారణకాండకు దారి తీసింది మహానుభావా!" అంటూ అర్జునుడి వంక తిరిగి, "నా ప్రియ సోదరా! శాంతిని ప్రసాదించగలది పరిత్యాగమేనని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. నేనిక అరణ్యాలకు వెళ్ళి, నా

శేషజీవితాన్ని దైవధ్యానంలో వెళ్ళబుచ్చుతాను. నాకీ రాజ్యం మీదగానీ, ప్రాపంచిక సుఖభోగాల మీదగానీ కోరిక లేనేలేదు. నీవీ రాజ్యాన్ని పరిపాలించు. అడ్డు చెప్పకు" అన్నాడు.

ఆ మాట విన్న అతడి తమ్ముళ్ళు, ద్రౌపది ధర్మరాజుని ఎంతగానో బ్రతిమాలారు. అట్టి నిర్ణయం వద్దని ప్రాధేయపడ్డారు. అక్కడున్న దేవస్థానాది ఋషులు, వ్యాసమహర్షి సైతం నచ్చజెప్పారు.

దేవస్థానుడు, "ఓ రాజా! నీవీ సామ్రాజ్యాన్ని ధర్మయుతంగా గెల్చుకున్నావు. అటువంటి దాన్ని త్యజించి వెళ్ళడం భావ్యం కాదు. నీవిప్పుడు మహా యజ్ఞయాగాది క్రతువులు చేసి కీర్తిప్రతిష్ఠల్ని పొందవచ్చు. అంతేగాని ఈ ప్రపంచాన్ని తప్పించుకు పారిపోవాల్సిన అగత్యం ఏమొచ్చింది? రాజైనవాడు తన ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించినట్లయితే ఇహపర సౌఖ్యాల్నిపొందగలడు సుమా!" అన్నాడు.

అందరు చెప్తున్నప్పటికీ యుధిష్ఠిరుడు దుఃఖంనుండి తెప్పరిల్లుకోకపోవడం గమనించి వ్యాసమహర్షి కల్పించుకొని ఇలా అన్నాడు:

"ఓ ధర్మరాజా! దుఃఖించకు, నీ పూర్వీకుల అడుగుజాడల్లో నడువు. తన విధిని మరిచినట్లయితే, ధర్మాన్ని అతిక్రమించిన పాపం వాటిల్లుతుందని మరువకు. కౌరవులు ధర్మాతిక్రమణ చేశారు కనుకనే వారు సపరివారంగా నీచే శిక్షింపబడ్డారు. నీ ధర్మాన్ని నువ్వు నెరవేర్చావు కాబట్టి నీకే పాపమూ అంటదు. కౌరవులు, వారి మిత్రులు అంతా తమ తమ విధి నిర్వహణలో తప్పటడుగు వేశారు. వారి వినాశాన్ని వారే కొనితెచ్చుకున్నారు. వారి మరణానికి నీవు కారకుడవెంత మాత్రమూ కాదు. రణంలో నిహతులవ్వాల్సిన యోగం వారికుంది. అదంతా విధి నిర్ణయమే. నీ మనస్సులో చెలరేగే గందరగోళమంటావా, అది వట్టి నీ భ్రమ. నీ ఆ భ్రాంతి తొలగాలంటే, నీ వనుకునే ఆ పాపాన్ని కడిగి పవిత్రుడివి కావాలని నీకు అనిపిస్తే ప్రాయశ్చిత్తం చేసుకుని సంతృప్తిపడు. అశ్వమేధయాగం చెయ్యి... అదే పాప పరిహారానికి ప్రాయశ్చిత్తం. పాపం చేశానన్న తలంపు నిన్ను బాధిస్తూ ఉంటే తక్షణం యాగసన్నాహాలు ప్రారంభించు."

తరువాత కృష్ణుడితో సహా మిగతా వారుకూడ ఇలాగే పదేపదే నచ్చజెప్పగా యుధిష్ఠిరుడు సమాధానపడ్డాడు.

## 2
## ధర్మజుని పట్టాభిషేకం

ధృతరాష్ట్రుని వెంట ధర్మరాజు రాజధానికి బయలుదేరాడు. దేవతలకు-బ్రాహ్మణులకు మ్రొక్కాడు. శుభచిహ్నంగా పదహారు తెల్లని ఎడ్లను పూన్చిన నూతన రథాన్ని అధిరోహించాడు. భీముడు పగ్గాలు, అర్జునుడు మహారాజుకి ఛత్రం పట్టగా, నకుల సహదేవులు వింజామరలు విసురుతూండగా, పరివారమంతా స్త్రీలతో సహా రథాన్ని అనుసరించి వెళ్ళారు. అదిగాక మరింకెన్నో రథాలు, గొప్పగొప్ప అంబారీలతో సింగారించుకున్న ఏనుగులు, గుర్రాలు, భటులతో నిండిన ఊరేగింపు అది. నగరమంతా ఎటుజూసినా పతాకాలతో, తోరణాలతో అందంగా అలంకరింపబడి ఉంది.

ఊరేగింపు నగర పొలిమేరకు చేరగానే మిత్రులు మధురోక్తులతో స్వాగతం పలికారు. రాజభవనంలో అడుగు పెడుతూనే ధర్మరాజు ప్రథమంగా తమ ఇలవేల్పుల్ని తర్వాత అక్కడ సమావిష్టులైన బ్రాహ్మణుల్ని అర్చించాడు. ఘనకీర్తిమంతుడైన ఆ కుంతీపుత్రుడు తూర్పు దిశాభిముఖుడై విలక్షణమైన ఆ బంగారు సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఆ సింహపీఠానికి చేరువనే అందమైన ఆసనాలపై అతడి తమ్ముళ్ళు, కృష్ణుడు, సాత్యకి, విదురుడు, ధృతరాష్ట్రుడు, గాంధారీ తదితరులు ఆసీనులయ్యారు.

తక్షణమే పట్టాభిషేక మహోత్సవం ప్రారంభమైంది. ధౌమ్యుడు పౌరోహిత్యం వహించగా అతివైభవంగా జరిగింది. ఆ సందర్భంలో శుభాకాంక్షలు తెల్పిన బంధుమిత్రాది రాజోద్యోగులతో యుధిష్ఠిరుడు, "మీ అందరి ఆదరాభిమానాల నందుకోవడం నా అదృష్టంగా భావిస్తున్నాను. అయినప్పటికీ మహారాజంటే – ధృతరాష్ట్ర మహారాజే. మీరు నన్ను సంతృప్తుణ్ణి చెయ్యాలంటే ముందు ఆయనకు విధేయులై ఉండాలి, ఆయన అంగీకారాన్ని పొందాలి. నేను ఆయన మాట దాటను, ఎన్నటికీ ఆయన ఇష్టప్రకారం చెయ్యడమే నా కర్తవ్యంగాను, సర్వవిధాలా తోడ్పడటమే ధర్మంగాను భావిస్తా"నన్నాడు.

భీముణ్ణి యువరాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేశారు. యుద్ధంలో మృతులైన వీరుల ఆత్మశాంతికై స్మారక చిహ్నాలు, పేదలకై అన్నదాన సత్రాలు నిర్మించారు. నీటి వసరుల్ని కల్పించారు. చెరువుల్ని త్రవ్వించారు. మృతవీరుల ఇల్లాళ్ళకు, వ్యాధిగ్రస్తులైన యోధులకు, ఇంకా అనాథలకు, నిస్సహాయులకు ఉపకారవేతనాలందించారు.

## 3
## ధర్మరాజుకు భీష్ముని ఉపదేశం

పట్టాభిషేకానంతరం కృష్ణుడు ధర్మరాజుతో, "అంపశయ్యపైనున్న భీష్ముడు ఇక ఆరిపోబోయే వెలుగు. నన్ను తలుచుకుంటున్నాడు. నేను వెళ్ళి చూడాలి.



యుధిష్ఠిరా, భీష్ముడంటే ఎవరనుకున్నావు? సాక్షాత్తు ధర్మస్వరూపుడు. ఆయన నుండి రాజధర్మాలేవిటో తెలుసుకో. భీష్ముడు మరణించిన తరువాత ఆ పరిజ్ఞానపు వెల్లువంతా లోకంలోనుంచి మటుమాయమైనట్లే. అందుకని త్వరపడు, తక్షణమే బయల్దేరు" అన్నాడు.

అలా చెప్పగానే ధర్మరాజు, తనతోబాటు మరికొందరితో కృష్ణుని వెంట బయలుదేరి భీష్ముడు అంపశయ్యపైనున్న ప్రదేశం చేరుకున్నారు.



వారంతా ఆయనకు సగౌరవంగా ప్రణమిల్లారు. ఆయనతో కొంతసేపు గడిపి తిరుగుముఖం పట్టారు. మరుసటి రోజు మళ్లీ కృష్ణుడు, ధర్మరాజు వెళ్లారు. ధర్మరాజు భీష్మ ఉపదేశానికై తహతహలాడిపోతున్నాడు.

భీష్ముడు "యుధిష్ఠిరా! రా, కూర్చో. అడగదల్చుకున్నవన్నీ సంకోచించకుండా అడుగు, చెబుతాను" అన్నాడు. ధర్మరాజు "విధులన్నిటిలోను రాజవిధులు మహోత్కృష్టమైనవని విజ్ఞుల మాటగదా! అసలు విధులంటే ఏమిటి?" అని అడిగాడు..

అందుకు భీష్ముడు ఇలా జవాబిచ్చాడు: "విధులంటే ఏమిటో మొదట తెలుసుకుందాం విను. 'సత్యపాలనం' రాజుయొక్క సర్వోత్కృష్టమైన విధి. సత్యనిష్ఠగల రాజుకి దుర్లభమైనదేదీ లేదు. ప్రజాపాలకుడైన ప్రభువు నిరంతరం ప్రజాసంక్షేమానికై పాటుపడాలి. రాజు శ్రద్ధాళువై ఉండాలి. శ్రమించనట్టి రాజుకు తెలివి తేటలుండి మాత్రం ఏం ప్రయోజనం? అతడెప్పుడూ జాగరూకుడై ఉండాలి. కేవలం ఒక్క చిన్న నిప్పురవ్వ అడవినంతా కాల్చి భస్మం చేసేస్తుంది. ఒక విషపుచుక్క మనిషి ప్రాణాల్ని హరించివేస్తుంది. అందువల్ల రాజు కనుక ఏమాత్రం అజాగ్రత్త చూపినా అతిబలహీనుడైన శత్రువుకూడ రాజ్యంపై ఆక్రమణ చేయడానికి సంసిద్ధంగా ఉంటాడు సుమా!"

అప్పుడు మళ్ళీ ధర్మరాజు, " 'విధి' నిర్వహణకు ఒక ప్రత్యేక పద్ధతి విధానమూ ఉంటాయి గదా. దయచేసి ముఖ్యవిధులేవో, రాజుకి ఇహపరాలకి చిరకీర్తిని చేకూర్చగల ధర్మాలేవో వివరించు" అని అడిగాడు.

"రాజైనవాడికి తల్లి, తండ్రి, గురువును గౌరవించడం ముఖ్యవిధుల్లో అతిముఖ్యమైనది. వారి 'ఆజ్ఞను' తలదాల్చడం 'విధి'. పదిమంది పండితుల కన్నా ఒక గురువు అధికుడు. అట్టి పదిమంది ఆచార్యులకన్నా అధికుడు తండ్రి. కాని, ఒక తల్లి పదిమంది తండ్రుల కన్నా ముల్లోకాల్లోనూ అధికురాలుగా పరిగణించబడుతూంది. అయినప్పటికీ నువ్వు నన్నడిగితే, నేనేం చెబుతానో తెల్సా? తల్లీ తండ్రీ కన్నా కూడ గురువే గొప్పవాడంటాను. ఎందుకంటావా? తల్లిదండ్రులు కేవలం ఈ దేహానికి – జన్మ నిచ్చినవారేగానీ, భగవంతుని చూపగలవాడు గురువే" అంటూ సమాధానమిచ్చాడు భీష్ముడు.

ధర్మరాజు "లోకంలో తప్పులెందుకు చేస్తుంటారు? అసలు నేరం చేయడానికి కారణమేమిటి?" అనడిగాడు.

"నేరం చెయ్యడానికి కారణం కోరిక. కోరికవల్ల ఆశ పెరుగుతుంది. ఆశవల్లే అపరాధాలు చివురిస్తాయి. ఎత్తులు జిత్తులు, వంచన, కపటం అన్నీ పేరాసకు వ్రేళ్లు. అందుకని కోరికను, పేరాసను వదిలెయ్యాలి."

"సత్యస్వరూపమెట్టిదో? దాని వివిధ రూపాలెట్టివో?"

"సత్యమే విధి. సత్యమే తపం. సత్యమే యోగం, సత్యమే దైవం. వెయ్యి అశ్వమేధయాగాల ఫలాన్ని ఒక వైపు, సత్యఫలాన్ని మరోవైపు త్రాసులో పెట్టితూస్తే, ముల్లు సత్యం వైపే మొగ్గుతుంది."

ఈ విధంగా భీష్ముడు ధర్మజుని ప్రశ్నలకు సమాధానాల్ని, ధర్మసూక్ష్మాల్ని చెబుతూ ఉపదేశం చేశాడు.

# అనుశాసన పర్వం

## భీష్మ నిర్యాణం

"యుధిష్ఠిరా! నువ్విక బయలుదేరు. నీ పరివారాన్ని, మిత్రుల్ని, ప్రజల్ని కాపాడాల్సిన బాధ్యత నీ మీద ఉన్నది. నా తుదిఘడియల్లో అంటే – సూర్యుడు ఉత్తరాభిముఖంగా ప్రయాణం (అదే ఉత్తరాయణ పుణ్యకాలం) ప్రారంభించగానే రావాల్సింది సుమా!" అని భీష్ముడు ధర్మరాజుతో అన్నాడు.

అంతట గాంధారీ, ధృతరాష్ట్రులు, కృష్ణుడు, మిగతా పెద్దలు యుధిష్ఠిరుడితోసహా హస్తినాపురానికి తరలి వెళ్ళి అక్కణ్ణుండి తమ తమ నివాసాలకు చేరుకున్నారు. ధర్మజుడు కురుక్షేత్రయుద్ధంలో అసమాన శౌర్యపరాక్రమాలతో పోరాడి ప్రాణాలర్పించిన వీరయోధుల భార్యలకు, వారి సంతతికి విరివిగా కానుకలర్పించి అందరి మన్ననలకు పాత్రుడయ్యాడు.

యాభై రోజులు గడిచాయి. సూర్యుడు ఉత్తరాయణంలో ప్రవేశించాడు. అప్పుడిక యుధిష్ఠిరుడు పురోహితుల్ని వెంటబెట్టుకుని, సుగంధద్రవ్యాలు, పుష్పమాలలు, నెయ్యి, చందనపు కర్రలు వగైరాలన్నీ కూడ తీసుకుని అంపశయ్యపైనున్న భీష్ముని చేరుకున్నాడు. ఆయన వెంట గాంధారీ ధృతరాష్ట్రులు, కుంతి మిగతా ఆప్తులంతాకూడ వెళ్లారు.



యుధిష్ఠిరుడు శిరసువంచి, "నేను యుధిష్ఠిరుణ్ణి, ప్రణమిల్లుతున్నాను పితామహా! దయచేసి నన్ను ఆశీర్వదించు" అన్నాడు. భీష్ముడు మెల్లగా కళ్ళు తెరచి తన చుట్టూ నిలబడి ఉన్నవారందరిని ఒక్కసారి తేరిపార చూశాడు. ధర్మజుని చేతిని పట్టుకుని, "యుధిష్ఠిరా! నేను అదృష్టవంతుణ్ణి సుమా! సూర్యుడు ఉత్తరాయణంలోకి ప్రవేశించాడు. ఈ పుణ్యకాలం కోసమే ఇంతవరకూ ఎదురుచూస్తున్నాను" అంటూ భీష్ముడు మౌనం వహించాడు. వారంతా చూస్తూండగానే యోగంలో దేహాన్ని వీడాడు.

యుధిష్ఠిరుడు, విదురుడు భీష్ముని దేహానికి పట్టువస్త్రం చుట్టారు. యుయుత్సుడు ఛత్రం పట్టుకున్నాడు. పురోహితులు వేదమంత్ర పఠనం చేస్తూండగా భీష్ముని చితికి నిప్పంటించి అంత్యక్రియలు జరిపారు. ఆ విధంగా భీష్మాచార్యుల దివ్యజీవితయాత్ర ముగిసింది. ఆయనతోబాటే ధర్మస్వరూపంకూడ మాయమైపోయింది.

# అశ్వమేధ పర్వం

## మరణించిన శిశువుకు ప్రాణభిక్ష

భీష్ముని అంత్యక్రియలు ముగిశాయి. యుధిష్ఠిరుడు దుఃఖంతో అక్కడే గంగ ఒడ్డున కూలబడిపోయాడు. సోదరులు అతడి చుట్టూ చేరారు. అప్పుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజునితో, "లేవయ్యా, లే, శోకించాల్సింది నేనూ, గాంధారీనూ, కానీ నువ్వు కాదు. వెళ్ళి నీ విధుల్ని నిర్వర్తించు" అన్నాడు. యుధిష్ఠిరునితో కలిసి వారు హస్తినాపురం చేరుకొన్నారు. కొన్నిరోజులు గడిచిన తరువాత కృష్ణుడు



తిరిగి ద్వారకకు వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. కాని అందుకు ఎంతో కష్టం మీద ధర్మజుని ఒప్పించాల్సి వచ్చింది. అర్జునుడు కృష్ణుణ్ణి ప్రేమతో ఆలింగనం చేసుకుని వీడ్కోలిచ్చాడు. కృష్ణుడు యాదవుల రాజధాని నగరమైన ద్వారకను చేరుకున్నాడు.

వ్యాసుడు తరచూ ధర్మజుని రాజసభకు వస్తూండేవాడు. ఆయన వచ్చి చూసేసరికి ఇంకా యుధిష్ఠిరుడు దుఃఖంనుంచి తేరుకోలేదు. అప్పుడు మహర్షి, "అశ్వమేధయాగం చెయ్యి, దానివల్ల శాంతి సౌఖ్యాలు చేకూరుతాయి. పాపం నశిస్తుంది" అంటూ సలహా ఇచ్చాడు. అంతేకాదు, "ఆ యాగం చెయ్యడమంటే మాటలు కాదు. దానికి అపరిమిత ధనవ్యయం అవుతుంది. అందువలన కృష్ణుడికి కబురు చెయ్యి" అన్నాడు.

విషయం తెలియగానే కృష్ణుడు తమ వృష్ణికుల పరివారాన్ని వెంటబెట్టుకుని మరీ వచ్చాడు. అప్పుడు ఉత్తరకు ప్రసవమయ్యే సమయం. అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రం ఫలితంగా ఆ శిశువు ప్రాణం లేకుండా, చనిపోయి పుట్టింది. లోపల్నుంచి ఏడుపులు పెడబొబ్బలు వినపడగానే కృష్ణుడు తక్షణం భవనంలోకి



వెళ్లాడు. అక్కడ కుంతి, ద్రౌపది, సుభద్ర ఇంకా మరికొందరు విలపిస్తూండటం చూశాడు.

“కృష్ణా! నువ్వే కాపాడాలి, కాపాడగలవాడివి నువ్వే తండ్రీ!” అంటూ కుంతి వెక్కివెక్కి ఏడ్చింది. “సరే అలాగే” అన్న కృష్ణుడి సమాధానం వారందరికి ఎంతో ఊరట కల్గించింది. కృష్ణుడు పురిటింట్లో మృతశిశువున్న చోటికి వెళ్లాడు. అక్కడంతా నీళ్ళు చిలకరించి శుద్ధిచెయ్యమన్నాడు. అప్పటికి ఉత్తర అతడి రాకకై ఆతురతతో చూస్తోంది. కృష్ణుడు ఆ శిశువును స్పృశించి, “మాననీయంగా నేను సముపార్జించిన యోగ్యత ప్రభావంతో ఈ శిశువు కోల్పోయిన తన ప్రాణాల్ని తిరిగి పొందుగాక!” అని అంటూండగానే, భగవానుడి దివ్యస్పర్శవల్ల ఆ బిడ్డకు తక్షణమే ప్రాణం వచ్చి కదలసాగాడు. ఆ గది అంతా వెలుగులతో నిండిపోయింది.

ఆ శిశువు ఎవరో కాదు. కాలాంతరంలో ‘పరీక్షిత్తు’ అని ప్రసిద్ధిగాంచిన మహారాజు అతడే.

ధర్మరాజు తాను అశ్వమేధయాగం తలపెట్టినట్లు కృష్ణుడికి తన అభిమతాన్ని తెలుపుతూ, అందుకు కావలసిన సాయాన్నికూడ అర్థించాడు. యాగాశ్వం విధిపూర్వకంగా అర్చించబడింది. వ్యాసుడు స్వయంగా ఆ అశ్వాన్ని స్వేచ్ఛావిహారానికి వదిలాడు. ఆ అశ్వం వెంట అర్జునుణ్ణి పంపారు. హస్తినాపురవాసులంతా అర్జునుణ్ణి, ఆ యాగాశ్వాన్నీ చూడాలనే వేడుకతో వీధుల్లో గుమిగూడారు. ఆ అశ్వంతోపాటు దాన్ని అనుసరిస్తూ అర్జునుడు వెళ్ళాడు. అది నేల నాలుగు చెరగులా తిరిగింది. చాలాచోట్ల దాన్నెవ్వరూ అడ్డగించలేదు. కాని, అక్కడక్కడ అడ్డగించి ఆపినప్పుడుకూడ ఆ వ్యతిరేకించిన వారిని ఎదుర్కొని ఓడించేందుకుగాని, వశపరచుకునేందుకుగాని అర్జునుడికేమాత్రం శ్రమ కలుగలేదు. జరుగబోయే అశ్వమేధయాగానికి రాజులందర్నీ ఆహ్వానించాడు. ఆ విధంగా దిగ్విజయయాత్ర ముగించి అర్జునుడు హస్తినాపురాన్ని చేరుకున్నాడు.

యాగం కోసమై బ్రహ్మాండంగా ఏర్పాట్లన్నీ జరిగాయి. వచ్చిన వారందరినీ తగువిధంగా సత్కరించాలని వ్యాసుడు ధర్మజునికి హెచ్చరికలు చేశాడు. యాగపరిసమాప్తి వేళ ధర్మరాజు శిరస్సు మీద ఆకాశంనుండి పూలవాన కురిసింది.

రాజులు, పురోహితులు, ప్రజలంతాకూడ ఎంతో సంతృప్తి చెందారు. యాగం వైభవోపేతంగా ముగిసింది. రాజులు, పురోహితులు యాగానంతరం ధర్మజుని, అతడి సోదరులను ఆశీర్వదించి తమ తమ నివాసాలకు తిరిగి వెళ్ళిపోయారు.

# ఆశ్రమవాసిక పర్వం

## 1

## ధృతరాష్ట్రుని వానప్రస్థం

యుధిష్ఠిరుడు రాజ్యపాలనను మొదలుపెట్టి పదిహేనేళ్ళ కాలం గడిచింది. ఆయన రాజ్యంలో ప్రజలు చాలా సంతోషంగా ఉన్నారు. తాను పాలకుడైనా, యుధిష్ఠిరుడు ధృతరాష్ట్రుణ్ణి మహారాజుగా, పెదతండ్రిగా గౌరవించేవాడు. కాని ధృతరాష్ట్రుడికి ఏ మాత్రం సంతోషం లేదు. నిరంతరం యుద్ధంలో మరణించిన తన కొడుకుల చింత ఆయన్ను నిలువునా దహించసాగింది. అందులోనూ తన ప్రాణంలో ప్రాణంగా చూసుకున్న దుర్యోధనుని గురించి మరీను. చివరికి ఒకనాడు తన భార్య గాంధారితో సంప్రదించి అడవికి వెళ్ళాలనే నిర్ణయం తీసుకున్నాడు. యుధిష్ఠిరుని పిలిపించి ఆయన తన మనోవాంఛను తెల్పాడు. యుధిష్ఠిరుడు మాత్రం అందుకు ఒప్పుకోలేదు. వారించాలని ఎంతగానో ప్రయత్నించాడు. కాని ధృతరాష్ట్రుడు మొండిపట్టుపట్టడంతో అంగీకరించక తప్పలేదు.

అరణ్యవాసానికి వెళుతున్న గాంధారీ – ధృతరాష్ట్రులను చూసేందుకు జనులంతా పురవీథుల్లో

గుమిగూడారు. పట్టుపట్టి కుంతికూడ వారితో వెళ్ళింది. విదురుడు సంజయుడుగూడ వారితోబాటు బయలుదేరారు. పాండవులు ఎంతో విచారంగా వారికి వీడ్కోలు చెప్పారు. వారు వ్యాసాశ్రమానికి చేరుకున్నారు. అక్కడ వారి బసకు వలసిన ఏర్పాట్లన్నీ జరిగాయి. రాజదుస్తులు వదిలి నారవస్త్రాల్ని, జింకచర్మాన్ని ధరించారు. దర్భాసనం మీద శయనించారు. ఋషులు చెప్పేమాటలు వింటూ తమ హృదయాల్లోని దుఃఖాన్ని ఉపశమింపచేసుకునేందుకు ప్రయత్నించసాగారు.

గంగాతీరాన నివసిస్తూ ధృతరాష్ట్రుడు తీవ్రనిష్ఠతో సాధన చేయసాగాడు. విదురుడు, సంజయుడు ఆ వృద్ధరాజుని కనిపెట్టి చూస్తూండేవారు. కొంతకాలమైన తరువాత ధృతరాష్ట్రుని చూసేందుకు నారదుడు వచ్చి, మాటల సందర్భంలో ఆ దేవర్షి రాజుతో, “ఇంక మూడేళ్ళ



తరువాత గాంధారీ, ధృతరాష్ట్రులు కుబేర సామ్రాజ్యాన్ని చేరుకుంటారని శంకరుడు ముఖతా విన్నాను" అని అన్నాడు. ఆ దేవర్షి చెప్పిన చల్లని మాటలు విని ధృతరాష్ట్రుడు సంతోషం పట్టలేకపోయాడు.

## 2
## విదుర నిర్యాణం

రాజభవనంలో ఉన్న యుధిష్ఠిరుడికి ఏమంత సంతోషంగా లేదు. పెద్దలు ఎవ్వరూ లేకపోవడంతో బాధ అనిపించింది. తన తమ్ముళ్ళతో కలిసి ధృతరాష్ట్రుడుంటున్న ఆ అడవిలోని ఏకాంత పవిత్ర స్థలానికి వెళ్ళి ఆయనకు, ఆయనతోబాటున్న వారందరికీ గౌరవ మర్యాదలు తెలియజేశాడు. వారందరినీ తన చుట్టూ చూసి, ధృతరాష్ట్రుడు హస్తినాపురంలో ఉన్నట్లు భావించగా, కళ్ళ వెంట ఆనందబాష్పాలు రాలాయి.

కుశలప్రశ్నలన్నీ అయిన తరువాత, ధర్మజుడు, విదురుడు కనబడటం లేదే అని ప్రశ్నించాడు. అందుకు ధృతరాష్ట్రుడు, "నాయనా! అతడు క్షేమమే. కాని, కఠోరతపంలో నిమగ్నుడైవున్నాడు. కేవలం గాలి మాత్రమే ఆహారంగా తీసుకుంటున్నాడు. ఒక్కొక్కప్పుడు దట్టమైన అడవి ప్రదేశంలో బ్రాహ్మణులతో కలిసి సంచారం చేస్తూంటాడు" అని అంటూండగానే దూరాన విదురుడు కనిపించాడు. తలంతా జడలు కట్టిపోయి బాగా శుష్కించి కనబడ్డాడు.

అతిథుల రాక గమనించి విదురుడు తటాలున ఆగినట్లే ఆగి వెనుదిరిగి అడివిలోకి వెళ్ళిపోసాగాడు. ధర్మరాజు అతణ్ణి వెంబడిస్తూ "ఓ విదురా! నేను ధర్మరాజుని, నీ ఇష్టుణ్ణి" అంటూ పెద్దగా కేకేసి చెప్పాడు.

అడవిలో ఒక ఏకాంతభూమిని చేరుకుని విదురుడు ఒక చెట్టును ఆనుకుని కదలక మెదలక నిలబడ్డాడు. ధర్మరాజువంక తేరిపారజూస్తూ చేష్టారహితుడై యోగసమాధి మగ్నుడై నిలబడే ఉన్నాడు. అంతే, తన యోగశక్తితో ఆయన ధర్మరాజు దేహంలో పూర్తిగా ప్రవేశించాడు. ఆతని ఊపిరిలో ఊపిరిగా, ఇంద్రియాల్లో ఇంద్రియాలుగా కలిసిపోయాడు. కాని తన దేహం మాత్రం చెట్టుకి చేరగిలబడి, కళ్ళార్పకుండా చూస్తూనే ఉండిపోయింది. ధర్మరాజు ఆయన ప్రాణాలు దేహాన్ని విడిచివెళ్ళిపోయినట్లు గ్రహించాడు. అదే సమయంలో తనలో ఏదో అజ్ఞాతశక్తి ప్రవేశించినట్లు మానసికంగాను, నైతికంగానుకూడ బలాన్ని పొందినట్లు అనుభూతిచెందాడు.

ఈ సంగతి విన్న ప్రతిఒక్కరూ ఆశ్చర్యచకితులయ్యారు. ధృతరాష్ట్రుడెంతో సంతోషించాడు.

## 3
## మృతవీరుల సాక్షాత్కారం

పాండవులు అడవిలో ఉన్నప్పుడు వ్యాసుడు వారున్న చోటికి వచ్చాడు. ధృతరాష్ట్రుని చూసి జాలిపడి, సానుభూతితో ఆ రోజు రాత్రి తన కొడుకులు, సోదరులు, బంధుమిత్రులు, పూర్వీకులు నిద్రనుంచి లేచినట్లుగా కనబడేటట్లు అతడికి ఒక వరం అనుగ్రహించాడు. అందుకు ధృతరాష్ట్రుడు, మిగతావారంతా కూడ తమ బంధుమిత్రులందరూ కనబడతారని ఎంతగానో సంతోషపడ్డారు. రాత్రి కాగానే వారంతా వ్యాసుని సమీపించారు.

మహర్షి భాగీరథీ పవిత్ర జలాల్లో స్నానం చేసి మృతవీరులందరినీ పిలిచాడు. అప్పుడా నీళ్ళల్లోంచి విపరీతమైన కోలాహలం వినవచ్చింది. రణరంగంలో కదంతొక్కే సైన్యాలు, కురుపాండవులు ఇంకా తమ తమ సైనికదళాలతో భీష్మద్రోణులు, మిగిలిన దళాలు, దళాధిపతులు, రాజులు, సామంతులు వేలాదిగా గంగాజలాల్లోంచి ప్రత్యక్షమయ్యారు. కౌరవసైన్యం, సైన్యాధ్యక్షులు, మహాయోధులైన దుర్యోధనుడు, కర్ణుడు, శకుని, దుశ్శాసనుడు మొదలైన వారంతాకూడ దివ్యాంబరధారులై ఉన్నారు.

ఈ దృశ్యం చూసిన ధృతరాష్ట్రుడి సంతోషం చెప్పనలవి కాదు. ఆ ఆనందానికి మేర లేదు. అదేవిధంగా కర్ణుడు, అభిమన్యుడు కనబడినప్పుడు ధర్మరాజాదులుకూడ సంతోషించారు. తన బిడ్డల్ని చూసుకున్నప్పుడు తల్లిగా ద్రౌపది పొందిన ఆనందానికి హద్దుల్లేవు. వారిని చూస్తూన్నప్పుడెవ్వరికీ దుఃఖంగానీ, భయంగానీ, అనుమానంగానీ కలగనే లేదు. ఆ రాత్రంతా వారు ఆత్మీయులతో మహదానందంగా గడిపారు. తెల్లవారుజాముకి వ్యాసుడు ఆ సమస్తయోధుల్ని, యుద్ధవీరుల్ని, సేనాసమూహాన్ని కన్నుమూసి తెరిచేలోపల అదృశ్యం చేశాడు. కొన్నిరోజులు గడిచిన తరువాత పాండవులు బరువెక్కిన హృదయాలతో హస్తినాపురానికి తిరిగివచ్చారు.

## 4
## ధృతరాష్ట్రుని అంతిమ గడియలు

మూడేళ్ళు గడిచిన తర్వాత ఒకనాడు నారదుడు యుధిష్ఠిరుని రాజసభకు విచ్చేశాడు. యుధిష్ఠిరుడు మహర్షిని ఎంతో ఆదరపూర్వకంగా ఆహ్వానించాడు. కొంతసేపటి తరువాత నారదుడు రాజుతో ఇలా చెప్పాడు: "యుధిష్ఠిరా! ఒక శోకసమాచారాన్ని వినేందుకు నీ మనస్సును దృఢం చేసుకోవాలి సుమా. ఒకనాడు మీ పెత్తండ్రి ధృతరాష్ట్రుడు, గాంధారీ ఇంకా కుంతీ నదినుంచి ఆశ్రమ ప్రదేశానికి తిరిగి వెడుతూన్నారట. వారి వెంట సంజయుడుకూడ ఉండి దారి చూపుతున్నాడట. ఆ సమయంలో అడవిలో భయంకరంగా దావాగ్ని రగిలి త్వరత్వరగా అంతటా అలుముకుంది. చెట్టుచేమలు, జంతుజాలాలన్నీ కాలి బూడిదైపోతున్నాయి. ధృతరాష్ట్రుడు కఠోర ఉపవాసదీక్షతో బలహీనంగా ఉన్నందు వల్ల పరిగెత్తలేకపోయాడు. సంజయుడితో, "సంజయా! నువ్వెళ్ళిపో... నిన్ను నువ్వు కాపాడుకో. మేము ఈ అగ్నికి ఆహుతైపోయినా ఫర్వాలేదు. స్వర్గాన్ని చేరుతాము" అన్నాడట. సంజయుడు వారిని వదిలి వెళ్ళిపోయేందుకు సమ్మతించకపోయినా, ధృతరాష్ట్రుడు బలవంతపెట్టి పంపించేశాడు. ఆ తరువాత ధృతరాష్ట్రుడు, గాంధారీ, కుంతీ తూర్పుదిక్కుకు తిరిగి నేలమీద కూర్చుని కళ్ళుమూసుకున్నారట. మనస్సంతా దేవుడిపై లగ్నంచేసి కొయ్యదుంగల్లా కదలక మెదలక ఉన్నారు. తర్వాత ఆ దావానలం వారిని దగ్ధం చేసేసింది. గంగ ఒడ్డున సంజయుడు నాకు కనబడి జరిగిన ఈ సంగతంతా చెప్పి, తాను తపశ్చర్యలు కొనసాగించేందుకని హిమాలయాలకు వెళ్ళిపోయాడు."

ఆ విషయం విన్న ధర్మజుడు మూర్ఛిల్లాడు. అతడి తమ్ముళ్ళు తమను దిక్కులేనివారిగా భావించి పిల్లల్లా విలపించారు. నారదుడెంతగానో వారిని ఓదార్చేందుకు ప్రయత్నించాడు. వ్యాసుడొచ్చి వారికి దుఃఖాన్ని తట్టుకోగల మనోస్థైర్యం కలిగించాలని ప్రయత్నించాడు.

# మౌసల పర్వం

## కృష్ణుని అవతార సమాప్తి

ధర్మరాజు రాజ్యపాలన ప్రారంభించి ముప్ఫై ఆరు సంవత్సరాలైంది. ముప్ఫై ఆరోయేట ఒకనాడు కృష్ణ వంశీయులైన యదువీరులు, విశ్వామిత్ర కణ్వ నారద మహర్షులు ద్వారకానగరంలో అడుగు పెడుతూండగా చూసి, సాంబుడికి స్త్రీ వేషం వేసి తెచ్చి, ఆ మహర్షుల్ని, "ఈమె సుప్రసిద్ధుడైన బభ్రుడి భార్య, గర్భవతి. ఈమెకి పుట్టబోయే బిడ్డ మగా? ఆడా?" అని అడిగారు.

మహర్షులు ఆ స్త్రీని చూసి మోసపోక ఆగ్రహంతో 'ఈమె' అని మీరు పిల్చే 'ఇతడి'కి ఓ ఇనపముసలం పుడుతుంది. ఆ ఇనప ముసలమే వృష్ణికుల సమూల నాశనానికి కారణమవుతుంది. కృష్ణబలరాములు మాత్రం తప్పించుకుంటారు. బలరాముడు సాగరంలో జలసమాధి అవుతాడు. కృష్ణుడు జర అనే వేటగాడి చేతిలో మృతుడవుతాడు" అని సమాధానం చెప్పారు.

తరువాత సాంబుడి కడుపున ముసలం (ఇనపరోకలి) పుట్టింది. అప్పుడు యాదవ ప్రభువైన ఉగ్రసేన మహారాజు ఆ రోకలిని అరగదీయించి ఆ రజనును సముద్రంలో కలపమని ఆజ్ఞాపించాడు. అలా చేసిన తరువాత మునుల శాపాన్ని తప్పించుకొన్నాము అని వారు అనుకొన్నారు.

కాని విధి నిర్ణయం ప్రకారం ఒక రోజు యాదవులంతా ప్రభాసతీర్థమనే చోటికి వెళ్ళడం జరిగింది. అక్కడ వారు శివుని అర్చించారు. ఆ తరువాత ఉల్లాసంగా విందు భోజనాలు చేసి, గడచిన విషయాల్ని, గత సంఘటనల్ని ముచ్చటించుకోవడంలో నిమగ్నులై ఉన్నారు. అంతలో సాత్యకి, కృతవర్మల మధ్య వివాదం ప్రారంభమైంది. ఇతరులూ వారి తగాదాలో పాలుపంచుకున్నారు. కృతవర్మని సాత్యకి చంపేశాడు. చేతిలో ఆయుధాలు లేనివారంతా ఆ సముద్ర తీరాన మొల్చిన రెల్లును పీకి కొట్టుకోవడం మొదలుపెట్టారు. ఆ రెల్లు నాటి ఇనపముసలం రజను నుంచి మొలుచుకొచ్చిందే.

సాత్యకికూడ చంపబడటం కృష్ణుడు చూశాడు. తానూ పిడికెడు దర్భలు త్రుంచి ఆ కొట్టుకునే వారిపై విసిరాడు. కృష్ణుడు విసిరిన దర్భపోచలన్నీ భయంకరమైన ఆయుధాలుగా మారి, పోరాడుతున్న వారందర్నీ, క్షణంలో అంతం చేశాయి. ఆ సమయాన బలరాముడు ఆ ప్రదేశాన లేడు. కృష్ణుడతణ్ణి వెతుక్కుంటూ బయలుదేరాడు. బలరాముడు సముద్రతీరాన కూర్చుని ఉన్నాడు. అతడికి ఈ జరిగిన సంఘటనలేవీ తెలియవు. అతడు అలసి సొలసిన దేహాన్నిక విడిచిపెట్టాలనే నిర్ణయం తీసుకుని యోగసమాధిలో లీనమైవున్నాడు. అప్పుడతని నోటి నుండి ఒక బ్రహ్మాండమైన ఎర్రటికళ్ళు, వేయి తలలున్న శేషనాగు వెలువడింది. ఆ మహానాగం సాగరంవైపు పోతూ ఉండగా సముద్రుడు సగౌరవంగా ఆహ్వానిస్తూ మున్ముందుకు ఉరకలు వేసుకుంటూ వచ్చాడు. ఆ విధంగా బలరాముడు ఈ లోకంనుంచి నిష్క్రమించాడు. అతడు ఆదిశేషుని అవతారం గదా మరి!

ఈ దృశ్యం చూసిన తదుపరి కృష్ణుడు కొంతకాలం ఆ అరణ్యంలోనే సంచరిస్తూ , తరువాత ఒకచోట శయనించి మనస్సును యోగస్థితిలో లయం చేశాడు. అప్పుడక్కడికో వేటగాడొచ్చాడు. అతడి పేరు జర. ఆ త్రోవనే వెళుతూన్నవాడు కాస్త కృష్ణుని చూసి పొరబాటున లేడి అనుకుని బాణం వేసి కొట్టగా. అది వచ్చి కృష్ణుడి కాలిమడమలో గ్రుచ్చుకుంది.

అప్పుడు జర కృష్ణుని సమీపించి ఆ రూపం చూసి ఆశ్చర్యచకితుడైనాడు. బహుభుజాలు కలిగి, కాషాయాంబరాలు ధరించి, యోగసమాధిలో ఉన్న కృష్ణుడి పాదాలపైబడి, క్షమాపణ వేడుకున్నాడు. కృష్ణుడు మాత్రం అప్పటికే వైకుంఠాన్ని అలంకరించాడు. దేవ గణమంతా స్వాగతగీతాలు పలుకుతూండగా ఇంద్రుడాతనికి ఎదురేగి స్వాగతం పలికాడు.

# మహాప్రస్థానిక పర్వం

## పాండవుల స్వర్గారోహణం

వృష్ణికుల వినాశాన్ని గురించిన వివరాలన్నీ విన్న తరువాత ధర్మరాజు, ఇక ఈ లోకాన్ని పరిత్యజించి స్వర్గలోకానికి పయనించాలని నిర్ణయించుకున్నాడు. భీమార్జున నకుల సహదేవులు ధర్మరాజుని అనుసరించారు. వారు చెట్టు బెరళ్ళను, జింక చర్మాన్ని ధరించారు. దృఢమైన దీక్షతో సర్వసంగపరిత్యాగులై ఎన్నో ప్రదేశాల్ని, నదుల్ని, సముద్రాల్ని దాటుతూ ప్రయాణం సాగించారు.

ధర్మరాజు వారికి మార్గదర్శకుడు. ఆయన్ను అనుసరిస్తూ నలుగురు తమ్ముళ్ళు, ఆ వెనుక ద్రౌపదీను. వారందరితోపాటు వేటకుక్క ఒకటి వెంట నడిచింది.

ఆ విధంగా వారు ఎన్నో ప్రదేశాలు దాటుకుంటూ ఉత్తరదిశగా సుదీర్ఘప్రయాణం సాగిస్తూ వెళ్ళి మహోన్నతమైన హిమాలయపర్వతాన్ని చేరుకున్నారు. దాన్ని దాటిన తరువాత సమున్నత మేరుపర్వతాన్ని సమీపించారు. వారు పొందిన మహత్తరమైన యోగశక్తి ప్రేరణతో వారా మేరువును ఎక్కసాగారు. ఆ పర్వతం మీద నడుస్తూండగా ద్రౌపది కాలు జారి పడిపోయి మరణించింది. భీముడప్పుడు దిగ్భ్రాంతుడై, "ఆమె నిష్కళంక గదా! ఇలా సంభవించడమేమిటి?" అంటూ ధర్మజుని ప్రశ్నించాడు.



అందుకు ధర్మరాజు, "మనమందరం ఆమెను సరిసమానంగా ప్రేమించాం కాని, ఆమెకు మాత్రం అర్జునుడంటే మక్కువ ఎక్కువ. ఆమెకున్న పక్షపాతానికి ఫలితమే ఈనాడు ఆమె పొందాల్సి వచ్చింది" అని సమాధానమిచ్చాడు. మరికొంత దూరం ముందుకి వెళ్ళగానే సహదేవుడు చనిపోయాడు. అప్పుడు ధర్మరాజు, "సహదేవుడికి తెలివితేటల్లో తనని మించిన వారెవ్వరూ లేరని ఒక అహం ఉంది. అదే అతని పతనానికి కారణం" అన్నాడు. తరువాత నకులుడు నేలకొరిగాడు. "అతడు వివేకవంతుడు, సత్యవంతుడే కాని, లోకంలో తనంత అందగాడు లేడనే ధీమాగలవాడు" అన్నాడు ధర్మరాజు. తరువాత అర్జునుని వంతు వచ్చింది. అప్పుడు ధర్మరాజు భీముడితో, "శత్రువులందర్నీ ఒక రోజులో హతమార్చేస్తానన్నాడు. గర్వించదగ్గ వీరుడే కాని తన మాట నిలుపుకొన్నాడా? ఎప్పుడూ సాటి విలుగాళ్ళను కించపరచేవాడు. అందుకనే ఈ అవసానం" అని చెప్పుకుంటూ ధర్మజ భీములు మేరుపర్వతం పైకి పోతూండగా భీముడు పడిపోయాడు. పోతూపోతూ, "అయ్యో, అన్నా! నా ప్రాణమంతా నీ మీదనే పెట్టుకున్నా... నాకీ గతి ఏమిటి?" అంటూ పొలికేకపెట్టాడు.

"నీవో పెద్ద బడాయికోరువి, తిండిపోతువీను. నువ్వు తినేటప్పుడెన్నడూ ఇతరుల ఆకలి గురించి పట్టించుకోలేదే! అందుకే పడిపోయావు" అన్నాడు.

ధర్మరాజు కొండపైకి ఎక్కుతున్నాడు. ఇప్పుడిక అతడి వెంట అతణ్ణనుసరించి వస్తున్నది ఆ కుక్క ఒక్కటే. అంతలో అకస్మాత్తుగా నింగినేల దద్దరిల్లిపోయేటట్లు పెద్ద ధ్వని వినవచ్చింది. ఇంద్రుడు రథం దిగి వచ్చి, ధర్మరాజుని రథం ఎక్కమని ఆహ్వానించాడు. కాని, ధర్మరాజు తన తమ్ముళ్ళు, ద్రౌపది లేకుండా తాను మాత్రం స్వర్గానికి వెళ్ళేందుకు ఇష్టపడలేదు.

"నీ తమ్ముళ్ళు, ద్రౌపది స్వర్గంలో నీ రాకకై నిరీక్షిస్తున్నారు. కాని నీవు అదృష్టవంతుడివి కనుక బొందితోనే స్వర్గానికి రావచ్చు" అన్నాడు ఇంద్రుడు. అందుకు ధర్మరాజు, "అయితే ఈ కుక్కకూడ నా వెంట రావాల్సిందే. ఇంతదూరం నా వెంటే వచ్చింది. తోడుగా నడిచింది. కనుక దాన్నికూడ రానియ్యండి" అని అడిగాడు.

ఇంద్రుడా మాట విని, "స్వర్గంలో కుక్కలుండేందుకు వసతులేవీ లేవు. అందువల్ల ఈ కుక్క సంగతి మర్చిపో. నువ్వు మాత్రం నా వెంట రా" అన్నాడు.

"నా మీద భక్తివిశ్వాసాలతో నన్నునుసరించి వచ్చిన ప్రాణిని విడిచిపెట్టి నేను మాత్రం రావడం అన్యాయం. స్వర్గంగానీ, మరేదైనాకానీ నేనీ కుక్కని విడిచి రాను" అన్నాడు. అంతలో ఆ కుక్క ధర్మదేవతగా ధర్మజుని ఎదుట సాక్షాత్కరించి, అతణ్ణి దీవించింది.



# స్వర్గారోహణ పర్వం

## స్వర్గంలో యుధిష్ఠిరుడు

యుధిష్ఠిరుని రథం మీద ఎక్కించుకుని ఇంద్రుడు, ధర్మదేవత స్వర్గం చేరుకున్నారు.

స్వర్గంలో అడుగుపెడుతూనే యుధిష్ఠిరుడు, ఎంతో అందమైన సింహాసనం మీద ఠీవిగా కూర్చున్న దుర్యోధనుని చూశాడు. యుధిష్ఠిరుడి మనస్సంతా వికలమైపోయింది. అక్కడున్న దేవతలతో, "చూడండి... ఇతడి మొహం చూడటం నాకెంత మాత్రం ఇష్టంలేదు. ముందు నా సోదరులున్న చోటికి నన్ను తీసుకుపోండి" అన్నాడు.

దేవతలాయన్ను మరికొంత ముందుకు తీసుకువెళ్ళారు. మధ్యలో ఒక మురికిగా ఉన్న ప్రదేశాన్ని దాటివెళ్ళాలి. అది అచ్చంగా కురుక్షేత్ర రణరంగంలాగే ఉంది. ఎక్కడ చూసినా మృతదేహాలు, క్రిమికీటకాదులతో అంతటా భయంకరంగానూ, కాలుష్యపూరిత విషవాయువులతోనూ నిండివుంది. అంతలో యుధిష్ఠిరుడికి వ్యక్తులు కనబడకుండానే గొంతులు వినవచ్చాయి. "ఓ యుధిష్ఠిరా! నువ్వు మమ్మల్ని ఇక్కడ వదిలేసి వెళ్ళొద్దు. నువ్వు ఎదుట ఉంటే మాకెంతో ఉపశమనంగా ఉంది సుమా!" యుధిష్ఠిరుడు ఆ కంఠ స్వరాల్ని ఇట్టే గుర్తుపట్టాడు. అవి... కర్ణుడు, భీముడు, ద్రౌపది మిగతా వారివీను. అప్పుడిక యుధిష్ఠిరుడికి పట్టరానంత కోపోద్రేకం కలిగింది. అంతే దేవతల మీద ఒక్కపెట్టున అగ్గిలా భగ్గుమంటూ విరుచుకుపడ్డాడు.

"ఏమిటి మీ స్వర్గనియమాలు? పాపాలు చేసిన పాపిష్ఠి దుర్యోధనుడేమో అందమైన భవనంలో కూర్చోవడం, నా సోదరులు ఈ మురికికూపంలోపడి కొట్టుకోవడమూనా? వీరితోబాటు నేనిక్కడే ఉంటానన్నానని పోయి మీ ప్రభువు ఇంద్రుడితో చెప్పండి" అని ఉరిమాడు. ఆ తరువాత కొంతసేపటికి ఇంద్రుడు దేవతాసమేతుడై యుధిష్ఠిరుడి ఎదుట నిలిచాడు. ఇంద్రుడు రాగానే ఆ మురుగుడు వాసనంతా పోయి. సువాసనలు వ్యాపించాయి. చల్లని గాలి వీచసాగింది.

ఇంద్రుడు ధర్మరాజునితో "స్వల్ప పుణ్యం చేసిన వ్యక్తి మొదట స్వర్గ సౌఖ్యాలు అనుభవించి అనంతరం నిరంతర నరక యాతనలు అనుభవిస్తాడు. విశేషంగా సత్కార్యాలను చేసిన వాడు మొదట క్లేశాలను అనుభవించి తరువాత అనంత స్వర్గలోక సౌఖ్యాలను అనుభవిస్తాడు. నీ వారందరూ నరకంలో క్లేశాలను అనుభవించేశారు. కాబట్టి ఇప్పుడిక నీ సోదరులతోబాటు నీవు స్వర్గ సౌఖ్యాన్ని పొందుతూ ఆనందంగా ఉండవచ్చు" అన్నాడు.

యుధిష్ఠిరుడు కృష్ణపరమాత్ముని కూడ దర్శించాడు. ఇక తన తమ్ముళ్ళు, ద్రౌపదితో కలిసి దివ్యసుఖాలను పొందుతూ స్వర్గంలో హాయిగా ఉన్నాడు.

దివ్యత్వం సంతరించుకొన్న వ్యక్తుల్ని గురించి ఒళ్ళు గగుర్పొడిచే ఉపకథలతో ధర్మానికే జయమని, పేరాశ ద్వేషం, హింస, పతనానికే దారి తీస్తాయనీ, తమ అల్పబుద్ధిని జయించడమే నిజమైన విజయమనీ ఈ ఇతిహాసం మనకు బోధిస్తూంది.

**సమాప్తం**